# శంకర గ్రంథ రత్నావళి

( శ్రీ విష్ణు సహస్రనామస్తోత్ర భాష్యము )

సప్తమ సంపుటము



అనువాదకులు :

బాలవ్యాస : శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి



ప్రకాశకులు :

సాధన గ్రంథ మండలి, తెనాలి.



[వెల : రు. 6-00

# ప రి చ య ము

విష్ణుసహస్రనామ స్తోత్రము ఇది శ్రీవేదవ్యాసమహర్షి ప్రణీతమైన మహాభారత గ్రంథమండలి అను శాసన పర్వమందు 149 వ, అధ్యాయములో కీర్తింపబడి యున్నది.

ఈ సహస్రనామములకు అనయవార్థము శ్రీశంకర భగవత్పాదుల భాష్యములో వివరింప బడినది.

శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి గారు (సాధన గ్రంథ మండలి) ఆభాష్యమునకు ఆంధ్ర తాత్పర్యము వ్రాయవలసిన దని నన్ను ప్రేరేపించుటచే యథోచితముగా తాత్పర్యము వ్రాయబడినది.

ఈ సహస్రనామ సంకీర్తన ఫల మిట్లున్నది.

శ్లో॥ సహస్రం వాసుదేవస్య నామ్నా మేత త్ప్రకీర్తయేత్ ।
న భయం కించి దాప్నోతి వీర్యం తేజశ్చ విన్దతి ॥

శ్లో॥ భవత్యరోగో ద్యుతిమాన్ బలరూప గుణాదిభిః ।
రోగార్తో ముచ్యతే రోగా ద్బద్ధో ముచ్యేత బంధనాత్ ।
భయా న్ముచ్యేత భీతస్తు ముచ్యేదాపన్న ఆపదః ॥

ఈ సహస్ర నామములను కీర్తించినవారికి ఎట్టి భయము ఉండదు. తేజోవీర్యములు లభించును. సంకీర్తనముచేత రోగ రహితు లగుదురు. బలరూపాదులతో ప్రకాశింతురు. ఆపన్నులు ఆపదనుండి విముక్తు లగుదురు అని. –

ఇట్టి ప్రభావముగల ఈ సహస్ర నామము శ్రీ శంకర భాష్య సమంచితమై యొప్పుచున్నది. తెనాలి సాధన గ్రంథ మండలి వారు శంకర గ్రంథములను సాధ్యమైనంతవరకు ఆంధ్ర తాత్పర్యము వ్రాయించుచు వానిని ముద్రించి వినియోగించుచు లోకోపకారము చాల చేయుచున్నారు. వారి కృషిని వారి పరిశ్రమను సార్థకము చేయ వలసిన భారము లోకులయం దున్నది. వారి గ్రంథములను స్వీకరించి లోకులు వారి నుత్సాహ పరచెదరు గాక-

అనువాదకర్త

వా. సుబ్రహ్మణ్య శాస్త్రి.

# సహస్రపది

— జమ్ములమడక మాధవరామశర్మ

శ్రీ విష్ణునామ సహస్రపారాయణ పరాయణులను, నామ పారాయణప్రీత నారాయణ దేవులను, భావించి, సంభావించి, సహస్రపద రచన, మొనరింప దలచితిని. నే నప్పుట ఆ కళాశాలలో అధ్యాపకుడను. అధ్యక్షుడను. ఒక విధముగ అంతర్వాణిని, అందరకు అంతర్యామిగా నుంటిని. అప్పుట అక్కడ ఆ కళాశాలలో శాస్త్రిపదాంతుడు సూర్యప్రకాశుడు విద్యావ్యాసంగ మొనరించు చుండెను. ఆ సీమలో బలుసు లేని ఆహారము లేదు. బులుసు లేని యజ్ఞము లేదు. అనూచానముగా వచ్చుచున్న విశిష్టసంపత్తిని, ఇద మిత్థమని గుర్తింప నున్నను అస్థిగత మొనరించు కొనినందున సాధన సంపత్తి గల సూర్యశాస్త్రులు, ప్రకాశశాస్త్రి, సూర్యప్రకాశశాస్త్రి యయ్యెను. ఆనాటి బులుసుశాస్త్రి సాధన గ్రంథ మండలి స్థాపకుడై యున్న గ్రంథములను, ఇట్టి గ్రంథములను, ఈ గ్రంథము నిట్లుగా వెలయింప చేయునని నే నప్పుడు వెలగట్ట గలిగి యుంటినో?, శ్రీ శంకర భగవత్పాద విరచితములైన గ్రంథములను శంకర రచితములను ప్రఖ్యాతి గల సంస్కృతి భాషలోని శంకరకృతులను అన్నిటిని ఒకటొకటిగా తీసి నేనధ్యయనము చేయునపుడు రెండురెండుగా నందు కొని, ప్రకాశశాస్త్రి ఆకాంక్షను చూచి, విషయమహత్తను చూచి లోలోన మురిసి కొనెను. శంకర కృతుల నన్నిటిని సమా

కారముతో సమసౌష్ఠవముతో ప్రకాశింప చేయవలయు నని ప్రకాశశాస్త్రి తనకు తెలియకుండగనే ఆత్మప్రకాశమును పొంది యుండును. నేను అప్పటిలో, సాహిత్య సంస్కారమును సంస్కరించి, సంపాదించితినే గాని ఆధ్యాత్మిక తత్త్వసౌందర్యమును సమున్మిషింప చేయగలిగితినో! అవియు, ఇవియు లేక నే నూరకుండజాలు వాడనుగాను. ఈనాటికిని నేను విద్యాకాముడను. ఆనాడును వారలకు ప్రయోజన మున్నను లేకున్నను నామార్గమున నే నెన్నెన్నో వినిపించితిని, వ్రాయించితిని. పలికించితిని. ప్రకాశశాస్త్రికి ఆ విశేషములు సంస్కార సముల్లాసకములై యుండ వచ్చును. ఇట్లు నేను నాకై తృప్తికొఱకగు వచనములను వ్రాసి కొందునుగాని ప్రకాశశాస్త్రి సూర్యశాస్త్రి యైనందున సహస్రకరుడై యెన్నిటినో సంపాదించెను. వాని ఫలము సాధన గ్రంథ మండలి. శంకర గ్రంథ రత్నావళి. భగవత్పాదులు, పూజ్యపాదులు తేజోమయ వాచావిశేషములతో విశిష్టతను సంపాదింపగా బులుసు సూర్యప్రకాశశాస్త్రి యింతటి వాడయ్యెను. ఇంకను యెంతటి వాడై నను కావలెనని నేను భావింప కుందునా! అస్తు.

సాధన గ్రంథ మండలి శంకర భగవత్పాదుల కృతులను సాంధ్రభాషా సుందరముగా ప్రకాశింప చేయుటకు యత్నించినది. ఒకనాడు సూ. శాస్త్రి నాదగ్గరకు వచ్చి సాధన గ్రంథ మండలిలో ప్రకటింతును, మీ రేదైన గ్రంథమును రచించి నన్నాదరింపుడు, మీకు భగవత్పాదులు అభీష్టులు కదా! శ్రీ విష్ణు సహస్రనామ భాష్యమునకు మీరు మీ భాషలో

శంకరభాష్య భాషాభావములను నిరూపింపుడు, మా. శర్మన్ మీ పేరిట నున్న గ్రంథమును నేను ప్రకటింపవలెను- అనెను. నేను "అస్తు" అంటిని. మా. శర్మ విష్ణుసహస్రనామ భాష్యాను వాద మొనరించునని సూ. శాస్త్రి ప్రకటించెను. నేను నా పేరును దేశమున ప్రయోగించుకొంటినిగదా! లోకము కొంత పడినది. పాఠకులు మా-శర్మది ఏది యేది యని బులుసు నడిగిరి. నేను రచన మారంభింపనే లేదు. నాకు అంతశ్చోదనము కలుగనే లేదు. నాంచనాదీక్షలో నేనుంటిని. నా పనిలో నేనుంటిని. ఈ సహస్రకార్యము జరుగనే లేదు. నేనప్పుడు గీతాభావప్రకాశమున సత్యాలోకమును వ్రాయుచుంటిని. అప్పటిలో నే నాపని నారంభింపగలనా? "నహి కర్మణి కర్మాంతరాంరంభః" బులుసు వచ్చి అడిగెను. రాక అడిగెను. ఎన్నియో విధముల నడిగెను. అడిగించెను. అదు గడున నడిగించెను. ఏమి చెప్పగలను? శివాజ్ఞ కాలేదు. శివుడు వచ్చి నాకు విష్ణుసహస్ర ముపదేశింపవలె నేమి? నా గురువే నాకు శివుడాయెను గదా! నేను రామనారాయణ జప మాచరింతునే గాని, విష్ణునారాయణ జపము, బ్రహ్మనారాయణ జపము, సహస్రనారాయణ జప మొనరించితినా? లే దని యెట్లందును? కాని విష్ణుజపదీక్ష నాకింకను కానలెను. అప్పుడు వ్రాయవలెను. ఇప్పుడు వ్రాయ లేను. అని అనవలసి అంటిని. అయినను ప్రకాశ శాస్త్రి నిర్విణ్ణుడు కాలేదు. అది ఆయన దీక్ష. అది శాస్త్రి దక్షత! ఇప్పుడు బహుశ్రుతులు భాషానువాద మొనరించిరి. వారు ద్రష్టలు. వారు సంధాతలు, వారి కొక భాష యున్నది.

ఆ భాషలో వారు దీని వ్రాసిరి. ఆ వ్రాతలోని విశిష్టతను నేను చెప్పుట యేల ? కరమున కెక్కగనే గ్రంథమే గుండెకు పాఠము చెప్పును. ఇది ముద్రితమయినది. ఇట్లువచ్చినది. దీనికై నేనునేనై వచ స్సహస్రము వ్రాయవలెను. ప్రకాశన దీక్షితుడైన ప్రకాశశాస్త్రి నాకు తనమాట విన్పించెను. నేను "అస్తు" అంటిని ఈ "స, హ, స్ర, ప, ది," వచ్చినది.

ఈ విష్ణునామ సహస్రము భారతగతము. ఏవంస్తుతి పర్యాయములు భారతములో నెన్నియో గలవు. వానిలో నిది అన్యతమమా ? నే నట్లుగనే భావింపను. ఇది విశిష్టము. భారత గ్రంథమునకు సంబంధించిన విశిష్టతలు ఈసహస్రములో నున్నవి. భారతము ఒక ధర్మగీత. అది ఒక కర్మగీత. అది జయవాదము చెప్పు జయగీత. అది బ్రహ్మవాదము నిరూపించు బ్రహ్మగీత. అది కృష్ణదేశనము ప్రతిపాదించు కృష్ణగీత. అది ఒక విధముగా విష్ణుగీత. అది యెంతటిదో యగును. "యన్న భారతే తన్న భారతే" - దీనిలో నున్నది. భారత మిట్టిదిగదా ! ఈ విష్ణుసహస్ర మిట్టిది. దీనిని భారతగీత అని అందురో! భారతులకు భారతము భావగత మగును. భారతము మహాభారతము. అది భారతసంహిత,జయాఖ్య సంహిత,ఇందేమి యున్నది! ఉండవలసిన దంతయు నున్నది. ఇందు శాంతరసము ముఖ్యము. అందులకై విరసావసానము నిరూపితమయినది. శాంతేతరము లయిన రసములు నటనట నున్నవి. కాని భారతము శాంతగీత. దీనిలో సర్వపురుషార్థము లున్నవి. అయినను మోక్షప్రధానతయే పాదుకొని యున్నది. పర్వ పర్వమునను

అఖర్వము యైన మోక్షతత్త్వ ప్రతిపాదన మున్నది. ఈ అంశము మోక్షధర్మ పర్వముయందు స్పష్టము. ఈ భారతగ్రంథము శ్రీ కృష్ణనాయకము. కాగా భారత మహార్థము గ్రంథము నందంతటను సంగతము సుసంగతము నై యున్నది. ఉన్నదని సూచించుటకునై భగవద్గీత యున్నది. సనత్సుజాతీయ మున్నది. విష్ణునామ సహస్ర మున్నది. ఇంకను అనుగీతాదులు ఎన్నియో కలవు. అయినను గీతా, జాతీయ సహస్రములు ముప్పేటతో నున్నవి. గీతలో, సనత్సుజాతీయములో తత్త్వ ప్రతిపాదనము కలదు. విష్ణుసహస్రములో నట్లు లేదు. అయినను ఇది గీతాది ప్రతిపాదిత తత్త్వప్రతిపాద్యములతో నున్నది. వేయి విష్ణునామము లింక కలవుగదా! కావుననే యిది విష్ణునామ సహస్రమయినదో, 'సహస్ర శీర్షాపురుషః, సహస్రాక్షః, సహస్రపాత్' అను పురుష సూక్తములోని విరాడ్వ్యాఖ్యానమును స్వరాడ్వ్యాఖ్యానమును దీనిలో నున్నది. కావున నిది నామసహస్ర మయినది. సహస్ర నామక మయినది. సర్వాత్మబ్రహ్మ యొకడే. నామబహుత్వము లోకోపకారకము. నామబహుత్వ మేలవచ్చినది. నామ నిమిత్తక శక్తులు భిన్నభిన్నములుగా నున్నవి. అవి నానా నామోల్లాస హేతువులు. నానావిధ ఫలప్రసాధకములు. ఉపనిషత్ప్రతిపాద్యుడైన పరబ్రహ్మకు గుణక్రియాజాతి ద్రవ్యభావములు లేవుగదా. శబ్దప్రవృత్తి నిమిత్తములయిన శక్తులెచ్చటివి? సత్యమే. ఈ అంశమున భాష్య మేమనినది. ఈ విధముగా ననినది. "సగుణే బ్రహ్మణి సవికారే చ సర్వాత్మకత్వాత్ తేషాం శబ్దప్రవృత్తి హేతూనాం సంభవాత్ సర్వే

ద్రౌః పరస్మిన్ ప్రుంసి వర్తన్తే” నిర్గుణమున నేవియు లేవు. గుణమున నన్నియు నున్నవి. ఆ యున్నవానికే యిట్లు సంగత పరచుకొనవచ్చును.

ఉపనిషత్తులలో నుపాసనా విద్య లనేకములు గలవు. ఉపాసనా సహస్రమందున్నది. ఉపాసక మహర్షులును సహస్ర సంఖ్యతో నున్నారు ఉపాసనా సహస్రమునకు, నామసహస్ర మునకు సంబంధ ముండియుండును దానిని యీ భాష్యాను సంధాన మొనరించిన వారు సంప్రదాయ విశుద్ధముగా గ్రహింప గలరు. ఈ యంశము కేవలము అనిరుక్తముగాదు. స్పష్టా స్పష్టముగా భాష్యములో సూచితమయినది. సహస్రవిధముల పరమాత్మ నుపాసించవచ్చును. సహస్రపదము అనంత పదమున కుపలక్షకము. అట్టి ఉపాసనా విశేషములే మహాపురాణము లలో, పురాణములలో, ఉపపురాణములలో, సంహితలలో, తంత్రములలో, యామళములలో, డామరములలో, ఉక్తము లలో, అనుక్తములలో ననంతముగ నున్నవి. సర్వోపాసనా సమ్యుడుగా మహావిష్ణు వింద నిరూపితు డయినాడు. ఈ గ్రంథముసందే విష్ణుస్వరూప సంకీర్తనములో చతుర్భుజుడగు విష్ణువు నిరూపితుడైనాడు. (శ్రీ) విష్ణువు నాలుగు హస్తము లలో నాలుగాయుధము లున్నవి.

“శంఖభృ న్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః, రథాంగ పాణి”అను ఆరు నామములలో ఆయుధ షట్కము నిరూపిత మయి నది. హస్తచతుష్కములో ఆయుధ షట్క మెట్లు కుదురును?

ఆ దగ్గరనే "గదీ, శార్ఙ్గీ, శంఖీ, చక్రీ, చనందకీ" అను అయిదు నామములలో నయిదాయుధము లున్నవి. ఇట్లే న్నెన్ని యున్నను, ఇంత నెన్నియున్నను శంఖ, చక్ర, గదా, ఖడ్గములు శ్రీవిష్ణువునకు అసాధారణములని ప్రసిద్ధి. చతుర్బాహు సమన్వితుడైన శ్రీవిష్ణునారాయణ ప్రతీకాత్మక ప్రతిమా రూపములలో శంఖ చక్ర గదా ఖడ్గము లున్నవి. కేవల మీ నాల్గింటికి పరిగణనము మాత్రమేగాని, విష్ణునారాయణుకు వాసుదేవ నారాయణుడు సర్వప్రహరణాయుధుడు. ఈ సహస్ర నామము చతుర్భుజ నారాయణుని శంఖచక్ర గదాఖడ్గ ధారిగా చెప్పియు, సర్వప్రహరణాయుధుడు అని మరల మరల చెప్పినది. "శ్రీ సర్వప్రహరణాయుధో న్నమః," ఓ మారంభముగా నున్న సహస్రము ఓమంతముగా నున్నది. నానావిధములగు ప్రహరణములు హస్తములలో నుండగా నిట్టి యనంతాకారములు కలిగి యున్నది. ఆయుధము లున్నంత మాత్రమున ఆకార భేదమెట్లు కలుగును ? స్పష్టముగా చెప్పరాని ఒక రహస్యము చెప్పెదను. సర్వరహస్యము చెప్పుటకు నేనలతి కాను. "నాతీవ ప్రకాశ్యం, నాతీవ గోప్యం ఇతి అస్మ ద్గురవః" అని శ్రీమదభినవ గుప్తుడే యనెను. నేనింతమాత్రమే యందును. నేనే అందు నేమి ? అభిజ్ఞులనిన దానినే యందును. వారే మనిరి ? వారిట్లనిరి. నాల్గు భుజములలోని నాల్గు ఆయుధములను స్థాన భేదమును విన్యసించినచో నటునిటు కూర్పుచేర్పులవలన ఇరువది నాలుగు ఆకార విశేషములు మాత్రమే సిద్ధములగును. ఆ యిరువది నాలుగు ఆకార విశేషములు సాధకులకు అను

గ్రాహకములు. ఒక్కొక్క ఆకృతి ఒక్కొక్క నామముతో
నుండును. ఆ నామముతో నున్న ఆతని ఉపాసించుటలో కొంత
విశేషము కలదు. కేశవ, నారాయణ, మాధవ, గోవిందాది
శ్రీకృష్ణాంత చతుర్వింశతి నామములు శంఖ చక్ర గదా ఖడ్గ
ధారియైన శ్రీవిష్ణునారాయణుని చతుర్వింశతి రూపవిశేషము
లను నిరూపించునని కేశవాది చతుర్వింశతి నామములు
సూచించు చున్నవి. పాంచరాత్రసంహిత, బ్రహ్మపురాణము
అహిర్బుధ్న్య సంహిత మొదలగు వానిలో నీ విశేషములు
కలవు. ఆ నిర్దిష్ట విశేషములనే కాక ఇతరాయుధముల సంయో
జనమునను రూపవిశేషములను భావించినచో నామ విశేషము
లను సంకేతింప వచ్చును. వీని నన్నిటిని ఎట్లు గుర్తింపదగును?
శ్రీవిష్ణునారాయణ నామపారాయణ మొనరించువారు వేయి
మంది ఒకచో చేరి ఒక్కొకరు ఒక్కొక నామమును వేయి దినములు
సూర్యాకృష్టి విద్యావిధానమున నుపాసించినచో నేమేని విష
యము సాక్షాత్కరించును. ఛాందోగ్యములో నిరూపించినట్లుగ
ఆదిత్యనారాయణుని సాప్తవిభక్తిక సామసంకేత దృష్టితో
నుపాసించుచు ఈ నామానుసంధాన మొనరించినచో నేమేని
గోచరించును. అట్లు గోచరింప చేసికొనిన శ్రీవేదవ్యాస
భట్టారకుడు నామసహస్ర మందుకొని అందించెను వ్యాసు
నుండి అందుకొని భీష్ముడు ధర్మరాజునకు అందించెను. అట్లు
పరంపరగా మనకు వచ్చినది. మనకు ఆ మంత్రవిద్యా సంకే
తములను, ఉపాసనా రహస్యములను సామములలోని స్తోభా
క్షరముల సంకేతములను మనకు చెప్పువా రెవరని నిర్వేదమును

పొందుదునా ? ఇట్లు నిర్వేదమును పొందదగిన స్థాన మిది యని నేను అప్రబుద్ధప్రబోధన మొనరింతునా ? చతుర్భుజుడైన శ్రీశివమహాదేవునకును ఇట్లు చతుర్వింశతి సంఖ్యాక రూపభేదములును సంభావ్యము లగును. శ్రీదేవి నాలుగు చేతులలో పాశ, అంకుశ, కోదండ, సాయకము లుండగా చతుర్వింశంతి రూపధేయములు కలగును. ఇంక నింకను ప్రస్తరింపగా అనంత భేదములు కలుగును. వానిలో ఉపాసక, సాధకానుగ్రహ ములగు కతిపయ రూపములు మాత్రమే నామ సంకేతమున సూచితము లగును. అష్టభుజదేవి, హస్తగతాయుధముల విన్యాసభేదమున కొన్ని వేల రూపములు రావచ్చును. అష్టాదశ మహాభుజ శ్రీమహాలక్ష్మి రూపధేయము లెన్ని యగునో లెక్కపెట్టితినేగాదు ! అనిపించునేగదా ! "ప్రకృత మనుసరామః, పాయసం భక్షయామః" భద్రాద్రిపై రామ నారాయణుడు వెలసియున్నాడు. సీతాలక్ష్మణులతో నున్నను వైకుంఠ నారాయణుడే రామనారాయణుడుగా వచ్చెను. కావున నాలుగు హస్తములతో నున్నాడు. ఆ నాల్గు హస్తములలో నుండవలసినవి యున్నవి. వాని విన్యాసమున చతుర్వింశతి భేదములు కలుగును గదా ! వాని నుపాసకులు పరిగణించిరా? లేదని నేనెట్లు అందును ? పరిగణించిరని మీరెల్లెందురు ! ఈ విష్ణుసహస్రములో ఈ భావ మంతయు సంక్షిప్తమయి యున్నది. సాధకుని శిరస్సహస్రారము నందు సహస్రస్థానము లున్నవి. ఒక్కొక్క స్థానమునకు ఒక్కొక్క నామము సంకేతిత మగునా ! శంకరభగవత్పాదులు నామాక్షరోపాసనము

కూడ "నామవతః ఉపాసనం" అని యనెను. ఉద్గీథ పదము లోని ఉత్, గీ - థ అను వర్ణముల యుపాసనము కూడ ఛాందోగ్యమున సంకేతిత మయినది. ఈ సహస్రములో నూటఎనిమిది శ్లోకము-లు కలవు. శ్లోకమునకు ముప్పది రెండ క్షరములు. ఈ సహస్రములోని అక్షరములు 3456 మూడు వేల నాలుగువందల ఏబదియారు. ఇన్ని విధముల సహస్రనామాక్ష రోపాసన మొనరింపగా గలుగునట్టి విశేషములు చెప్పుటకు సమర్థులెవరు ?

శ్రీశంకరభగవత్పాద రచితముగా ప్రసిద్ధమయిన విష్ణు సహస్రనామ భాష్యము కొంత చెప్పును. నూట ఎనిమిది శ్లోకములే యున్నవేమి ? ఈ సంఖ్యలో నేదియో యున్నది. దినదినము జీవుడు 21600 ఉచ్ఛ్వాస నిశ్వా సములు కలవాడగును. ఇదియొక సోఽహం ప్రక్రియ. ఇది హంసోపాసన. 108 మణులతో నున్న జపమాలచేపట్టి రెండు వందల పర్యాయములు ఆవృత్తి మొనరించినచో, 21600 పర్యాయములు హంసమంత్రము జపించినట్లగును. దానిని ఆ సంఖ్య సూచించును. వేరొక రహస్యమును గ్రహించిన కొందరు ఇట్లుపపాదించ వచ్చును. 108 సంఖ్యలో మొదటనున్న ఒకటి "ఏకమేవాద్వితీయం" అను బ్రహ్మకు సంకేతము. తరు వాత నున్న బిందువు మాయామయమయిన జగత్తునకు సంకే తము. తుదినున్న ఎనిమిది సంఖ్య ఆధ్యాసికమయిన అష్టధా ప్రకృతికి సూచకము. ఈ ఎనిమిది సంఖ్యను ఆ యొకటిని సంక లన మొనరించినచో తొమ్మిది సంఖ్య కలుగును. తొమ్మిది

అనునది ప్రణవము. ఇది ఉద్గీథము. ఇది బ్రహ్మ. ఈ తత్త్వము ఈ సహస్రములో సంకేతిత మగుచున్నది.

ఇది విష్ణుసహస్రనామ మను పేర ప్రసిద్ధముగా నున్నది. ఈ విష్ణువెవరు ? అందరు సామాన్యముగా తలచు విష్ణువు కాడు. ఈత డందరి యందుగల విష్ణువు. సర్వాంతర్యామి విష్ణువు. ఔపనిషదపురుషు డయిన - పురుషోత్తము డయిన విష్ణువు. ఈతడు సాత్వతాంపతి యగునా ? వైకుంఠవాసి కాడా ? లక్ష్మీవల్లభు డగునే కదా ! బ్రహ్మ స్రష్టకాగా, హరుడు హర్త కాగా, విష్ణువు తన్మధ్య సంచారి యగునా ! విష్ణువు పౌరాణిక దేవుడా ? ఈతడు దశావతారములకు మూల పురుషుడా ? విష్ణువు రాక్షస వంచకు డందురు. ఈత డట్టిడా ? వైష్ణవ దర్శనములలో నుండు నాతడితడే యగునా ? ఈతడు ద్వైతుల విష్ణువా ? విశిష్టాద్వైతుల విష్ణువా ? ఇతర వైష్ణవుల విష్ణువా ? ఈత డవైష్ణవుల కారాధ్యుడగునా? బ్రహ్మ ద్వైత ప్రవక్త శంకరు డారాధించెనా ? శంకర రచిత మను ప్రసిద్ధికల విష్ణుపాదాది కేశాంత - కేశాదిపాదాంత స్తుతిలో నీ విష్ణువు కలడా ? అగుణ శాంకర వాదములో నీ సగుణవిష్ణు వెట్లు చేరినాడు ? అగుణ సగుణ సమైక్య మంగీకరించువారి భావ వ్యూహములు భగవత్పాద భాష్య భాషలో నున్నవా ? ఈ విష్ణువు పారమార్థిక సత్యస్వరూపు డయినచో వ్యావహారిక ముగా నసత్యస్వరూపుడే కదా ! ఈ వ్యావహారిక సత్యజగము లోని వారు అసత్య స్వరూపుని ఆరాధింపవలెనా ? ఈ విధ

ముగా ప్రశ్న సహస్రము వెలువడినను ఈ సహస్రభాష్యము
సమాధానించును.

తాంత్రికవాద మసిద్ధము కాదు. అది సిద్ధవ్యక్తుల సిద్ధ
వాదము. ఇంతమాత్రమున నిది సిద్ధసిద్ధాంతమని యనను.
కొందరందు లేని యా యనుట యనవలసి యనదలచి యన
వలచి యనుట యగును. ఇందు తాంత్రికభావ నామము లున్న
వేమి ? తాంత్రికుల యర్థభావము లిందు సంగతములా ? అట్టి
పదములకు స్వసంవాది భావ కథనము సంగతమా ? ఆపన్ని
వారకత సంపత్ప్రాపకత దేవునం దున్నదని భక్తులు భావిం
తురు. కొందరు కేవల రోగనివారణమునకై దేవు నారా
ధింతురు. శారీరిక రోగములు వాచిక రోగములు మానసిక
రోగములు భౌతిక రోగములు దైవిక రోగములు ఇట్లెన్నియో
రోగము లున్నవి. కాని శారీరికరోగ నివారణమునకె ముడు
పులు కట్టి మ్రొక్కులు చెల్లించి మ్రొక్కుబడి యయిన దని
యనిపింతురు. కొందరు సర్వరోగ భంజనమున కారాధింతురు.
కొందరు భోగ ప్రాప్తికి విజయసిద్ధికి సేవింతురు. కొందరు
పూర్వజన్మమున నొనరించిన యోగమునకు సంబంధించిన
శేష యోగమునకై తదనలంబనమునకై భగవాను నారా
ధింతురు. యోగసిద్ధికి సర్వార్థసిద్ధికి సమారాధన మొన
రింతురు. ఇం దన్నివిధముల నారాధించు వారల కాసక్తి జనక
విశేషము లున్నవి.

ఈ సహస్రములోని విష్ణువు నిర్వికారుడు- శుద్ధుడు-
నిత్యుడు- పరమాత్మ. ఈ విష్ణుస్మరణము జన్మ సంసార బంధ

మోచకము. భారతమున నిట్లున్నది. ధర్మరాజు పావన ధర్మ
ములు విని, వి: సంతుష్టి సంపాదనమున కిట్లు భీష్ముని ప్రశ్నిం
చెను. దైవత మేది? పరాయణ మేది? స్తోత్రవ్యు డెవడు?
అర్చనీయు డెవడు? అభీష్టమగు ధర్మ మేది? జపింపదగినది
ఏది? ఈ ప్రశ్నషట్కమునకు సమాధానముగా భీష్ముడు
ఈ సహస్రము నిర్దేశించెను. ఈయాకు వేరు, వేరు ప్రశ్నలుగా
నున్నను, అన్నిటికి సహస్రమే సముత్తరము. ఇట్లే దీనిని
సంభావింప దగును. ఈ సహస్రము నిత్యపారాయణమున
నుంచదగినదని విష్ణుజ్ఞానులు అనవలయును. ఈ సహస్రమంతయు
మాలామంత్రము. ఇదియే జప్యము. ఈ సహస్రానుసంధానము,
వేయి నామముల యనుసంధానము సర్వనామాక్షరానుసంధా
నము, విష్ణూపాసనమే యగును. ఇందు నామభేదమే యున్నది,
కాని నామిభేదము లేదు. లలితాసహస్ర నామమునందువలె
నిందు సుశ్లిష్టత లేదు. అపునరుక్తత లేదు. ఉపాసనాక్రమ
సూచనము లేదు. లేకున్న నేమి. ఇది నామవిద్య. ఇది యక్షర
విద్య. ఇది విష్ణువిద్య. కొన్ని వకారాది నామము లిన్ని యున్నవి.
వకార మమృత బీజము వాని నన్నిటి నొకచో భావించుటయు
యుక్తానుసంధానము.

విశ్వ। విష్ణు। వషట్కార। విధాత। విశ్వకర్మ। విక్రమి। విక్రమ
క్రమ। విశ్వరేతా। వ్యాళి। వృషాకపి। వసు। వసుమనా। వృషకర్మా
వృషాకృతి। విశ్వయోని। వరారోహ। విష్వక్సేన। వేద। వేదవిత్।
వేదాంగ। వేదవిత్। విజయ। విశ్వయోని। వామన। వేద్య। వైద్య।
వరహా। విశుద్ధాత్మా। వాచస్పతి। విశ్వాత్మా। వహ్ని। విశ్వదృక్।

విస్పృట్। విశ్వభుక్। విభు। విశిష్ట। వృషాహీ। వృషభ। విష్ణు। వృష
పర్వా।వృషోదర।వర్ధన। వర్ధమాన। వివిక్త। వాగ్మి। వసుద। వసు।
వ్యక్తరూప। వృష। విశ్వబాహు। వాసవానుజ। వరద। వాయువా
హన।వాసుదేవ। వృద్ధ।వృద్ధాత్మా। విక్షర। వేగవాన్। వికర్తా।వ్యవ
స్థాన। విరామ। విరజ। వీర। వైకుంఠ। వ్యాప్త। వాయు। విశ్రామ।
విశ్వదక్షిణ।విస్తార।విముక్తాత్మా। వీరబాహు। విదారణ।వ్యాప్తి।
వత్సర।వత్సల। వత్సీ। విధాతా। వినయ। వినయితా। వేధావరుణ।
వారుణ। వృక్ష। వనమాలీ। వ్యాస। వాచస్పతి। వృషభాక్ష। వృష
ప్రియ। విజితాత్మా। విధేయాత్మా।విశోక।విశుద్ధాత్మా।విశోధన।
వీరశౌరి। విష్ణు।వీర। వసురేతా। వసుప్రద। వసుప్రద। వాసుదేవ।
వాసు। వసుమనా। వాసుదేవ। విశ్వమూర్తి। వరాంగ। వీరహా।
విషమ।వ్యగ్ర।వాజసని।వంశవర్ధన। వాయువాహన।విహాయసగతి।
విలోచన।విక్రమీ।విశ్వోత్తమ।వీతభయ। వీరహా। విదిశ। వ్యాదిశ।
వైఖాన। వనమాలీ। విష్ణు। వాసుదేవ —

ఇట్లిందిన్ని నామములు వకారాదులు కలవు. ఇవి యన్నియు అమృత బీజాత్మకములు. "తేజోమయీ వాక్" వకారాది నామోచ్చారణమునను అమృత ద్యుతి మనలో ప్రక్రమించును. ఈ వకారాదుల నొకచో భావించి కూర్చిన ని శోధించి శ్లోకాత్మకముగా విధానించి పారాయణ మొన ర్చంప దగునని పూజ్యపాదులు బహుశ్రుతులు లనదగును. వీని యర్థభావములను విశిష్టముగా పృథగ్రూపమున నిరూపించు టయు సాధకజాపక ప్రమోదము. అన్నిటిని పారాయణ మొన రింప తీరిక లేదనుకొనువారు వీని జూచి తృప్తినందుదురు. హాకా

రాది హయగ్రీవ నామసహస్ర నిర్మాతలు వికారాది విష్ణు సహస్రమును నిర్మింతురు. వానికన్న నివి సనాతనములు కదా! రామాయణాంతర్గతాదిత్య హృదయమునందలి నామము లన్నియు వేదాదిత్య హృదయము సూచించునవి యని కతిపయ జాపకులు గుర్తించిరి. ఈ సహస్రము నందలి నామములు విశేషణములు కావు. అన్నియు విశేష్యములు. విశేషణము లని భావించువారు పరమాత్మ సర్వవిశేష్యమని భావించుట కలవడ వలయును.

ఈ నామసహస్రము సనాతన వాసుదేవ పరబ్రహ్మాశ్రయము. ఆ వాసుదేవుడు, జ్ఞానాశ్రయుడు, ఫలాశ్రయుడు, లీలాశ్రయుడు, ప్రభావాశ్రయుడు, మాహాత్మ్యాశ్రయుడు, అనుగ్రహాశ్రయుడు, నిగ్రహాశ్రయుడు, సర్వాశ్రయుడు. ఇట్లు భావించి ఈ జప్యము జపించు వారలకు జప్యపరమాత్మ తేజః ప్రసారానుభూతి కలుగును. బహు వత్సరములనుండి బహుశ్రుతులు బహువ్రతులు ఈ సహస్రము జపించి ఆత్మీయ తేజశ్శక్తులను నామాక్షరములలో నిక్షేపించినారు. తదుచ్చారణమున తత్ప్రాప్తి యున్నది. ఇట్టిది జపయజ్ఞము. నామ యజ్ఞము. ఈ యజ్ఞమున ఫలాభిసంధి వలదు. వినియోగాభి సంధి వలదు. ప్రయోగాభిసంధి వలదు. ఈ సహస్రానుసంధాన ముపాసనము. ఉపాసనము సత్త్వశుద్ధికరము. వస్తుతత్త్వావ భాసకము. అద్వైత జ్ఞానోపకారకము. సాలంబనము కావున సుసాధ్యము. ఛాందోగ్య భాష్యములో భగవత్పాదులు;

“ఉపాసనం తు యథా శాస్త్ర సమర్థితం కించి
దాలంబన ముపాదాయ తస్మిన్ సమాన చిత్తా
వృత్తి సంతానకరణం తద్విలక్షణ ప్రత్యయానంతరితమ్.”

అని నిరూపించిరి. ఇట్లె యుపాసింపుడు.

ఇందలి సంస్కృతి వ్యాఖ్యానము శంకరభగవత్పాద విరచిత మని ప్రసిద్ధి యున్నది. ఒకప్పుడు భగవత్పాదులు భాష్యము రచింపు తలంపుతో శ్రీ లలితానామ సహస్రగ్రంథ మిమ్మని రట. శిష్యుడు విష్ణుసహస్రము తెచ్చెను. పర్యాయ త్రయ మిట్లెయయినది. దేవి ఆ సహస్ర భాష్యకరణమున కనుజ్ఞ నీయలేదు. ఈ సహస్రభాష్యకరణము నాకు అనుజ్ఞ లభించి నట్లు ఇక రచింతును. అని ఈ భాష్యము రచించెనని దంతకథ యున్నది. దేవీ సహస్రముపై భగవత్పాదులు భాష్యము రచించి యున్నచో భాస్కరరాయ భాష్యము వచ్చెడిది కాదు. భగవత్పాదుల భాష్య మెట్లుండెడిదో? ఈ చింత యిప్పుడేల? ఈ విష్ణుభాష్యము భగవత్పాద భాష్య మందురు. ప్రస్థాన త్రయభాష్యమున భగవత్పాదుని చూచిన వారు ఈ భాష్య మున భగవత్పాదుని చూడగలరా? శ్వేతాశ్వతర భాష్య మునను భగవత్పాదుడు గోచరించుటలేదు. ఇందు? ఈ వ్యాఖ్యభాష్యమా? భాష్యపద గౌరవమునకు తగునా? శ్వేతా శ్వతర భాష్యములో శంకర భగవత్పాదుడు కలడా? లేడు. ఇందును లేడు. ఇందున్నచో నందు నందును. అందు లేడు. ఇందు లేడు. ఒకవిధముగా నిందు, నందు గలడు. భగవత్పా

దాత్మ సమావేశము కల పీఠప శంకరపూజ్యపాదు డిందు గలడు. ఈ సహస్రటీకలో ప్రమాపక శ్లోకములు బహుళ ముగా నున్నవి. సమధికముగా పురాణ వచనములున్నవి. శ్వేతాశ్వతరమునను గలవు. ఇట్లిన్ని పౌరాణికములు ప్రస్థాన త్రయభాష్యములో లేవు. ఇం దారంభముననె 150 శ్లోకము లుదాహృతము లయినవి. భారతపురాణగత విష్ణుసహస్రము నకు పురాణశ్లోక ప్రామాణ్య ప్రదర్శనము సహకారిగా నుం డెనా? వ్యాఖ్యాతార్థ మాపనిషదమె. ఉదాహృత శ్లోకపంచ శతి పీఠపాలక శంకరులను దర్శింప జేయుచున్నది. భగవత్పాద భాష్యభావార్థమును "పురుషాయనమ్" పేరిట నేను శ్లోక రూప మున వ్రాసికొనుచున్నాను. అందు శ్వేతాశ్వతర టీకార్థ శ్లోకీ కారమున బుద్ధిపుట్టలేదు. ఇందును పుట్టు నట్లు లేదు. గీతా భాష్య పటుత్వము గాంభీర్యము. ఈ సహస్ర భాష్యములో నాకు గోచరించుట లేదు. ఉపనిషద్భాష్యభావములకు దీని లోని భావములకు సంవాదము లేదని నేననినచో నాది తొం దరపా టందురు. సంవదింపరు. ఈ సనాతన భావసంవాది భావమును నేను విసంవాదులలో సృజించుట కిష్టపడను. శాం కర మనిపించుటకిందు గౌడపాద కారికలు నుదాహృతము లయినవి. ఇది పీఠేశ్వర శాంకరమయినను గౌడ ద్రావిడ నిరూపిత బ్రహ్మాద్వైత శాస్త్రవిషయము లన్నియు నిందున్నవి. ఇది యుపాదేయ మయినది. ప్రస్థానత్రయ ప్రవచన ప్రౌఢి కల వడలేని వారిసహస్రభాష్య భావనమున ఆత్మోపాసకులు కాగలరు. సర్వదేవాయతనములలో నిత్యము వాచనికుడు

ప్రవచనము చేయుటకట్టి గట్టి యేర్పాటునకు ముందుగా నర్చకులు ధర్మాధికారులు ద్రవ్యాధికారులు కర్మాధికారులు పారాయణ పరాయణులగుట యావశ్యకము. ఈ సహస్రటీకలో నర్థవాదాత్మకములయిన ప్రశంసనీయ ప్రశంసా పరమములయిన శ్లోకములు సమధికముగా నున్నవి. ఇట్లు భగవత్పాద భావము నివేదించిన వారలకు పాపము రారాదు. అందరీ ప్రమాపక శ్లోకములను పఠించి ప్రబోధించి లోకకళ్యాణ మాపాదింపగలరు.

ఈ విష్ణు సహస్రనామస్తోత్ర భాష్యము నీవిధముగా నాంధ్రమున వ్రాయుటకు షడ్దర్శనీపారదృశ్వ భగవత్పాద భాష్యార్థ వేది, నానావిధ పురాణాగమ విదుడు, శ్రీ మహాభారత తత్త్వవిమర్శన దక్షుడు, శబ్దశాస్త్రవిదుడు, శిష్య సంక్రాంత పాండిత్య వైదగ్ధ్యాద్వైతమూర్తి, పండిత పరమేశ్వరుడు వారణాసి ధర్మసూరి బహురూప బహుశ్రుత చక్రసంచారి సుబ్రహ్మణ్యుడు సంవిన్మయమూర్తి సమర్థుడగును. ఈ వివేక వైశిష్ట్యము కల శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి బహుకాల మాగి, యాగి బహువాదభాజను డయినాడు. సహస్ర భాష్యము భావింపదలచువారు సహస్రపదినిని భావించి శతానందులు కావచ్చును. ఈ ప్రకాశశాస్త్రి నా పుస్తకములలో నున్న నన్ను చూచి నాపై పుష్పము వేయును. ఇట్టి స్వస్పందధన్యుని సర్వేక్షణుని సర్వసమ్మాదయులు సంభావింతురు. నేనును. అస్తు-

— మాధవరామశర్మ.

# మండలి మాట

సశంఖచక్రం సకిరీటకుణ్డలం
సహారవక్షఃస్థల శోభికౌస్తుభం ।
సపీత వస్త్రం సరసీరుహేక్షణం
నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్॥

భుక్తి ముక్తులలో భుక్తి మొదటిది. తృష్ణ తుదిగినకదా నిష్ఠ. సాంసారికమైన జీవనము ప్రశాంతముగా సాగవలె నన్న ఎన్నో సమస్యలు. ఒక్కొక్కరి జీవనమందొక్కొక్క తీరైన సమస్యలు. ఈ సమస్యలు ఏదో ఒక విధముగానైన తీరినవని అనిపించక పోయినపుడు ఎవడైనను ముముక్షువై ఏమి సాధించ గలడు ? అందుచే సర్వమానవకోటి ముక్తినికోరినను కోర కున్నను భుక్తిని (ఐహిక భోగములను) వాంఛించును. కేవల వాంఛయేకాదు దానికై తీవ్రమైన యత్నము. ఎన్ని యత్నము లాచరించినను మానవబుద్ధి పరిష్కరింప జాలని సమస్యలు కోకొల్లలు. వాని పరిష్కారమునకు ఎవరైనను దైవము నాశ్రయింపవలసినదే. 'నా కేసమస్యలును లేవు, నేను ముము క్షువను' అని ముక్తివాంఛను వెల్లడించు వాడును దైవము నాశ్రయింపక తప్పదు కదా !

శ్లో॥ రూపమారోగ్య మర్థాంశ్చ భోగాంశ్చైవానుషంగికాన్ ।
దదాతి ధ్యాయతో నిత్యం భుక్తి ముక్తి ప్రదో హరిః ॥

శ్రీహరి మోక్షదాత. ఆయన తన్ను ధ్యానించిన వానికి మోక్ష మొక్కటియే కాదు. రూపము, ఆరోగ్యము, ధనాదులు, భోగములు- సర్వమును అనుగ్రహించును.

ఇక నేమి, శ్రీహరి నాశ్రయించిన - భజించిన భుక్తి ముక్తులు రెండును కరతలామలకము లగుచున్నవి కదా !

అగును, కాని ఆ శ్రీహరిని భజించుటెట్లు? ధ్యానించుటెట్లు? ఆయన యెట్టివాడు? ఆయన గుణ, రూప, స్వభావము లెట్టివి? ఆయన ఉనికి ఎచ్చట? అబ్బో! ఇట్లు లెక్కలేనన్ని ప్రశ్నలు.

ఈ ప్రశ్నల కన్నిటికి సముచిత సమాధానములు మన పురాణముల యందు అడుగడుగున కానుపించును. పురాణముల యందు - భోగమోక్షములను ప్రసాదించు పెన్నిధు లెన్నో పేర్కొనబడినవి. అందు మహాభారత మందలి 'విష్ణు సహస్ర నామ స్తోత్రము' అద్వితీయ మైనది.

గనినుండి తీసిన రత్నములవలె నున్న శ్రీ విష్ణు సహస్ర నామములకు జగద్గురువైన శ్రీమదాదిశంకరులు భాష్యము సానపెట్టి మెఱుపులు మెఱయించినది. శంకర భాష్యము సమకూర్చిన యీ వేనవేల మెఱపులలో ఒక్కొక్క మెఱపున హరి ఒక్కొక్క తీరుగ మెఱయుచుండు నన్నది భాష్యము

చదివిన వారికే గాని ఇతరుల కెట్లు తెలియును ! అందులకే యీ యత్నము.

శ్రీమజ్జగద్గురు శంకరాచార్య విరచితములైన గ్రంథములను అనువాదములతో ప్రచురించి లోకమున కందించుటకు పూనుకొన్న మా మండలి కడు పేది. ఇంత పెద్ద బరువు ఈ పేదరాలెట్లు మోయగలదని ఉదారులు కొందరు యథోచిత ద్రవ్య సహాయ మాచరింపగా - పండితులు కొందఱు (కొందఱు మాత్రమే) 'మేమున్నాము అనువదించుటకు - ఇది యొక పవిత్ర కార్యము' - అని నన్ను ప్రోత్సహించినారు. వారిలో బాల వ్యాస: బ్ర. శ్రీ. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగా రొకరు. శ్రీ శాస్త్రిగారు మహావిద్వాంసులు. వారి విద్వత్తను పాఠకులు ఈ భాష్యానువాదమున గమనింపగలరు.

ఎందఱో విష్ణుసహస్రనామమును నిత్యము పారాయణ మాచరించుచుందురు. అర్థానుసంధానముతోడి పారాయణము ఆనందమును కలిగించునుకదా ! "గోవిందా ! హరీ ! హృషీకేశా !" ఇత్యాదిగా మనము భగవన్నామముల నుచ్చరించు చుందుము. ఆ నామముల అర్థము - అటు ఉచ్చరించు వేళ మనస్సులో ఆడిన ఎంత తృప్తిగా నుండును. కేవలము తృప్తి కాదు, హరియే వచ్చి, మన మనఃఫలకమున కూర్చుండడా ! ఏమన, ఈనామముల అర్థము హరినే కదా చూపించును.

ఇట్లు లోకోపకారకమైన సాధకజనోపయోగియైన భాష్యమును తేట తెనుగున వ్రాసి యనుగ్రహించిన బ్ర. శ్రీ. సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి, కోరినతోడనే "సహస్రపది" వ్రాసిన గురువర్యులు బ్ర. శ్రీ. జమ్ములమడక మాధవరామశర్మగారికి నమోవాకములు. ప్రూఫులు చూచుటలో సహకరించిన మిత్రులు శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి కృతజ్ఞతలు

ఈ గ్రంథ ముద్రణకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము 1100/- లు సహాయము చేసినది. వారి ఉపకృతికి కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

తెనాలి
ఆనంద - ఉగాది
1974

ఇట్లు
బులుసు సూర్యప్రకాశశాస్త్రి
వ్యవస్థాపకుడు : సాధన గ్రంథ మండలి.



శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయం।

నమామి భగవత్పాద శఙ్కరం లోకశఙ్కరమ్॥

ఓమ్

# శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమ్

శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాన్తయే ॥
యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

## పూర్వపీఠికా

హరిః ఓమ్. వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్ ।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్ ॥ ౧

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥ ౨

అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే ।
సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే ॥ ౩

యస్య స్మరణమాత్రేణ జన్మసంసారబన్ధనాత్ ।
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే ॥ ౪

ఓంనమో విష్ణవే ప్రభవిష్ణవే

సచ్చిదానన్దరూపాయ కృష్ణాయాక్లిష్టకారిణే ।
నమో వేదాన్తవేద్యాయ గురవే బుద్ధిసాక్షిణే ॥ ౫

కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతమ్ ।
వేదాబ్జభాస్కరం వన్దే శమాదినిలయం మునిమ్ ॥ ౬

సహస్రమూర్తేః పురుషోత్తమస్య
సహస్రనేత్రానన పాదబాహోః ।
సహస్రనామ్నాం స్తవనం ప్రశస్తం
నిరుచ్యతే జన్మజరాదిశాన్త్యై ॥ ౭

(శ్రీ) వైశంపాయన ఉవాచ :-

శ్రుత్వా ధర్మానశేషేణ పావనాని చ సర్వశః ।
యుధిష్ఠిరశ్శాన్తనవం పునరేవాభ్యభాషత ॥ ౧

యుధిష్ఠిర ఉవాచ :-

కిమేకం దైవతం లోకే కిం వాఽప్యేకం పరాయణమ్ ।
స్తువన్తః కం కమర్చన్తః ప్రాప్నుయుర్మానవాశ్శుభమ్ ॥ ౨

కో ధర్మస్సర్వధర్మాణాం భవతః పరమో మతః ।
కిం జపన్ముచ్యతే జన్తుర్జన్మసంసారబన్ధనాత్ ॥ ౩

(శ్రీ) భీష్మ ఉవాచ :-

జగత్ప్రభుం దేవదేవమనన్తం పురుషోత్తమమ్ ।
స్తువన్నామసహస్రేణ పురుషస్సతతోత్థితః ॥ ౪

తమేవచార్చయన్నిత్యం భక్త్యా పురుషమవ్యయమ్ ।
ధ్యాయన్ స్తువన్నమస్యంశ్చ యజమానస్తమేవ చ ॥ ౫

అనాదినిధనం విష్ణుం సర్వలోకమహేశ్వరమ్ ।
లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్ ॥ ౬

బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనమ్ ।
లోకనాథం మహద్భూతం సర్వభూతభవోద్భవమ్ ॥ ౭
ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః ।
యద్భక్త్యా పుణ్డరీకాక్షం స్తవైరర్చేన్నరస్సదా ॥ ౮
పరమం యో మహత్తేజః పరమం యో మహత్తపః ।
పరమం యో మహద్బ్రహ్మ పరమం యః పరాయణమ్ ॥ ౯
పవిత్రాణాం పవిత్రం యో మఙ్గలానాం చ మఙ్గలమ్ ।
దైవతం దేవతానాం చ భూతానాం యోఽవ్యయః పితా ॥ ౧౦
యతస్సర్వాణి భూతాని భవన్త్యాదియుగాగమే ।
యస్మింశ్చ ప్రలయం యాన్తి పునరేవ యుగక్షయే ॥ ౧౧
తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే ।
విష్ణోర్నామసహస్రం మే శృణు పాపభయాపహమ్ ॥ ౧౨
యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః ॥
ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే ॥ ౧౩
ఋషిర్నామ్నాం (విష్ణోర్నామ) సహస్రస్య వేదవ్యాసో మహామునిః ।
ఛన్దోఽనుష్టుప్తథా దేవో భగవాన్ దేవకీసుతః ॥ ౧౪
అమృతాంశూద్భవో బీజం శక్తిర్దేవకినన్దనః ।
త్రిసామా హృదయం తస్య శాన్త్యర్థే వినియుజ్యతే ॥ ౧౫
విష్ణుం జిష్ణుం మహావిష్ణుం ప్రభవిష్ణుం మహేశ్వరమ్ ।
అనేకరూపదైత్యాన్తం నమామి పురుషోత్తమమ్ ॥ ౧౬

అస్య శ్రీవిష్ణోర్దివ్య సహస్రనామస్తోత్ర మహామన్త్రస్య ।
శ్రీవేదవ్యాసో భగవానృషిః, అనుష్టుప్ ఛన్దః, శ్రీమహావిష్ణుః
పరమాత్మా శ్రీమన్నారాయణో దేవతా, అమృతాం
శూద్భవో భానురితి బీజమ్, దేవకీనన్దనస్స్రష్టేతి శక్తిః,
ఉద్భవః క్షోభణో దేవ ఇతి పరమో మన్త్రః, శఙ్ఖభృన్నన్దకీ
చక్రీతి కీలకమ్, శార్ఙ్గధన్వా గదాధర ఇత్యస్త్రమ్, రథాఙ్గ
పాణి రక్షోభ్య ఇతి నేత్రమ్. త్రిసామా సామగస్సామేతి
కవచమ్, ఆనన్దం పరబ్రహ్మేతి యోనిః, ఋతుస్సుదర్శనః
కాల ఇతి దిగ్బన్ధః. విశ్వరూప ఇతి ధ్యానమ్ శ్రీమహావిష్ణు
(ప్రీత్యర్థే) కైంకర్యరూపే శ్రీసహస్రనామజపే వినియోగః.

ధ్యానమ్ :-

క్షీరోదన్వత్ప్రదేశే శుచిమణివిలసత్సైకతే మౌక్తికానాం
మాలాకౢప్తాసనస్థః స్ఫటికమణినిభైర్మౌక్తికైర్మణ్డితాఙ్గః ।
శుభ్రైరభ్రైరదభ్రైరుపరి విరచితైర్ముక్తపీయూషవర్షై
రానన్దీ నః పునీయా దరినళినగదాశంఖపాణి ర్ముకున్దః ॥

భూః పాదౌ యస్య నాభిర్వియదసుర నిలశ్చన్ద్ర సూర్యౌ చ నేత్రే
కర్ణావాశాశ్శిరో ద్యౌర్ముఖమపి దహనో యస్య వాసోఽయమబ్ధిః।
అన్తస్థం యస్య విశ్వం సురనరఖగగోభోగి గన్ధర్వదైత్యై
శ్చిత్రం రంరమ్యతే తం త్రిభువనవపుషం విష్ణుమీశం నమామి ॥

శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాఙ్గం ।

లక్ష్మీకాన్తం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వన్దే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥

మేఘశ్యామం పీతకౌశేయవాసం
శ్రీవత్సాఙ్కం కౌస్తుభోద్భాసితాఙ్గమ్ ।
పుణ్యోపేతం పుణ్డరీకాయతాక్షం
విష్ణుం వన్దే సర్వలోకైకనాథమ్ ॥

సశఙ్ఖచక్రం సకిరీటకుణ్డలం
సపీతవస్త్రం సరసీరుహేక్షణం ।
సహారవక్షఃస్థలశోభికౌస్తుభం
నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్ ॥

ఇతి పూర్వపీఠికా.

హరిః ఓమ్.

విశ్వం విష్ణుర్వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః ।
భూతకృద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ॥ ౧

పూతాత్మా పరమాత్మా చ ముక్తానాం పరమా గతిః ।
అవ్యయః పురుషస్సాక్షీ క్షేత్రజ్ఞోఽక్షర ఏవ చ ॥ ౨

యోగో యోగవిదాం నేతా ప్రధానపురుషేశ్వరః ।
నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః ॥ 3

సర్వశ్శర్వశ్శివ స్థాణుర్భూతాదిర్నిధిరవ్యయః ।
సమ్భవో భావనో భర్తా ప్రభవః ప్రభురీశ్వరః ॥ ౪

స్వయమ్భూశ్శమ్భురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః ।
అనాదినిధనో ధాతా విధాతా ధాతురుత్తమః ॥ ౫

అప్రమేయో హృషీకేశః పద్మనాభో౽మరప్రభుః ।
విశ్వకర్మా మను స్త్వష్టా స్థవిష్ఠ స్థవిరో ధ్రువః ॥ ౬

అగ్రాహ్యశ్శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః ।
ప్రభూత స్త్రికకుద్ధామ పవిత్రం మఙ్గలం పరమ్ ॥ ౭

ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠ శ్శ్రేష్ఠః ప్రజాపతిః ।
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః ॥ ౮

ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః ।
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతి రాత్మవాన్ ॥ ౯

సురేశశ్శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః ।
అహస్సంవత్సరో వ్యాళః ప్రత్యయస్సర్వదర్శనః ॥ ౧౦

అజ స్సర్వేశ్వరస్సిద్ధ స్సిద్ధి స్సర్వాదిరచ్యుతః ।
వృషాకపి రమేయాత్మా సర్వయోగవినిస్సృతః ॥ ౧౧

వసు ర్వసుమనా స్సత్య స్సమాత్మా సమ్మిత స్సమః ।
అమోఘః పుణ్డరీకాక్షో వృషకర్మా వృషాకృతిః ॥ ౧౨

రుద్రో బహుశిరా బభ్రు ర్విశ్వయోని శ్శుచిశ్రవాః ।
అమృతశ్శాశ్వత స్థాణు ర్వరారోహో మహాతపాః ॥ ౧౩

సర్వగ స్సర్వవిద్భాను ర్విష్వక్సేనో జనార్దనః ।
వేదో వేదవిదవ్యంగో వేదాంగో వేదవి త్కవిః ॥ ౧౪

లోకాధ్యక్ష స్సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః ।
చతురాత్మా చతుర్వ్యూహ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్భుజః ॥ ౧౫

భ్రాజిష్ణు ర్భోజనం భోక్తా సహిష్ణుర్జగదాదిజః ।
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః ॥ ౧౬

ఉపేన్ద్రో వామనః ప్రాంశు రమోఘ శ్శుచి రూర్జితః ।
అతీన్ద్రస్సంగ్రహస్సర్గో ధృతాత్మా నియమో యమః ॥ ౧౭
వేద్యో వైద్యస్సదా యోగీ వీరహా మాధవో మధుః ।
అతీన్ద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః ॥ ౧౮
మహాబుద్ధి ర్మహావీర్యో మహాశక్తి ర్మహాద్యుతిః ॥
అనిర్దేశ్యవపుశ్శ్రీమా నమేయాత్మా మహాద్రిధృత్ ॥ ౧౯
మహేష్వాసో మహీభర్తా శ్రీనివాస స్సతాంగతిః ।
అనిరుద్ధ స్సురానన్దో గోవిన్దో గోవిదాంపతిః ॥ ౨౦
మరీచి ర్దమనో హంస స్సుపర్ణో భుజగోత్తమః ।
హిరణ్యనాభ స్సుతపాః పద్మనాభః ప్రజాపతిః ॥ ౨౧
అమృత్యు స్సర్వదృక్సింహ స్సన్ధాతా సన్ధిమాన్ స్థిరః ।
అజో దుర్మర్షణ శ్శాస్తా విశ్రుతాత్మా సురారిహా ॥ ౨౨
గురుర్గురుతమో ధామ సత్యస్సత్యపరాక్రమః ।
నిమిషోఽనిమిష స్స్రగ్వీ వాచస్పతి రుదారధీః ॥ ౨౩
అగ్రణీ ర్గ్రామణీ శ్శ్రీమా న్న్యాయో నేతా సమీరణః ।
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షస్సహస్రపాత్ ॥ ౨౪
ఆవర్తనో నివృత్తాత్మా సంవృత స్సంప్రమర్దనః ।
అహస్సంవర్తకో వహ్ని రనిలో ధరణీధరః ॥ ౨౫
సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వ(ధృగ్వి)శ్వభుగ్విభుః ।
సత్కర్తా సత్కృత స్సాధు ర్జహ్ను ర్నారాయణో నరః ॥ ౨౬
అసంఖ్యేయోఽప్రమేయాత్మా విశిష్టశ్శిష్టకృ చ్ఛుచిః ।
సిద్ధార్థస్సిద్ధసఙ్కల్పః సిద్ధిదస్సిద్ధిసాధనః ॥ ౨౭

వృషాహీ వృషభో విష్ణుర్వృష పర్వా వృషోదరః ।
వర్ధనో వర్ధమానశ్చ వివిక్తః శ్రుతిసాగరః ॥ ౨౮
సుభుజో దుర్ధరో వాగ్మీ మహేన్ద్రో వసుదో వసుః ।
నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః ॥ ౨౯
ఓజస్తేజోద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః ।
ఋద్ధస్స్పష్టాక్షరో మన్త్రశ్చన్ద్రాంశుర్భాస్కరద్యుతిః ॥ ౩౦
అమృతాంశూద్భవో భానుః శశిబిన్దుస్సురేశ్వరః ।
ఔషధం జగతస్సేతు స్సత్యధర్మ పరాక్రమః ॥ ౩౧
భూతభవ్యభవన్నాథ పవనః పావనో ఽనలః ।
కామహా కామకృత్కాన్తః కామః కామప్రదః ప్రభుః ॥ ౩౨
యుగాదికృ ద్యుగావర్తో నైకమాయో మహాశనః ।
అదృశ్యో వ్యక్తరూప శ్చ సహస్రజి దనన్తజిత్ ॥ ౩౩
ఇష్టోఽవిశిష్ట శ్శిష్టేష్టః శిఖండీ నహుషో వృషః ।
క్రోధహా క్రోధకృ త్కర్తా విశ్వబాహు ర్మహీధరః ॥ ౩౪
అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః ।
అపాంనిధి రధిష్ఠాన మప్రమత్తః ప్రతిష్ఠితః ॥ ౩౫
స్కన్దః స్కన్దధరో ధుర్యో వరదో వాయువాహనః ।
వాసుదేవో బృహద్భాను రాదిదేవః పురన్దరః ॥ ౩౬
అశోక స్తారణ స్తారః శూర శ్శౌరి ర్జనేశ్వరః ।
అనుకూల శ్శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః ॥ ౩౭
పద్మనాభోఽరవిన్దాక్షః పద్మగర్భ శ్శరీరభృత్ ।
మహర్ద్ధి రృద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః ॥ ౩౮

అతుల శ్శరభో భీమ స్సమయజ్ఞో హవిర్హరిః ।
సర్వలక్షణలక్షణ్యో లక్ష్మీవాన్ సమితింజయః ॥ ౩౯

విక్షరో రోహితో మార్గో హేతు ర్దామోదర స్సహః ।
మహీధరో మహాభాగో వేగవా నమితాశనః ॥ ౪౦

ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః ।
కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః ॥ ౪౧

వ్యవసాయో వ్యవస్థానః సంస్థాన స్థానదో ధ్రువః ।
పరర్ధిః పరమస్పష్ట స్తుష్టః పుష్ట శ్శుభేక్షణః ॥ ౪౨

రామో విరామో విరజో మార్గో నేయో నయో௨నయః ।
వీర శ్శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః ॥ ౪౩

వైకుణ్ఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః ।
హిరణ్యగర్భ శ్శత్రుఘ్నో వ్యాప్తో వాయు రధోక్షజః ॥ ౪౪

ఋతు స్సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః ।
ఉగ్ర స్సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః ॥ ౪౫

విస్తారః స్థావర స్స్థాణుః ప్రమాణంబీజ మవ్యయమ్ ।
అర్థో௨నర్థో మహాకోశో మహాభోగో మహాధనః ॥ ౪౬

అనిర్విణ్ణ స్స్థవిష్ఠో భూ ర్ధర్మయూపో మహామఖః ।
నక్షత్రనేమి ర్నక్షత్రీ క్షమః, క్షామ స్సమీహనః ॥ ౪౭

యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతు స్సత్రం సతాంగతిః ।
సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్ ॥ ౪౮

సువ్రత స్సుముఖ స్సూక్ష్మ స్సుఘోష స్సుఖద స్సుహృత్ ।
మనోహరో జితక్రోధో వీరబాహు ర్విదారణః ॥ ౪౯

స్వాపన స్స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్ ।
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః ॥ ౫౦
ధర్మకృ ద్ధర్మగు ద్ధర్మీ సదసత్క్షర మక్షరమ్ ।
అవిజ్ఞాతా సహస్రాంశు ర్విధాతా కృతలక్షణః ॥ ౫౧
గభస్తినేమి స్సత్త్వస్థ స్సింహో భూతమహేశ్వరః ।
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః ॥ ౫౨
ఉత్తరో గోపతి ర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః ।
శరీరభూతభృద్భోక్తా కపీన్ద్రో భూరిదక్షిణః ॥ ౫౩
సోమపోఽమృతప స్సోమః పురుజిత్పురుసత్తమః ।
వినయో జయ స్సత్యసన్ధో దాశార్హ స్సాత్వతాంపతిః॥ ౫౪
జీవో వినయితా సాక్షీ ముకున్దోఽమితవిక్రమః ।
అమ్భోనిధి రనన్తాత్మా మహోదధిశయోఽన్తకః ॥ ౫౫
అజో మహార్హ స్స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః ।
ఆనన్దో నన్దనో నన్ద స్సత్యధర్మా త్రివిక్రమః ॥ ౫౬
మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః ।
త్రిపద స్త్రిదశాధ్యక్షో మహాశృంగః కృతాన్తకృత్ ॥ ౫౭
మహావరాహో గోవిన్ద స్సుషేణః కనకాంగదీ ।
గుహ్యో గభీరో గహనో గుప్త శ్చక్రగదాధరః ॥ ౫౮
వేధా స్స్వాంగోఽజితః కృష్ణో దృఢ స్సఙ్కర్షణోఽచ్యుతః ।
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః ॥ ౫౯
భగవాన్ భగహాఽఽనన్దీ వనమాలీ హలాయుధః ।
ఆదిత్యో జ్యోతిరాదిత్య స్సహిష్ణు ర్గతిసత్తమః ॥ ౬౦

సుధన్వా ఖణ్డపరశు ర్దారుణో ద్రవిణప్రదః ।
దివస్పృ క్సర్వదృగ్వ్యాసో వాచస్పతిరయోనిజః ॥ ౬౧
త్రిసామా సామగ స్సామ నిర్వాణం భేషజం భిషక్ ।
సన్న్యాసకృ చ్ఛమ శ్శాన్తో నిష్ఠా శాన్తిః పరాయణ(ః)మ్॥౬౨
శుభాంగ శ్శాన్తిద స్స్రష్టా కుముదః కువలేశయః ।
గోహితో గోపతి ర్గోప్తా వృషభాక్షో వృషప్రియః ॥ ౬౩
అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృ చ్ఛివః ।
శ్రీవత్సవక్షా శ్శ్రీవాస శ్శ్రీపతిః శ్రీమతాంవరః ॥ ౬౪
శ్రీద శ్శ్రీశ శ్శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః ।
శ్రీధరః శ్రీకర శ్శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః॥౬౫
స్వక్ష స్స్వఙ్గ శ్శతానన్దో నన్ది ర్జ్యోతి ర్గణేశ్వరః ।
విజితాత్మా విధేయాత్మా సత్కీర్తి శ్ఛిన్నసంశయః ॥ ౬౬
ఉదీర్ణ స్సర్వతశ్చక్షు రనీశ శ్శాశ్వత స్థిరః ।
భూశయో భూషణో భూతి ర్విశోక శ్శోకనాశనః ॥ ౬౭
అర్చిష్మా నర్చితః కుమ్భో విశుద్ధాత్మా విశోధనః ।
అనిరుద్ధోఽప్రతిరథః ప్రద్యుమ్నోఽమితవిక్రమః ॥ ౬౮
కాలనేమినిహా వీర శ్శౌరి శ్శూర జనేశ్వరః ।
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః ॥ ౬౯
కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః ।
అనిర్దేశ్యవపు ర్విష్ణు ర్వీరోఽనన్తో ధనఞ్జయః ॥ ౭౦
బ్రహ్మణ్యో బ్రహ్మకృ ద్బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మవివర్ధనః ।
బ్రహ్మవి ద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః॥౭౧

మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః ।
మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః ॥ ౭౨
స్తవ్య స్స్తవప్రియ స్స్తోత్రం స్తుతిస్స్తోతా రణప్రియః ।
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తిరనామయః ॥ ౭౩
మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః ।
వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః ॥ ౭౪
సద్గతి స్సత్కృతి స్సత్తా సద్భూతి స్సత్పరాయణః ।
శూరసేనో యదుశ్రేష్ఠ స్సన్నివాస స్సుయామునః ॥ ౭౫
భూతావాసో వాసుదేవః సర్వాసునిలయోఽనలః ।
దర్పహా దర్పదోఽదృప్తో దుర్ధరోఽథాపరాజితః ॥ ౭౬
విశ్వమూర్తి ర్మహామూర్తి ర్దీప్తమూర్తిరమూర్తిమాన్ ।
అనేకమూర్తి రవ్యక్త శ్శతమూర్తి శ్శతాననః ॥ ౭౭
ఏకో నైక స్సవః కః కిం యత్తత్పద మనుత్తమమ్ ।
లోకబన్ధు ర్లోకనాథో మాధవో భక్తవత్సలః ॥ ౭౮
సువర్ణవర్ణో హేమాంగో వరాంగశ్చన్దనాంగదీ ।
వీరహా విషమ శ్శూన్యో ఘృతాశీ రచల శ్చలః ॥ ౭౯
అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోకధృక్(త్) ।
సుమేధా మేధజో ధన్య స్సత్యమేధా ధరాధరః ॥ ౮౦
తేజోవృషో ద్యుతిధర స్సర్వశస్త్రభృతాంవరః ।
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృఙ్గో గదాగ్రజః ॥ ౮౧
చతుర్మూర్తి శ్చతుర్బాహు శ్చతుర్వ్యూహ శ్చతుర్గతిః ।
చతురాత్మా చతుర్భావ శ్చతుర్వేదవిదేకపాత్ ॥ ౮౨

సమావర్తోఽనివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః ।
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా ॥ ౭౩

శుభాఙ్గో లోకసారఙ్గ స్సుతన్తు స్తన్తువర్ధనః ।
ఇన్ద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః ॥ ౭౪

ఉద్భవ స్సున్దర స్సున్దో రత్ననాభ స్సులోచనః ।
అర్కో వాజసని(స) శ్శృఙ్గీ జయన్త స్సర్వవిజ్జయీ ॥ ౭౫

సువర్ణబిన్దు రక్షోభ్య స్సర్వవాగీశ్వరేశ్వరః ।
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః ॥ ౭౬

కుముదః కున్దరః కున్దః పర్జన్యః పావనోఽనిలః ।
అమృతాంశోఽమృతవపు స్సర్వజ్ఞ స్సర్వతోముఖః ॥ ౭౭

సులభ స్సువ్రత స్సిద్ధ శ్శత్రుజిచ్ఛత్రుతాపనః ।
న్యగ్రోధోదుమ్బరోఽశ్వత్థ శ్చాణూరాన్ధ్రనిషూదనః ॥ ౭౮

సహస్రార్చి స్సప్తజిహ్వ స్సప్తైధా స్సప్తవాహనః ।
అమూర్తి రనఘోఽచిన్త్యో భయకృద్భయనాశనః ॥ ౭౯

అణుర్బృహత్కృశ స్స్థూలో గుణభృన్నిర్గుణో మహాన్ ।
అధృతః స్వధృత స్స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః ॥ ౮౦

భారభృత్ కథితో యోగీ యోగీశ స్సర్వకామదః ।
ఆశ్రమ శ్శ్రమణః క్షామ స్సుపర్ణో వాయువాహనః ॥ ౮౧

ధనుర్ధరో ధనుర్వేదో దణ్డో దమయితా దమః ।
అపరాజిత స్సర్వసహో నియన్తా నియమో యమః ॥ ౮౨

సత్త్వవాన్ సాత్త్విక స్సత్య స్సత్యధర్మపరాయణః ॥
అభిప్రాయః ప్రియార్హోఽర్హః ప్రియకృత్ప్రీతివర్ధనః ॥ ౮౩

విహాయసగతి ర్జ్యోతి స్సురుచిర్హుతభుగ్విభుః ।
రవిర్విలోచనస్సూర్యః సవితా రవిలోచనః ॥ ౯౪
అనన్తో హుతభుగ్భోక్తా సుఖదో నైకజోఽగ్రజః ।
అనిర్విణ్ణ స్సదామర్షీ లోకాధిష్ఠాన మద్భుతః ॥ ౯౫
సనాత్సనాతనతమః కపిలః కపిరవ్యయః ।
స్వస్తిద స్స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తిదక్షిణః ॥ ౯౬
అరౌద్రః కుణ్డలీ చక్రీ విక్రమ్యూర్జితశాసనః ।
శబ్దాతిగ శ్శబ్దసహ శ్శిశిర శ్శర్వరీకరః ॥ ౯౭
అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాం వరః ।
విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణకీర్తనః ॥ ౯౮
ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః ।
వీరహా రక్షణ స్సన్తో జీవనం పర్యవస్థితః ॥ ౯౯
అనన్తరూపోఽనన్తశ్రీ ర్జితమన్యు ర్భయాపహః ।
చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః ॥ ౧౦౦
అనాది ర్భూర్భువో లక్ష్మీ స్సువీరో రుచిరాంగద ।
జననో జనజన్మాది ర్భీమో భీమపరాక్రమః ॥ ౧౦౧
ఆధారనిలయో(ఽ)ధాతా పుష్పహాసః ప్రజాగరః ॥
ఊర్ధ్వగ స్సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః ॥ ౧౦౨
ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ప్రాణజీవనః ।
తత్త్వం తత్త్వవిదేకాత్మా జన్మమృత్యుజరాతిగః ॥ ౧౦౩
భూర్భువస్స్వస్తరు స్తార స్సవితా ప్రపితామహః ।
యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః ॥ ౧౦౪

యజ్ఞభృ ద్యజ్ఞకృ ద్యజ్ఞీ యజ్ఞభుగ్యజ్ఞసాధనః ।
యజ్ఞాన్తకృద్యజ్ఞగుహ్య మన్న మన్నాద ఏవ చ ॥ ౧౦౫
ఆత్మయోని స్స్వయంజాతో వైఖాన స్సామగాయనః ।
దేవకీనన్దన స్స్రష్టా క్షితీశః పాపనాశనః ॥ ౧౦౬
శఙ్ఖభృన్నన్దకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః ।
రథాంగపాణి రక్షోభ్య స్సర్వప్రహరణాయుధః ॥ ౧౦౭
శ్రీసర్వప్రహరణాయుధోంనమ ఇతి ।
వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీ చ నన్దకీ ।
శ్రీమాన్నారాయణో విష్ణు ర్వాసుదేవోఽభిరక్షతు ॥ ౧౦౮

## ఉత్తర పీఠికా

ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః ।
నామ్నాం సహస్రం దివ్యానా మశేషేణ ప్రకీర్తితమ్ ॥ ౧
య ఇదం శృణుయా న్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।
నాశుభం ప్రాప్నుయాత్కించి త్సోఽముత్రేహ చ మానవః ॥ ౨
వేదాన్తగో బ్రాహ్మణస్స్యాత్ క్షత్రియో విజయీ భవేత్ ।
వైశ్యో ధనసమృద్ధస్స్యా చ్ఛూద్రస్సుఖ మవాప్నుయాత్ ॥ ౩
ధర్మార్థీ ప్రాప్నుయా ద్ధర్మ మర్థార్థీ చార్థమాప్నుయాత్ ।
కామా నవాప్నుయాత్కామీ ప్రజార్థీ చాప్నుయాత్ప్రజామ్ ॥
భక్తిమా న్యస్సదోత్థాయ శుచి స్తద్గతమానసః ।
సహస్రం వాసుదేవస్య నామ్నా మేత త్ప్రకీర్తయేత్ ॥ ౪
యశః ప్రాప్నోతి విపులం యాతి ప్రాధాన్య మేవ చ ।
అచలాం శ్రియ మాప్నోతి శ్రేయః ప్రాప్నో త్యనుత్తమమ్ ॥ ౬

న భయం క్వచిదాప్నోతి వీర్యం తేజశ్చ విన్దతి ।
భవత్యరోగో ద్యుతిమాన్ బలరూపగుణాన్వితః ॥ ౭
రోగార్తో ముచ్యతే రోగాద్బద్ధో ముచ్యేత బన్ధనాత్ ।
భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥ ౮
దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమమ్ ।
స్తువన్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః ॥ ౯
వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవపరాయణః ।
సర్వపాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్ ॥ ౧౦
న వాసుదేవభక్తానామశుభం విద్యతే క్వచిత్ ।
జన్మమృత్యుజరావ్యాధి భయం నైవో, నాప్యుపజాయతే ॥ ౧౧
ఇమం స్తవమధీయానః శ్రద్ధాభక్తిసమన్వితః ।
యుజ్యేతాత్మసుఖక్షాన్తి శ్రీధృతిస్మృతికీర్తిభిః ॥ ౧౨
న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభా మతిః ।
భవన్తి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే ॥ ౧౩
ద్యౌస్సచన్ద్రార్కనక్షత్రం ఖం దిశో భూర్మహోదధిః ।
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః ॥ ౧౪
ససురాసురగన్ధర్వం సయక్షోరగరాక్షసమ్ ॥
జగద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచరమ్ ॥ ౧౫
ఇంద్రియాణి మనో బుద్ధిస్సత్త్వం తేజో బలం ధృతిః ।
వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవ చ ॥ ౧౬
సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పతే(ల్పితః ।
ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః ॥ ౧౭

ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః ।
జఙ్గమాజఙ్గమం చేదం జగన్నారాయణోద్భవమ్ ॥ ౧౮
యోగో జ్ఞానం తథా సాఙ్ఖ్యం విద్యాశ్శిల్పాదికర్మ చ ।
వేదాశ్శాస్త్రాణి విజ్ఞానమేతత్సర్వం జనార్దనాత్ ॥ ౧౯
ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః ।
త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వభుగవ్యయః ॥
ఇమం స్తవం భగవతో విష్ణోర్వ్యాసేన కీర్తితమ్ ।
పఠేద్య ఇచ్ఛేత్పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖాని చ ॥ ౨౧
విశ్వేశ్వర మజం దేవం జగతః ప్రభు మవ్యయమ్ ।
భజన్తి యే పుష్కరాక్షం న తే యాన్తి పరాభవమ్ ॥ ౨౨
న తే యాన్తి పరాభవమోంనమ ఇతి ।

అర్జునఉవాచ-
పద్మపత్రవిశాలాక్ష పద్మనాభ సురోత్తమ ।
భక్తానా మనురక్తానాం త్రాతా భవ జనార్దన ॥ ౨౩

శ్రీభగవానువాచ–
యో మాం నామసహస్రేణ స్తోతు మిచ్ఛతి పాణ్డవ ।
సోఽహ మేకేన శ్లోకేన స్తుత ఏవ న సంశయః ॥ ౨౪
స్తుత ఏవ న సంశయ ఓం నమ ఇతి ।

వ్యాసఉవాచ–
వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్ ।
సర్వభూతనివాసోఽసి వాసుదేవ నమోఽస్తు తే ॥ ౨౫
శ్రీవాసుదేవనమోస్తుత ఓం నమ ఇతి ।

పార్వత్యువాచ–
కేనోపాయేన లఘునా విష్ణోర్నామసహస్రకమ్ ।
పఠ్యతే పణ్డితైర్నిత్యం శ్రోతుమిచ్ఛామ్యహం ప్రభో ॥ ౨౬

ఈశ్వర ఉవాచ-

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే ॥ ౨౭

బ్రహ్మోవాచ-

నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షిశిరోరుబాహవే ।
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటీ యుగధారిణే నమః ॥ ౨౮

సఞ్జయ ఉవాచ-

యత్ర యో(గీ)గేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ॥ ౨౯

శ్రీభగవానువాచ-

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ ౩౦
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥ ౩౧
ఆర్తా విషణ్ణాశ్శిథిలాశ్చ భీతా
ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః ।
సఙ్కీర్త్య నారాయణశబ్దమాత్రం
విముక్తదుఃఖా స్సుఖినో భవన్తి ॥ ౩౨

ఇతి శ్రీమహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యా మనుశాసనపర్వాంతర్గత ఆనుశాసనికపర్వణి మోక్షధర్మే భీష్మ యుధిష్ఠిరసంవాదే శ్రీవిష్ణోర్దివ్యసహస్రనామస్తోత్రం నామైకోనపఞ్చాశదధికశతతమోఽధ్యాయః.

శ్రీ పరమాత్మనే నమః

# శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము

[ శంకర భాష్యము ]

శ్లో॥ సచ్చిదానన్దరూపాయ కృష్ణాయాక్లిష్టకారిణే ।
నమో వేదాన్తవేద్యాయ గురవే బుద్ధిసాక్షిణే ॥

శ్లో॥ కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతమ్ ।
వేదాబ్జభాస్కరం వన్దే శమాదినిలయం మునిమ్ ॥

శ్లో॥ సహస్రమూర్తేః పురుషోత్తమస్య
సహస్రనేత్రాననపాదబాహోః ।
సహస్రనామ్నాం స్తవనం ప్రశస్తం
నిరుచ్యతే జన్మజరాదిశాన్త్యై ॥

శ్రీ శంకర భగవత్పాదులు మహాభారతాన్తర్గత మగు శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రమునకు భాష్యము రచించుచు ప్రథమశ్లోకముచేత సచ్చిదానందరూప శ్రీకృష్ణభగవానుని, ద్వితీయ శ్లోకముచేత తపోనిధి యగు వేదవ్యాసభగవానుని నమస్కరించి తృతీయ శ్లోకముచేత నేత్ర-ముఖ-పాద-బాహు-సహస్రవిరాజితుడు, సహస్రమూర్తి ధారియునగు పురుషోత్తముని ప్రశస్తమైన సహస్రనామస్తోత్రము జన్మజరాదిశాన్తికై వ్యాఖ్యానింపబడుచున్న దని తెలిపిరి.

వైశంపాయనమహర్షి మహాభారతమునందు జనమేజయ మహారాజునకు చెప్పుచు ఇట్లు పలికెను.

వైశంపాయనో జనమేజయ ఉవాచః—

శ్లో॥ శ్రుత్వా ధర్మా నశేషేణ పావనాని చ సర్వశః ।
యుధిష్ఠిర శ్శాన్తనవం పునరేవాఽభ్యభాషత ॥ ౧

శంకర భాష్యమ్ :- ధర్మాన్-అభ్యుదయ నిశ్శ్రేయసోత్పత్తి హేతు భూతాన్ చోదనాలక్షణాన్; అశేషేణ-కార్త్స్న్యేన; పావనాని - పాపక్షయ కరాణి ధర్మరహస్యాని చ; సర్వశః-సర్వప్రకారైః; శ్రుత్వా; యుధిష్ఠిరో-ధర్మపుత్రః శాన్తనవం - శన్తనుసుతం భీష్మం; సకల పురుషార్థసాధనం. సుఖసంపాద్య మల్పప్రయాస మనల్పఫల మనుక్త మితి కృత్వా. పునః-భూయ ఏవ; అభ్యభాషత ప్రశ్నం కృతవాన్.

యుధిష్ఠిరుడు, అభ్యుదయ మోక్షసాధనములు, వేద విహితములు నగు సకల ధర్మములను, పాపక్షయకరములైన ధర్మరహస్యములను భీష్ముని వలన విని యు, సకల పురుషార్థ సాధనము, సులభసాధ్యము, అల్పప్రయాసము, అనల్పఫలము నగు విషయము కొరకు మరల ఇట్లు ప్రశ్నించెను.

యుధిష్ఠిర ఉవాచ :—

శ్లో॥ కి మేకం దైవతం లోకే కిం వా ప్యేకం పరాయణమ్ ।
స్తువన్తః కం కమర్చన్తః ప్రాప్నుయు ర్మానవా శ్శుభమ్ ॥

శం. భా. :- కిమేకం దైవతం దేవ ఇత్యర్థః; స్వార్థే తద్ధిత ప్రత్యయ విధానాత్; లోకే-లోకసహేతుభూతే సమస్త విద్యాస్థానే; ఉక్తమ్. 'యదాజ్ఞయా ప్రవర్తన్తే సర్వే' ఇతి ప్రథమః ప్రశ్నః.

పై శ్లోకములోని యుధిష్ఠిరప్రశ్నములు నాలుగు. అందు ప్రథమప్రశ్నము ఇది. వేద-పురాణ-న్యాయ-మీమాంసా-ధరశాస్త్రాది సమస్త విద్యాస్థానములలో కీర్తింపబడియున్న

మెవని యాజ్ఞకు లోబడి సకల ప్రపంచము ప్రవర్తించు చున్నదో ఒక్కడయిన అట్టి దేవు డెవరు ?

శం. భా. :- 'కిం వా పేక్యం పరాయణమ్' — అస్మిన్ లోకే ఏకం పరాయణం చ కిమ్ ; పర మయనం - ప్రాప్తవ్యం స్థానమ్. యస్మి న్నిరీక్షితే— "భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః క్షీయన్తే చాఽస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" — ఇతి శ్రుతేః హృదయగ్రన్థి శ్ఛిద్యతే । యస్య విజ్ఞానమాత్రే ఆనన్దలక్షణో మోక్షః ప్రాప్యతే. యద్వి ద్వా న్నబిభేతి కుతశ్చన. యత్రప్రవిష్టస్య న విద్యతే పునర్భవః. యస్య చ వేదనా త్తదేవ భవతి 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి'— ఇతి శ్రుతేః. యద్విహాయాఽపరః పన్థా స్సతాం నాస్తి 'నాన్యః పన్థా విద్యతేఽయనాయ' —ఇతి శ్రుతేః తదుక్త మేకం పరాయణం లోకే యత్తత్కిమితి ద్వితీయః ప్రశ్నః.

విద్వాంసులలో, ప్రాప్తవ్య స్థానముగా ఏ యొకటి కీర్తింపబడినదో, ఏది సాక్షాత్కారము నొందినతో హృదయగ్రన్థి భిన్నమగునో దేని విజ్ఞానమాత్రమున ఆనన్దాత్మక మయిన మోక్షము ప్రాప్తించునో, దేనిని పొందినవానికి పునర్జన్మ ముండదో, దేనియొక్క సాక్షాత్కారమును కలుగుటతో అదియే అగునో, లోకులకు దేనిని విడిచి మార్గాంతరము లేకుండెనో, (ఈ విశేషణము లన్నియు శ్రుతివాక్యసిద్ధములు) అట్టి పరమైన పరాయణ మది యేది ? ఇది ద్వితీయ ప్రశ్న.

శం. భా :- 'కం. కతమం దేవం స్తువన్తః - గుణసంకీర్తనం కుర్వ న్తః; కం. కతమం దేవమ్ అర్చన్తః - బాహ్య మాభ్యన్తరం చాఽర్చనం బహువిధం కుర్వన్తః; మానవాః - మనుష్యాః; శుభం - కల్యాణం స్వర్గాదిఫలం; ప్రాప్నుయుః - లభేరన్; ఇతి పునః ప్రశ్నద్వయమ్.

ఏ దేవుని గుణసంకీర్తనరూపమున స్తుతించుచు ఏ దేవుని బాహ్యముగా అభ్యంతరముగా బహువిధముల అర్చించుచు మనుసంతతియైన మానవులు కల్యాణకరమైన స్వర్గాదిఫలమును పొందుదురో యాదేవు డెవ్వరనునది ప్రశ్నద్వయము. ఇట్లు నాలుగు ప్రశ్నలు.

శ్లో॥ కో ధర్మ స్సర్వధర్మాణాం భవతః పరమో మతః ।
కిం జప న్ముచ్యతే జన్తుః జన్మసంసారబన్ధనాత్ ॥ 3

శం.భా. :- కో ధర్మః పూర్వోక్తలక్షణః; సర్వధర్మాణాం - సర్వేషాం ధర్మాణాం మధ్యే; భవతః; పరమః - ప్రకృష్టః; మతః-అభిప్రేత ఇతి పంచమః ప్రశ్నః । కిం జపన్ - కిం జప్యం జపన్. ఉచ్చోపాంశు మానసలక్షణం జపం కుర్వన్, జన్తుః-జననధర్మా; అనేన జన్తుశబ్దేన జపార్చనస్తవనాదిషు యథాయోగ్యం సర్వప్రాణినా మధికారం సూచయతి; జన్మసంసార బన్ధనాత్-జన్మ - అజ్ఞానవిజృంభితానా మవిద్యాకార్యాణా ముప లక్షణం. సంసారోఽవిద్యా. తాభ్యాం. జన్మసంసారాభ్యాం యద్బన్ధనం. తస్మాత్; ముచ్యతే-ముక్తో భవతీతి షష్ఠః ప్రశ్నః । ముచ్యతే జన్మసంసార బన్ధనా దితీద ముపలక్షణ మితరేషాం ఫలానా మపి. ఏతద్గ్రహణం మోక్షస్య ప్రాధాన్యఖ్యాపనార్థమ్ ॥

పూర్వోక్తలక్షణము కల సర్వధర్మములలో నుత్తమ ధర్మమేది యని మీ యభిప్రాయము ? ఇది ఐదవప్రశ్న.

ఒరులకు వినబడునట్లు (ఉచ్చ) వినబడనట్లు (ఉపాంశు) మానసికము అను పద్ధతులతో జపించువారు దేనిని జపించి జన్మపరంపర నుండి సంసారము (అవిద్య) నుండి విముక్తు లగుదురు ? ఇది ఆరవ ప్రశ్న. ఈ ప్రశ్నలలో జన్తు శబ్దమును

బట్టి జననధర్మము కల సర్వప్రాణులనును జపము అర్చన స్తుతి మున్నగువానియందు యోగ్యతానుసారము అధికారము కలదని సూచింపబడినది. జన్మసంసార...అను పదము ఇందలి జన్మ శబ్దము అజ్ఞానవిజృంభితము లగు అవిద్యాకార్యము లన్నిటిని చెప్పును. సంసార శబ్దము అవిద్యను చెప్పును. కనుక అవిద్యాకార్యముల చేత, అవిద్య చేత కలుగు బన్ధము నుండి విముక్తి ప్రశ్నింపబడినది. ఇక్కడ 'ముచ్యతే' అను పదము మోక్షఫలమునే కాక ఇతర ఫలములను కూడ చెప్పును. మోక్షమునకు ప్రాధాన్యమును చెప్పుటకై 'ముచ్యతే' అనబడినది.

శ్రీ భీష్మ ఉత్తర మువాచ :—

శ్లో॥ జగత్ప్రభుం దేవదేవ మనన్తం పురుషోత్తమమ్ ।
స్తువన్నామ సహస్రేణ పురుష స్సతతోత్థితః ॥ ౮

శం. భా. :- కిమేక మితి షట్ ప్రశ్నాః కథితాః; తేషు పాశ్చాత్యోఽనన్తరో జప్య విషయః షష్ఠః ప్రశ్నః అనేన శ్లోకేన పరిహ్రియతే - సర్వేషాం బహిరన్తశ్శత్రూణాం భయహేతు ర్విష్ణుః మోక్షధర్మాదీనాం ప్రవక్తా సర్వజ్ఞః.

'కిమేకం దైవతమ్' అను రెండవ శ్లోకము మూడవ శ్లోకములలో చెప్పబడినవి ఆరు ప్రశ్నలు. అందులో కిం జపన్ ముచ్యతే జన్తుః' అని జప్యవిషయకమైన ఆరవ ప్రశ్నపై భీష్ముని ఉత్తరము ఈ నాల్గవ శ్లోకమున చెప్పబడుచున్నది. అన్తశ్శత్రువులగు కామక్రోధాదులకును బహిశ్శత్రువులకును భయంకరుడు, మోక్షధర్మాదులకు ప్రవక్త, సర్వజ్ఞుడు నగు

భీష్ముడు ఇట్లు సమాధానము చెప్పుచున్నాడు.

శం. భా. :- జగత్ - స్థావరజంగమాత్మకం; తస్య ప్రభుం - స్వామినమ్. దేవదేవం - దేవానాం బ్రహ్మాదీనాం దేవమ్; అనన్తమ్ - దేశతః కాలతో వస్తుతశ్చాఽపరిచ్ఛిన్నం; పురుషోత్తమమ్ - క్షరాఽక్షరాభ్యాం కార్యకారణాభ్యా ముత్కృష్టమ్ నామసహస్రేణ - నామ్నాం సహస్రేణ; స్తువన్ - గుణాన్ సంకీర్తయన్; సతతోత్థితః - నిరన్తర ముద్యుక్తః; పురుషః - పూర్ణత్వాత్, పురిశయనాద్వా, పురుషః; సర్వదుఃఖాతిగో భవేత్ - ఇతి సర్వత్ర సంబధ్యతే.

స్థావర జంగమాత్మక జగత్తునకు ప్రభువు. బ్రహ్మాది దేవతలకు దేవుడు, అనంతుడు, దేశ-కాల-వస్తువులచే నపరిచ్ఛిన్నుడు, (దేశతః పరిచ్ఛిన్నుడు-ఒక దేశమందుండి మరొక దేశ మం దుండనివాడు; కాలతః పరిచ్ఛిన్నుడు కాల మందుండని వాడు, వస్తుతః పరిచ్ఛిన్నుడు - ఒక వస్తువయి యుండి మరొక వస్తువు కానివాడు, ఇట్లు త్రివిధముగను పరిచ్ఛిన్నుడు కానట్టి వాడు.) క్షరము అక్షరము అగు కార్యకారణముల కంటె ఉత్కృష్టుడయి పురుషోత్తము డనబడు దేవదేవుని సహస్ర నామముల చేత, గుణసంకీర్తన రూపమైన స్తుతిని నిరన్తరము ఉద్యుక్తుడై చేయు పురుషుడు సర్వదుఃఖములనుండి తొలగును. ఇట 'పురుష' శబ్దము జీవుని చెప్పును.

శ్లో॥ తమేవ చాఽర్చయ న్నిత్యం భక్త్యా పురుష మవ్యయమ్ ।
ధ్యాయన్ స్తువ న్నమస్యంశ్చ యజమాన స్తమేవ చ॥ ౫

శం.భా :- చతుర్థః ప్రశ్న స్సమాధీయతే - తమేవ చాఽర్చయన్ - బాహ్యార్చనం కుర్వన్; నిత్యం-సర్వేషు కాలేషు; భక్తి ర్భజనం త్యాత్పర్యం; తయా భక్త్యా; పురుష మవ్యయం - వినాశక్రియారహితం; తమేవ చ

ధ్యాయన్ - అభ్యన్తరార్చనం కుర్వన్; స్తువన్ పూర్వోక్తేన; నమస్యన్ నమస్కారం కుర్వన్; పూజాశేషభూత ముభయం స్తుతినమస్కారలక్షణం; యజమానః - పూజకః ఫలభోక్తా. అథవా, అర్చయ న్నిత్యనేనోభయవిధ మర్చన ముచ్యతే. ధ్యాయం స్తువ న్నమస్యం శ్చేత్యనేన మానసం వాచికం కాయికం చోచ్యతే ॥

ఇక్కడ చతుర్థప్రశ్నకు సమాధానము చెప్పబడు చున్నది- అవ్యయుడు - వినాశక్రియారహితుడగు ఆ దేవునే అర్చించుచు బాహ్యమైన అర్చన చేయుచు- సర్వకాలము లయందు భక్తితో- తత్పరత్వముతో, ఆ దేవునే ధ్యానించుచు- అభ్యన్తరముగా అర్చించుచు, సహస్రనామములతో స్తుతించుచు, నమస్కరించు ధ్యాననిరతుడగు పూజకుడు సకల దుఃఖముల నుండి విముక్తుడగును. ఈ స్తుతినమస్కారములు పూజకు శేషభూతములు. ఇంకొకటి 'అర్చయన్' అనుటచే బాహ్యమైన ఆభ్యన్తరమైన ద్వివిధమగు అర్చన చెప్పబడి మానసికమయిన ధ్యానము, వాచికమైన స్తుతి, కాయికమైన నమస్కారము చెప్పబడినవి.

శ్లో॥ అనాదినిధనం విష్ణుం సర్వలోక మహేశ్వరమ్ ।
లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్ ॥ ౬

శం.భా. :- తృతీయం ప్రశ్నం పరిహరతి - అనాదినిధనం - షడ్భావ వికారవర్జితం; విష్ణుం - వ్యాపనశీలం; సర్వం లోక్యతే ఇతి లోకో దృశ్య వర్గో లోకః; తస్య నియన్తౄణాం బ్రహ్మాదీనా మపీశ్వరత్వాత్ సర్వలోక మహేశ్వరః. తం; లోకం స్వాశ్రయస్థం. స్వాభావికేన బోధేన సాక్షాత్పశ్య తీతి లోకాధ్యక్షః. తం; నిత్యం - నిరన్తరం; స్తువన్; సర్వదుఃఖాతిగో

భవేత్. ఇతి త్రయాణాం స్తవనాఽర్చనజపానాం సాధారణం ఫలవచనం. సర్వాణి అధ్యాత్మికాదీని దుఃఖాన్యతీత్య గచ్ఛతీతి సర్వదుఃఖాతిగో భవేత్ ॥

తృతీయ ప్రశ్నకు సమాధానము - భావపదార్థము జన్మ మొదలు నాశపర్యంతము ఆరు వికారములు కలిగియుండును. అట్టి షడ్భావవికారములు లేనివాడు, సర్వవ్యాపకుడు, దృశ్య ప్రపంచమునకు నియన్తలగు బ్రహ్మాదులకును ఈశ్వరుడు. దృశ్యమంతయు సహజజ్ఞానము చే: ప్రత్యక్ష మొనర్చుకొను నట్టి యా దేవుని నిరన్తరము స్తుతించుచు అర్చించుచు జపించుచు నుండువాడు సర్వదుఃఖముల నుండి ఆధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము, అను దుఃఖత్రయము నుండి విముక్తుడగును.

శ్లో॥ బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనమ్ ।
లోకనాథం మహద్భూతం సర్వభూతభవోద్భవమ్ ॥ 2

శ. భా. :- పునరపి తమేవ స్తుత్యం విశినష్టి - బ్రహ్మణ్యం-బ్రహ్మణే (స్రష్ట్రే); బ్రాహ్మణాయ, తపసే, శ్రుతయే, హితమ్, సర్వాన్ ధర్మాన్ జానాతీతి సర్వధర్మజ్ఞః తమ్; లోకానాం ప్రాణినాం కీర్తయః యశాంసి; స్వశక్త్యాఽనుప్రవేశేన వర్ధయతీతి, తం; లోకై ర్నాథ్యతే, లోకా నుపతాప యతే, శాస్తే-లోకానా మిష్ట ఇతి వా, లోకనాథః తం. మహత్ బ్రహ్మ, విశ్వోత్కర్షేణ వర్తమానత్వాత్ మహద్భూతం - పరమార్థసత్యం; సర్వ భూతానాం భవః సంసారః. యత్సకాశా దుద్భవతీతి సర్వభూతభవో ద్భవః తమ్ ॥

మరల స్తుతింపబడు ఆ స్వరూపము యొక్క విశేషములే చెప్పబడుచున్నవి. బ్రహ్మణ్యుడు - బ్రహ్మకు హితమైనవాడు. ఈ బ్రహ్మ శబ్దము సృష్టికర్తను, బ్రాహ్మణుని, తపస్సును,

వేదమును చెప్పెను. వీనికి హితమైనవాడు గాన బ్రహ్మణ్యుడు, సర్వధర్మములు తెలిసినవాడగుటచే సర్వధర్మజ్ఞుడు, స్వశక్తిచే లోకులలో ప్రవేశించి వారి కీర్తులను వర్ధిల్ల జేయు వాడగుటచే కీర్తివర్ధనుడు. లోకులచేత యాచింపబడువాడు, లోకులను తపింపజేయువాడు, లోకులను శాసించువాడు, లోకులకు ఇష్టమైనవాడు - అగుటచే లోకనాథుడు, మహాత్ - సర్వోత్కృష్టమయినది. అనగా బ్రహ్మ, భూతము-సత్యము, అగుటచే మహాద్భూతము - పరమార్థసత్యము, సర్వభూత సంసారము నుద్భవింపజేయు వాడగుటచే సర్వభూతభవోద్భవుడు.

శ్లో॥ ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః ।
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవై రర్చేన్నర స్సదా ॥ ८

శం. భా. :- పంచమం ప్రశ్నం పరిహరతి - సర్వేషాం చోదనా లక్షణానాం ధర్మాణా మేష వక్ష్యమాణో ధర్మః అధికతమ ఇతి మే మమ మతః అభిప్రేతః; యద్భక్త్యా తాత్పర్యేణ; పుండరీకాక్షం - హృదయ పుండరీకే ప్రకాశమానం వాసుదేవం; స్తవైః - గుణసంకీర్తన లక్షణైః స్తుతిభిః సదాఽర్చేత్ - సత్కారపూర్వక మర్చనం కరోతి; నరః-మనుష్య ఇతి యత్ ఏష ధర్మ ఇతి సంబన్ధః ॥

పంచమప్రశ్నకు సమాధానము:- చోదనాలక్షణముగల సర్వ ధర్మములలో ఈ చెప్పబోవు ధర్మము అధికతమ మని నా అభిప్రాయము. మనుష్యుడు భక్తితత్పరత్వముతో హృదయాన్తర్వర్తి యగు వాసుదేవుని గుణసంకీర్తన రూపములైన స్తుతులతో ఆదరపూర్వకముగా అర్చించుట యనునది ఉత్తమ ధర్మము.

శం. భా. :- అస్య స్తుతిలక్షణస్య అర్చనస్యాధిక్యే కిం కారణమ్ ? ఉచ్యతే - హింసాది పురుషాన్తర ద్రవ్యాన్తర దేశ కాలాది నియమాఽనపేక్షత్వ మాధిక్యే కారణమ్ ।

"ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞై స్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్॥" (ఇతి విష్ణుపురాణే)

"జప్యేనైవ తు సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః
కుర్యా దన్యన్నవా కుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే॥"
(ఇతి మానవం వచనమ్)

"జపస్తు సర్వధర్మేభ్యః పరమో ధర్మ ఉచ్యతే
అహింసయా చ భూతానాం జపయజ్ఞః ప్రవర్తతే॥" (ఇతి మహాభారతే)

"యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" ఇతి భగవద్వచనమ్

ఏతత్సర్వ మభిప్రేత్య - "ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః" - ఇత్యుక్తమ్.

ఈ అర్చనరూప ధర్మము సర్వోత్తమ మగుటలో కారణము చెప్పబడుచున్నది. దీనికి హింస లేకుండుట, పురుషాన్తరాపేక్ష కాని, ద్రవ్యాన్తరాపేక్ష కాని, దేశకాలాది నియమాపేక్ష కాని లేకుండుట కారణము. కృతయుగములో ధ్యానము చేత త్రేతాయుగములో యజ్ఞముల చేత ద్వాపర యుగములో అర్చన చేత ఏ ఫలము ప్రాప్తించునో ఆ ఫలము కలియుగములో భగవత్సంకీర్తనము చేత ప్రాప్తించునని విష్ణు పురాణమున చెప్పబడుట చేతను, మను స్మృతిలో - 'ఏది చేసినను ఏది చేయకపోయినను భూతదయ కలవాడు బ్రాహ్మణు డనబడు' నని చెప్పుట వలనను, మహాభారతములో - 'అహింసతో కూడినది జపము కనుక జపయజ్ఞము ప్రశస్త'

మని చెప్పుట వలనను, గీతలో - 'యజ్ఞములలో జపయజ్ఞము నేనని చెప్పుట వలనను, ఈ ప్రమాణములను పురస్కరించు కొని అర్చనము సర్వధర్మములలో అధిక మని భీష్ముని అభి ప్రాయము.

శ్లో॥ పరమం యో మహ త్తేజః పరమం యో మహ త్తపః ।
పరమం యో మహద్బ్రహ్మ పరమం యః పరాయణమ్ ॥౯

శం. భా :- ద్వితీయం ప్రశ్నం సమాధత్తే - పరమం - ప్రకృష్టం; మహత్ - బృహత్; తేజః - చైతన్యలక్షణం సర్వావభాసకం; 'యేన సూర్య స్తపతి తేజసేద్ధః' 'తద్దేవా జ్యోతిషాం జ్యోతిః' 'న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకమ్' ఇత్యాది శ్రుతేః । 'యదాదిత్యగతం తేజః' ఇత్యాది స్మృతేశ్చ ॥

పరమం తపః - తపతే ఆజ్ఞాపయతీతి తపః 'య ఇమం చ లోకం పరమం చ లోకం సర్వాణి చ భూతాని యోఽన్తరో యమయతి' ఇత్య న్తర్యామి బ్రాహ్మణే సర్వనియన్తృత్వం శ్రూయతే 'భిషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః భీషాఽస్మా దగ్నిశ్చేన్ద్రశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః' ఇత్యాది తైత్తిరీయకే, తపతి ఐష్టే ఇతి వా తపః తస్యైశ్వర్య మనవ చ్ఛిన్న మితి మహత్త్వం. 'ఏష సర్వేశ్వర' ఇత్యాది శ్రుతేః. పరమం - సత్యాదిలక్షణం బ్రహ్మ; పరిబృంహితయా మహత్; పరమం-ప్రకృష్టం పున రావృత్తి శంకారహితం; పరాయణం-పరమ్ అయనం. పరాయణమ్; పరమ గ్రహణా త్సర్వత్ర అపరం తేజః ఆదిత్యాదికం వ్యావర్త్యతే; సర్వత్ర 'యో దేవ'ఇతి విశేష్యతే చ - యో దేవః పరమం తేజః, పరమం తపః; పరమం బ్రహ్మ. పరమం పరాయణం, సః ఏకం సర్వభూతానాం పరాయణ మితి వాక్యార్థః ॥

ద్వితీయ ప్రశ్నకు సమాధానము చెప్పబడుచున్నది-

ఏది ఉత్కృష్టము సర్వప్రకాశము అయి, సూర్యునకును తేజస్సును ప్రసాదించునది, జ్యోతిస్సులలో జ్యోతిస్సు, సూర్యాది తేజస్సులచే ప్రకాశింప జేయబడనిదనియు, శ్రుతులచే కీర్తింపబడుచున్న చైతన్యరూప మహాతేజోరూపమో, ఏ దేవుడు, సర్వనియన్తయు, వాయు - సూర్య - అగ్ని - ఇన్ద్ర - మృత్యు - దేవతలు కూడ భయపడవలసినవాడు అని శ్రుతులచే కీర్తింపబడుచున్న పరమ తపోరూపమో, ఇక్కడ 'తపః' పదమునకు ఆజ్ఞాపన, ఐశ్వర్యము. అని యర్థము సర్వేశ్వరుడుగా శ్రుతి చేత కీర్తింపబడు చుండుటచే అపరిమితైశ్వర్యశాలి యనియు అర్థము.

ఏ దేవుడు, పరమం బ్రహ్మ, సత్యజ్ఞానానన్ద లక్షణమై పూజనీయమైన పరబ్రహ్మస్వరూపమో, ఏ దేవుడు, పరమం- పునరావృత్తి శంకారహితమైన పరాయణం - పరమప్రాప్య స్థానమో, అట్టి దేవుడు సర్వభూతములకు పరాయణము.

శ్లో॥ పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్ ।
దైవతం దేవతానాం చ భూతానాం యోఽవ్యయః పితా॥

శం భా. :- ఇదానీం ప్రథమ ప్రశ్నస్యోత్తర మాహ - పవిత్రాణాం పవిత్రం - పావనానాం తీర్థాదీనాం పవిత్రమ్, పరమస్తు పుమాన్ ధ్యాతో దృష్టః కీర్తితః స్తుతః సంపూజితః స్మృతః ప్రణతః పాప్మన స్సర్వాన్సున్మూలయతీతి పరమం పవిత్రమ్. సంసారబన్ధహేతుభూతం పుణ్యాపుణ్యాత్మకం కర్మ తత్కారణం చాఽజ్ఞానం సర్వం నాశయతి స్వయాథాత్మ్యజ్ఞానేనేతి వా పవిత్రాణాం పవిత్రమ్ ॥

ఇప్పుడు ప్రథమ ప్రశ్నకు ఉత్తరము చెప్పబడుచున్నది- పావనములైన తీర్థాదులలో పవిత్రము.

పరమాత్మ, ధ్యాన, దర్శన, కీర్తన, స్తుతి, పూజా, స్మరణ, ప్రణామములచేత సర్వ పాపములను ఉన్మూలించు వాడగుటచేత పరమపవిత్రము, సంసారబన్ధహేతుభూతమైన పుణ్యపాపకర్మను, తత్కారణమైన అజ్ఞానమును, స్వస్వరూప జ్ఞానముచేత నశింపజేయు వాడగుటచేతను పరమ పవిత్రము.

శంకర భాష్యమ్:—

రూప మారోగ్య మర్థాంశ్చ భోగాం శ్చైవాను షంగికాన్ ।
దదాతి ధ్యాయతో నిత్య మపవర్గప్రదో హరిః ॥
చిన్త్యమాన స్సమస్తానాం క్లేశానాం హానిదో హి యః ।
సముత్సృజ్యాఽఖిలం చిన్త్యం సోఽచ్యుతః కిం న చిన్త్యతే ॥
ధ్యాయే న్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు ।
ప్రాయశ్చిత్తం హి సర్వస్య దుష్కృతస్యేతి వై శ్రుతిః ॥
సంసారసర్పసందష్ట నష్టచేష్టైకభేషజమ్ ।
కృష్ణేతి వైష్ణవం మన్త్రం శ్రుత్వా ముక్తో భవే న్నరః ॥
అతిపాతకయుక్తోఽపి ధ్యాయ న్నిమిష మచ్యుతమ్ ।
భూయ స్తపస్వీ భవతి పంక్తిపావనపావనః ॥
ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః ।
ఇద మేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణ స్సదా ॥
హరి రేక స్సదా ధ్యేయో భవద్భి స్సత్త్వసంస్థితైః ।
ఓ మిత్యేవం సదా విప్రాః పఠత ధ్యాత కేశవమ్ ॥
భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః ।
క్షీయన్తే చాఽస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥
యన్నామకీర్తనం భక్త్యా విలాపన మనుత్తమమ్ ।
మైత్రేయాఽశేషపాపానాం ధాతూనా మివ పావకః ॥

అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః ।
పుమాన్ విముచ్యతే సద్యః సింహత్రస్తై ర్మృగైరివ ॥
ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞై స్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్ ।
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్ ॥
హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః ।
అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః ॥
జ్ఞానతోఽజ్ఞానతో వాఽపి వాసుదేవస్య కీర్తనాత్ ।
తత్సర్వం విలయం యాతి తోయస్థం లవణం యథా ॥
యస్మి న్న్యస్తమతి ర్న యాతి నరకం, స్వర్గోఽపి యచ్చిన్తనే ।
విఘ్నో యత్ర నివేశితాత్మమనసో బ్రాహ్మోఽపి లోకోఽల్పకః ॥
ముక్తిం చేతసి యస్థితోఽమలధియాం పుంసాం
దదా త్యవ్యయః ।
కిం చిత్రం యదఘం ప్రయాతి విలయం తత్రాఽచ్యుతే కీర్తితే ॥
శమయాలం జలం వహ్నే స్తమసో భాస్కరోదయః ।
శాన్తిః కలౌ హ్యఘౌఘస్య నామసంకీర్తనం హరేః ॥
హరే ర్నామైవ నామైవ నామైవ మమ జీవనమ్ ।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా ॥
స్తుత్వా విష్ణుం వాసుదేవం విపాపో జాయతే నరః ।
విష్ణోః స్సంపూజనా న్నిత్యం సర్వపాపం ప్రణశ్యతి ॥
సర్వదా సర్వకార్యేషు నాస్తి తేషా మమంగళమ్ ।
యేషాం హృదిస్థో భగవా న్మంగళాయతనం హరిః ॥
నిత్యం సంచిన్తయే ద్దేవం యోగయుక్తో జనార్దనమ్ ।
సాఽస్య మన్యే పరా రక్షా కో హిన స్త్యచ్యుతాశ్రయమ్ ॥
గంగాస్నానసహస్రేషు పుష్కరస్నానకోటిషు ।
యత్పాపం విలయం యాతి స్మృతే నశ్యతి తద్ధరౌ ॥

ముహూర్తమపి యో ధ్యాయే న్నారాయణ మనామయం ।
సోఽపి సిద్ధి మవాప్నోతి కిం పున స్తత్పరాయణః ॥
ప్రాయశ్చిత్తా న్యశేషాణి తపః కర్మాత్మకాని వై ।
యాని తేషా మశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్ ॥
కలికల్మష మత్యుగ్రం నరకార్తిప్రదం నృణామ్ ।
ప్రయాతి విలయం సద్య స్సకృద్యత్రాపి సంస్మృతే ॥
సకృత్స్మృతోఽపి గోవిన్దో నృణాం జన్మశతైః కృతమ్ ।
పాపరాశిం దహత్యాశు తూలరాశి మివాఽనలః ॥
యథాఽగ్ని రుద్ధతశిఖః కక్షం దహతి సానిలః ।
తథా చిత్తస్థితో విష్ణు ర్యోగినాం సర్వకిల్బిషమ్ ॥
ఏకస్మి న్నప్యతిక్రాన్తే ముహూర్తే ధ్యానవర్జితే ।
దస్యుభి ర్ముషితేనేవ యుక్త మాక్రన్దితుం భృశమ్ ॥
జనార్దనం భూతపతిం జగద్గురుమ్
స్మర న్మనుష్య స్సతతం మహామునే ।
దుఃఖాని సర్వాణ్యపహన్తి సాధయ
త్యశేషకార్యాణి చ యాన్యభీప్సతే ॥
ఏవ మేకాగ్రచిత్తస్సన్ సంస్మరన్ మధుసూదనం ।
జన్మమృత్యుజరాగ్రాహం సంసారాబ్ధిం తరిష్యతి ॥
కలా వత్రాపి దోషాఢ్యే విషయాసక్తమానసః ।
కృత్వాఽపి సకలం పాపం గోవిన్దం సంస్మరన్ శుచిః ॥
వాసుదేవే మనో యస్య జపహోమార్చనాదిషు ।
తస్యాన్తరాయో మైత్రేయ దేవేన్ద్రత్వాదికం ఫలమ్ ॥
లోకత్రయాధిపతి మప్రతిమప్రభావ
మీష త్ప్రణమ్య శిరసా ప్రభవిష్ణు మీశమ్ ।

జన్మాన్తర ప్రలయ కల్ప సహస్రజాతమ్
ఆశు ప్రణాశ ముపయాతి నరస్య పాపమ్ ॥
ఏకోఽపి కృష్ణస్య కృతః ప్రణామః
దశాశ్వమేధావభృథేన తుల్యః ।
దశాశ్వమేధీ పునరేతి జన్మ
కృష్ణప్రణామీ న పునర్భవాయ ।
అతసీపుష్పసంకాశం పీతవాసన మచ్యుతమ్ ॥
యె నమస్యన్తి గోవిన్దం న తేషాం విద్యతే భయమ్ ॥
శాఠ్యేనాపి నమస్కారః ప్రయుక్త శ్చక్రపాణయే ।
సంసారస్థూలబన్ధానా ముద్వేజనకరో హి సః ॥

ఇత్యాది శ్రుతిస్మృతీహాస పురాణ వచనేభ్యః.

ఇక్కడ పరమాత్మధ్యానము సర్వపాపహార మని చెప్పు ప్రమాణములు చూపబడుచున్నవి. మోక్షప్రదాత యగు శ్రీహరి – రూపము, ఆరోగ్యము, అర్థము, భోగము – వీనిని కూడ తనను ధ్యానము చేయువానికి అనుగ్రహించును.

ధ్యానింపబడి సమస్త కష్టములను నివారించు అచ్యుతుని ఇతర చిన్తలు మాని చింతింపరాదా ?

స్నానాది కర్మలలో నారాయణుని ధ్యానింపవలెను. ఆ ధ్యానము సర్వపాపమునకు ప్రాయశ్చిత్తరూపమై పోగొట్టును.

సంసారసర్పదష్టుడై స్మృతి తప్పినట్లున్నవానికి ధ్యానాలంబనమగు కృష్ణమంత్రము దివ్యౌషధము.

అతిపాతకియైనను అచ్యుతుని, కొద్దికాలమైన ధ్యానించుచో అతడు తపస్వియై పవిత్రు డగును.

సర్వశాస్త్రములను ఆలోచనచేసి విచారింపగా నారాయణుని ధ్యానింపవలె ననునది స్పష్టము.

సాత్త్వికవృత్తితో శ్రీహరి ధ్యానింపదగినవాడు; విప్రులారా ! ప్రణవపాఠము, కేశవధ్యానము చేయుడు.

ఇవన్నియు ధ్యానమహిమను ప్రకటించుచున్నవి.

ఇక పరమాత్మ దర్శనము సర్వపాపహార మనుటకు ప్రమాణము. పరమాత్మ దర్శన మగుటతో హృదయగ్రంథి భేదన మగును. సర్వసంశయ విచ్ఛేద మగును. కర్మక్షయ మగును..

కీర్తనము సర్వపాపహార మని నిరూపింపబడుచున్నది. రజత సువర్ణాది ధాతువులలోని మాలిన్యమును అగ్ని హరించునట్లు భక్తితో కూడిన పరమాత్మ నామకీర్తనము సకల పాపములను హరించును.

భక్తితో కాక అవశుడై కీర్తించినను కీర్తన ప్రభావమున సింహమునకు భయపడిపోవు తోడేళ్లువలె పాతకములు పోవును.

కృతయుగమున ధ్యానముచేత, త్రేతలో యజ్ఞముల చేత, ద్వాపరమున అర్చన చేత, ప్రాప్తించు ఫలము కలిలో సంకీర్తనముచేత ప్రాప్తించును.

అగ్ని, తెలియక స్పృశించినను దహించునట్లు బుద్ధి లేక శ్రీహరిని స్మరించినను పాపములు నశించును.

తెలిసి కాని, తెలియక కాని, వాసుదేవుని కీర్తించుట

వలన పాపములు లవణము నీటిలో లయ మగునట్లు లయ మగును.

ఎవనియందు లగ్నమైన బుద్ధి కలవాడు నరకమును పొందడో, ఎవని చింతనములో స్వర్గము విఘ్న మనిపించునో, ఎవనియందు ప్రవేశపెట్టిన మనస్సు కలవానికి బ్రహ్మలోకము అల్ప మనిపించునో, ఎవరు నిర్మలచిత్తుల చిత్తము నధిష్ఠించి యుండి ముక్తి ననుగ్రహించునో, అట్టి అచ్యుతుడు కీర్తింప బడిన, పాపక్షయ మగుటలో చిత్ర మేమున్నది?

అగ్నిని ఆర్పగలది జలము; చీకటిని పారద్రోల గలిగినది సూర్యోదయము. కలిలో పాపజాలమును హరింపగలది హరినామ సంకీర్తనము.

హరినామమే ముముక్షువునకు జీవనము. అంతకంటె గత్యంతరము కలిలో ముముక్షువునకు లేనేలేదు.

పరమాత్మ స్తుతి, పూజ, పాపహర మని ప్రతిపాదింప బడుచున్నది. వ్యాపకుడగు వాసుదేవుని స్తుతించి పాపవిముక్తు డగును. నిత్యము పూజించుట వలన సర్వపాపక్షయ మగును.

పరమాత్మ స్మరణము పాపహరమనుటకు ప్రమాణ వచనము. ఏ మహనీయుల హృదయమందు మంగళస్వరూపు డగు భగవాను డుండునో వారి కెప్పుడు ఏ కార్యముల యందును అమంగళముండదు.

నిత్యము ఏకాగ్రతతో భగవచ్చింతనము చేయవలెను. అదియే పెద్ద రక్ష. అచ్యుతు నాశ్రయించినవాని నెవ్వడు హింసింపగలడు ?

అనేక గంగాస్నానములచేత అనేక పుష్కరస్నానముల చేత హరించిపోవు పాపము హరిస్మరణముచేత హరించును.

మహార్తకాలము నారాయణుని ధ్యానించువాడును ఇష్టసిద్ధిని పొందును. కేవలము తత్పరుడయి యున్నవానిని గూర్చి చెప్పవలసిన దేమున్నది!

తపోరూపములు, కర్మరూపములు అగు అశేష ప్రాయశ్చిత్తములలో కృష్ణానుస్మరణము ప్రశస్తము.

అత్యుగ్రమైన కలికల్మషము నరక-దుఃఖప్రదము. అట్టిది భగవానుని సకృత్స్మరణముతో నశించును.

గోవిందుని సకృత్స్మరణము, అనేక జన్మార్జిత పాప రాశిని; అగ్ని దూదిని దహించునట్లు దగ్ధము చేయును.

వాయువుతో కలిసి ప్రజ్వలించు అగ్ని (ను) గుప్పలను దహించునట్లు యోగుల హృచ్చిత్తస్థుడగు విష్ణువు సకల కిల్బిషములను దహించును.

భగవచ్చిత్తన లేకుండ ఒక్క ముహూర్తము గడచినను, చోరులచే సర్వస్వము అపహరింపబడిన వానివలె నిరంతరము దుఃఖింపవలయును.

జగద్గురుడగు జనార్దనుని నామమును స్మరించువాడు సర్వ దుఃఖములను పోగొట్టుకొని అభీష్టములను సాధించుకొనును.

ఏకాగ్రచిత్తుడై భగవానుని స్మరించువాడు, జనన-మరణ జరా-రూపములైన గ్రాహములు (మొసళ్లు) కల సంసారసముద్రమును దాటగలడు.

దోషభూయిష్ఠమైన ఈ కలిలో విషయాసక్తుడై పాపము చేసియు గోవిందుని స్మరించుచో శుద్ధు డగును.

జప, హోమ, అర్చనాది కార్యములలో ఎవ్వని మనస్సు గోవిందునియందు లగ్నమై యుండునో ఆ మహానీయు నకు ఇంద్రపదవీరూప ఫలము సైతము విఘ్నమే అనిపించును.

ఇక, భగవత్ప్రణామము పాపహారమని నిరూపింపబడు చున్నది. నిరుపమాన ప్రభావము గల జగదీశ్వరుని ఎవడు నతశిరస్కుడై ప్రణామము చేయునో, వానియొక్క బహు కాలసంచితమై యుండు పాపము వెంటనే నశించును.

శ్రీకృష్ణునకు చేసిన ఒక్క ప్రణామము, పది అశ్వమేధ ముల ఫలముతో సమానఫలము కలది. దశాశ్వమేధకర్తకు పునర్జన్మ ముండును. కృష్ణప్రణామ మొనరించిన వానికి ఆ పునర్జన్మ ముండదు.

శ్యామలవర్ణుడై పీతాంబరధారియై యొప్పు గోవిందుని నమస్కరించువారికి ఎట్టి భయము నుండదు.

కపటముచే నయినను చక్రహస్తునకు చేసిన నమ స్కారము సంసారమునకు చెందిన స్థూలబంధములను కదల్చి వేయును.

ఈ ముప్పదినాలుగు ప్రమాణవచనములు శ్రుతి-స్మృతి ఇతి హాస-పురాణములకు చెందినవి. వీనిననుసరించియే భీష్ముడు పదియవ శ్లోకములో - 'పవిత్రాణాం పవిత్రం యః' అనుచు పరమాత్మ పరమపావను డని బోధించెను.

శం. భా. :- 'మంగలానాం చ మంగలమ్' మంగలం - సుఖం. తత్సాధనం. తజ్జ్ఞాపకం చ. తేషామపి పరమానందలక్షణం వరం మంగళ మితి మంగలానాం మంగలం.

సుఖము, సుఖసాధనము, సుఖజ్ఞాపకము - ఇవి మంగళములు. వీనిలో గూడ పరమానంద స్వరూపము గనుక పరమ మంగళము.

శం. భా. :- 'దైవతం దేవతానాం చ' దేవానాం-దేవః. ద్యోతనాదిష్వుత్కర్షేణ వర్తమానత్వాత్.

ప్రకాశనాదులచే సర్వోత్కృష్టుడు గనుక దేవులకు దేవుడు.

శం. భా. :- 'భూతానాం యోఽవ్యయః పితా' అవ్యయః - వ్యయ రహితః; పితా - జనకో యో దేవః ॥

న ఏకం దైవతం లోక ఇతి వాక్యార్థః.

ఏ దేవుడు భూతకోటికి అవ్యయుడైన జనకుడో అతడే లోకములో ఏకైక దైవము - అని వాక్యార్థము.

శం. భా. :- "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వ భూతాన్తరాత్మా । కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ"

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై । తగ్ంహ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే ॥ ఇతి శ్వేతాశ్వతరాణాం మన్త్రోపనిషది । 'సేయం దేవతైక్షత' 'ఏకమేవాఽద్వితీయమ్' ఇతి ఛాన్దోగ్యే.

సర్వభూతములలో అన్తర్హితుడై సర్వవ్యాపియై సర్వ భూతములకు అన్తరాత్మయై ప్రాణికర్మలకు అధ్యక్షుడై సర్వ

భూతములకు అధిష్ఠానమై సర్వసాక్షియై చైతన్యరూపమై నిర్గుణ స్వరూపమై యొప్పువాడు ఒక్క దేవుడే.

మొదట బ్రహ్మను ఆవిర్భవింపజేసి ఆయనకు వేదముల ననుగ్రహించి సర్వబుద్ధిప్రకాశకుడై ముముక్షువులకు శరణ్యమై యొప్పు దేవు డొక్కడే అని శ్వేతాశ్వతర - ఛాందోగ్య శ్రుతులు బోధించుచున్నవి.

**శం.భా. :-** నను కథ మేకో దేవః. జీవపరయో ర్భేదాత్ । న 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్' 'స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః' ఇత్యాది శ్రుతిభ్యః అవికృతస్య పరస్య బుద్ధి తద్వృత్తి సాక్షిత్వేన ప్రవేశశ్రవణా దభేదః,

ఒకడే దేవు డెట్లు? దేవు డాత్మగా చెప్పబడుచుండెను. ఆత్మ, జీవాత్మ, పరమాత్మ అని భిన్నముగా లేదా? అని శంకింపరాదు. తైత్తిరీయ, ఉపనిషత్తులో- 'తత్సృష్ట్వా తదే వానుప్రావిశత్' జగత్తును సృష్టించి ఆ సృష్టించిన స్వరూపమే ఆ జగత్తునందు ప్రవేశించె నని యున్నది.

**శం.భా:-** పవిష్టానా మితరేతరభేదాత్ పరాత్మైకత్వం కథ మితి చేత్ న. 'ఏకో దేవః బహుధా సన్నివిష్టః' 'ఏకస్సన్ బహుధా విచారః'త్వమేకోఽపి బహూ ననుప్రవిష్టః. ఇత్యేకస్యైవ బహుధా ప్రవేశశ్రవణాత్. ప్రవిష్టానాం చ న భేదః ॥

బృహదారణ్యక ఉపనిషత్తులో ఆ పరమాత్మ ఈ శరీర ములయందు నఖాగ్రపర్యంతము ప్రవేశించినట్లు బుద్ధి, బుద్ధి వృత్తులకు సాక్షిగా ప్రవేశించినట్లు ఉండుటచే అభేదమే చెప్పనగును.

బహువిధములుగా సన్నివిష్టుడు ఏకదేవుడే అని, నీ వొక్కడవే బహు శరీరములలో ప్రవేశించితి వని, ఒక స్వరూపమునకే బహుధా ప్రవేశము చెప్పబడుటచే ప్రవిష్టములకు భేదముకూడ లేదు.

శం.భా. :- 'హిరణ్యగర్భః'(ఋ-వే)ఇత్యష్టౌ మన్త్రాః.'కస్మై దేవాయ. ఇత్యత్ర ఏకారలోపేన ఏకదైవత ప్రతిపాదకః. తైత్తిరీయకే ।

ఋగ్వేదములో—— 'హిరణ్యగర్భ స్సమవ ర్తతాగ్రే' ఇత్యాది మంత్రములు ఎనిమిది ఉన్నవి. వానిలో, 'కస్మై దేవాయ' అనుచు ఉన్నది. 'కస్మై దేవాయ' అనునప్పుడు ఆదియందలి 'ఏ' కార లోపముచే 'ఏకస్మై దేవాయ' అనియు ఏకదైవతప్రతిపాదకము అనియు తైత్తిరీయములో నిలుచు.

శం.భా. :-"అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ। ఏక స్తథా సర్వభూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ"

"వాయు ర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ। ఏక స్తథా సర్వభూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ"

"సూర్యో యథా సర్వలోకస్య చక్షు ర్నలిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః। ఏక స్తథా సర్వభూతాన్తరాత్మా న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః"

"ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి। తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్"

"నిత్యోఽనిత్యానాం చేతన శ్చేతనానా మేకోబహూనాం యో విదధాతి కామాన్। త మాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరేషామ్" -ఇతి కఠకే

ఏకరూపమైన అగ్ని దహింపబడు ఆ యా భిన్న భిన్న వస్తువులను గూర్చి ప్రతిరూపము వహించి ఉపాధిసమాన రూపము కలిగియున్నట్లు ఏకమైన సర్వభూతాంతరాత్మ, సర్వ దేహములను గూర్చి ప్రతిరూపము వహించి అవికృతరూపము కలిగియుండెను.

ఒక్క వాయువు ప్రాణరూపముతో ప్రతిరూపము వహించినట్లు పరమాత్మ ప్రతిరూపము వహించియుండెను.

ఒక్క సూర్యుడు సర్వలోకము యొక్క చక్షుస్సును ప్రకాశింపజేయుచు అశుచి పదార్థములను ప్రకాశింపజేసియు ఆ అశుచి నిమిత్తక దోష మంటనివాడై యున్నట్లు ఏకమైన సర్వభూతాంతరాత్మ లోకదోషము లంటనివాడై యుండెను.

సర్వజగత్తు తనకు వశమై యున్న ఆ పరమాత్మ, తన ఏకరూపమును బహురూపములుగా చేయుచు హృదయస్థుడై యున్నటుల తెలిసికొన్నవారు శాశ్వతసుఖము పొందుదురు.

అనిత్యములు, వినాశస్వభావము కలవానిలో నిత్యము, అవినాశియై, చేతనములలో-బ్రహ్మాదులలో చేతనమై, సంసారులకు కర్మానుగుణముగా కర్మఫలము నిచ్చువాడై యొప్పు ఏకమైన పరమాత్మను తెలిసికొనువారికి శాశ్వతమైన శాంతి లభించునని ఈ అయిదు కఠోపనిషద్వచనములవలన దెలియును.

శం.భా. :-"బ్రహ్మ వా ఇద మగ్ర ఆసీ దేకమేవ. తదేకం సన్నవ్యభవత్. 'నాన్యదతోఽస్తి ద్రష్టా" - ఇత్యాది బృహదారణ్యకే.

బృహదారణ్యకములో - ఈ ప్రపంచము మొదట ఒక్క

బ్రహ్మరేయే అయి యుండెననియు, ఈ అన్తర్యామి కంటె అన్యుడు ద్రష్ట లేడని యు చెప్పబడెను.

శం. భా. :- "అనేజదేకం మనసో జవీయః" "తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః" - ఇతి ఈశావాస్యే

ఈశావాస్యములో - ఆత్మతత్త్వము నిశ్చలము, ఏకము, మనస్సు కంటె ఎక్కువ వేగము కలది అని, ఏకత్వదర్శనము కలవానికి శోకమోహము లుండవని, చెప్పబడినది.

శం. భా. :- "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీ న్నాన్యత్కించన మిషత్" 'సర్వేషాం భూతానా మన్తరః పురుషః స మ ఆత్మేతి విద్యాత్' 'ఏకం సద్విప్రా బహుధా వద న్తి' 'ఏకం స న్తం బహుధా కల్పయ న్తి' 'ద్యావా పృథివీ జనయన్ దేవ ఏకః' 'ఏకో దధార భువనాని విశ్వా' 'ఏక ఏవాగ్ని ర్బహుధా సమిద్ధః" - ఇతి ఋగ్వేదే.

ఋగ్వేదములో - ఈ నామరూపాత్మకమైన జగత్తు సృష్టికి పూర్వము ఆత్మ ఒక్కటే అయియుండెను, మరియొకటి లేదు, అనియు సర్వభూతాన్తరాత్మయే నా ఆత్మ, అని తెలిసి కొనవలెను, అనియు ఏకమై యున్నదానినే బహుప్రకారములు చెప్పుచున్నారనియు బహు ప్రకారములు కల్పించు చున్నారనియు, ద్యులోక భూలోకములకు జనకుడైన దేవు డొక్కడే అనియు, ఒకే అగ్ని బహు ప్రకారములు ప్రదీపించు చున్న విధమున, సకల భువనములను ధరించియున్నవా డొక్కడే యనియు చెప్పబడినది.

శం. భా. :- "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్" ఇతి ఛాన్దోగ్యే.

ఛాన్దోగ్యములో - ఈ ప్రపంచము సృష్టికి పూర్వము

ద్రూప మొక్కటియే అయి యుండెను: అది అద్వితీయమే.
'ని చెప్పబడినది.

క భగవద్గీత స్మృతులు. ఉదాహరింపబడుచున్నవి—

"సర్వభూతస్థితం యో మాం భజత్యే కత్వ మాస్థితః ।
సర్వథా వర్తమానో౽పి స యోగీ మయి వర్తతే ॥
విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శునిచైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః ॥
అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మన్త ఏవ చ ॥
యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥
యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోక మిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥
సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః''

—ఇతి గీతోపనిషత్సు.

భగవద్గీతలో - ఉపాదానకారణమై సర్వభూతస్థితుడ
) నన్ను ఏకత్వదృష్టితో భజించు యోగి సర్వదా వర్తించు
డైనను నాయందే ఉండును. విద్యావినయసంపన్నుడగు
హ్మణుని యందు, గోవునందు, ఏనుగునందు, శునకమందు,
ాకునందు కూడ 'సమదర్శినః' బ్రహ్మ స్వరూపమును
ంచువారు పండితులు. అర్జునా! నేను సర్వభూతముల
దయాంతరములందు ఆత్మనై యున్నాను. భూతములకు
మధ్య-అంతములు నేనే ॥ ఎప్పుడు నానాభూతములు

ఏకత్ర ఉన్నవని తెలిసికొని ఆ ఏకవస్తువు నుండిగానే, ప్రపంచ విస్తృతి కలిగెనని గ్రహించునో, అప్పుడు బ్రహ్మప్రాప్తి యగును. ఒక్క సూర్యుడు సమస్త లోకములను ప్రకాశింప చేయుచున్నట్లు క్షేత్రజ్ఞుడగు ఒక్క ఆత్మ సమస్త క్షేత్రము (శరీరము) లను ప్రకాశింపజేయుచుండును. సర్వధర్మములను విడిచి నన్నొక్కనినే శరణు పొందుము. నేను నిన్ను సర్వ పాపవిముక్తుని చేయుదును, అని వివరింపబడెను.

శం.భా.:- హరిరేక స్సదా ధ్యేయో భవద్భి స్సత్త్వసంస్థితైః
ఓమిత్యేవం సదా విప్రాః పఠత ధ్యాత కేశవమ్ ।
ఆశ్చర్యం ఖలు దేవానా మేక స్త్వం పురుషోత్తమ
ధన్యశ్చాపి మహాబాహో లోకే నాన్యోఽస్తి కశ్చన ॥
- ఇతి హరివంశే.

భవతి మనోర్మాహాత్మ్యభ్యాపినీ శ్రుతిః- 'యద్వై కించ మను రవద త్తద్భేషజమ్' ఇతి । మనునా చోక్తమ్ - 'సర్వభూతేషు చాత్మానం సర్వ భూతాని చాత్మని సంపశ్య న్నాత్మయాజీ వై స్వారాజ్య మధిగచ్ఛతి'___ ఇతి (మను 12-91)

'సృష్టిస్థిత్య న్తకరణీం బ్రహ్మ విష్ణు శివాత్మికామ్ ।
ససంజ్ఞాం యాతి భగవా నేక ఏవ జనార్దనః' (విష్ణు)

'తస్మా న్నవిజ్ఞాన మృతేఽస్తి కించిత్, క్వచిత్కదాచిద్ ద్విజవస్తు జాతమ్ । విజ్ఞాన మేకం నిజకర్మభేదాత్ విభిన్నచిత్తై ర్బహుధాఽభ్యు పేతమ్ ॥' (విష్ణు)

'జ్ఞానం విశుద్ధం విమలం విశోక మశేషలోభాది నిరస్తసంగమ్ । ఏక స్సదైకః పరమః పరేశః స వాసుదేవో న యతోఽస్తి కించిత్॥' (విష్ణు)

హరివంశములో- సాత్త్వికులయి మీరు హరి నొక్కని

ధ్యానింపుడు. విప్రులారా! ప్రణవపాఠము, కేశవధ్యానము చేయుడు.

దేవతలలో నీవొక్కడవే పురుషోత్తముడవు. అన్యుడు లేడు అనియు చెప్పబడినది. మనువు యొక్క మాహాత్మ్యమును ప్రఖ్యాపన చేయు శ్రుతి- 'మనువు చెప్పినది దివ్యౌషధము' అని చెప్పుచున్నది. ఆ మనువు సర్వభూతములయందు ఆత్మను, ఆత్మయందు సర్వభూతములను, సందర్శించువాడు స్వారాజ్యమును పొందు నని చెప్పియుండెను.

విష్ణుపురాణములో- జనార్దను డొక్కడే సృష్టి- స్థితి- అన్త - కార్యములలో బ్రహ్మ, విష్ణువు, శివుడు అని కీర్తింపబడుచుండె ననియు, విజ్ఞానరూపమైన ఆత్మకంటె భిన్నముగా ఎప్పుడును, ఎక్కడను, ఏదియు లేదు. విజ్ఞాన మొక్కటే విభిన్నచిత్తుల చేత తమ తమ కర్మభేదము వలన బహువిధములుగా భావింపబడిననియు విశుద్ధజ్ఞానము, సమస్తదోషసంపర్కరహితము, సదా ఏకరూపము అగు పరమేశ్వరుడైన వాసుదేవుని కంటె భిన్నముగా నేదియు లేదు అనియు చెప్పబడినది.

శం. భా. :-"యదా సమస్తదేహేషు పుమానేకో వ్యవస్థితః।
తదా హి కో భవాన్ సోఽహ మిత్యేత ద్విఫలం వచః ॥"
సిత నీలాది భేదేన యథైకం దృశ్యతే నభః।
భ్రాన్తదృష్టిభి రాత్మాఽపి తథైక స్సన్ పృథక్పృథక్ ॥
ఏక స్సమస్తం యదిహాస్తి కించి
త్తదచ్యుతో నాస్తి పరం తతోఽన్యత్ ।

అయి యున్నదో, ఆ వస్తువు అచ్యుతుడే; అన్యముకాదు. నేను ఆ అచ్యుతుడను; నీవు ఆ అచ్యుతుడవు. ఈ సర్వము కూడ అచ్యుతరూప - ఆత్మస్వరూపమే, భేదబుద్ధిని విడువుము అని ప్రబోధింపబడిన రాజపర్యుడు భేదభావనను విడిచెను, అనియు వివరింపబడెను.

యముని ఉపదేశములో - ఈ సకల ప్రపంచము, నేనును ఒక్క వాసుదేవ పరమాత్మయే, అను నిశ్చలబుద్ధి యెవరి కుండునో వారిని విడిచిపెట్టి దూతలారా, దూరముగా పొండు. అనియు, దేవతలారా! భూదేవి చెప్పినట్లు నేను మీరు, శంకరుడు, సర్వము నారాయణాత్మకమే, అని బ్రహ్మ చెప్పెననియు గలదు; మరియు- ఆ నారాయణుని విభూతులలో పరస్పర భేదము, ఆధిక్యము, న్యూనత, బాధ్యబాధకభావము వర్తించును అనియు, విశ్వరూపా! నీవు, నేను, జగత్తునకు ఏకకారణమే అయి యుండి జగత్తు కొరకు మనము భిన్నముగా నున్నాము, అనియు-

శంకరా! నీచేత దత్తమైన అభయమే నాచే దత్తమైనది. నిన్ను నాకంటె భిన్నముగా నీవు భావింపదగదు, అనియు- నేను దేవాసుర మనుష్యాది సహితమైన ఈ జగత్తు స్వరూపమే, అవిద్యామోహితులు భిన్నభిన్నముగా భావించు చుందురు. అనియు చెప్పబడినది.

విష్ణో రన్యం తు పశ్యన్తి యే మాం బ్రహ్మాణ మేవ వా।
కుతర్కమతయో మూఢాః పచ్యన్తే నరకేష్వథః ॥
యే చ మూఢా దురాత్మానో భిన్నం పశ్యన్తి మాం హరేః।
బ్రహ్మాణం చ తత స్తస్మా ద్బ్రహ్మహత్యాసమం త్వఘమ్ ॥

ఇతి భవిష్యోత్తరపురాణే మహేశ్వరవచనమ్।

నన్ను, బ్రహ్మను, విష్ణువుకంటె భిన్నులని భావించు కుతర్కమతులకు నరకము ప్రాప్తించును. అట్టివారికి బ్రహ్మహత్యా సమపాతకము లభించును, అని భవిష్యోత్తర పురాణమందలి మహేశ్వర వచనమువలన తెలియును.

తథా చ హరివంశే కైలాసయాత్రాయాం మహేశ్వరవచనమ్-

"ఆది స్త్వం సర్వభావానాం మధ్యమన్త స్తథా భవాన్ ।
త్వత్త స్సర్వమభూ ద్విశ్వం త్వయి సర్వం ప్రలీయతే ॥
అహం త్వం సర్వగో దేవ త్వమేవాఽహం జనార్దన ।
ఆవయో ర న్తరం నా సి శబ్దై రర్థై ర్జగత్త్రియే ॥
నామాని తవ గోవిన్ద యాని లోకే మహాన్తి చ ।
తాన్యేవ మమ నామాని నాత్ర కార్యా విచారణా ॥
త్వదుపాసా జగన్నాథ సైవాస్తు మమ గోపతే ।
యశ్చ త్వాం ద్వేష్టి భో దేవ స మాం ద్వేష్టి న సంశయః ॥ "

మరియు- సర్వపదార్థములకు ఆది, మధ్య, అన్తములు నీవే. ఈ విశ్వము నీవలననే ఉద్భవించినది; నీయందే లయమగుచున్నది. నేను సర్వగతుడనైన నీవే; జనార్దనా! నీవు నేనే. శబ్దములచే గాని, అర్థములచే గాని మన ఉభయులకు భేదము లేనే లేదు.

గోవిన్దా! లోకములో నీ నామము లేవి కలవో, అవియే నా నామములు; సందేహాము లేదు.

జగన్నాథా! నీ యుపాసనయే నా యుపాసన; నన్ను ద్వేషించువాడు నన్ను ద్వేషించువాడే, యని హరివంశమందలి మహేశ్వరవచనము వలన స్పష్టమగును.

త్వద్విస్తారో యతో దేవ హ్యాహం భూతపతి స్తతః ।
న తదస్తి విభో దేవ యత్తే విరహితం క్వచిత్ ॥
యదాసీ ద్వర్తతే యచ్చ యచ్చ భావి జగత్పతే ।
సర్వం త్వమేవ దేవేశ వినా కించి త్త్వయా న హి ॥
ఇత్యాది వాక్యా న్యేకత్వప్రతిపాదకాని ।

అపిచ- 'ఆత్మేతి తూపగచ్ఛన్తి గ్రాహయన్తి చ' (బ్ర.సూ. 4-1-3)
ఆత్మేత్యేవం. శాస్త్రోక్త లక్షణః పరమాత్మా ప్రతిపత్తవ్యః. తథా హి
పరమాత్మప్రక్రియాయాం జాబాలా ఆత్మత్వే నైవైన మభ్యుపగచ్ఛన్తి
'త్వం వా అహ మస్మి భగవో దేవతే అహం వై త్వ మసి' ఇతి ॥

తథాఽన్యేపి- 'యదేవేహ తదముత్ర, యదముత్ర తదన్విహ'
'స యశ్చాయం పురుషే, యశ్చాఽసావాదిత్యే స ఏకః' 'తదాత్మాన మేవాఽ
వేదహం బ్రహ్మాస్మీతి' 'త దేత ద్బ్రహ్మ పూర్వ మనపర మనన్త
మబాహ్య మయ మాత్మా బ్రహ్మ' 'సవా ఏష మహానజ ఆత్మాఽజరోఽ
మరోఽమృతోఽభయో బ్రహ్మ' ఇత్యేవ మాదయ ఆత్మత్వోపగమ
ద్రష్టవ్యాః. గ్రాహయన్తి చ-బోధయన్తి చాత్మత్వే నేశ్వరం వేదాన్తవాక్యాని

దేవా! భూతపతి నగు నేను నీ విస్తారమునకు చెందిన
వాడనే. కనుక నీవు కానట్టి దేదియు లేదు.

జగదీశా! భూత భవిష్యద్వర్తమానములకు చెందిన
సర్వము నీవే. నీవు కాని దేదియు లేదు- ఇత్యాది వాక్యములు
ఏకత్వ ప్రతిపాదకములై యున్నవి.

మరియు (బ్ర-సూ. 4-1-3) శాస్త్రోక్త లక్షణములు
కల పరమాత్మయే ఆత్మ (జీవాత్మ) యని తెలిసికొనవలెను.
పరమాత్మ ప్రక్రియలో జాబాలులు పరమాత్మను ఆత్మగానే
అంగీకరించిరి - పరమాత్మా! నీవే నేనయి యుంటెని. నేనే

నీ వయి యుంటివి. (ఇంకను ఈ విధముగనే 'అహంబ్రహ్మాస్మి' నేను బ్రహ్మ నయితిని. ఇత్యాదులు ద్రష్టవ్యములు.)

కఠోపనిషత్తు (2-1-10) ఏది యిక్కడ కార్య కారణో పాధి సమన్వితమై సంసార ధర్మము కలదిగా తోచుచున్నదో, అదియే నిత్యవిజ్ఞాన ఘనస్వభావము, సర్వ సంసారధర్మ వర్జితము అగు బ్రహ్మ; ఆ బ్రహ్మ ఏదో అదియే ఇక్కడ సంసార ధర్మము కలదిగా దోచునని తెలియచేయుచున్నది.

ఆనన్దవల్లి - ఆకాశాది అన్నమయాంతమును సృష్టించి దానియందు ప్రవేశించిన ఏ స్వరూపము పురుషుని యందును ఆదిత్యుని యందును ఉండెనో అది ఏకమే యని చెప్పుచున్నది.

బృహదారణ్యకములో-తనను 'బ్రహ్మాస్మి' అని తెలిసి కొనెను. 'దేనికి కారణము, కార్యము, అభ్యంతరము, బహిర్భాగము, లేకుండెనో ఆ బ్రహ్మ ఈ ఆత్మయే; (ద్రష్ట, శ్రోత, అయిన ప్రత్యగాత్మయే) 'జనక యాజ్ఞవల్క్య - ఆఖ్యాయికలో వ్యాఖ్యాతమై యున్న ఆత్మ, జన్మ-జరా-మరణాదులు లేనిది అమృతము, అభయము అయి బ్రహ్మమై యున్నది. ఇత్యాదులు ఆ బ్రహ్మయే ఈ ఆత్మయని యుపదేశించుచున్నవి.

'ఏష త ఆత్మా ఽన్తర్యామ్యమృతః' 'యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్' 'తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే' 'తత్సత్యం స ఆత్మా తత్త్వమసి' ఇత్యేవ మాదివి।

నను ప్రతీకదర్శన మిదం విష్ణుప్రతిమాన్యాయేన భవిష్యతి. తదయుక్తం. గౌణత్వ ప్రసంగాత్. వాక్య వైరూప్యాచ్చ. యత్ర హి ప్రతీక దృష్టి రభిప్రేయతే సకృ దేవ తత్ర వచనం భవతి. యథా 'మనో బ్రహ్మ

'ఆదిత్యోబ్రహ్మ' ఇతి । ఇహపునః— 'త్వమహమస్మి అహంవై త్వమసి' ఇత్యాహ । అతః ప్రతీకశ్రుతి వైరూప్యా దభేదప్రతిపత్తిః ।

భేదదృష్ట్యపవాదాచ్చ । తథాహి- 'అథయోఽన్యాం దేవతా ముపాస్తే అన్యోఽసా వన్యోఽహ మస్మీతి న స వేద యథా పశుః' 'మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి' 'యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి । ఏవం ధర్మాన్ పృథక్పశ్యం స్తానేవాఽనువిధావతి'

"ద్వితీయాద్వై భయం భవతి" యదా హ్యేవైష ఏతస్మి న్నుదర మన్తరం కురుతే । అథ తస్య భయం భవతి త త్త్వేవ భయం విదుషో మన్వానస్య'' ''సర్వం తం పరాదాత్ యోఽన్యత్రాత్మన స్సర్వం వేద'' ఇత్యేవమాద్యా భూయసీ శ్రుతి ర్భేదదృష్టి మపవదతి ॥

వేదాన్తవాక్యములు ఆ యీశ్వరునే ఆత్మగా బోధించు చున్నవి - బృహదారణ్యకములో - 'ఈ అమృతుడైన అన్త ర్యామియే నీ యొక్క ఆత్మ' అనియు- కేనోపనిషత్తులో - 'ఏ చైతన్య జ్యోతిస్సు మనస్సుచేత మననము చేయ నలవి కాదో, ఏ చైతన్య జ్యోతిస్సు చేత మనస్సునకు మనన సామర్థ్యము కలదో, ఆ చైతన్యజ్యోతిస్సు అగు బ్రహ్మయే నీవని తెలిసికొనుము' అనియు- ఛాందోగ్యములో - 'అది సత్యము. అది ఆత్మ, అదియే నీవు' అనియు- ఇత్యాదులు ఈశ్వరునే ఆత్మగా బోధించు చున్నవి.

ఇక్కడ, జీవేశ్వరుల కభేద మని కాదు. ప్రతిమయందు విష్ణుదృష్టి వంటిదే యిది, యని చెప్పుటకు వీలులేదు. అట్లయిన గౌణత్వము ప్రసక్త మగును. మరియు, ప్రతిమయందు విష్ణు దృష్టికి ప్రతీకదృష్టి యని పేరు. ప్రతీకదృష్టి బోధక వాక్య

ములలో - 'మనోబ్రహ్మ' 'ఆదిత్యో బ్రహ్మ' అనియే యున్నది. ఈ స్థలమునందు 'త్వమహమస్మి' 'అహం వై త్వమసి' అని యున్నది కనుక ఇది అభేద బోధకమే. ఇట్లు లేనట్టి 'మనోబ్రహ్మ' ఇత్యాదులే ప్రతీకదృష్టి బోధకములు. మరియు భేదదృష్టి నిషేధకములైన వాక్యము లున్నవి - బృహదారణ్యకములో - 'నాకంటె ఉపాస్య స్వరూపము అన్యము; నేను అన్యుడను, అని భావించువాడు తెలియనివాడు; 'దర్శన విషయమయిన బ్రహ్మయందు, పరమార్థతః అభిన్నమైయున్న దానియందు, అవి ద్యామూలక నానాత్వమును నిజమని భావించు వాడు మృత్యువునుండి మృత్యువును పొందు చుండును' అని వివరింపబడినది. కఠోపనిషత్తులో - ఉన్నత ప్రదేశమందలి వర్షోదకము పల్లపు ప్రదేశములం దంతట వ్యాపించినట్లు భిన్న భిన్న శరీరములలో వ్యాపించిన ఆత్మను శరీరభేదమును బట్టి భిన్నముగా భావించువాడు భిన్నభిన్న శరీరములనే పొందును, అనియు చెప్పబడినది. బృహదారణ్యకములో - 'ద్వితీయము (వస్త్వంతరము) వలన భయము కలుగుచున్నది' అనియు- తైత్తిరీయకములో - 'ఈ సాధకుడు ఎప్పుడు ఈ ఆత్మ స్వరూప బ్రహ్మయందు అల్పమైనను భేదమును కల్పించునో అప్పు డతనికి భయము కలుగుచున్నది. భేదదర్శికి ఆ బ్రహ్మయే భయకారణము' అనియు, చెప్పబడినది. ఆత్మస్వరూప వ్యతిరిక్తముగా భావింపబడు సర్వము అట్లు భావించువానిని నిరాకరించును. అని బహుశ్రుతులు భేదదృష్టిని నిరాకరించుచున్నవి.

శం.భా. :- తథా —'ఆత్మైవేదం సర్వమ్' 'ఆత్మని విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి' 'ఇదం సర్వం యదయ మాత్మా' 'బ్రహ్మైవేదం విశ్వమ్' ఇతి శ్రుతిః ।

ఈ సర్వము ఆత్మయే, (ఛాన్దోగ్యము) 'ఆత్మ విజ్ఞాత మయినపుడు ఈ సర్వము విజ్ఞాత మగును, 'ఈ సర్వము ఈ ఆత్మయే' (బృ॥) 'ఈ విశ్వము బ్రహ్మయే' (ముండకోపనిషత్తు) యని శ్రుతు లుద్ఘోషించుచున్నవి.

శం.భా. :- తథా స్మృతిరపి —

యజ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాండవ ।
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్యస్యాత్మ న్యథో మయి ॥ (గీతా- 4-35)
క్షేత్రజ్ఞ- ఈశ్వర- ఏకత్వం సర్వోపనిషత్ప్రసిద్ధం ద్రక్ష్యసీ త్యర్థః ।

సమ్యగ్దర్శులగు ఆచార్యులచే నుపదిష్టమైన జ్ఞానమును పొందినప్పుడు నీవిట్టి మోహము (భ్రాంతి)ను పొందవు, ఆ జ్ఞానము చేత బ్రహ్మాది స్తంబపర్యన్తమైన భూతములు నీయందే యున్న వని నీవు తెలిసికొందువు. అటుపిమ్మట పరమేశ్వరుడ నగు నాయందును ఉన్నవని తెలిసికొందువు. సర్వోపనిషత్ప్రసిద్ధ మయిన క్షేత్రజ్ఞ-ఈశ్వర-ఏకత్వము నీకు తెలియునని భావము.

శం.భా. :- సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ (గీతా- 18-20)
ఇతి అద్వైతాత్మజ్ఞానం సమ్యగ్దర్శన మిత్యుక్తం భగవతాఽపి తస్మా దాత్మన్యేవేశ్వరే మనో దధీత ।

అవ్యక్తాది స్థావరాన్త భూతములలో అవ్యయమైన 'ఏకం భావమ్' ఏకమైన ఆత్మవస్తువును విభక్తములై విభిన్నములై యున్న దేహములలో అవిభక్తమై అభిన్నమై యున్నట్టి

ఏ జ్ఞానము చేత దర్శించునో ఆ జ్ఞానము సాత్త్వికజ్ఞానము, అని చెప్పిన భగవంతుని చేత గూడ అద్వైతాత్మజ్ఞానమే సమ్యగ్దర్శన మని బోధింపబడినది. కనుక, ఆత్మస్వరూపమై యున్న ఈశ్వరుని యందు మనస్సును ధారణ చేయవలెను.

శం. భా :- "భూతాత్మా చేన్ద్రియాత్మా చ ప్రధానాత్మా తథా భవాన్ ।
ఆత్మాచ పరమాత్మాచ త్వమేకః పంచధా స్థితః ॥"
(విష్ణు- 5-18-50)

భూతాత్మగా, ఇన్ద్రియాత్మగా, ప్రధానాత్మగా, ఆత్మగా, పరమాత్మగా, నీవొక్కడవే ఐదు విధములుగా నుంటివి.

శం. భా. :- "అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।
విష్టభ్యాఽహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥"
(గీతా-10-42)

అర్జునా ! నా విభూతులు తెలియుటచే నేమగును ? ఈ సకలజగత్తును ఒక భాగముచే వ్యాపించి నేనున్నాను.

శం.భా. :- అవిద్యోపాధిపక్షేపి ప్రమాణవాదః సమస్తి—

"ఏకఏవ మహానాత్మా సోఽహంకారోఽభిధీయతే ।
స జీవ స్సోఽన్తరాత్మేతి గీయతే తత్త్వచిన్తకైః ॥"
తథా విష్ణుపురాణే-
"విభేదజనకేఽజ్ఞానే నాశ మాత్యన్తికం గతే ।
ఆత్మనో బ్రహ్మణో భేద మసన్తం కః కరిష్యతి ॥
పరాత్మనో ర్మనుష్యేన్ద్ర విభాగోఽజ్ఞాన కల్పితః ।
క్షయే తస్యాఽఽత్మపరయో ర్విభాగోఽభాగ ఏవ హి ॥" 6-7-98

అవిద్యోపాధిపక్షములో గూడ ప్రమాణము లిట్లున్నవి—

ఏకమే యైన పరమాత్మ అహంకారమని, జీవుడని, అన్తరాత్మ యని తత్త్వచిన్తకులచే కీర్తింపబడుచుండెను.

ఆత్మకు, బ్రహ్మకు విభేదమును కలిగించు అజ్ఞానము ఆత్యన్తికనాశము నొందినపుడు ఆత్మకు బ్రహ్మకు లేనట్టి భేదమును ఎవడు కల్పించును ?

ఆత్మ పరమాత్మలకు విభాగము అజ్ఞానకల్పితము. ఆ అజ్ఞానము నశించినపుడు ఆత్మ-పరమాత్మలకు విభాగము అసంభవమే, యని పై విష్ణుపురాణ వచనముల వలన దెలియును.

శం భా. :- విష్ణుధర్మే—

"యథైకస్మిన్ ఘటాకాశే రజోధూమాదిభిర్యుతే ।
నాన్యే మలినతాం యాన్తి దూరస్థాః కుత్రచిత్క్వచిత్ ॥
తథా ద్వన్ద్వై రనేకైస్తు జీవే చ మలినే కృతే ।
ఏకస్మిన్నాఽపరే జీవా మలినా స్సన్తి కుత్రచిత్ ॥"

బ్రహ్మయాజ్ఞవల్క్యే—

"ఆకాశమేకం హి యథా ఘటాదిషు పృథగ్భవేత్ ।
తథాఽఽత్మైకోఽప్యనేకేషు జలాధారే ష్వివాంశుమాన్॥"

ఒక ఘటాకాశము ధూళి చేతనో, ధూమము చేతనో, మలిన మయినను, దూరస్థములైన ఇతర ఘటాకాశములు మలినములు కావు. అట్లే అనేక ద్వంద్వముల చేత ఒక జీవుడు మలినుడయినను ఇతర జీవులు మలినులు కారు, అని విష్ణు ధర్మవచనములు చెప్పుచున్నవి.

ఒకే ఆకాశము ఘటాదులయందు ఘటాకాశము, మఠాకాశము అని భిన్నముగా నుండును. ఒకే సూర్యుడు అనేక జలాధారముల యందు ప్రతిబింబ రూపమున భిన్నముగా నుండును. ఆరీతిగ ఒకే ఆత్మ అనేక శరీరములయందు- ఉపాధుల యందు - భిన్నముగా నున్నది, అని బ్రహ్మయాజ్ఞవల్క్య వచనము వలన స్పష్టమగుచున్నది.

**శం.భా :-** 'క్షరాత్మానా వీశతే దేవ ఏకః' ఇతి శ్వేతాశ్వతరే। ఛాన్దోగ్యే— 'స ఏకధా భవతి' (7-26-2) ఇత్యాది। 'స తత్ర పర్యేతి' 'స వా ఏష ఏతేన దైవేన చక్షుషా మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే పరోఽవికృత ఏవాత్మా స్వాత్మాఽయం జీవః' ఇతి శ్రుతేః। 'స ఏష ఇహ ప్రవిష్టః' (బృ. శ్రుతిః) 'ఆత్మేత్యేవోపాసీత, తదేతద్బ్రహ్మాఽపూర్వమ్' (బృ. 2-5-19) 'నాన్యోఽతోఽస్తి ద్రష్టా। నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా' (బృ. 3-7-23) 'స వా ఏష మహా నజ ఆత్మా యోఽయం. విజ్ఞానమయః' (బృ. 4-4-22) 'అథ యోఽన్యాం దేవతా ముపాస్తే' (బృ. 1-4-10) 'ఐతదాత్మ్య మిదం సర్వమ్' (ఛాం. 6-8-7) ఇత్యాది।

జడవర్గమును, చేతనవర్గమును ఒకే దేవుడు శాసించుచుండెను, అని శ్వేతాశ్వతరోపనిషద్వచనము వలన దెలియును. ఆ స్వరూపము, సృష్టిప్రభేదమునకు పూర్వము ఏక విధమే; సృష్టికాలములో అనంతభేదములు కలదియై యుండు నని ఛాందోగ్యశ్రుతి స్పష్టముగ వివరించినది.

ఆ స్వరూపము సర్వవ్యాపకము; దివ్యచక్షుస్సుతో విషయములను గ్రహించి మనస్సుతో ఆనందించును; అవికృతమే పరమాత్మ; ఆ పరమాత్మ స్వరూపమే ఈ జీవుడు అని శ్రుతితాత్పర్యము. ఆ పరమాత్మ సృష్టిలో జీవరూప

ముగా ప్రవేశించెను; ఆ స్వరూపమును ఆత్మ యనియే ఉపా సింపవలెను. అట్లే, ఇది బ్రహ్మ. ఈ అన్తర్యామి కంటె అన్యుడు ద్రష్ట లేడు, శ్రోత లేడు, విజ్ఞాత లేడు. విజ్ఞానమయుడని చెప్పబడిన జీవుడు, మహత్త్వాది లక్షణములు కల అజుడగు ఆ పరాత్మయే. ఉపాస్యదేవత కంటె నేను భిన్నుడ నని భావించుచు ఉపాసించువాడు తెలియనివాడు, ఈ సర్వము, జగత్తునకు మూలమైన సద్రూపము ఆత్మగా కలది అని బృహదారణ్యక, ఛాందోగ్యాది శ్రుతివచనములు ముక్తకంఠముగ చెప్పుచున్నవి.

శం. భా. :- "నిశ్చరన్తి యథా లోహపిండాత్తప్తాత్ స్ఫులింగకాః సకాశా దాత్మన స్తద్వత్ ప్రభవన్తి జగన్తి హి" ఇతియోగియాజ్ఞవల్క్యే -

"అజశ్శరీరగ్రహణా త్సజాత ఇతి కీర్త్యతే" ఇతి బ్రాహ్మే ।

"సర్పవద్రజ్జుఖండస్తు నిశాయాం వేశ్మమధ్యగః
ఏకో హి చంద్రో ద్వౌ వ్యోమ్ని తిమిరాహతచక్షుషః
ఆభాతి పరమాత్మా చ సర్వోపాధిషు సంస్థితః
నిత్యోదిత స్స్వయంజ్యోతి స్సర్వగః పురుషః పరః
అహంకారాఽవివేకేన కర్తాహమితి మన్యతే" ఇతి.

తప్తమయిన లోహపిండము నుండి అగ్నికణములు వలె ఆత్మనుండి జగత్తులు ప్రభవించుచున్నవి. అని, యోగి యాజ్ఞవల్క్యమందున్నది. జన్మాది వికారములు లేని పరమాత్మ శరీరగ్రహణము చేయుటవలన జన్మించినట్లు కీర్తింపబడుచుండెను, అని బ్రహ్మపురాణము చెప్పుచున్నది. నిశాసమయమందు గృహములో త్రాడు సర్పముగా భాసించినట్లు, ఆకాశమందొక్క చంద్రుడే తిమిరవ్యాధి కల చక్షుస్సునకు రెండుగా

భాసించినట్లు స్వప్రకాశ సర్వవ్యాపక పరమాత్మ, సర్వోపాధుల యందుండి అనేకముగా భాసించుచుండెను. అహంకార రూపమైన అవివేకము చేత, నేను కర్తనని లోకము తలచుచుండె. నని భావము.

శం భా :- "ఏవమేవాయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః" (బృ॥4-3-21) "సతా సోమ్య తదా సంపన్నో భవతి" (ఛాన్దో॥ 6-8-1) ఇతి,

కాముకురాలిచే పరిష్వక్తుడైన కాముకుడు బాహ్యాభ్యన్తర విషయములు తెలియకుండునట్లు ఈ పురుషుడు (ఆత్మ) ప్రాజ్ఞాత్మతో సుషుప్తిలో ఏకీభవించి విషయజ్ఞానరహితుడై యుండును అని బృహదారణ్యక వచనమువలన దెలియుచున్నది.

సుషుప్తికాలములో సద్రూపమైన పరమాత్మతో ఏకీభూతుడగును. మనస్సంబన్ధకృతమైన జీవరూపమును పరిత్యజించి స్వస్వరూపమయిన సద్రూపపరమాత్మను పొందును అని ఛాందోగ్యశ్రుతి చెప్పుచున్నది.

శం. భా. ఏవమ్ —

"స్వమాయయా స్వమాత్మానం మోహయన్ ద్వైతమాయయా ।
గుణాహితం స్వమాత్మానం లభతే చ స్వయం హరిః ॥" తథా—
"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" (గీతా-13-2)
"ఉత్క్రామన్తం స్థితం వాఽపి" (గీతా-15-10)
"అజ్ఞానేనావృతం జ్ఞానమ్" (గీతా-5-15)
"అవ్యక్తాదివిశేషాన్త మవిద్యాలక్షణం స్మృతమ్"
"ఆసీదిదం తమోభూతమ్" (మను-1-5)
"వాచారంభణమ్" (ఛాన్దో- 6-1-4)

"యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి యత్ర త్వస్యసర్వ మాత్మైవాఽభూత్ తత్కేన కం పశ్యేత్. తత్ కేన కం జిఘ్రేత్" (బృ॥ 2-4-14)

త్రిగుణాత్మకము, ద్వైతదృష్టిని కలిగించునది మాయ. ఆ మాయ శ్రీహరిశక్తియై యున్నది. అట్టి స్వకీయమైన మాయచేత శ్రీహరి, స్వస్వరూపమగు జీవకోటిని మోహింపజేయుచు సగుణస్వరూపమును పొందుచుండును.

ఈ శరీరము క్షేత్ర మనబడును; క్షేత్రమును సాకల్యముగా తెలిసికొనువాడు క్షేత్రజ్ఞుడు; ఆ క్షేత్రజ్ఞుడను నే నని తెలిసికొనుము, అని భగవదుపదేశము.

దేహమందుండి, ఆ దేహమందు విషయముల ననుభవించుచుండి, ఆ దేహమును విడిచిపెట్టుచుండి, సుఖదుఃఖమోహాదిగుణములతో సంబంధించి దర్శనయోగ్యమగుచున్నను ఆ స్వరూపమును మూఢులు తెలిసికొనలేకున్నారు; జ్ఞానచక్షుష్కులే తెలిసికొనుచున్నారు.

వివేకవిజ్ఞానము అజ్ఞానము చేత ఆవృత మగుటచే సంసారులు మోహితు లగుచున్నారు. అని గీతావచనముల వలన దెలియును.

అవ్యక్తము మొదలుకొని విశేషాంతము గల పదార్థములుఅవిద్యాలక్షణముగా చెప్పబడెను.

ఈజగత్తు ప్రలయ కాలమందు 'తమోభూతమ్' ప్రకృతియందు సూక్ష్మరూపముతో లీనమై యుండెను. ఆ ప్రకృతి బ్రహ్మాత్మకమే అయి యుండెను, అని మనుస్మృతి వచనము.

జగత్కారణము బ్రహ్మ; ఆ బ్రహ్మ విజ్ఞాత మయినపుడు జగత్తు విజ్ఞాతమగును. మృత్తు విజ్ఞాతమైనపుడు మృద్వికారములగు ఘటాదులు మృత్తుగా తెలియుచున్న రీతిగ, వికారము నామమాత్రమే కాని అది యొక వస్తువు కాదు, యని ఛాందోగ్య శ్రుతి వచనము వివరించినది.

పరమార్థతః అద్వైతస్వరూప బ్రహ్మమందు 'ద్వైత మివ' భిన్నమైన వస్త్వంతరము వలె, గోచరించుచు అవిద్యావస్థలో ఇతరుడైన ద్రష్ట ఇతరమయిన దృశ్యమును చూచుచున్నాడు. ఎప్పుడు బ్రహ్మవిద్యచే అవిద్య నశించి సర్వము ఆత్మయే అగునో అప్పుడు దేనిచేత దేనిని చూచును? దేనిచేత దేనిని ఆఘ్రాణించును? అని బృహదారణ్యక శ్రుతి సర్వాత్మకత్వమును ప్రతిపాదించినది.

శం. భా. :- "యస్మిన్ సర్వాణి భూతా న్యాత్మైవాభూ ద్విజానతః ।
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః" (ఈశావాస్య-7)
'యత్ర నాన్యత్పశ్యతి నాన్యద్విజానాతి' (ఛా-7-24-1)
'భేదోఽయ మజ్ఞాననిబన్ధనః' 'నేహ నానాఽస్తి కించన' (కఠ-2-1-11)
'మృత్యో స్స మృత్యు మాప్నోతి య ఇహ. నానేవ పశ్యతి'
(కఠ-?-1-10)
"విశ్వతశ్చక్షుః' (శ్వే-3-3)
'యో యోని మధితిష్ఠత్యేకో విశ్వాని రూపాణి యోనీశ్చ సర్వాః'
'అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం
సరూపాః అజో హ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం
భుక్తభోగా మజోఽన్యః" (శ్వే-4-5)

'దేవాత్మశక్తిం విదధే' "నతు తద్ద్వితీయ మస్తి। తతోఽన్య ద్విభక్తం యత్పశ్యేత్'॥ (బృ-4-3-23)
'ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థుః' (శ్వే-3-2) ఇత్యాది-
'మనో దృశ్య మిదం ద్వైతం యత్కించిత్సచారాచరమ్।
మనసో హ్యమనీభావే ద్వైతం నైవోపలభ్యతే॥' (3-31)
'ప్రపంచో యది విద్యేత నివర్తేత న సంశయః।
మాయామాత్రమిదం ద్వైత మద్వైతం పరమార్థతః' ॥ (1-17)
'యథా స్వప్నే ద్వయాభాసం స్పన్దతే మాయయా మనః।
తథా జాగ్రద్ద్వయాభాసం స్పన్దతే మాయయా మనః॥' (3-29)
ఇత్యాది గౌడపాదే-

పరమార్థాత్మదర్శనము కలవానికి సర్వభూతములు ఆత్మగానే ఉండును. ఏకత్వదర్శనము చేసినవానికి మోహ మే ముండును? శోక మేముండును ? అని ఈశావాస్యశ్రుతివచనము.

నిరతిశయమైన ఏ తత్త్వమందు ద్రష్టవ్యాన్తర దర్శనము, శ్రోతవ్యాన్తర శ్రవణము, విజ్ఞేయాన్తరవిజ్ఞానము ఉండదో అది భూమబ్రహ్మ, యని ఛాందోగ్యశ్రుతియు -

ఈ భేదము అజ్ఞానమూలకమే; అవిద్య నివృత్తమైనపుడు బ్రహ్మస్వరూపమందు భిన్నమైన దేదియు లేదు, అని కఠ శ్రుతియు తెలియజేయుచున్నవి.

అవిద్యాతిమిరదృష్టిచే భిన్నదర్శనము కలవాడు మృత్యు పరంపరకు లోబడుచుండును, అని కఠశ్రుతి మరియొకచోట స్పష్టముగ చెప్పినది.

ఒక్కడే పరమాత్మ. సర్వతః చక్షుస్సులు, కలవాడు.

మూలకారణమైన ప్రకృతిని అధిష్ఠించిన ఒక్క పరమాత్మయే సర్వరూపములను సర్వకారణములను అధిష్ఠించియుండెను.

సత్త్వరజస్తమోగుణాత్మకము, అజయు, ఏకము, అయి త్రిగుణాత్మక బహుస్వరూపములను సృజించుచున్న ప్రకృతిని సేవించుచుండు అజుడొకడు; అనుభూతభోగము కల ఆ ప్రకృతిని పరిత్యజించు అజుడొకడు, అనియు శ్వేతాశ్వతరశ్రుతి స్పష్టముగ వివరించినది.

పరమాత్మస్వరూపము కంటె భిన్నముగ దర్శించునట్టి ద్వితీయ వస్తువు లేదు, అని బృహదారణ్యకవచనము.

రుద్రుడొక్కడే; ద్వితీయము లేదు, అని శ్వేతాశ్వతర శ్రుతి వలన తెలియుచున్నది.

చరాచరాత్మకమైన ఈద్వైతమంతయు మనస్సునకే దృశ్యము; మనస్సు ఉన్నప్పుడు అది యుండి మనస్సు లేనప్పుడు అది లేకుండుటవలన వివేకదర్శనాభ్యాస వైరాగ్యముల వలన మనస్సు నిరుద్ధ మయినపుడు (సమాధిదశలో) రజ్జువునందు సర్పమునవలె లయమును పొందినప్పుడు (సుషుప్తిలో) ద్వైత ప్రపంచము గోచరించుట లేదు. కనుక ద్వైతము అసత్తు. రజ్జువునందు భ్రాన్తిబుద్ధిచేత కల్పితమైన సర్పము విద్యమానమగుచు వివేకజ్ఞానము వలన, నివర్తింపలేదు. అట్లే ప్రపంచము కూడ విద్యమానమగుచు తత్త్వజ్ఞానముచేత నివర్తించుట కాదు. ఈ ద్వైత ప్రపంచము మాయామాత్రము. పరమార్థతః అద్వైతమే.

రజ్జువునందు కల్పితమైన సర్పమునకు (నిరీక్షింపగా) సత్త, అధిష్ఠాన (రజ్జు) రూపము చేతనే, కలిగియుండును. అట్లే పరమార్థజ్ఞానముచే నిరీక్షింపబడు మనస్సు యొక్క సత్త, అధిష్ఠానమైన ఆత్మయొక్క రూపము చేతనే కలిగి యుండును. అట్టి మనస్సు స్వప్నములో గ్రాహ్యగ్రాహక రూపద్వయాభాసమై స్పన్దించుచున్న రీతిగ జాగ్రద్దశలో కూడ మాయచే ద్వయాభాసమై స్పన్దించుచుండును, అని గౌడపాద వచనములు స్పష్టము చేయుచున్నవి.

శం.భా. :- "తర్కేణాపి ప్రపంచస్య మనోమాత్రత్వ మిష్యతామ్ ।
దృశ్యత్వా త్సర్వభూతానాం స్వప్నాదివిషయో యథా"
"ద్వితీయాద్వై భయం భవతి" (బృ॥ 1-4-2)
"జ్ఞాతేత్వాత్మని నా స్త్యేతత్కార్యకారణతాత్మనః"
"ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః" (శ్వే॥ 6-11)
"అసంగోహ్యయం పురుషః" (బృ॥ 4-3-15) ఇతి చ ॥
"విస్తార స్సర్వభూతస్య విష్ణోస్సర్వ మిదం జగత్ ।
ద్రష్టవ్య మాత్మవ త్తస్మా దభేదేన విచక్షణైః ॥ "
"సర్వత్ర దైత్యా స్సమతా ముపేతసమత్వ మారాధన మచ్యుతస్య"
"సర్వభూతాత్మకే తాత జగన్నాథే జగన్మయే ।
పరమాత్మని గోవిన్దే మిత్రామిత్రకథా కుతః" ఇతి విష్ణుపురాణే—
"తత్త్వమసి" (ఛా॥ 6-8) "అహం బ్రహ్మాస్మి" "ఇదం సర్వం యదయమాత్మా" "అయమాత్మా బ్రహ్మ" 'తరతి శోక మాత్మవిత్"
"తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః" ఇత్యాది శ్రుతి స్మృతీతిహాస పురాణ లౌకికేభ్యశ్చ ॥

స్వప్నదృశ్యపదార్థము మనోమాత్రమే అయినట్లు

దృశ్యమైన సర్వభూతప్రపంచము మనోమాత్రమే అని యెప్పి కొనవలెను.

ద్వితీయవస్తువే భయహేతువు.

ఆత్మజ్ఞానము కలిగినపుడు కార్యకారణభావము ఆత్మకు యుండనే యుండదు. సర్వభూతములందును ఒక్క పరమాత్మయే గూఢమై యుండును.

ఈ ఆత్మ అసంగస్వరూపము, అని బృహదారణ్యక శ్వేతాశ్వతరాది శ్రుతి తాత్పర్యము

ఈ సర్వజగత్తు, సర్వభూతాత్మకుడగు విష్ణువు యొక్క విస్తారము. కాన, విజ్ఞులకు అభేదముచే ఆత్మ వలెనే ద్రష్టవ్యము; దైత్యులారా! మీరు సర్వత్ర సమత్వమునే వహింపుడు. ఆ సమత్వమే విష్ణువుయొక్క ఆరాధనము. తండ్రీ! సర్వభూతాత్మకుడు, జగన్నాథుడు, జగన్మయుడు, పరమాత్మ అగు గోవిందునియందు శత్రుమిత్రభావ మెట్లుంటును? అనియు విష్ణు పురాణము ఆత్మైకత్వమును ప్రతిపాదించినది. ఈ విధముగా తత్త్వమసి ఇత్యాదిశ్రుతి స్మృతి ఇతిహాస వచనముల వలనను పురాణవచనముల వలనను అభేదమే సిద్ధించును.

శం.భా. :- సిద్ధేఽర్థేఽపి వేదస్య ప్రామాణ్య మేష్టవ్యమ్ ।
"స్వపక్ష సాధనై రకార్య మర్థజాత మాహ చేత్,
తథా పరోఽపి వేద చే ద్భ్రుతిః పరాత్మదృజ్ఞకిమ్" ॥

ఇత్యభియుక్తై రుక్తమ్—

సిద్ధమయిన అర్థము (బ్రహ్మ) నందు కూడ వేదమునకు ప్రామాణ్యము నంగీకరింపవలెను. క్రియాయోగ్యము కాని

సిద్ధార్థమునందు వేదము ప్రమాణము కాదనుచో శ్రుతి, పరమాత్మజ్ఞానప్రదము కాకుండ పోవునా? అని అభిజ్ఞులనిరి.

**శం. భా. :-** 'అన్యాన్వితస్వార్థే పదానాం సామర్థ్యమ్. న కార్యాన్విత స్వార్థే. తథా సత్యర్థవాదానా మనన్వయప్రసంగాత్. అన్వయబుద్ధేః స్తుతిత్వాత్. న హి భవతి 'వాయవ్యం శ్వేత మాలభేత. భూతికామో వాయుర్వై క్షేపిష్ఠా దేవతా' ఇతి. రాగస్యైవ ప్రవర్తకత్వాత్. న నియోగస్య. తథా చ శ్రుతిః—అథో ఖల్వాహుః కామమయ ఏవాఽయం పురుష ఇతి. స యథా కామో భవతి తత్క్రతుర్భవతి. యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే. యత్కర్మ తదభిసంపద్యతే' ॥

పదములకు అన్యపదార్థముతో అన్వయించు అర్థము చెప్పుటయందే సామర్థ్యము కాని, కార్యముతో అన్వయించు అర్థమును చెప్పుట యందుకాదు. కార్యముతోనే అన్వయింపవలె ననినచో స్తుతిపరములైన అర్థవాదములకు అనన్వయమే ప్రసక్త మగును. మరియు, 'ఐశ్వర్యకాముడు వాయుదేవతాక యాగము చేయవలెను; వాయువు శీఘ్రఫల మిచ్చెడి దేవత' అనినపుడు ప్రవర్తకము యజమానుని ఇచ్ఛావిశేషమైన రాగ మగును. కాని, నియోగము కాదు.

కనుకనే శ్రుతి - పురుషుడు కామమయు డనియు, ఎట్టి కామమో అట్టి సంకల్పము, ఎట్టి సంకల్పమో అట్టి కర్మ, ఎట్టి కర్మయో అట్టి ఫలము, అనియు చెప్పుచున్నది.

**శం. భా. :-** తథా చ స్మృతిరపి -

"అకామతః క్రియా కాచి ద్దృశ్యతే నేహ కస్యచిత్ యద్యద్ధి కురుతే

కర్మత త్తత్కామస్య చేష్టితమ్''
''కామ ఏష క్రోధ ఏషః'' ఇతి.

లోకములో కామన లేనిదే ఎవ్వనికి ఏ క్రియయు కనబడదు. ఏ యే కర్మ చేయుచుండెనో అదంతయు కామము యొక్క చేష్టయే అనియు, కర్మయందు ప్రవర్తింపచేయునది కామము, క్రోధము అనియు స్మృతివచనములు చెప్పుచున్నవి.

శం. భా. :- అన్యపరాణామపి మన్త్రార్థవాదానాం ప్రామాణ్య మంగీకర్తవ్యమ్, తేషా మప్రామాణ్యకథనేన ఉరగత్వం గతవా న్నహుషః. తత్కథమ్ ;''

''ఋషయస్తు పరిశ్రాన్తా వాహ్యమానా దురాత్మనా
దేవర్షయో మహాభాగా స్తథా బ్రహ్మర్షయోఽమలాః
ప్రపచ్ఛు స్సంశయం తే తు నహుషం పాపచేతసమ్।
య ఇమే బ్రహ్మణా ప్రోక్తా మన్త్రా వై ప్రోక్షణే గవామ్
ఏతే ప్రమాణం భవత ఉతాహో నేతి వాసవ।
నహుషో నేతి తానాహ సహసా మూఢచేతనః॥
ఋషయ ఊచుః :-
'అధర్మే సంప్రవృత్త స్త్వం ధర్మం చ విజిఘృక్షసి
ప్రమాణ మేత దస్మాకం పూర్వం ప్రోక్తం మహర్షిః।
అగస్త్య ఉవాచ :-
''తతో వివదమాన స్సన్ ఋషిభి స్సహ పార్థివః
అథ మా మస్పృశ న్మూర్ధ్ని పాదేనాఽధర్మపీడితః।
తేనాభూద్ధతచేతా స్స విశ్శ్రీకశ్చ శచీపతే
తత స్తమహ ముద్విగ్న మవోచం భయపీడితమ్।
యస్మా త్పూర్వైః కృతం మార్గం మహర్షిభి రనుష్ఠితం

అదుష్టం దూషయసి వై యచ్చ మూర్ధ్న్యస్ప్రాక్షీః పదా ।
యచ్చాపి త్వ మృషీన్ మూఢ బ్రహ్మకల్పాన్ దురాసదాన్
వాహాన్ కృత్వా వహయసి తేన స్వర్గాద్ధతప్రభః
త్వం స్వపాపపరిభ్రష్టః క్షీణపుణ్యో మహీపతే ।
దశవర్షసహస్రాణి సర్పరూపధరో మహీమ్
విచరిష్యసి తీర్ణశ్చ పునస్స్వర్గ మవాప్స్యసి ॥

ఇతి శ్రీమహాభారతే-

అన్యపరము లయిన మన్త్ర - అర్థవాదములకును ప్రామాణ్య మంగీకరింపవలసినదే; వాని కప్రామాణ్యము చెప్పుటచేత నహుషుడు సర్పరూపమును పొందెను. అది యెట్ులనగా నహుషు డొకప్పుడు స్వర్గాధిపత్యము వహించి యుండి దుర్బుద్ధితో దేవర్షులను, బ్రహ్మర్షులను తన వాహనము నకు వాహకులనుగా చేసెను. పరిశ్రాంతులైన ఆ ఋషులు నహుషుని ఇట్లు ప్రశ్నించిరి.

గోవులను ప్రోక్షించుట విషయమైె వేదప్రోక్తములైన ఈ మంత్రములు నీకు ప్రమాణములా? కావా? అని. అయ్యవి ప్రమాణములు కావని నహుషుడు చెప్పెను.

అంత ఋషు లిట్లనిరి. అధర్మప్రవృత్తుడవైన నీవు ధర్మ మును గర్హించుచున్నావు; పూర్వము మహర్షులచే ప్రోక్తమై నట్టి మంత్రజాలము మాకు ప్రమాణమే. అంతట నహుషుడు ఆ ఋషులతో వివాదపడుచు వాహకుడ నగు నాయొక్క శిరస్సును తన పాదముతో స్పృశించెను. అని అగస్త్య మహర్షి చెప్పుచుండెను. నా శిరస్సున పాదస్పర్శచేయుటతో

వికలచిత్తుడు, నిస్తేజస్కుడు అయి, భయపీడితు డగు నహుషునితో నే నిట్లంటిని.

పూర్వులచే ప్రదర్శితమైన మహర్షులచే అనుసరింపబడి నిర్దుష్టమై యున్న మార్గమును నీవు దూషించుచుండుటచేతను నా శిరస్సును, నీవు పాదముచే తాకుటచేతను, మహాతేజ శ్శాలులు బ్రహ్మణ్యులు నగు ఋషులను నీ వాహనము వహించువారినిగ చేయుటచేతను హ్రస్వపాపోపహతుడవగు నీవు స్వర్గపరిభ్రష్టుడవై భూమియందు సర్పరూపము ధరించి పది వేల సంవత్సరములు సంచరింతువుగాక; తరువాత శాపవిముక్తు డవై పునః స్వర్గమును పొందెదవు, అని అగస్త్యమహర్షి చెప్పి నట్లు మహాభారతము తెలుపుచున్నది.

శం. భా. :- అతః శ్రద్ధేయ మాత్మజ్ఞానమ్.

"అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని"

—ఇతి శ్రీభగవద్వచనాత్.

కార్యపరములే కాక అన్యపరములగు వేదవాక్యము లకును ప్రామాణ్యమంగీకరింపవలసినదే కావున, ఆత్మజ్ఞానము విశ్వసనీయమే. కనుకనే, భగవద్గీతయందు -

ఆత్మజ్ఞానరూపమైన ఈ ధర్మము యొక్క స్వరూప మందు, ఫలమునందు శ్రద్ధారహితులైన నాస్తికులు పరమే శ్వరుడ నగు నన్ను పొందక మృత్యుయుక్తమైన సంసారమార్గ మందే వర్తింతురు. అని చెప్పబడినది.

శం. భా. :- ఐతరేయకే చ - "ఏష పన్థా ఏతత్కర్మైతద్బ్రహ్మై

తత్సత్యం తస్మా న్న ప్రమాద్యే త్తన్నాతీయా న్నహ్యాత్యాయన్ పూర్వే యేఽత్యాయన్ తే పరా బభూవుః''

తదుక్త మృషిణా - ''ప్రజాహ తిస్రో అత్యాయ మీయు ర్న్యన్యా అర్క మభితో వివిశ్రే బృహద్ధతస్థౌ భువనేష్వన్తః పవమానో హరిత ఆవివేశ''

''ప్రజాహ తిస్రో అత్యాయ మీయురితి యావైతా ఇమాః ప్రజాః తిస్రోఽత్యాయ మీయు స్తానీమాని వయాంసి వంగా వగధాశ్చేరపాదాః''

ఇతి. (ఐత. ఆ. 2-1-1,4.5) శ్రుతమ్.

వంగాః - వనగా వృక్షాః, వగధాః - ఓషధయశ్చ । ఇరపాదాః - ఉరః పాదాః సర్పాదయః.

పూర్వోత్తరకాండార్థరూపమయినదే మార్గము. పురుషార్థసాధనము. పూర్వకాండ ప్రతిపాదితమే కర్మ. ఉత్తరకాండ ప్రతిపాదితమైన సగుణము నిర్గుణము అయినది బ్రహ్మ. ఇది సత్యము. 'తస్మాత్' ఉభయవిధామ్నాయ మార్గమునుండి ప్రమాదము (కర్మానుష్ఠానము మానుట. బ్రహ్మజ్ఞానము సంపాదింపకుండుట) తగదు; పూర్వోక్త మార్గద్వయమును అతిక్రమింపరాదు; పూర్వులైన మహర్షులు అతిక్రమింపలేదు; ఎవరు అతిక్రమించిరో వారు పురుషార్థభ్రష్టులయిరి.

మంత్రమే ఈ విషయమును ప్రతిపాదించుచున్నది. చాతుర్వర్ణ్యప్రజలలో మొదట మూడు విధముల ప్రజలు వైదికమార్గశ్రద్ధారహితులై మార్గద్వయమును అతిక్రమించిరి. చతుర్థవర్ణప్రజలలో కొందరు 'అర్కమ్' అర్చనీయుడైన అగ్నిని అర్చించువారైరి. మరికొందరు సర్వజగత్ప్రకాశకమగు సూర్యమండల మందలి దేవుని భజించువారైరి. మరి కొందరు దిగంత వ్యాపకమైన వాయువును భజించువారైరి.

మొదట మూడు వర్ణముల ప్రజలలో వైదికమార్గము యెడ శ్రద్ధ లేక, మార్గద్వయమును అతిక్రమించిన వారెవరో వారే పశువులుగా వృక్షములుగా ఓషధులుగా సర్పములుగా అయిరి, అని ఋషివచనము.

శం. భా. :- తథా చ, ఈశావాస్యే అవిద్వన్నిన్దార్థో మన్త్రః - అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసా వృతాః । తాం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః'' (ఈ శా - 3)

''అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్' 'ఇతి తైత్తిరీయే॥

తథా శకున్తలోపాఖ్యానే -

"యోఽన్యథా సన్త మాత్మానా మన్యథా ప్రతిపద్యతే కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా''

అవిద్యాదోషముచేత ఆత్మస్వరూపజ్ఞానహీనులు, ఆత్మఘాతులు నగువారు ఈ దేహము విడిచినతరువాత అంధకారావృతములగు అసుర్యలోకములను పొందుదురు.

బ్రహ్మ అసత్ - లేదు - అని భావించువాడే లేనివాడగును, అని ఈశావాస్య, తైత్తిరీయాదిశ్రుతుల వలన తెలియుచున్నది.

అన్యథా విద్యమానమైన ఆత్మను ఎవ్వడు అన థా గ్రహించునో ఆతడు ప్రధానమైన ఆత్మనే అపహరించు చోరుడయి పాపము చేసినవాడగును, అని శకుంతలోపాఖ్యానము వలన స్పష్టమగుచున్నది.

శం. భా. :- ఇత్యల మతిప్రసంగేన ।

సహస్రనామజపస్య అనురూపం మానసస్నాన ముచ్యతే -

"యస్మిన్ దేవాశ్చ వేదాశ్చ పవిత్రం కృత్స్నమేకతామ్ ।
వ్రజేత్తన్మానసం తీర్థం తత్ర స్నాత్వాఽమృతో భవేత్" ॥
"జ్ఞానహ్రదే ధ్యానజలే రాగద్వేషమలాపహే
యః స్నాతి మానసే తీర్థే స యాతి పరమాం గతిమ్"
"సరస్వతీ రజోరూపా తమోరూపా కలిన్దజా
సత్వరూపా చ గంగా చ న యాన్తి బ్రహ్మ నిర్గుణమ్"
"ఆత్మానదీ సంయమతోయపూర్ణా
సత్యహ్రదా శీలతటాదయోర్మిః
తత్రావగాహం కురు పాండుపుత్ర
న వారిణా శుధ్యతి చాఽన్తరాత్మా" ॥ ఇతి మహాభారతే.
"మానసం స్నానం విష్ణుచిన్తనమ్" ఇతి స్మృతౌ.
"జప్యేనైవ తు సంసిధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః
కుర్యా దన్యన్నవా కుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే"
ఇతి మానవం వచనమ్.

"జపస్తు సర్వధర్మేభ్యః పరమో ధర్మ ఉచ్యతే
అహింసయా చ భూతానాం జపయజ్ఞః ప్రవర్తతే" ఇతి.
"యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" ఇతి శ్రీ గీతాసు
"అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా
యః స్మరేత్పుండరీకాక్షం స బాహ్యాభ్యన్తరశ్శుచిః" ఇత్యాది-

ఇక అధికముగ చెప్పనేల?

సహస్ర నామజపమునకు అనుగుణమైన మానస స్నానము చెప్పబడుచున్నది.

ఎక్కడ దేవతలును, వేదములును, పావనమయిన సర్వ

మును ఏకత్వము నొందునో అది మానసతీర్థ మనబడును. వానియందు స్నానము చేసి అమృతు డగును.

జ్ఞాన మను మడుగు, రాగద్వేషములును పోగొట్టు ధ్యాన మను జలము కల మానసతీర్థమందు స్నానము చేసిన వాడు పరమగతిని పొందును.

రజోగుణరూపమైనది సరస్వతీ నది; తమోగుణరూప మైనది యమునానది; సత్త్వగుణ రూపమైనది గంగానది; ఇవి నిర్గుణమయిన బ్రహ్మను పొందజాలవు.

ఆత్మ యనునది ఇంద్రియనిగ్రహ మను జలము కలది; సత్యము అను మడుగు కలది; సత్ప్రివర్తన అను తటములు కలది; దయ అను తరంగములు కలది. పాండుపుత్రా! అట్టి నదిలో స్నానము చేయుము. జలముతో అంతరాత్మకు శుద్ధి కలుగదు.

అని మహాభారతములో చెప్పబడినది.

మానసస్నాన మనగా, విష్ణుచిన్తనమే యని స్మృతి వచనము.

ఇతరము చేసినను చేయకున్నను, బ్రాహ్మణుడు జపము చేతనే మోక్షప్రాప్తియోగ్యు డగును. బ్రాహ్మణుడు భూత దయ కలవాడని చెప్పబడుచున్నది, అని మనుస్మృతి వలన దెలియును.

సర్వధర్మములలో పరమ ధర్మము జపము; అహింస తో జరుగునది జపమనియు, యజ్ఞములలో జప యజ్ఞము

నా స్వరూపము అనియు, గీతలో చెప్పబడినది.

పవిత్రుడయినను, అపవిత్రుడయినను ఎట్టి అవస్థలో నున్నను పుండరీకాక్షుని స్మరించినవాడు బాహ్యాభ్యంతరముల శుద్ధుడగునని చెప్పబడినది.

ఇంతవరకు భీష్మోపదేశములోని పదవ శ్లోకభాష్యము ముగిసినది.

శం. భా. :- యదేకం దైవతం ప్రస్తుతం తస్యోప లక్షణ ముచ్యతే.

శ్లో. యత స్సర్వాణి భూతాని భవన్త్యాదియుగాగమే ।
యస్మింశ్చ ప్రలయం యాన్తి పునరేవ యుగక్షయే ॥

శం. భా. :- యతః యస్మాత్ సర్వాణి భూతాని భవన్తి ఉద్భవన్తి. ఆదియుగాగమే - కల్పాదౌ. యస్మింశ్చ ప్రలయం - విలయం. యాన్తి- వినాశం గచ్ఛన్తి. పునః - భూయః. ఏవ మిత్యవధారణార్థః. నాన్యస్మి న్నిత్యః. యుగక్షయే - మహాప్రలయే చకారా న్మధ్యేఽపి యస్మిన్ తిష్ఠన్తి. "యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయ న్త్యభిసంవిశన్తి'' ఇతి శ్రుతేః ॥

ఏకదైవత మేది ప్రస్తుతమయ్యెనో దానికి ఉపలక్షణము చెప్పబడుచున్నది - కల్పాదియందు సర్వభూతములు ఏ స్వరూపమునుండి ఉద్భవించుచున్నవో, ఏ స్వరూపమందు మహాప్రలయమున మరల లయ మగుచున్నవో, మధ్యలో ఏస్వరూపమందు అధారపడియున్నవో అట్టిది ఆ ఏకదైవతము.

శ్లో. తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే ।
విష్ణోర్నామసహస్రం మే శ్రుణు పాపభయాపహమ్॥ ౧౨

శం. భా. :- తస్య ఏవం లక్షణలక్షితస్య ఏకదైవతస్య లోకప్రధానస్య - లోకనహేతుభిః విద్యాస్థానైః ప్రతిపాద్యమానస్య. జగన్నాథస్య - జగతాం నాథః స్వామీ, మాయాశబలః పరమాత్మా నిర్లేపశ్చ. తస్య. భూపతే - మహీపాల, విష్ణోః - వ్యాపనశీలస్య. నామసహస్రమ్-నామ్నాం సహస్రం, అశుభకర్మకృతం పాపం, సంసారలక్షణభయం చ అపహన్తీతి పాపభయాపహమ్. త్వం, మే - మత్తః, శ్రుణు ఏకాగ్రమనా భూత్వా అవధారయేత్యర్థః ॥

అట్టి ఆ ఏకదైవతము, స్వరూపావలోకన హేతువులైన విద్యాస్థానములచే ప్రతిపాదింప బడుచున్నది. జగత్తులకు స్వామియై మాయాశబలమగు పరమాత్మయై నిర్లేపమై యున్నది. వ్యాపకమయిన ఆ దైవతము యొక్క నామసహస్రము అశుభకర్మజన్య మగు పాపమును, సంసారలక్షణమైన భయమును పోగొట్టును. కావున, నీవు నావలన ఏకాగ్రతతో వినుము - అవధరింపుము.

శం. భా :- "ఏకస్యైవ సమస్తస్య బ్రహ్మణో ద్విజసత్తమ
నామ్నాం బహుత్వం లోకానా ముపకారకరం శ్రుణు
నిమిత్తశక్త్యో నామ్నాం భేదిన్య స్తదుదీరణాత్
విభిన్నాన్యేవ సాధ్యన్తే ఫలాని ద్విజసత్తమ
యచ్ఛక్తి నామ యత్తస్య తత్తస్మిన్నేవ వస్తుని
సాధకం పురుషవ్యాఘ్ర సౌమ్యే క్రూరేషు వస్తుషు" ॥
ఇతి విష్ణుధర్మ వచనాత్.

సమస్తాత్మకమయిన ఒక బ్రహ్మకే నామబహుత్వము లోకోపకారకము. ఆ యా నామములకు నిమిత్తములగు

శక్తులు విభిన్నములై తత్తన్నామోచ్చారణము వలన విభిన్న ఫలములను సాధించుచుండును.

పరమాత్మ యొక్క ఏ నామము ఏ శక్తికి సంబంధించినదో ఆ నామము సౌమ్యములు, క్రూరములు నయిన ఆయా విషయములకు సాధక మగుచుండును, అని విష్ణుధర్మోత్తరములో చెప్పబడినది.

శం. భా. :– "యద్యపి పరస్య బ్రహ్మణః గుణక్రియాజాతిరూఢీనాం శబ్దప్రవృత్తిహేతుభూతానాం నిమిత్తశక్తీనాం చాఽసంభవః, తథాఽపి సగుణే బ్రహ్మణి సవికారే చ సర్వాత్మకత్వా త్తేషాం శబ్దప్రవృత్తిహేతూనాం సంభవాత్ సర్వే శబ్దాః పరస్మిన్ పుంసి వర్తన్తే.

శబ్దప్రవృత్తికి హేతువులగు గుణముకాని క్రియకాని లేక జాతికాని రూఢికాని పరబ్రహ్మస్వరూపమందు లేదు, అయినను, సగుణము, సవికారము అగు బ్రహ్మ యందు సర్వాత్మకత్వమును బట్టి శబ్దప్రవృత్తి హేతువులకు సంభవ ముండుటచేత సర్వ శబ్దములు పరమాత్మయందు వర్తించుచున్నవి.

శ్లో॥ యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః ।
ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే ॥ ౧౩

శం. భా. :- "తత్ర యాని నామాని గౌణాని గుణసంబన్ధీని గుణయోగాత్ప్రవృత్తాని, తేషు చ యాని విఖ్యాతాని ప్రసిద్ధాని, ఋషిభిః - మన్త్రైః తద్దర్శిభిశ్చ పరిగీతాని - పరితః సమన్తతః పరమేశ్వరాఖ్యానేషు తత్ర తత్ర గీతాని, మహాంశ్చాసౌ ఆత్మా ఇతి మహాత్మా.

"యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ
యచ్చాస్తి సన్తతో భావ స్తస్మాదాత్మేతి కీర్త్యతే" (లింగ)
ఇతి వచనా దయమేవ మహాత్మా తస్యాఽచిన్త్యప్రభావస్య. తాని వక్ష్యామి భూతయే పురుషార్థచతుష్టయసిద్ధ్యై భూతయే పురుషార్థ చతుష్టయార్థినా మితి॥

ఆ నామములలో గుణములకు సంబంధించినవియు, వానిలోకూడ ప్రసిద్ధములైనవియు మన్త్రముల చేతను మన్త్ర ద్రష్టల చేతను పరమేశ్వరాఖ్యానములలో కీర్తింపబడియున్న వియునగు మహాత్మ నామములు పురుషార్థచతుష్టయార్థుల సిద్ధి కొరకు చెప్పెదను.

లింగపురాణోక్త వచనానుసారము విషయముల ప్రాప్తి, స్వీకారము, అనుభవము, కలది ఆత్మ. ఇదియే మహాత్మ. అచిన్త్య ప్రభావము కలది, అని తాత్పర్యము.

శం. భా. :- "అత్ర నామసహస్రే ఆదిత్యాది శబ్దానా మర్థాన్తరే ప్రసిద్ధానా మాదిత్యాద్యర్థానాం తద్విభూతిత్వేన తదభేదా త్తస్యైవ స్తుతి రితి ప్రసిద్ధార్థగ్రహణేఽపి తత్స్తుతిత్వమ్.

"భూతాత్మా చేన్ద్రియాత్మా చ ప్రధానాత్మా తథా భవాన్
ఆత్మా చ పరమాత్మా చ త్వమేకః పంచధా స్థితః" (విష్ణు)
"జ్యోతీంషి విష్ణుర్భువనాని విష్ణుర్వనాని విష్ణుర్గిరయో దిశశ్చ
నద్య స్సముద్రాశ్చ స ఏవ సర్వం యదస్తి యన్నాస్తి చ విప్రవర్య"
—ఇతి విష్ణుపురాణే,

"ఆదిత్యానా మహం విష్ణుః" ఇత్యారభ్య
"అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ;

విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్''

—ఇతివర్ణ్యస్తం గీతాసు

"బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్'' (ముం)

"పురుష ఏవేదం విశ్వమ్'' (ముం) ఇతి శ్రుతిశ్చ.

విష్ణ్వాది శబ్దానాం పునరుక్తానామపి వృత్తిభేదేనాఽర్థభేదా న్న పౌన రుక్త్యమ్ ।

శ్రీపతిః మాధవః ఇత్యాదీనాం వృత్త్యైకత్వేఽపి శబ్దభేదా న్న పౌన రుక్త్యమ్ । అర్థైకత్వేఽపి న పౌనరుక్త్యం దోషాయ, నామ్నాం సహస్రస్య 'కిమేకం దైవతమ్' ఇతి పృష్టే రేకదైవతవిషయత్వాత్ ।

యత్ర పుంలింగ శబ్దప్రయోగ స్తత్ర విష్ణుర్విశేష్యః, యత్ర స్త్రీలింగ శబ్ద స్తత్ర దేవతా విశేష్యతే । యత్ర నపుంసకలింగశబ్ద స్తత్ర బ్రహ్మేతి విశేష్యతే ।

'యత స్సర్వాణి భూతాని' ఇత్యారభ్య జగదుత్పత్తి - స్థితి - లయ కారణస్య బ్రహ్మణ ఏకదైవతత్వేనాఽభిహితత్వాత్ ।

ఈ సహస్రనామముల యందలి ఆదిత్యాది శబ్దములు అర్థాన్తరప్రసిద్ధము లయినను ఆ ఆదిత్యాదులు పరమాత్మ భూతులే కనుక, పరమాత్మతో అభేదమే యగుట చేత ప్రసిద్ధార్థ గ్రహణములో కూడ పరమాత్మస్తుతియే యగును.

నీవు భూతాత్మవు; ఇన్ద్రియాత్మవు; ప్రధానాత్మవు; ఆత్మవు; పరమాత్మవు: ఇట్లు పంచవిధములుగా నీవొక్కడవే ఉంటివి.

'జ్యోతిస్సులు విష్ణువు; భువనములు విష్ణువు, వనములు, పర్వతములు, దిక్కులు, నదులు, సముద్రములు, ఈ సర్వము

విష్ణువే, 'అస్తి' అనబడునదియు, 'నాస్తి' అనబడునదియు (లయమగుట ఆ స్వరూపమందే కనుక) విష్ణువే' అని విష్ణు పురాణము చెప్పుచున్నది.

భగవద్గీతలో - 'ఆదిత్యులలో విష్ణువు నేను, అని ఆరంభించి చెప్పుచు 'నా విభూతులు తెలిసినంతమాత్రమున నా స్వరూప మేమి తెలిసినట్లు? నిఖిల ప్రపంచమును నేను ఏకాంశముచేతనే వ్యాపించి యున్నానని భగవంతు డుపదేశించియుండెను.

ఈ సమస్త జగత్తు బ్రహ్మయే, 'ఈ సమస్తము పురుషుడే' అని శ్రుతి యుద్ఘోషించుచున్నది.

ఈ నామములలో విష్ణ్వాదిశబ్దములు పునరుక్తములై యున్నను వ్యుత్పత్తిభేదమూలకమైన అర్థభేదముచేత పునరుక్తి కానేరదు. శ్రీపతి, మాధవ - ఇత్యాది శబ్దములు అర్థభేదము లేనివయినను శబ్దభేదమును బట్టి పునరుక్తి కానేరదు. ఏకార్థమూలక పునరుక్తి దోషావహముకాదు. ఏకదైవతప్రశ్నపై చెప్పబడిన నామసహస్రము ఏకదైవత విషయమై యుండుట వలన పునరుక్తిదోషము లేదు.

ఈ నామములలో పుంలింగశబ్దప్రయోగమున్న స్థలమున విష్ణువు విశేష్యము; స్త్రీలింగశబ్దము ప్రయుక్తమయినపుడు దేవత విశేష్యము; నపుంసకలింగశబ్దము ప్రయుక్తమయినపుడు బ్రహ్మ విశేష్యము అని గ్రహింపవలెను.

ఈ నామములలో, జగదుత్పత్తి - స్థితి - లయకారణ

మగు బ్రహ్మ ఏకదైవత మని చెప్పబడుటే కారణము.

శ్లో॥ విశ్వం విష్ణు ర్వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః ।
భూతకృద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ॥

శం. భా. :- ఆదా వుభయవిధం బ్రహ్మ విశ్వ శబ్దేనోచ్యతే. విశ్వస్య జగతః కారణత్వేన విశ్వ మిత్యుచ్యతే బ్రహ్మ. ఆదౌ తు విశ్వ మితి కార్య శబ్దేన కారణగ్రహణమ్. కార్యభూత విరించ్యాది నామభిరపి ఉపపన్నా స్తుతి ర్విష్ణో రితి దర్శయతి.

యద్వా పరస్మాత్పురుషా న్న భిన్న మిదం విశ్వం పరమార్థతః తేన విశ్వ మిత్యభిధీయతే బ్రహ్మ. "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్" "పురుష ఏవేదం విశ్వమ్" ఇత్యాది శ్రుతిభ్యః తద్భిన్నం న కించి త్పర మార్థతః సద స్తి.

అథవా, విశతీతి విశ్వం బ్రహ్మ. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" ఇతి శ్రుతేః

కించ, సంహృతౌ విశ న్తి సర్వాణి భూతాని అస్మిన్నితి విశ్వం బ్రహ్మ. "యత్ప్రయ న్త్యభిసంవిశ న్తి" ఇతి శ్రుతేః. తథా హి - సకలం జగత్ కార్యభూతమేష విశతి, అత్ర చాఽఖిలం విశతీత్యుభయథాఽపి విశ్వం బ్రహ్మ. ఇతి.

౧. విశ్వమ్.

ఇట విశ్వశబ్దము, కారణము కార్యము ఉభయవిధము నయిన, బ్రహ్మను బోధించుచున్నది. విశ్వమునకు కారణ మగుటచే విశ్వ శబ్దము చేత బ్రహ్మ చెప్పబడుచున్నది. మొదట కార్యమగు విశ్వ శబ్దము చేత కారణగ్రహణము. కార్యకోటికి

చెందిన బ్రహ్మాదుల నామములచే కూడ ఆ విష్ణుస్తుతి ఉపపన్నమే. ఏలయన,

ఈ పరమార్థములో ఆ పరమ పురుషుని కంటె భిన్నము విశ్వము కానందునను విశ్వశబ్దము బ్రహ్మను చెప్పును.

ఈ విషయము – 'ఈ విశ్వము బ్రహ్మయే' 'ఈ విశ్వము పురుషుడే' – మున్నగు శ్రుతివచన తాత్పర్యముచే బ్రహ్మభిన్నమయినదేదియు నిటలేదని సిద్ధించుచున్నది. 'అథవా విశ్వమును సృష్టించి దానిలో ప్రవేశించెను'. అను శ్రుత్యర్థమును బట్టి 'విశతీతి విశ్వమ్' అను వ్యుత్పత్తితో 'విశ్వ' శబ్దము ఆ విష్ణువును (బ్రహ్మను) చెప్పును. మరియు, శ్రుతి చెప్పినట్లు సంహారకాలములో సర్వభూతములు ఈ స్వరూపమందు ప్రవేశించుచున్నందున 'విశన్తి సర్వభూతాని అస్మిన్' అను వ్యుత్పత్తిచే 'విశ్వ' శబ్దము బ్రహ్మను చెప్పును.

కార్యజగత్తునందు ప్రవేశించి యుండుటచేతను, కార్యజగత్తు ఈ స్వరూపమందు ప్రవేశించునదగుటచేతను, రెండు విధముల 'విశ్వ' శబ్దార్థము బ్రహ్మ యగుచున్నది.

శం. భా. :- "అన్యత్ర ధర్మా దన్యత్రాఽధర్మాత్" ఇత్యారభ్య - 'సర్వే వేదా యత్పద మామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి। యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్'

'ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరం ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ - ఇతి కాఠకే.

'ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః'

ఇత్యుపక్రమ్య- 'యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత' ఇతి ప్రశ్నోపనిషది.

'ఓమితి బ్రహ్మ. ఓమితీదం సర్వమ్' ఇతి యజుర్వేదారణ్యకే
'తద్యథా శంకునా సర్వాణి పర్ణాని సన్తృణ్ణాన్యేవ
మోంకారేణ సర్వా వాక్ సన్తృణ్ణా ఓంకార ఏవేదం సర్వమ్'
—ఇతి ఛాన్దోగ్యే ।

'ఓమిత్యేతదక్షర మిదం సర్వమ్' ఇత్యుపక్రమ్య - ప్రణవో హ్యపరం బ్రహ్మ ప్రణవశ్చ పర స్స్మృతః । అపూర్వోఽన న్తరోఽబాహ్యోఽనపరః ప్రణవోఽవ్యయః'' "సర్వస్య ప్రణవో హ్యాది ర్మధ్యమ న్త స్తథైవ చ । ఏవం హి ప్రణవం జ్ఞాత్వా వ్యశ్నుతే తదన న్తరమ్''

''ప్రణవం హీశ్వరం విద్యా త్సర్వస్య హృదయే స్థితం
సర్వవ్యాపిన మోంకారం మత్వా ధీరో న శోచతి''
''అమాత్రోఽన న్తమాత్రశ్చ ద్వైతస్యోపశమ శ్శివః
ఓంకారో విదితో యేన స ముని ర్నేతరో జనః''
ఇత్యాన్నా మాండూక్యోపనిషత్-

'ఓం తత్ బ్రహ్మ. ఓం తద్వాయుః. ఓం తదాత్మా. ఓం తత్సత్యమ్. ఓం తత్సర్వమ్' ॥ ఇత్యాది శ్రుతిభిః-

కఠోపనిషత్తులో ఇట్లు చెప్పబడినది - 'సర్వవేదములు- వేదైక దేశములగు ఉపనిషత్తులు ప్రాప్తవ్యముగా దేనిని ప్రతి పాదించుచున్నవో, తపస్సు లన్నియు దేని ప్రాప్తికొరకగు చున్నవో, దేనిని కోరి బ్రహ్మచర్యము నాచరించుచున్నారో, దానిని నీకు సంక్షేపించి చెప్పుచున్నాను. అది 'ఓమ్' శబ్ద వాచ్యము. ఓమ్ శబ్దము (ప్రతీకము 'ఆలంబనము) గా గలది.

ఈ అక్షరము, అపర బ్రహ్మయే. ఈ అక్షరము పరబ్రహ్మయే ఈ అక్షరము ఉపాస్యమగు పరాపరబ్రహ్మ- అని తెలిసి ఉపాసించినట్టి యధికారి దేనిని కోరునో, అది యంతయు ఆతనికి ప్రాప్తమగును.

ప్రశ్నోపనిషత్తులో ఇట్లు చెప్పబడినది - 'సత్యకామా! ఓంకార మేది కలదో, అదియే పరాపరబ్రహ్మ, త్రిమాత్రలు కల ఓమ్, అను ఈ అక్షరముచేతనే పరమపురుషుని ధ్యానింపవలయును.

'ఓమ్' అనునది బ్రహ్మ; ఈ సర్వము ప్రణవరూపము- అని యజుర్వేదారణ్యకమున వివరింపబడినది.

ఛాన్దోగ్యమునందు ప్రణవస్వరూపమిట్లు ప్రతిపాదింపబడినది- ఆకునకు గల ఈనెతో ఆకులోని భాగములన్నియు వ్యాప్తము లయినరీతి ఓంకారముతో సర్వవాఙ్మయము వ్యాప్తమయినది, సకలజగత్తు పరమాత్మవికార మగుటచే పరమాత్మకు భిన్నముగా లేదు. ఆ పరమాత్మ ఓంకారము కంటె భిన్నము కాదు.

మాండూక్య శ్రుతియందు ప్రణవము ఈ రీతిగ కీర్తింపబడినది- ప్రణవము పరాపరబ్రహ్మరూపము. అది పూర్వము కారణము లేనిది. అన్తరము భిన్నజాతీయ మేదియు లేనిది. బహిర్భాగము లేనిది. అపరము - కార్యము లేనిది, అవ్యయమైనది, ప్రణవము, సర్వమునకు ఆదియు మధ్యము అన్తము అయియున్నది. అనగా, రజ్జుసర్పము యొక్క ఆది - ఉత్పత్తి.

మధ్య - స్థితి. అన్త-లయము, ఈ వికారములలో నిర్వికారమై యున్న రజ్జువు వంటిది. ఈవిధముగా ప్రణవమును తెలిసి కొని ఆత్మధ్యానము నొందును.

'సర్వమునకు హృదయస్థ మయిన ఈశ్వరునిగా ప్రణవ మును తెలిసికొనవలెను. సర్వవ్యాపి యగు ఓంకారరూపా త్మను భావించిన ధీరుడు శోకింపడు.

'అమాత్రః - తురీయమైన ఓంకారము ఇంతటిదని పరిచ్ఛేదింప శక్యము కానిది. సర్వద్వైతోపశమ మగుటచే ఇట్టిదానినిగా తెలిసికొని పరమార్థతత్త్వమననము వలన ముని యనబడును.

'బ్రహ్మ, వాయువు, ఆత్మ, సత్యము, సర్వము, ఓంకా రము- అని 'ఓంతద్బ్రహ్మ' ఇత్యాది శ్రుతులు చెప్పుచున్నవి.

శం.భా. :- "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్॥"
"యదక్షరం వేదవిదో వదన్తి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥"
(గీతా-8-11-13)

బ్రహ్మప్రతిపాదకమగు ఓంకారము నుచ్చరించుచు ఆ ఓంకారమునకు అర్థమైన నన్ను అనుచిన్తన చేయుచు దేహ త్యాగము చేసి వెళ్లువాడు పరమగతిని పొందును.

దేనిని వేదవిదులు అక్షరము - అవినాశి యని చెప్పు చున్నారో, విరాగులైన సంన్యాసులు దేనిని ప్రవేశించు

చున్నారో, దేనిని కోరి బ్రహ్మచర్యము నవలంబించుచున్నారో, ఆ ప్రాప్యమును సంక్షేపించి చెప్పెదను, అని గీతలో భగవంతు డుపదేశించెను.

శం.భా. :- "రసోఽహ మప్సు కౌన్తేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః,
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥
"మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేక మక్షరమ్.
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥"
(గీతా)

గీతలో పరమాత్మ ఇట్లు తన యాత్మరూపమును 'ఉదకములలో మధురరసము నేను; సూర్యచంద్రులయందలి దీప్తిని నేను; సర్వవేదములలో ప్రణవము నేను. అకాశమందు శబ్దము నేను. నరులయందు పౌరుషము నేను' అనియు,

'మహర్షులలో భృగువు నేను, వాక్కులలో 'ఏకమక్షరమ్' ఓంకారము నేను, యజ్ఞములలో జపయజ్ఞము నేను, స్థావరములలో హిమాలయము నేను' అనియు చెప్పెను.

శం.భా. :- "ఆద్యం చ త్ర్యక్షరం బ్రహ్మ త్రయీ యస్మిన్ప్రతిష్ఠితా.
ఏకాక్షరం పరం బ్రహ్మ ప్రాణాయామః పరంతపః"॥ (అత్రి)

త్ర్యక్షరమైన బ్రహ్మ ఆద్యము. దానియందు వేదము ప్రతిష్ఠితమై యున్నది. ఏకాక్షరమగు ప్రణవము పరబ్రహ్మ, ప్రాణాయామము పరమ తప మని అత్రివచనము వలన తెలియును.

శం.భా. :- "ప్రణవాద్యా స్త్రయో వేదాః ప్రణవే పర్యవస్థితాః
వాఙ్మయం ప్రణవం సర్వం తస్మాత్ప్రణవ మభ్యసేత్" ॥
(అత్రి)

ప్రణవము ఆద్యముగా కలిగి, ఋగ్యజుస్సామాత్మక మంత్రరూప వేదములు ప్రణవమందు పర్యస్థితములు. వాఙ్మయ మంతయు ప్రణవమే. కాన, ప్రణవము నభ్యసింపవలెను.

శం భా. :- ఇత్యాది స్మృతేశ్చ విశ్వశబ్దే నోంకారోఽభిధీయతే-వాచ్య వాచకయో రత్యన్తభేదాభావాత్. విశ్వమిత్యోంకార ఏవ బ్రహ్మేత్యర్థః ॥

ఇత్యాది స్మృతివచనముల వలన కూడ శ్లోకములోని 'విశ్వ' శబ్దము చేత ఓంకారము ప్రతిపాదింపబడుచున్నది. వాచ్యమైన బ్రహ్మకు, వాచకమైన ఓంకారమునకు అత్యంత భేదము లేదు. కనుక, విశ్వ మనగా ఓంకారమే. అదియే బ్రహ్మ యని అర్థము.

శం. భా. :- ''సర్వం ఖల్విదం బ్రహ్మ'' తజ్జలానితి శాన్త ఉపాసీత''
ఇతి- (ఛాన్దోగ్యమ్)

ఏతదుక్తం భవతి - యస్మాత్సర్వమిదం వికారజాతం బ్రహ్మ. తజ్జత్వా త్తల్లయత్వా త్తదనత్వాచ్చ. న చ సర్వస్యైకాత్మత్వే రాగాదయ స్సంభవన్తి: 'తస్మా చ్ఛాన్త ఉపాసీత' । ఇతి శ్రుతేః.

ఈ వికారజాతము సర్వము, బ్రహ్మయే: బ్రహ్మనుండి పుట్టి, బ్రహ్మ యందు లయమై, బ్రహ్మచే జీవించుచుండుట వలన ఈ వికారజాత మంతయు బ్రహ్మయే, యని తెలియ నగును. ఇట్లు సర్వము, ఏకాత్మక మగుటచే రాగాదులు సంభ వింపవు. కావున, శాన్తుడై ఉపాసింపవలె నని ఛాందోగ్య శ్రుతి చెప్పుచున్నది.

శం. భా. :-

"శ్రూయతాం ధర్మసర్వస్వం శ్రుత్వా చైవాఽవధార్యతామ్ ।
ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్ ॥" (విష్ణుధర్మ)

"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః " (గీతా)
"నిర్గుణః పరమాత్మాఽత్ర దేహే వ్యాప్య వ్యవస్థితః ।
తమహం జ్ఞానవిజ్ఞేయం నావమన్యే న లంఘయే ॥
యద్యాగమై ర్నవిన్దేయం తమహం భూతభావనం ।
క్రమేయం త్వాం గిరిం చేమం హనుమానివ సాగరమ్ ॥" (వన పర్వ)
"బద్ధవైరాణి భూతాని ద్వేషం కుర్వన్తి చేత్తతః ।
శోచ్యాన్యహోఽతిమోహేన వ్యాప్తానీతి మనీషిణామ్ ॥
ఏతే భిన్నదృశాం దైత్యా వికల్పాః కథితా మయా ।
కృత్వాఽభ్యుపగమం తత్ర సంక్షేప శ్రూయతాం మమ ॥
విస్తార స్సర్వభూతస్య విష్ణో స్సర్వమిదం జగత్ ।
ద్రష్టవ్య మాత్మవ త్తస్మా దభేదేన విచక్షణైః ॥
సముత్సృజ్యాసురం భావం తస్మా ద్యూయం తథా వయమ్ ।
తథా యత్నం కరిష్యామో యథా ప్రాప్స్యామ నిర్వృతిమ్ ॥
సర్వత్ర దైత్యా స్సమతా ముపేతసమత్వ మారాధన మచ్యుతస్య
న షన్తాపాదికృత స్తాత పచ నైసర్గికో మమ ।
ప్రభావ ఏష సామాన్యో యస్య యస్యాఽచ్యుతో హృది ॥
అన్యేషాం యో న పాపాని చిన్తయ త్యాత్మనో యథా ।
తస్య పాపాగమ స్తాత హేత్వభావా న్నవిద్యతే ॥
కర్మణా మనసా వాచా పరపీడాం కరోతి యః ।
తద్బీజం జన్మ ఫలతి ప్రభూతం తస్య చాఽశుభమ్ ॥"

విష్ణుధర్మములో నిట్లున్నది- 'ధర్మసర్వస్వమును విని అవధరింపుడు. ఏవి తనకు దుఃఖకరములో వానిని పరులకు చేయకూడదు'. 'తన కేది సుఖకరమో, అది సర్వత్ర సుఖకర

మరియు, తనకేది దుఃఖకరమో అది సర్వత్ర దుఃఖకరమే అనియు సర్వమును తనతో సమానముగా భావించువాడు పరమయోగి, అనియు గీతలో చెప్పబడినది.

మహాభారతవనపర్వమున హనుమద్భీమ సంవాదములో అజ్ఞాతముగా నున్న హనుమంతునితో భీమసేను డిట్లనెను- 'నిర్గుణ పరమాత్మ ఈ నీ దేహమందు వ్యాపించి యుండెను. జ్ఞానగమ్యమై యున్న ఆ పరమాత్మను నేను అవమానించు వాడను కాను. కావున, నన్ను దాటి వెళ్ళు మని నీవనినను నేను లంఘింపను, శాస్త్రములచేత నా పరమాత్మను తెలిసి కొనకున్నచో హనుమంతుడు సాగరమును లంఘించి యున్నట్లు నేను నిన్ను, ఈ గిరిని, లంఘించెడివాడనే'.

ప్రహ్లాదుడు దైత్యులకు ఈ రీతిగ నుపదేశించెను- 'భూతములు బద్ధవైరము కలిగి ద్వేషించుచున్నచో అతిమోహముతో వ్యాప్తములైనవని జ్ఞానులకు శోచనీయము లగును, 'దైత్యులారా! భిన్నదృష్టికలవారి అభిప్రాయములను చెప్పితిని. ఇపుడు నేను సంక్షేపముగా దానిని చెప్పుచున్నాను. వినుడు, 'ఈ జగత్తంతయు సర్వభూతాత్మకుడగు విష్ణువు యొక్క విస్తారము. అందువలన అభేదదృష్టితో ఆత్మ (తాను) వలెనే ద్రష్టవ్యము.

'కావున, ఆసురభావమును విడిచి' మీరును మేమును నిర్వృతిని ఎట్లు పొందుదుమో ఆ రీతిగ ప్రయత్నము చేయుదము' 'దైత్యులారా! సర్వత్ర సమత్వము వహింపుడు. ఆ సమత్వమే అచ్యుతుని ఆరాధన' 'నాలో నున్నది మన్త్రాదిమూలక

ప్రభావము కాదు, నైసర్గికమైనదియు కాదు, ఎవరెవరి హృదయ మందు అచ్యుతుఁడుండునో వారికందరకు సామాన్యమైనదే ఇది, 'ఎవడు అన్యుల పాపములను చింతింపకుండునో అతనికి పాపము ప్రాప్తింపదు' 'ఎవడు మనోవాక్కాయములచేత పరులను పీడించునో, ఆ పరపీడనము బీజముగా గలవాని జన్మ, అధికమైన అశుభఫలము నిచ్చుచుండును.

వి. భా. :-

"సోఽహం న పాప మిచ్ఛామి న కరోమి వదామి వా ।
చిన్తయన్ సర్వభూతస్థ మాత్మన్యపి చ కేశవమ్ ॥
శారీరం మానసం వాగ్జం దైవం భూతభవం తథా ।
సర్వత్ర సమచిత్తస్య తస్య మే జాయతే కుతః ॥
ఏవం సర్వేషు భూతేషు భక్తి రవ్యభిచారిణీ ।
కర్తవ్యా పండితైర్ జ్ఞాత్వా సర్వభూతమయం హరిం ॥
సామ చోపప్రదానం చ భేదదండౌ తథా పరౌ ।
ఉపాయాః కథితా హ్యేతే మిత్రాదీనాం చ సాధనే ॥
తానేవాఽహం న పశ్యామి మిత్రాదీం స్తాత మా క్రుధః ।
సాధ్యాభావే మహాబాహో సాధనైః కిం ప్రయోజనమ్ ॥
సర్వభూతాత్మకే తాత జగన్నాథే జగన్మయే ।
పరమాత్మని గోవిన్దే మిత్రాఽమిత్రకథా కుతః ॥
జడానా మవివేకానా మశూరాణామపి ప్రభో ।
భాగ్యభోగ్యాని రాజ్యాని సన్త్యనీతిమతామపి ॥
తస్మాద్యతేత పుణ్యేషు య ఇచ్ఛే న్మహతీం శ్రియం ।
యతితవ్యం సమత్వే చ నిర్వాణమపి చేచ్ఛతా ॥
దేవా మనుష్యాః పశవః పక్షి వక్షృ సరీసృపాః ।

రూపమేత దనన్తస్య విష్ణో ర్భిన్నమివ స్థితమ్ ॥
ఏతద్విజానతా సర్వం జగత్ స్థావరజంగమమ్ ।
ద్రష్టవ్య మాత్మవ ద్విష్ణు ర్యతోఽయం విశ్వరూపధృక్ ॥
ఏవం జ్ఞాతే స భగవా ననాదిః పరమేశ్వరః ।
ప్రసీద త్యచ్యుత స్తస్మిన్ ప్రసన్నే క్లేశసంక్షయః ॥'' (విష్ణు-పు)

'దైత్యులారా! నేను పాపమును కోరను; చేయను; చెప్పను; సర్వభూతములయందును, నాయందును ఉన్న భగవంతుని చింతించుచున్నవాడను. కావున, సర్వత్ర సమచిత్తుడ నయి యున్న నాకు దుఃఖము, కాయికముగా గాని, మానసికముగా గాని, వాచికముగా గాని, దైవికముగా గాని, భౌతికముగా గాని, ఎట్లు కలుగును? ఇట్లు హరి, సర్వభూతమయు డని తెలిసికొని సర్వభూతములయందు నియతమగు భక్తి కలిగి యుండవలెను.

ఇక ప్రహ్లాదుడు తండ్రితో నిట్లు పలికెను- 'సామదాన భేదదండము లను ఉపాయములు మిత్రులను అమిత్రులను సాధించుటకై చెప్పబడినవి. నా దృష్టికి మిత్రులనియు అమిత్రులనియు గోచరించుటే లేదు. తండ్రీ! కోపింపకుము. మిత్రామిత్రరూపమైన సాధ్యము లేనప్పుడు సాధనములతో పని యేమి?

'సర్వభూతాత్మకుడు, జగన్మయుడు, జగన్నాథుడు, పరమాత్మ యగు గోవిందుని యందు, తండ్రీ! మిత్రామిత్ర కథ ఎట్లు?' 'జడులు, అవివేకులు, అయి యుండి శూరులు, నీతిమంతులు కానట్టివారికి రాజ్యములు, భాగ్యభోగ్యము లగు

చున్నవి. (అక్కడ వారి పూర్వపుణ్యావిశేషమే కారణము; కనుక, మహైశ్వర్యమును కోరువాడు పుణ్యమార్జింప ప్రయత్నింపవలెను.) 'దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు, వృక్షములు, సర్పములు ఇవి యవి యననేల? ఈ రూపప్రపంచమంతయు, అనన్తుడగు విష్ణువు యొక్క రూపమే. భిన్నము వలె నున్నది' 'ఈ సత్యము తెలిసినవాడు స్థావరజంగమాత్మకమయిన సర్వజగత్తును విశ్వరూపధారి విష్ణువగుటచే ఆత్మతుల్యముగా దర్శింపవలయును. ఇట్టి జ్ఞానము కలిగినపుడు ఆదిరహితుడు, భగవానుడు నగు ఆ పరమేశ్వరుడు ప్రసన్నుడగును. ఆయన ప్రసన్నుడగుటతో సకల క్లేశనాశన మగును.

శం. భా. :-

"బహూనాం జన్మనా మన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥" (గీతా)

ఇత్యాది వచనైశ్చ. హింసాదిరహితేన స్తుతి నమస్కారాది కర్తవ్యమితి దర్శయితుం విశ్వ శబ్దేన బ్రహ్మ అభిధీయతే ఇతి వా ।

"మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః ।
నిర్వైర స్సర్వభూతేషు య స్స మామేతి పాండవ ॥" (గీతా)

"న చలతి నిజవర్ణధర్మతోయః సమమతి రాత్మసుహృద్విపక్షపక్షే ।
న హరతి న చ హన్తి కించి దుచ్చైః స్థిత మనసం తమవేహివిష్ణుభక్తమ్॥
విమలమతి రమత్సరః ప్రశాన్తః శుచిచరితోఽఖిల సత్త్వమిత్రభూతః ।
ప్రియహితవచనోఽస్తమానమాయో వసతి సదా హృదితస్య వాసుదేవః॥
వసతి హృది సనాతనే చ తస్మిన్ భవతి పుమాన్ జగతోఽస్య సౌమ్యరూపః ।
క్షితిరసమతిరమ్యమాత్మనోఽన్తః కథయతి చారుతయైవ శాలపోతః ॥

సకల మిదమహం చ వాసుదేవః పరమపుమాన్ పరమేశ్వర స్స ఏకః ।
ఇతిమతి రచలా భవత్యనన్తే హృదయగతే వ్రజ తాన్విహాయ దూరాత్ ॥
యమనియమ విధూతకల్మషాణామ్ అనుదిన మచ్యుతస క్తమానసానామ్।
అపగతమదమానమత్సరాణామ్ వ్రజ భటదూరతరేణ మానవానామ్ ॥"

(విష్ణు. పు.)

ఇత్యాది వచనైః వైష్ణవలక్షణస్యైవం ప్రకారత్వాచ్చ హింసాది రహితేన విష్ణోః స్తుతినమస్కారాది కర్తవ్య మితి.

బహుజన్మల అంతమందు 'సర్వము వాసుదేవ పరమాత్మయే', అను జ్ఞానము కలవాడై నన్ను పొందుచున్నాడు. అట్టి మహాత్ముడు దుర్లభుడు.

ఇత్యాది వచనములచేత హింసాదిరహితుడయి స్తుతి నమస్కారాదికము చేయవలయు ననుటకై భీష్మోక్తశ్లోకము లోని 'విశ్వ' శబ్దము బ్రహ్మను ప్రతిపాదించుచున్న దనవచ్చును.

'సర్వభూతములందు నిర్వైరుడై, నాకు చెందిన కర్మనే చేయుచు నాయందే పరమ తాత్పర్యము కలిగి నా భక్తుడై ఎవ్వడు సంగవర్జితుడై యుండునో అతడు అర్జునా! నన్ను పొందును.

'తన వర్ణధర్మమును విడువనివాడై శత్రుమిత్రపక్షములయందు సమదృష్టి కలవాడై ఒకని సొత్తు హరింపక, ఎవ్వరిని హింసింపక ఉదారమనస్కుడై ఎవడుండునో వానిని విష్ణుభక్తునిగ తెలిసికొనుము' 'నిర్మల మయిన బుద్ధి కలిగి మాత్సర్యము లేక, ప్రశాంతుడు, పవిత్రచరిత్రుడు, సర్వభూతమైత్రి కలవాడు, ప్రియహితవచనుడు, కపట మెరుగనివాడునై

వర్తించునో వాని హృదయమందు వాసుదేవ పరమాత్మ సదా, వసించును. 'ఆ సనాతనపరమాత్మ ఎవని హృదయమందు వసించుచుండునో, అతడు ఈ జగత్తునకు సౌమ్యమూర్తియై గోచరించుచుండును. చిన్న సాలవృక్షము సుందరముగ దర్శనీయమై యుండి తనయందు అన్తర్గతమై యున్న భూసారమును ప్రకటించుచున్నరీతిగ వాని ఆ సౌమ్యరూపమే వానియందు అన్తర్గతమై యున్న ఆపరమాత్మ స్థితిని ప్రకటించుచుండును. 'ఆ పరమాత్మ, హృదయగతుడై యుండగా ఈ సకలజగత్తు నేనును వాసుదేవపరమాత్మయే, ఆ పరమేశ్వరుడు అద్వితీయుడు, అను నిశ్చలమైన బుద్ధి ఎవరికుండునో వారిని విడిచి దూరముగా వెళ్ళుడు.

'యమ - నియమముల చేత కల్మషరహితులై అనుదినము అచ్యుతునియందు లగ్నమనస్కులై మద-మాన-మత్సర-విరహితులై యుండు మానవులకు అతిదూరముగా వెళ్ళుడు, అని యమధర్మరాజు తన భటులను ఆదేశించి యుండెను' అని విష్ణుపురాణ వచనములను బట్టి తెలియును. 'న చలతినిజవర్ణధర్మతో యః' 'త మవేహి విష్ణుభక్తమ్' అను విధముగ వైష్ణవ లక్షణములు కలవాడై హింసారహితుడై విష్ణువుయొక్క స్తుతి - నమస్కారాదికము చేయవలెనని గ్రహింపవలయును.

శం. భా. :- 'శ్రద్ధయా దేయమ్. అశ్రద్ధయాఽదేయమ్' 'శ్రద్ధయాగ్నిస్సమిధ్యతే' ఇత్యాది శ్రుతేః । 'శ్రద్ధాపూతం వదాన్యస్య హత మశ్రద్ధయేతరత్' (శాన్తి) 'ఇమం స్తవ మధీయానః శ్రద్ధాభక్తిసమన్వితః'.

అశ్రోత్రియం శ్రాద్ధ మధీత మవ్రత
మదక్షిణం యజ్ఞ మనృత్విజా హుతమ్ ।
అశ్రద్ధయా దత్త మసంస్కృతం హవి
ర్భాగా షడేతే తవ దైత్యసత్తమ ॥
పుణ్యం మద్ద్వేషిణాం యచ్చ మద్భక్తద్వేషిణాం తథా ।
క్రయవిక్రయసక్తానాం పుణ్యం యచ్చాగ్నిహోత్రిణామ్ ॥
అశ్రద్ధయా చ యద్దానం యజతాం దదతాం తథా ।
తత్సర్వం ఏవ దైత్యేన్ద్ర మత్ప్రసాదా ద్భవిష్యతి ॥ (హరివంశ)
అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అస దిత్యుచ్యతే పార్థ న చ తత్ ప్రేత్య నో ఇహ ॥

ఇత్యాది స్మృతిభిశ్చ శ్రద్ధయా స్తుతినమస్కారాదిక ర్తవ్య మశ్రద్ధయా న కర్తవ్యమ్ 'ఓం తత్సతిది నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః ఇతి భగద్వచనాత్ స్తుతినమస్కారాదికం కర్మ అసాత్త్వికం విగుణమపి శ్రద్ధాపూర్వకం బ్రహ్మణోఽభిధానత్రయప్రయోగేణ సగుణం సాత్త్వికం సంపాదితం భవతి.

దానము శ్రద్ధతో చేయవలెను; అశ్రద్ధతో చేయరాదు. అగ్ని శ్రద్ధతో నుపాసింపబడి ప్రజ్వలించును.' ఇత్యాది శ్రుతి వచనముల చేతను. 'దాతయొక్క దానము శ్రద్ధ చేత పవిత్రము- అను శాంతిపర్వమందలి వచనము చేతను 'ఈ విష్ణు సహస్రనామ స్తవము శ్రద్ధాభక్తులతో అధ్యయనము చేయతగినది' 'శ్రోత్రియరహిత శ్రాద్ధము, వ్రతవిహీనాధ్యయనము, దక్షిణాహీన యజ్ఞము, ఋత్విక్కుకానివాడు చేయు హోమము అశ్రద్ధతో చేయుదానము, అసంస్కృతమైన హవిస్సు, ఈ ఆరును బలిదైత్యునకు చెందును, 'నన్ను, నా భక్తులను

ద్వేషించువారియొక్క పుణ్యము, క్రయవిక్రయాసక్తులగు ఆహితాగ్నులపుణ్యము, యజ్వలు, దాతలును అశ్రద్ధతో చేసిన దానము, ఈ సర్వము దైత్యేంద్రుడవగు బలిచక్రవర్తీ! నా అనుగ్రహమున నీకు ప్రాప్తించును' అను హరివంశవచనముల చేతను 'హోమము కాని, దానముకాని, తపము కాని, మరి యేదియైనను అశ్రద్ధతో చేసినది 'అసత్'అని చెప్పబడును, అట్టిది ఇహమునకు గాని, పరమునకు గాని, యుపయోగింపదు- అని చెప్పుచున్న స్మృతుల చేతను, శ్రద్ధతోనే స్తుతినమస్కారాది కము చేయవలెను; అశ్రద్ధతో చేయరాదు, అని తెలియును. 'ఓమ్ తత్ సత్, అని బ్రహ్మయొక్క నిర్దేశము లనుచున్న భగవద్వచనమునుబట్టి స్తుతినమస్కారాదికర్మ అసాత్త్వికమయినను, విగుణ మయినను, శ్రద్ధాపూర్వకముగ బ్రహ్మవాచకములగు పై మూడు పదముల నుప్రయోగించుటచే ఆ కర్మ సగుణము, సాత్త్వికము అగు నని తెలియనగును.

శం. భా. :- 'ఆత్మానం విష్ణుం ధ్యాత్వాఽర్చనస్తుతి నమస్కారాది కర్తవ్యమ్.

''నాఽవిష్ణుః కీర్తయే ద్విష్ణుం నాఽవిష్ణు ర్విష్ణు మర్చయేత్ ।
నాఽవిష్ణు స్సంస్మరే ద్విష్ణుం నాఽవిష్ణు ర్విష్ణు మాప్నుయాత్ ॥''
ఇతి మహాభారతే కర్మకాండే

''సర్వాణ్యేతాని నామాని పరస్య బ్రహ్మణోఽనఘ ॥'' (విష్ణుధర్మ)

''యం యం కామ మభిధ్యాయే త్తం తమాప్నో త్యసంశయమ్ ॥''

సర్వకామా నవాప్నోతి సమారాధ్య జగద్గురుమ్ ।
తన్మయత్వేన గోవిన్ద మిత్యేత ద్దాల్భ్య నాన్యథా ॥

తన్మయో వాంఛితాన్ కామాన్ సదవాప్నోతి మానవః ॥” ఇతి (విష్ణుధర్మే)
“సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥” ఇతి
(భగవద్గీతాసు)
“అహం హరి స్సర్వ మిదం జనార్దనో నాన్య త్తతః కారణకార్యజాతమ్ ।
ఈదృఙ్మనో యస్య న తస్య భూయో భవోద్భవా ద్వన్ద్వగతా భవన్తి॥”
(ఇతి విష్ణుపురాణే)
“గురో ర్యత్ర పరీవాదో నిన్దా వాఽపి ప్రవర్తతే ।
కర్ణౌ తత్ర పిధాతవ్యౌ గన్తవ్యం వా తతోఽన్యతః ॥” (విష్ణుధర్మే)
“తస్మా ద్బ్రహ్మో వాచార్యస్వరూపే ణావతిష్ఠతే ।” ఇతి ( స్మృతేః)
“వరం హుతవహజ్వాలాపుంజస్యా న్తర్వ్యవస్థితిః ।
న శౌరిచిన్తావిముఖజనసంవాసవైశసమ్ ॥”

ఇతి కాత్యాయనవచనాత్ యత్ర దేశే వాసుదేవనిన్దా తత్ర వాసో న కర్తవ్యః.

“యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥”

ఇతి శ్వేతాశ్వతరోపనిష న్మన్త్రవర్ణాత్ హరౌ గురౌ చ పరా భక్తిః కార్యేతి.

తనను, విష్ణువుగా ధ్యానించి అర్చన — స్తుతి - నమస్కారాదికము చేయవలెను. కనుకనే తనను విష్ణువుగా భావింపక, విష్ణువును కీర్తించుట, విష్ణువు నర్చించుట, విష్ణువును స్మరించుట, విష్ణువును పొందుట, సంభవింపదు- అని మహాభారతమందలి కర్మకాండ వచనము చెప్పుచున్నది. ‘ఈ నామము లన్నియు పరబ్రహ్మమును చెందినవే, అని విష్ణుధర్మోత్తరములో

చెప్పబడినది. మరియు 'జగద్గురువగు పరమాత్మ నారాధించిన వాడు కోరినదంతయు నిస్సంశయముగ పొందును, తన్మయత్వముతో గోవిన్దు నారాధించి సర్వవాంఛితములను పొందును- అని విష్ణుధర్మవచనము వలన తెలియుచున్నది.

సర్వభూతస్థితుడ నగు నన్ను, ఏకత్వమును పొంది భజించువాడు యోగి; ఆత డెట్లు వర్తించుచున్నను, నాయందే వర్తించుచుండును- అని భగవద్గీత చెప్పుచున్నది.

ఆ శ్రీహరియే నేను; ఈ సర్వప్రపంచము ఆ జనార్దనుడే; కార్యకారణజాత మంతయు ఆయన కంటె వేరుగా లేదు- అని యిట్టి మనస్సు కలవానికి సంసారసంబన్ధములైన ద్వంద్వములను వ్యాధులు మరల సంభవింపవు- అని విష్ణుపురాణమందు చెప్పబడినది.

'గురువును తిరస్కరించుట నిందించుట జరుగుచున్నపుడు చెవులు మూసికొనవలయును. లేదా అక్కడి నుండి లేచిపోవలయును- అని విష్ణుధర్మవచనము ఆదేశించుచున్నది.

'బ్రహ్మయే ఆచార్యస్వరూపమున నుండె' నని స్మృతి చెప్పుచున్నది.

'శ్రీహరిచిన్తావిముఖులగు జనులతో కలిసియుండుట కంటె అగ్నిజ్వాలల మధ్య నుండుట కొంత మంచిది'- అను కాత్యాయన వచనానుసారము వాసుదేవనింద జరిగెడి చోట వసింపరాదు- అని గ్రహింపవలయును.

'ఎవనికి శ్రీహరియందు పరమభక్తియో, శ్రీహరి యందు వలెనే గురువునందును పరమభక్తియో వానికి చెప్ప బడిన యావద్విషయములు ప్రకాశించుచుండును- అను శ్వేతాశ్వతరోపనిష ద్వచనానుసారము హరియందును గురువు నందును పరమభక్తి కలిగి యుండవలెను.

శం. భా.- "అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః ।
పుమా విముచ్యతే సద్యః సింహత్రస్తైః మృగై రివ ॥" (విష్ణు)
జ్ఞానతోఽజ్ఞానతో వాఽపి వాసుదేవస్య కీర్తనాత్ ।
తత్సర్వం విలయం యాతి తోయస్థం లవణం యథా ॥
కలికల్మష మత్యుగ్రం నరకార్తిప్రదం నృణామ్ ।
ప్రయాతి విలయం సద్యః సకృత్ కృష్ణస్య సంస్మృతేః ॥" (విష్ణు)
"సకృత్స్మృతోఽపి గోవిన్దో నృణాం జన్మశతైః కృతమ్ ।
పాపరాశిం దహ త్యాశు తూలరాశి మివాఽనలః ॥
సేయం వదనవల్మీకవాసినీ రసనోరగీ ।
యా న గోవిన్ద గోవిన్ద గోవిన్దేతి ప్రభాషతే ॥
పాపవల్లీ ముఖే తస్య జిహ్వారూపేణ తిష్ఠతి ।
యా న వక్తి దివారాత్రౌ గుణాన్ గోవిందసంభవాన్ ॥
సకృదుచ్చరితం యేన హరి రిత్యక్షరద్వయమ్ ।
బద్ధః పరికర స్తేన మోక్షాయ గమనం ప్రతి ॥" (ప. ద్మపు)
"ఏకోఽపి కృష్ణస్య కృతః ప్రణామో
దశాశ్వమేధావభృథేన తుల్యః ।
దశాశ్వమేధీ పునరేతి జన్మ
కృష్ణప్రణామీ న పునర్భవాయ ॥" (శాంతిపర్వ)

ఏవమాదివచనైః శ్రద్ధాభక్త్యో రభావేఽపి నామసంకీర్తనం సమస్తం దురితం నాశయతీ త్యుక్తమ్ కిముత శ్రద్ధాదిపూర్వకం సహస్రనామ సంకీర్తనం నాశయతీతి.

"మనసా నా అగ్రే సంకల్పయ త్యథ వాచా వ్యాహరతి. 'యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా వదతి' ఇతిశ్రుతిభ్యాం స్మరణం ధ్యానం చ నామసంకీర్తనేఽన్తర్భూతమ్".

"యస్మిన్న్యస్తమతి ర్నయాతి నరకం స్వర్గోఽపి యచ్చిన్తనే ।
విఘ్నో యత్ర నివేశితాత్మమనసో బ్రాహ్మోఽపి లోకోఽల్పకః ॥
ముక్తిం చేతసి యః స్థితోఽమలధియాం పుంసాం దదా త్యవ్యయః ।
కిం చిత్రం యదఘం ప్రయాతి విలయం తత్రాఽచ్యుతే కీర్తితే ॥"

ఇతి విష్ణుపురాణాన్తే శ్రీపరాశరేణోపసంహృతమ్.

"ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునఃపునః
ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణ స్సదా ॥"

ఇతి శ్రీమహాభారతాన్తే భగవతా శ్రీవేదవ్యాసేనోపసంహృతమ్.

"హరిరేక స్సదా ధ్యేయో భవద్భి స్సత్త్వసంస్థితైః ।
ఓమిత్యేవం సదా విప్రాః పఠత ధ్యాత కేశవమ్ ॥"

ఇతి హరివంశే కైలాసయాత్రాయాం హరిరేకో ధ్యాతవ్య ఇత్యుక్తం. మహేశ్వరేణాపి ఏతత్సర్వ మభిప్రేత్య 'ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః' ఇత్యాధిక్య ముక్తమ్.

"అవశుడయి భగవన్నామము కీర్తించినను సింహామునకు భయపడి పలాయనము చేయు తోడేళ్ల వలె తత్క్షణము పాతకములు పోవును; జ్ఞానముతో గాని అజ్ఞానముతో గాని చేసిన వాసుదేవకీర్తనము వలన పాతక మంతయు నీటిలో లవణము

వలె అంతరించును, అత్యుగ్రము నరకదుఃఖప్రదము నగు కలి
కల్మషము ఒక్కసారి చేసిన శ్రీకృష్ణసంస్మరణము వలన వెంటనే
హరించిపోవును." అని విష్ణుపురాణవచనములు నామసంకీర్తన
మాహాత్మ్యమును వివరించినవి.

"గోవిందుని సకృత్స్మరణము, మనుజులజన్మశతకృతమగు
పాపరాశిని అగ్ని తూలరాశిని దహించు రీతిగ దహించును";
"ఎవ్వని జిహ్వా గోవిన్దనామమును కీర్తింపకుండునో అది వాని
వదనమను వల్మీకము (పుట్ట)లో నున్న సర్పమే, ఎవ్వని జిహ్వా
అహోరాత్రములు గోవిందగుణగానము చేయకుండునో అది
వాని ముఖమందు జిహ్వారూపమున నున్న పాపవల్లియే, 'హరి
అను అక్షరద్వయము ఒక్కసారి ఎవనిచే నుచ్చరింపబడునో
ఆతడు మోక్షగమనమునకు సామగ్రిని సంపాదించి యున్నవా
డగును- అని పద్మపురాణవచనముల వలన తెలియుచున్నది.

శ్రీకృష్ణునకు చేసిన ఒక వందనము కూడ దశాశ్వమేధావ
భృథతుల్యఫల మిచ్చును. దశాశ్వమేధములు చేసినవాడు మరల
జన్మించును. శ్రీకృష్ణప్రణామము చేసినవాడు మాత్రము
మరల జన్మింపడు- అని భారతవచము తెలియ చేయుచున్నది.

ఈ విధముగా నున్న వచనములచేత శ్రద్ధాభక్తి రహిత
ముగ చేసిన నామసంకీర్తనము వలన కూడ, సమస్తదురితము
నశించు నని చెప్పబడినది. ఇక శ్రద్ధాభక్తిపూర్వకముగ చేసిన
సహస్రనామసంకీర్తనము వలన దురితనాశన మగునని చెప్ప
నేల!

'మొదట మనస్సుచేత సంకల్పించిన తరువాత వాక్కుతో చెప్పును'- దేనిని మనస్సుతో ధ్యానించునో దానిని వాక్కుతో చెప్పును, అను శ్రుతులచే చెప్పబడిన స్మరణము ధ్యానము - ఈ రెండును నామసంకీర్తనములో అన్తర్భూతములని తెలియ నగును.

'ఏ పరమాత్మయందు లగ్నమైన మనస్సు కలవాడు నరకమును పొందడో, ఏపరమాత్మచిన్తనములో స్వర్గముకూడ విఘ్న మగునో, ఏ పరమాత్మ యందు ఏకాగ్రచిత్తము కల వానికి బ్రహ్మలోకము కూడ అల్పమే అగునో, ఏ పరమాత్మ శుద్ధాన్తఃకరణుల చిత్తమునందుండి ముక్తి నిచ్చుచుండునో, ఆ పరమాత్మయొక్క సంకీర్తనము చేత పాపనాశ మగుటలో ఆశ్చర్య మేమున్నది?' అని విష్ణుపురాణాన్తమందు శ్రీపరాశర మహర్షి చేత ఉపసంహారము చేయబడినది.

'సర్వశాస్త్రములను ఆలోచన చేసి పునఃపునః విచారించి చూడగా, సదా సదా నారాయణధ్యానము కర్తవ్యము- అను విషయ మొక్కటియే నిష్పన్న మయినది'- అని శ్రీమహాభారతాన్తమందు, వేదవ్యాసభగవానుని చేత ఉపసంహారము చేయబడినది.

'సాత్త్వికులగు మీచేత ఎల్లప్పుడును హరియొక్కడే ధ్యానింపదగినవాడు, విప్రులారా! సదాప్రణవమును పఠింపుడు కేశవుని ధ్యానింపుడు'- అని హరివంశము యందలి కైలాస యాత్ర వర్ణనలో 'హరి యొక్కడే సదా ధ్యేయు' డని

మహేశ్వరునిచే కూడ చెప్పబడినది. దీనినంతను మనస్సునందుంచుకొని 'ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః' అని భీష్మునిచే హరినామసంకీర్తనము యొక్క యాధిక్యము చెప్పబడినది.

శం. భా. :- కిమేకం దైవతమ్ ఇత్యారభ్య కిం జపన్ ముచ్యతే జన్తుః ఇతి షట్ప్రశ్నేషు యతస్సర్వాణి ఇతి ప్రశ్నోత్తరాభ్యాం యద్బ్రహ్మోక్తం తద్విశ్వశబ్దేనోచ్యతే ఇతి వ్యాఖ్యాతమ్.

తత్కిమిత్యాకాంక్షాయా మాహ- 'విష్ణుః' ఇతి తథా చ ఋగ్వేదే- 'తము స్తోతారః పూర్వ్యం యథావిద ఋతస్య గర్భం జనుషాఽపి పర్తన, అస్య జానన్తో నామ చిద్వివిక్తన మహస్తే విష్ణో సుమతిం భజామహే' (2-2-26) ఇత్యాది శ్రుతిభిః విష్ణోర్నామసంకీర్తనం సమ్యక్ జ్ఞానప్రాప్తయే విహితమ్. తమేవ స్తోతారః పురాణం యథా జ్ఞానేన సత్యస్య గర్భం జన్మ సమాప్తిం కురుత, జానన్తః ఆ అస్య విష్ణోః నామాపి ఆవదత, అన్యే వదన్తు మా వా, హేవిష్ణో, వయం తే సుమతిం శోభనం మహః భజామహే ఇతి శ్రుతే రభిప్రాయః.

"కిమేకం దైవతమ్"అని ఆరంభించి 'కిం జపన్ ముచ్యతే జన్తుః' అనుచు చేయబడిన ఆరు ప్రశ్నములలో 'యతస్సర్వాణి' అని ప్రశ్నోత్తరములచేత ఏ బ్రహ్మ చెప్పబడెనో అది 'విశ్వ' శబ్దము చేత వ్యాఖ్యాత మయినది.

ఆ వ్యాఖ్యాత విషయమే 'విష్ణు' శబ్దము చేత ప్రతిపాదింపబడెను. అది ఋగ్వేదములో నిట్లు చెప్పబడినది-

'విష్ణునామ సంకీర్తనము సమ్యక్ జ్ఞానప్రాప్తి కొఱకు విధింపబడినది. సత్యసారమగు ఆపురాణపురుషుని యథార్థ

జ్ఞానముతో స్తుతించువారయి జన్మసమాప్తిని పొందుడు. ఈ విష్ణువుయొక్క నామములను కూడ తెలిసికొని కీర్తింపుడు, ఓ విష్ణుదేవా! అన్యులు కీర్తించినను కీర్తింపకున్నను మేము నీయొక్క శుభావహమైన తేజస్సును భజించుచున్నాము'- అని శ్రుతియొక్క అభిప్రాయము.

శం. భా. :- వేవేష్టి వ్యాప్నోతీతి విష్ణుః విషేర్వ్యాప్త్యభిధాయినో నుక్ప్రత్యయా న్తస్య రూపం విష్ణు రితి దేశ-కాల-వస్తు-పరిచ్ఛేదశూన్య ఇత్యర్థః,

"వ్యాప్తే మే రోదసీ పార్థ కాన్తి శ్చాభ్యాభ్యధికా స్థితా
క్రమణా చ్చాప్యహం పార్థ విష్ణు రిత్యభిసంహితః ॥"

(ఇతి మహాభారతే- శాన్తి.)

"యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా ।
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥"

(ఇత్యాది శ్రుతేః బృహన్నారాయణే)

"సర్వ భూతస్థ మేకం నారాయణం కారణపురుష మకారణంపరం బ్రహ్మ శోకమోహ వినిర్ముక్తం విష్ణుం ధ్యాయ న్నసీదతి"

(ఇతి ఆత్మబోధోపనిషది)

విశతే ర్వా నుక్ప్రత్యయా న్తస్య రూపం విష్ణు రితి,

"యస్మా ద్విష్ట మిదం సర్వం తస్య శక్త్యా మహాత్మనః ।
తస్మా దేవోచ్యతే విష్ణుః విశే ర్ధాతోః ప్రవేశనాత్ ॥" (ఇతి విష్ణుపురాణే)

౨. విష్ణుః—

విష్ణు శబ్దము వ్యాప్త్యర్థకమైన 'విష్లు' ధాతువు యొక్క 'నుక్' ప్రత్యయాన్తరూపము. దేశ - కాల - వస్తు-

పరిచ్ఛేదశూన్యమైన స్వరూప మని యర్థము.

'నాచేత భూమ్యాకాశములు వ్యాప్తము లగుటచేతను భూనభోంతరాళములు నాచే ఆక్రమింప బడుటచేతను నేను 'విష్ణు' వని చెప్పబడితిని'- అని శాంతి పర్వమునందు 'విష్ణు' శబ్దము నిర్వచింపబడినది.

'దృష్టమగుచున్న జగత్తు, శ్రుతమగుచున్న జగత్తు, ఏది యేది కలదో దానినంతను వ్యాపించియున్నవాడు నారాయణుడు'- అని బృహన్నారాయణ శ్రుతి ప్రతిపాదించినది.

సర్వభూతస్థుడై అద్వితీయుడై నారాయణుడై కారణ పురుషుడై కారణరహితస్వరూపుడై పరబ్రహ్మమై శోక మోహ వినర్ముక్తుడై యొప్పు విష్ణువును ధ్యానించువాడు సద్గతి నొందును- అని ఆత్మబోధోపనిషత్తు విష్ణుస్వరూపమును వివరించెను.

విష్ణుశబ్దము 'విశ' ధాతువుయొక్క 'నుక్' ప్రత్యయాంత రూపము కూడ అగుచున్నది.

'ఈ సకలప్రపంచమున ఆ పరమాత్మశక్తి ప్రవిష్టమై యున్న కారణముచేత ప్రవేశార్థక 'విశ' ధాతువును బట్టి 'విష్ణుః' అని చెప్పబడెను- అనియు విష్ణుపురాణము తెలియజేయు చున్నది.

ఇట్లు సహస్రనామములలో విశ్వం విష్ణు ర్వషట్కారః అను శ్లోకము యందలి 'విశ్వ - విష్ణు' శబ్దములను వ్యాఖ్యానించి 'వషట్కార' శబ్దమును వ్యాఖ్యానించుచున్నారు.

శం. భా. :- యదుద్దేశేనాఽధ్వరే వషట్ క్రియతే స వషట్కారః. యస్మిన్ యజ్ఞే వా వషట్ క్రియా స వషట్కారః. 'యజ్ఞో వై విష్ణుః' ఇతి శ్రుతేః 'యజ్ఞో వషట్కారః' యేన వషట్కారాది మన్త్రాత్మనా వా దేవాన్ ప్రీణయతి స వషట్కారః దేవతా వా. 'ప్రజాపతిశ్చ వషట్కారశ్చ' ఇతి శ్రుతేః. చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభి రేవ చ హూయతే చ పునర్ద్వాభ్యాం స మే విష్ణుః ప్రసీదతు-

(ఇత్యా దిస్మృతేశ్చ)

3. వషట్కారః—

యజ్ఞమందు వషట్ క్రియ ఎవరి నుద్దేశించి చేయబడునో ఆ ఉద్దిష్టస్వరూపము వషట్కార మనబడును.

మరియు, ఏ యజ్ఞమందు వషట్ క్రియ చేయబడునో ఆ యజ్ఞము వషట్కార మనబడును. 'యజ్ఞో వై విష్ణుః' అను శ్రుతిని బట్టి యజ్ఞము వషట్కారము- అని తెలియనగును.

మరియు, ఏవషట్కారాది మన్త్రరూపమున దేవతలను తృప్తిపరచుచుండెనో అది వషట్కార మనబడును.



మరియు, 'ప్రజాపతిశ్చ వషట్కారశ్చ' అను శ్రుతినిబట్టి దేవత వషట్కారము- అని చెప్పనగును.



'నాల్గు నాల్గు అక్షరములు కల 'ఆశ్రావయ' 'అస్తు శ్రౌషట్' రెండక్షరములు కల 'యజ' అయిదక్షములు కల 'యే' యజామహే' మరల, రెండక్షరములు కల 'వషట్' మంత్రములు చేత హూయమానుడగు ఆ విష్ణువు నా యెడల ప్రసన్నుడగు గాక'- యని స్మృతి చెప్పుచున్నది.

శం. భా. :- 'భూతం చ. భవ్యం చ. భవచ్చ' భూతభవ్యభవన్తి. తేషాం ప్రభుః- భూతభవ్యభవత్ప్రభుః, కాలభేద మనాదృత్య సన్మాత్రప్రతి యోగిక మైశ్వర్య మస్యేతి ప్రభుత్వమ్, రజోగుణం సమాశ్రిత్య విరించి రూపేణ భూతాని కరోతీతి భూతకృత్. తమోగుణ మాస్థాయ స రుద్రాత్మనా భూతాని కృన్తతి కృణోతి. హినస్తీతి భూతకృత్. సత్త్వగుణ మధిష్ఠాయ భూతాని బిభర్తి పాలయతి ధారయతి పోషతీతి వా భూతభృత్. ప్రపంచ రూపేణ భవతీతి కేవలం భవతీ త్యేవ వా భావః. భవనం భావః సత్తాత్మకో వా. భూతాత్మా. భూతా న్యా మాత్మా అన్తర్యామీతి భూతాత్మా 'ఏష త ఆత్మా న్తర్యామ్యమృతః' ఇతి శ్రుతేః. భూతాని భావయతి జనయతి వర్ధయతీతి వా భూతభావనః.

౪. భూతభవ్యభవత్ప్రభుః—

భూతము, భవ్యము, (భవిష్యత్) భవత్ (వర్త మానము) వీనికి ప్రభువు కాన 'భూతభవ్యభవత్ప్రభుః' అని చెప్పబడును. పరమాత్మయొక్క ప్రభుత్వము కాలపరిచ్ఛిన్నము లేక సన్మాత్రరూపమైన ఐశ్వర్యము (ఈశ్వరత్వము) కలది.

౫. భూతకృత్ —

రజోగుణము నాశ్రయించి చతుర్ముఖబ్రహ్మరూపమున భూతసృష్టి చేయుచుండుటచేత 'భూతకృత్' అనియు, తమో గుణము నాశ్రయించి రుద్రరూపమున భూతములను 'కృన్తతి' హింసించుచుండుటచేతను 'భూతకృత్' అనియు చెప్పబడును.

౬. భూతభృత్ —

సత్త్వగుణము నాశ్రయించి భూతములను 'బిభర్తి' పాలించుచు పోషించుచుండుటచే 'భూతభృత్' అనిచెప్పబడును.

౭. భావః—

ప్రపంచరూపముతోడను, కేవలస్వస్వరూపముతోడను, ఉన్నవాడు కనుక 'భావ' శబ్దముచే చెప్పబడును. భవనము 'భావ' మగుటచే సత్తాత్మకు డనియు అర్థము.

౮. భూతాత్మా—

భూతములకు ఆత్మ, అన్తర్యామి కాన, 'భూతాత్మా' యని కీర్తింపబడుచున్నాడు. 'నీ ఈ యాత్మ అన్తర్యామి'- అని శ్రుతి చెప్పుచున్నది.

౯. భూతభావనః—

భూతములను పుట్టించుచున్నందుననువృద్ధి నొందించు చున్నందునను 'భూతభావనః'- అని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ 'పూతాత్మా పరమాత్మా చ ముక్తానాం పరమా గతిః।
అవ్యయః పురుషః సాక్షీ క్షేత్రజ్ఞోఽక్షర ఏవ చ ॥ ౧౫

శం. భా. :- భూతకృవాదిభిః గుణత న్త్రిత్వం ప్రాప్తం ప్రతిషిధ్యతే. పూతాత్మా ఇతి. పూతః ఆత్మా యస్య సః పూతాత్మా కర్మధారయో వా. 'కేవలో నిర్గుణశ్చ' ఇతి శ్రుతేః గుణోపరాగః స్వేచ్ఛాతః పురుషస్యేతి కల్ప్యతే. పరమశ్చాసౌ ఆత్మాచేతి పరమాత్మా. కార్యకారణవిలక్షణో నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావః ముక్తానాం పరమా ప్రకృష్టా గతిః గన్తవ్యా దేవతా పునరావృత్త్యసంభవా త్తద్గతస్యేతి ముక్తానాం పరమా గతిః 'మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ఇతి భగవద్వచనమ్' న వ్యేతి నాఽస్య వ్యయో వినాశో వికారో వా విద్యతే ఇతి అవ్యయః 'అజరోఽమరోఽవ్యయః' ఇతిశ్రుతేః పురం- శరీరం, తస్మిన్ శేతే పురుషః

"నవద్వారం పురంపుణ్య మేతై ర్భావై స్సమన్వితం, వ్యాప్యమహాత్మే శే
త్మా యస్తస్మాత్పురుష ఉచ్యతే" ఇతి మహాభారతే. యద్వా ఆస్తేః వ్యత్యస్తా
క్షరయోగాత్ అసీత్పురా పూర్వమేవేతి విగ్రహం కృత్వా వ్యుత్పాదితః
పురుషః "పూర్వమేవాఽహమిహాస మితి తత్ పురుషస్య పురుషత్వమ్"
ఇతి శ్రుతేః అథవా, పురుషు మారిషు ఉత్కర్షశాలిషు, సత్త్వేషు సీదతీతి;
పురూణి ఫలాని సనోతి దదాతీతి వా, పురూణి భువనాని సంహారసమయే
స్యతి అన్తం కరోతీతి వా; పూర్ణత్వాత్ పూరణాద్వా సదనాద్వా పురుషః
"పూరణాత్ సదనాచ్చైవ తతోఽసౌ పురుషో మతః" ఇతి పంచమవేదే.

'సాక్షా దవ్యవధానేన స్వరూపబోధేన ఈక్షతే పశ్యతి సర్వ మితి
సాక్షీ 'సాక్షాద్ద్రష్టరి సంజ్ఞాయామ్' ఇతి పాణినివచనా దిని ప్రత్యయః
క్షేత్రం శరీరం జానాతీతి క్షేత్రజ్ఞః "అతోఽనుపసర్గే"కః ఇతి కప్రత్యయః
'క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి' ఇతి భగవద్వచనాత్.

"క్షేత్రాణి హి శరీరాణి బీజం చాపి శుభాశుభం తాని వేత్తి స
యోగాత్మా తతః క్షేత్రజ్ఞ ఉచ్యతే ॥" (ఇతి మహాభారతే)

'స ఏవ న క్షరతీతి. అక్షరః. పరమాత్మా అశ్నుతేస శ్నోతేర్వా
సరప్రత్యయాన్తస్యరూప మక్షర ఇతి ఏవకారాత్ క్షేత్రజ్ఞాఽక్షరయో
రభేదః పరమార్థతః 'తత్త్వమసి' ఇతి శ్రుతేః చకారాత్ వ్యావహారికో
భేదశ్చ ప్రసిద్ధే రప్రమాణత్వాత్.

'భూతకృత్' ఇత్యాది శబ్దముల చేత ప్రాప్త మయిన
గుణాధీనత్వము నిషేధింపబడుచున్నది.

౧౧. పూతాత్మా—

పూతమైన ఆత్మ కలవాడు లేక పూతుడు (పవిత్రుడు)
ఆత్మయు నయినవాడు, 'కేవలో నిర్గుణశ్చ' అను శ్రుతినిబట్టి

నిర్గుణుడై యుండి ఇచ్ఛానుసారము గుణసంబంధము కలవాడగుచుండె నని చెప్పవలెను.

౧౧. పరమాత్మా—

కార్యకారణవిలక్షణమై, నిత్యశుద్ధ బుద్ధముక్తస్వభావము కలవాడు కాన 'పరమాత్మా' యని చెప్పబడును.

౧౨. ముక్తానాం పరమాగతిః—

ముక్తులకు అత్యుత్తమగు గన్తవ్యదేవత. ఆ స్వరూపమును పొందినవారికి పునరావృత్తి సంభవింపదు. కనుక, పరమగతి యగుచుండెను. కావుననే, భగవద్వచనము- 'నన్ను పొందిన యెడల పునర్జన్మ సంభవింప' దని చెప్పుచున్నది.

౧౩. అవ్యయః—

'అజరుడు, అమరుడు, అవ్యయుడు' అను శ్రుతిని బట్టి వ్యయము అనగా వినాశము కాని, వికారము కాని, లేనట్టివాడు కాన, పరమేశ్వరుడు 'అవ్యయ' శబ్దవాచ్యుడు.

౧౪. పురుషః—

పురము ( శరీరము ) నందు శయనించువాడు కాన, 'పురుషః' అని కీర్తింపబడుచున్నాడు.

'నవద్వారములు కల పుణ్యమైన పురమందు వ్యాపించి శయనించువాడగుటచే పురుషుడని చెప్పబడుచుండెను' అని మహాభారతమందు పురుషద్వారము వివరింపబడినది.

అథవా 'పూర్వమే నేనిందున్నాను. కాన, అదియే పురుషుని పురుషత్వము' అను శ్రుతి వచనానుసారము 'అసి'

ధాతువులోని సకారమును, ముందు అకారము తరువాత చేర్చిన 'స' అగును. ఇట్టి 'స' కు ముందు 'పురా' అను అర్థము కల 'పురు' శబ్దము చేర్చిన 'పురుష' శబ్దము నిష్పన్న మగును. పూర్వమందే ఉండెనని యర్థము.

అథవా, ఉత్కృష్టములైన ప్రాణులయందుండుట వలన పురుషు డనబడును. పురు (అధిక) ఫలములను 'సనోతి' ఇచ్చు వాడు కనుక, పురుషుడు; పురు (సమస్త) భువనములను సంహార కాలమందు 'స్యతి' అస్త మొందించువాడు కాన, పురుషుడు.

పూర్ణత్వము వలనను, పూరించుటవలనను, సదనము (ఉండుట) వలనను, పురుషుడు- అనబడును- అని పంచమ వేద మందు చెప్పబడినది.

౧౫. సాక్షీ—

స్వరూపజ్ఞానము చేతనే సర్వమును సాక్షాత్తు ధావ్యవ నము లేకుండ చూచువాడు కనుక, 'సాక్షి' అనబడును.

౧౬. క్షేత్రజ్ఞః—

క్షేత్రము (శరీరము) ను, తెలిసికొనువాడు క్షేత్రజ్ఞుడు, క్షేత్రజ్ఞుడను నన్నుగానే తెలిసికొనుము- అని భగవద్వచనము. 'శరీరములు క్షేత్రములు, శుభాశుభకర్మలు బీజములు, వానిని తెలిసికొనిన వాడగుటచే క్షేత్రజ్ఞు డని చెప్పబడుచుండెను' అని మహాభారతమందు వివరింపబడినది.

౧౭. అక్షరః—

ఆ క్షేత్రజ్ఞుడే అక్షరశబ్ద వాచ్యుడు, క్షయము లేనివాడు,

'అక్షర ఏవ చ' అనుటవలన 'ఏవ' కారము చేత, క్షేత్రజ్ఞ-అక్షరపరమాత్మలకు పరమార్థతః అభేదము చెప్పబడినది. ఈ అభేదము 'తత్త్వమసి' అను శ్రుతిచే సిద్ధము. 'అక్షర ఏవ చ' అనుట వలన 'చ' కారముచేత వ్యావహారిక భేదముకూడ చెప్పబడినది.

శ్లో॥ యోగో యోగవిదాం నేతా ప్రధానపురుషేశ్వరః ।
నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః ॥ ౧౮

శం. భా. :- యోగః- 'జ్ఞానేంద్రియాణి సర్వాణి నిరుధ్య మనసా సహ ఏకత్వభావనా యోగః క్షేత్రజ్ఞపరమాత్మనోః' తదవాప్యత యా యోగః, యోగం విదన్తి విచారయన్తి జానన్తి లభన్తే ఇతి వా యోగవిదః, తేషాం నేతా, జ్ఞానినాం, యోగక్షేమవహనాదినేతి యోగవిదాంనేతా. 'తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్' ఇతి భగవద్వచనాత్ ప్రధానం- ప్రకృతిః మాయా పురుషో జీవః తయో రీశ్వరః ప్రధానపురుషేశ్వరః; నరస్య సింహస్య చ అవయవా యస్మిన్ లక్ష్యన్తే తద్వపు ర్యస్య స నారసింహవపుః; యస్య వక్షసి నిత్యం వసతి శ్రీః స శ్రీమాన్ అభిరూపాః కేశా యస్య స కేశవః 'కేశాద్వోఽన్యతరస్యామ్' ఇతి వప్రత్యయః. ప్రశంసాయామ్ యద్వా కశ్చ అశ్చ ఈశశ్చ త్రిమూర్తయః కేశాః; తే యద్వశేన వర్తన్తే స కేశవః కేశి వధాద్వా 'యస్మాత్త్వయైష దుష్టాత్మ హతః కేశీ జనార్దన తస్మాత్కేశవ నామ్నా త్వం లోకే ఖ్యాతో భవిష్యసి ఇతి విష్ణుపురాణే శ్రీకృష్ణం ప్రతి నారదవచనమ్ వృషోదరాదిత్వా చ్ఛృద్ధి సాధుత్వకల్పనా పురుషాణా ముత్తమః పురుషోత్తమః 'న నిర్ధారణే' ఇతి షష్ఠీసమాసప్రతిషేధో న భవతి జాత్యాద్యనపేక్షయా సమర్థత్వాత్ యత్ర పునః జాతి గుణ క్రియాఽపేక్షయా తత్రాఽసమార్థత్వా న్నిషేధః ప్రవర్తతే

యథా మనుష్యాణాం క్షత్రియః శూరతమః గవాం కృష్ణా గౌః సంపన్న క్షీరతమా అశ్వగానాం ధావన్ శీఘ్రతమ ఇతి అథవా పంచమీ సమాసః తథా చ భగవద్వచనమ్- 'యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. (16)

౧౮. యోగః—

జ్ఞానేంద్రియములన్నిటిని మనస్సుతో కూడ నిరోధించి క్షేత్రజ్ఞ- పరమాత్మలకు ఏకత్వభావన కలదో అది "యోగ" మనబడును. అట్టి యోగము చేత ప్రాప్యుడగుటచే "యోగం" అను నామము పరమేశ్వరుని యందు ప్రసిద్ధము.

౧౯. యోగవిదాంనేతా—

యోగమును, విచారించినవారు, తెలివిలవారు, పొందిన వారు, యోగవిదులు, వారికి నేత అటు జ్ఞానులకు యోగక్షేమ నిర్వాహకుడు, కాన పరమేశ్వరుడు యోగవిదాంనేతా, యన బడును. ఈ విషయము "యోగక్షేమం వహా మ్యహామ్" అను భగవద్వచనముచే సిద్ధించుచున్నది.

౨౦. ప్రధానపురుషేశ్వరః—

ప్రధానము అనగా ప్రకృతిమాయ, పురుషుడు అనగా జీవుడు, వారిరువురకు ఈశ్వరుడు గాన "ప్రధాన పురుషేశ్వరః" అని కీర్తింపబడినాడు.

౨౧. నారసింహావపుః—

నరునియొక్క సింహముయొక్క అవయవములు గోచరించు శరీరము కలవాడు "నారసింహావపుః" అని చెప్పబడును.

౨౨. శ్రీమాన్—

నిత్యము వక్షస్థలమందు శ్రీదేవి నివసించునట్టివాడు గాన 'శ్రీమాన్' అనబడును.

౨౩. కేశవః—

ప్రశస్తము లయిన కేశములు కలవాడు 'కేశవ' శబ్దము లోని 'వ' ప్రత్యయము ప్రశస్తార్థకము. లేక క + అ + ఈశ-ఇవి కలిసి కేశ శబ్ద మయినది. క - బ్రహ్మ, అ - విష్ణువు, ఈశ- ఈశ్వరుడు. ఈ త్రిమూర్తులు ఎవ్వనికి వశవర్తులో ఆతడు కేశవుడు. అథవా, విష్ణుపురాణ వచనానుసారము దుష్టాత్ముడగు 'కేశి'యను దైత్యునివధించుటవలన 'కేశవ'నామము సిద్ధించినది.

ఇట 'కేశి' అను ఇకారమునకు అకారము వచ్చుట వకారము వధార్థక మగుట 'పృషోదరాదిత్వము' వలన సంభవించినది.

౨౪. పురుషోత్తమః-

పురుషులలో నుత్తముడు. ఇట 'పురుషాణా ముత్తమః' అని షష్ఠీసమాసము. దీనికి 'న నిర్ధారణే' అను వ్యాకరణ సూత్రనిషేధము సంభవింపదు. ఆ నిషేధము జాతి - గుణ - క్రియలచే పృథక్కరణము కలచోట ప్రవర్తించును. ఎట్లనగా-

'మనుష్యాణాం క్షత్రియః శూరతమః, గవాం కృష్ణాగౌః సంపన్నక్షీరతమా, అధ్వగానాం ధావన్ శీఘ్రతమః ఇతి. ఇందు 'క్షత్రియః' అని జాతిచేతను 'కృష్ణా గౌః' 'కృష్ణా' అని గుణముచేతను 'అధ్వగానాం ధావన్ శీఘ్రతమః' 'ధావన్' అని

క్రియచేతను పృథక్కరణము చేయబడెను. ఈ స్థలములయందే ఆ నిషేధము ప్రవర్తించును. పురుషాణా ముత్తమః, అనునది అట్టిది కాదు. లేదా పంచమీ సమాసము చెప్పవచ్చును. 'యస్మాత్ క్షరమతీతో౽హం' అను గీతావచనమున పురుషోత్తమ శబ్దనిర్వచన మట్లే చేయబడినది.

శ్లో॥ "సర్వః శర్వః శివః స్థాణు ర్భూతాది ర్నిధి రవ్యయః సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభు రీశ్వరః

**శం. భా.** :- 'అసతశ్చ సతశ్చైవ సర్వస్య ప్రభవా౽ప్యయాత్ సర్వస్య సర్వదా జ్ఞానాత్ సర్వ మేనం ప్రచక్షతే' ఇతి భగవద్వ్యాసవచనాత్ సర్వః. శృణాతి సంహారసమయే సంహరతి సంహరయతి సకలాః ప్రజా ఇతి శర్వః. నిస్త్రైగుణ్యతయా శుద్ధత్వాత్ శివః. 'స బ్రహ్మ స శివః' ఇత్య ఇత్యభేదోపదేశాత్ శివాదినామభిః హరిరేవ స్తూయతే. స్థిరత్వాత్ స్థాణుః. భూతానా మాదికారణత్వాత్ భూతాదిః. ప్రలయకాలే౽స్మిన్ సర్వం నిధీయతే ఇతి నిధిః. 'కర్మణ్యధికరణే చ' ఇతి 'కి' ప్రత్యయః. స ఏవ నిధి ర్విశేష్యతే. అవ్యయః, అవినశ్వరో నిధి రిత్యర్థః. స్వేచ్ఛయా సముచీనం భవన మస్యేతి సంభవః 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' ఇతి భగవద్వచనాత్. 'అథ దుష్టవినాశాయ సాధూనాం రక్షణాయ చ స్వేచ్ఛ యా సంభవా మ్యేవం గర్భదుఃఖవివర్జితః' ఇతి చ.

సర్వేషాం భోక్తౄణాం ఫలాని భావయతీతి భావనః. సర్వఫల దాతృత్వమ్- 'ఫల మత ఉపపత్తేః ఇత్యత్ర ప్రతిపాదితమ్. ప్రపంచస్యా౽ ధిష్ఠానత్వేన భరణాత్ భర్తా. ప్రకర్షేణ మహాభూతాని అస్మాజ్జాయన్తే ఇతి ప్రభవః. ప్రకృష్టో భవో జన్మ అస్యేతి వా. సర్వాసు క్రియాసు సామర్థ్యాతి

శయాత్ ప్రభుః. నిరుపాధిక మైశ్వర్య మస్యేతి ఈశ్వరః. 'ఏష సర్వేశ్వరః' ఇతి శ్రుతేః

౨౫. సర్వః-

సదసద్రూపమైన సర్వమునకు ఉత్పత్తి - లయస్థాన మగుటచేతను, సర్వదా సర్వజ్ఞానము కలవాడగుటచేతను 'సర్వః' అను నామము కలిగియుండెను.

౨౬. శర్వః-

సకలప్రజలను సంహారసమయమందు సంహరించుట చేతను, సంహారింపజేయుట చేతను 'శర్వః' అను నామముతో నొప్పారెను.

౨౭. శివః-

త్రిగుణాతీతమగు శుద్ధస్వరూప మగుటచే 'శివః' యను పేర ప్రసిద్ధి నొందెను. 'స బ్రహ్మా, స శివః' అని శ్రుతిచే అభేదమే ఉపదేశింపబడుట వలన శివాదినామములచే హరియే స్తుతింపబడుచుండెను.

౨౮. స్థాణుః-

స్థిరత్వమును బట్టి 'స్థాణుః' అను నామము కలిగి యుండెను.

౨౯. భూతాదిః-

భూతములకు ఆదికారణ మగుటచే 'భూతాదిః' అను పేరు ఒప్పుచున్నది.

30. నిధిరవ్యయః-

ప్రలయకాలమందు సర్వమునకునిధి-స్థానమగుటచే

'నిధిః'యను నామము యొప్పుచుండెను. ఆ నిధికే ఇది విశేషణము అగుచు, అవ్యయ (నాశరహిత) మగు నిధి యని తెలుపుచున్నది.

౩౧. సంభవః-

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" మున్నగు భగవద్వచనాదులచేత, తన ఇచ్ఛానుసారము సంభవము కలవాడగుటచే 'సంభవః' అను నామముతో ప్రసిద్ధి నొందెను. ఆ పరమాత్మయొక్క సంభవము (పుట్టుక) గర్భదుఃఖవిరహితము.

౩౨. భావనః-

"ఫలమత ఉపపత్తేః" అను బ్రహ్మ సూత్రానుసారము సర్వులకు సర్వఫలములను 'భావయతి' ఇచ్చువాడు గాన 'భావనః' యను నామముతో కీర్తింపబడుచుండును.

33. భర్తా-

ప్రపంచమును అధిష్ఠానరూపమున భరించువాడు గాన, 'భర్తా' యనబడుచున్నాడు.

౩౪. ప్రభవః-

ప్రకర్షముతో మహాభూతముల నుత్పాదింపచేయువాడు, ప్రకృష్టమైన 'భవః' జన్మ కలవాడును గాన 'ప్రభవ' శబ్దవాచ్యుడగుచున్నాడు.

౩౫. ప్రభుః-

సర్వక్రియలయందును సామర్థ్యాతిశయము కలవాడు

కాన 'ప్రభుః' అని పిలవబడుచున్నాడు.

౩౬. ఈశ్వరః-

'ఏష సర్వేశ్వరః' అను శ్రుతి ననుసరించి నిరుపాధికమైన ఐశ్వర్యము కలవాడు కాన, 'ఈశ్వరః' యను నామముతో నొప్పారుచున్నాడు.

శ్లో॥ స్వయంభూః శంభు రాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః ।
అనాదినిధనో ధాతా విధాతా ధాతు రుత్తమః॥ ౧౫

శం. భా. :- స్వయమేవ భవతీతి స్వయంభూః 'స ఏవ స్వయముద్బభౌ' ఇతి మానవం వచనమ్. సర్వేషా ముపరి భవతి స్వయంభవతీతి వా స్వయంభూః. యేషా ముపరి భవతి యశ్చోపరి భవతి తదుభయాత్మనా స్వయమేవ భవతీతి వా 'పరిభూః స్వయంభూః' ఇతి మన్త్రవర్ణాత్. అథవా స్వయంభూః పరమేశ్వరః స్వయమేవ స్వతన్త్రో భవతి, న పరతన్త్రః. 'పరాఞ్చిఖాని వ్యతృణ త్స్వయంభూః' ఇతి మన్త్రవర్ణాత్. శం- సుఖం భక్తానాం భావయతీతి శంభుః. ఆదిత్యమండలాన్తస్థో హిరణ్మయః పురుషః ఆదిత్యః, ద్వాదశాదిత్యేషు విష్ణుర్వా 'ఆదిత్యానా మహం విష్ణుః' ఇత్యుక్తేః అదితే రఖండితాయా మహ్యా అయం పతి రితి వా ఇయం వా అదితిః 'మహీం దేవీం విష్ణుపత్నీమ్' ఇతి శ్రుతేః. యథా ఆదిత్య ఏక ఏవాఽనేకేషు జలభాజనేషు అనేకవత్ ప్రతిభాసతే ఏవ మనేకేషు శరీరేషు ఏకఏవాత్మా అనేకవత్ ప్రతిభాసతే ఇతి ఆదిత్యసాధర్మ్యాద్వా ఆదిత్యః. పుష్కరేణోపమితే అక్షిణీ యస్యేతి పుష్కరాక్షః. మహాన్ ఊర్జితః స్వనో నాదో వా శ్రుతిలక్షణో యస్య స మహాస్వనః. 'సన్ మహత్' ఇత్యాదినా సమాసే కృతే 'ఆన్మహతస్సమానాధికరణ జాతీయయోః, ఇత్యాత్వమ్' 'అస్య మహతో భూతస్య నిశ్శ్వసిత మేతత్ ఋగ్వేదో యజుర్వేదః' ఇతి శ్రుతేః,

ఆదిః జన్మ నిధనం వినాశః తద్ద్వయం యస్య న విద్యతే స అనాదినిధనః. అనన్తాదిరూపేణ విశ్వం బిభర్తీతి ధాతా. కర్మణాం తత్ఫలానాం చ విధాతా అనన్తాదీనామపి ధారకత్వాత్. విశేషేణ దధాతీతి వా ధాతు రుత్తమ ఇతి నామైకం సవిశేషణం. సామానాధికరణ్యేన సర్వధాతుభ్యః పృథివ్యాదిభ్య ఉత్కృష్టః చిద్ధాతు రిత్యర్థః. ధాతు ర్విరించే రుత్కృష్ట ఇతి వా. వైయధికరణ్యేన నామద్వయం వా కార్యకారణప్రపంచధారణా చ్చిదేవ ధాతుః. ఉత్తమః సర్వేషా ముద్గతానా మతిశయే నోద్గతత్వా దుత్తమః.

౩౭. స్వయంభూః-

'స ఏవ స్వయ ముద్బభౌ' అను మను వచనాను సారము స్వయముగా ఉద్భవించినవాడు అగుటచేతను, 'పరిభూః స్వయంభూః' అను మన్త్రవర్ణమును బట్టి అందరకు, పరి-ఉపరి-మీద నుండువాడు; స్వయముగా నుండువాడు నగుట చేతను,మరియు సంయంభువుడు పరమేశ్వరుడు అనగా స్వయము గానే స్వతంత్రుడు-అనుచు 'పరాఞ్చిఖాని' అను మంత్రవర్ణము వివరించుటచేతను 'స్వయంభూ' శబ్దవాచ్యుడగుచున్నాడు.

౩౮. శంభుః—

భక్తులకు సుఖమును కలిగించువాడు గాన, 'శంభు' శబ్దముచే వ్యపదేశ్యుడగుచున్నాడు.

౩౯. ఆదిత్యః—

ఆదిత్యమండలాన్తర్గతుడగు హిరణ్మయ పురుషుడు. 'ఆదిత్యానా మహం విష్ణుః' అనుటచే ద్వాదశాదిత్యుల లో విష్ణువుగూడ ఆదిత్యశబ్దము చే చెప్పబడెను. అదితికి భూమికిని, అఖండమగు భూమండలమునకు పతి కనుకను ఆదిత్యుడన

బడును. 'మహీం దేవీం విష్ణుపత్నీమ్' 'ఇయం వా అదితిః' అను శ్రుతులు విష్ణుపత్ని, మహీదేవి అనియు, ఈమె అదితి అనబడుననియు చెప్పుచున్నవి. అథవా, ఆదిత్యుడు (సూర్యుడు) ఒక్కడే అనేక జలపాత్రలయందు అనేకముగా ప్రతిభాసించిన విధముగ ఒక యాత్మయే అనేకశరీరములందు అనేకములుగ ప్రతిభాసించుటచేత ఆదిత్యసామ్యమును బట్టి అదిత్యుడనబడె ననియు చెప్పవచ్చును.

౪౦. పుష్కరాక్షః—

పుష్కరము-(పద్మము)తో పోలిన నేత్రములు కలవాడు.

౪౧. మహాస్వనః—

గొప్పదయిన నాదము కలవాడు. లేదా, శ్రుతి చెప్పిన రీతిగ ఋగ్వేదాది రూపమయిన శబ్దప్రపంచము కలవాడు కాన, 'మహాస్వనః' యనబడెను.

౪౨. అనాదినిధనః-

జన్మ-వినాశము-ఈ రెండును లేనివాడగుటచే 'అనాది నిధన' నామముచే విలసిల్లెను.

౪౩. ధాతా-

అనన్తాది రూపముతో విశ్వమును భరించువాడు గాన 'ధాతా'యనబడును.

౪౪. విధాతా-

కర్మల యొక్క కర్మఫలముల యొక్క విధానమునకు కారకుడు గాన, 'విధాతృ' శబ్దవ్యపదేశ్యుడగుచున్నాడు.

౮౫. ధాతురుత్తమః—

ఇది ఏకనామముగ తీసికొనినయెడల ఆ అనంతాదులకును ధారకుడగుట వలన 'ధాతుః' అనియు, అందులో విశేషముగా ధారకుడగుటవలన 'ఉత్తమః' అనియు చెప్పబడును. లేదా, ధాతుః- పృథివ్యాది సర్వధాతువులకంటె ఉత్తమః- ఉత్కృష్టమయిన చిద్ధాతువు అని యర్థము. ధాత (బ్రహ్మ) కంటె ఉత్తముడు అనియును అర్థము. లేదా, ఇది నామద్వయముగ గ్రహించిన, కార్యకారణప్రపంచధారణక్రియ వలన 'ధాతుః' చిద్ధాతువు అనియు ఉద్గమించిన స్వరముతో అతిశయిత మగు ఉద్గమము కలవాడు కనుక 'ఉత్తమః' అనియు చెప్పనగును.

శ్లో॥ అప్రమేయో హృషీకేశః పద్మనాభోఽమరప్రభుః।
విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః। ౧౯

శం. భా. :- శబ్దాదిరహితత్వాన్న ప్రత్యక్షగమ్యః నాప్యనుమానవిషయః తద్వ్యాప్తలింగాఽభావాత్, నాప్యుపమానసిద్ధః నిర్భాగత్వేన సాదృశ్యాభావాత్, నాప్యర్థాపత్తిగ్రాహ్యః తద్వినాఽనుపపద్యమానస్యాఽసంభవాత్, నాప్యభావగోచరః భావత్వేన సమ్మతత్వాత్, అభావసాక్షిత్వాచ్చ, న షష్ఠప్రమాణస్య. నాపి శాస్త్రప్రమాణవేద్యః ప్రమాణజన్యాఽతిశయాభావాత్. యద్యేవం శాస్త్రయోనిత్వం కథమ్ ఉచ్యతే-ప్రమాణాది సాక్షిత్వేన ప్రకాశస్వరూపస్య ప్రమాణావిషయత్వేఽపి అధ్యస్తాఽతద్రూపనివర్తకత్వేన శాస్త్ర ప్రమాణకత్వ మితి అప్రమేయః-సాక్షిరూపత్వాద్వా హృషీకాణి ఇన్ద్రియాణి తేషామీశః క్షేత్రజ్ఞరూపభాక్. యద్వా ఇన్ద్రియాణి యస్య వశే వర్తన్తే స పరమాత్మా హృషీకేశః, యస్య వా సూర్యరూపస్య చన్ద్రరూపస్య చ జగత్ప్రీతి

కరా హృష్టాః కేశా రశ్మయః స హృషీకేశః; 'సూర్యరశ్మి ర్హరికేశః పురస్తాత్' ఇతి శ్రుతేః. పృషోదరాదిత్వా త్సాధుత్వమ్. యథోక్తం మోక్ష ధర్మే-

"సూర్యాచంద్రమసౌ శశ్వ దంశుభిః కేశసంజ్ఞితైః ।
బోధయన్ స్వాపయంశ్చైవ జగదుత్తిష్ఠతే పృథక్ ॥
బోధనా త్స్వాపనాచ్చైవ జగతో హర్షణం భవేత్ ।
అగ్నీషోమకృతై రేవం కర్మభిః పాండునన్దన ॥
హృషీకేశో మహేశానో వరదో లోకభావనః ।"-ఇతి ।

సర్వజగత్కారణం పద్మం నాభౌ యస్య సః పద్మనాభః 'అజస్య నాభా వధ్యేక మర్పితమ్' ఇతి శ్రుతేః, పృషోదరాదిత్వా త్సాధుత్వమ్. అమరాణాం ప్రభుః అమరప్రభుః విశ్వం కర్మ క్రియా యస్య సః విశ్వ కర్మా. క్రియతే ఇతి జగత్ కర్మ. విశ్వం కర్మ యస్యేతి వా విచిత్రనిర్మాణ శక్తిమత్త్వాద్వా విశ్వకర్మా. త్వష్టుస్సాదృశ్యాద్వా. మననాత్ మనుః 'నాఽన్యోఽతోస్తి మన్తా'ఇతి శ్రుతేః, మన్త్రో వా, ప్రజాపతిర్వా మనుః. సంహా రసమయే సర్వభూత తనూకరణత్వాత్ త్వష్టా. త్వక్షతే స్తనూకరణార్థాత్ తృచ్ ప్రత్యయః అతిశయేన స్థూలః స్థవిష్ఠః పురాణః స్థవిరః 'త్వేకం హ్యస్య స్థవిరస్య నామ' ఇతి బహ్వృచాః వయోవచనో వా స్థిరత్వాత్ ధ్రువః. 'స్థవిరో ధ్రువః' ఇత్యేక మిదం నామ సవిశేషణమ్-

౪౬. అప్రమేయః-

జ్ఞానేంద్రియములు శబ్దస్పర్శ రూప రస గన్ధములను గ్రహింపగలవు. ఆ స్వరూపము శబ్దాదిరహిత మగుటచే ప్రత్యక్షగమ్యము కాదు. దానికి వ్యాప్తమగు లింగము లేనందున అనుమానవిషయము కాదు. భాగరహితమై

సాదృశ్యము లేనిదగుటచే ఉపమానగమ్యము కాదు. ఆ పర
మేశ్వరుని విడచి అనుపపద్యమానము అసంభవ మగుటచే అర్థా
పత్తియు గ్రాహ్యము కాదు. భావపదార్థముగ సమ్మతమగుటచే
అభావగోచరము కాదు. అభావసాక్షిత్వమును, బట్టియు షష్ఠ
ప్రమాణమునకు తావు లేదు. ప్రమాణజన్యమగు అతిశయము
లేనిదగుటచేత శాస్త్రప్రమాణవేద్యమును, కాదు. అట్లయిన
శాస్త్రయోనిత్వ మెట్లు? అనుచో చెప్పబడుచున్నది. ప్రమా
ణాదులకు సాక్షి యగుటనుబట్టి స్వప్రకాశస్వరూపుడగువానికి
ప్రమాణవిషయత్వము లేకున్నను అక్కడ అధ్యస్తమయిన
తద్భిన్నరూపమునకు నివర్తకమగుటనుబట్టి శాస్త్రయోనిత్వము
(శాస్త్రప్రమాణకత్వము) అని గ్రహింపవలెను. సాక్షిరూప
మగుటచే గూడ 'అప్రమేయ' నామముచే చెప్పబడును.

౪౭. హృషీకేశః-

హృషీకములు-ఇన్ద్రియములు-వానికి ఈశుడు-క్షేత్రజ్ఞ
రూపుడు గాన 'హృషీకేశః'అనబడును. లేదా, ఇన్ద్రియములు
ఎవనికి వశమై యున్నవో, ఆ పరమాత్మ, హృషీకేశుడనియు,
చెప్పవచ్చును. అథవా; సూర్య-చంద్ర రూపసంబద్ధములు,
హృష్టములు (జగత్ప్రీతికరములు) నగు కేశములు (రశ్ములు)
ఏ పరమాత్మవో అట్టి పరమాత్మ హృషీకేశుడు- అనియు
చెప్పపగును. ఇది 'సూర్యరశ్మి ర్హరికేశః'అను శ్రుతిచే
సిద్ధము, 'హృష్టకేశః' శబ్దము 'హృషీకేశః' అగుట పృషో
దరాదిత్వముచేత సాధువని తెలియనగును. ఈ విషయము
మోక్షధర్మములో ఇట్లు చెప్పబడినది- పరమాత్మయొక్క-

చక్షుస్సులగు సూర్యుడును-చంద్రుడును 'కేశ' సంజ్ఞ కల కిరణముల చేత జగత్తునకు ప్రబోధము, స్వాపము కలిగించుట చేతను, ఆ సూర్యచంద్ర-అగ్నిషోమ-కర్మలచే జగత్తు హర్షము నొందుచుండుటచేతను పరమాత్మకు 'హృషీకేశ' నామము సిద్ధము.

౪౮. పద్మనాభః-

సర్వజగత్కారణమైన పద్మము నాభియందు కలవాడు కాన పరమాత్మ 'పద్మనాభ' శబ్దవ్యపదేశ్యుడగుచున్నాడు. ఈ విషయము 'అజస్యనాభౌ'- అను శ్రుతివచనము వివరించుచున్నది.

౪౯. అమరప్రభుః-

అమరులకు ( దేవతలకు ) ప్రభువు ' అమరప్రభువు ' యనబడును.

౫౦. విశ్వకర్మా -

సర్వము ఎవని క్రియయో, ఆతడు విశ్వకర్మ యనబడును. లేదా, చేయబడినది కర్మ; అది జగత్తు, విశ్వరూపమయినకర్మ, ఎవరివలన జరిగినదో యాతడు 'విశ్వకర్మ' శబ్దముచే చెప్పబడెను. అనగా విచిత్రనిర్మాణశక్తి కలవాడగుటచేతను, విశ్వకర్మ నామము గల త్వష్ట తో సాదృశ్యము చేతను 'విశ్వకర్మ' నామము సిద్ధించును.

౫౧. మనుః-

మననము వలన 'మనుః' అనబడును. 'నాఽన్యోఽతోఽస్తి'-

అను శ్రుతిచే నిది ప్రతిపాదితము. మన్త్రము, లేక ప్రజాపతి 'మను' శబ్దముచే చెప్పబడును.

౫౨. త్వష్టా-

ప్రజాపతి, సంహార సమయమున సర్వభూత తనూకరణము చేయుట, అనగా సూక్ష్మీకరించుటను బట్టి 'త్వష్టా' యను నామము పరమేశ్వర నామమై ఒప్పారును.

౫౩. స్థవిష్ఠః-

స్థౌల్యాతిశయము కలవాడుగాన, 'స్థవిష్ఠః' యనబడును.

౫౪. స్థవిరః ధ్రువః-

పురాణపురుషుడు. వయోవచనమును కావచ్చును. స్థిరత్వమును బట్టి ధ్రువుడు. 'స్థవిరో ధ్రువః' ఇది ఏకనామము; విశేషణవిశిష్టము.

శ్లో॥ అగ్రాహ్యః శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః ।
ప్రభూత స్త్రికకుబ్ధామ పవిత్రం మంగలం పరమ్॥ ౭౦

శం. భా. :- కర్మేన్ద్రియై ర్న గృహ్యత ఇతి అగ్రాహ్యః 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ' ఇతి శ్రుతేః, శశ్వత్ సర్వేషు కాలేషు భవతీతి శాశ్వతః 'శాశ్వతం శివ మచ్యుతమ్' ఇతి శ్రుతేః. 'కృషి ర్భూవాచక శ్శబ్దో ణశ్చ నిర్వృతి వాచకః విష్ణు స్తద్భావయోగాచ్చ కృష్ణో భవతి శాశ్వతః' ఇతి వ్యాసవచనాత్ సచ్చిదానన్దాత్మకః కృష్ణః కృష్ణవర్ణాత్మకత్వాద్వా కృష్ణః 'కృషామి పృథివీం పార్థ భూత్వా కార్ష్ణాయసో హలః కృష్ణో వర్ణశ్చ మే యస్మా త్తస్మా త్కృష్ణోఽహ మర్జున'- ఇతి మహాభారతే. లోహితే

అక్షిణీ యస్యేతి లోహితాక్షః 'అసౌ వృషభో లోహితాక్షః' ఇతి శ్రుతేః. ప్రళయే భూతాని ప్రతర్దయతి హినస్తీతి ప్రతర్దనః. జ్ఞానైశ్వర్యాది గుణై స్సంపన్నః ప్రభూతః. ఊర్ధ్వాధోమధ్యభేదేన తిసృణాం కకుభా మపి ధామేతి త్రికకుద్ధామ. ఇత్యేక మిదం నామ యేన పునాతి యో వా పునాతి ఋషి ర్దేవతా వా తత్ పవిత్రమ్. 'పునస్సంజ్ఞాయామ్' 'క ర్తరి చర్షిదేవతయోః' ఇతి భగవత్పాణిని స్మరణాత్ ఇత్ర ప్రత్యయః-

"అశుభాని నిరాచష్టే తనోతి శుభస న్తతిమ్ ।
స్మృతిమాత్రేణ యత్పుంసాం బ్రహ్మ తన్మంగలం విదుః ॥"

ఇతి శ్రీ విష్ణుపురాణవచనా త్కల్యాణరూపత్వాద్వా మంగలం. పరమ్- సర్వభూతేభ్యః ఉత్కృష్టం బ్రహ్మ. మంగలంపరమ్- ఇత్యేకమిదం నామ సవిశేషణమ్ ॥

౫౫. అగ్రాహ్యః -

'యతో వాచో నివర్తంతే' అను శ్రుతి చెప్పినరీతిగ కర్మేంద్రియములచే గ్రహింప బడనట్టివాడు గాన 'అగ్రాహ్య' శబ్దార్థభియు డగుచున్నాడు.

౫౬. శాశ్వతః -

'శశ్వత్ భవతి' సర్వకాలములయందు ఉండువాడు గాన 'శాశ్వతః' అని శ్రుతి చెప్పుచున్నది.

౫౭. కృష్ణః -

'కృష్' సత్తావాచకము, 'ణ', ఆనందవాచకము- అను వ్యాసవచనానుసారము సచ్చిదానన్దాత్మకుడుగాన 'కృష్ణ' శబ్దముచే కీర్తింపబడుచున్నాడు. కృష్ణవర్ణము గలవాడు నగు

టచే కృష్ణశబ్దవాచ్యుడు. మహాభారతములో 'ఇనుప హాల మయి భూమిని దున్నుచున్నాను; కృష్ణవర్ణము కలిగియున్నాను; అందుచే 'కృష్ణుడ' నయితినని, పరమాత్మ స్వయముగా చెప్పెను.

౫౮. లోహితాక్షః -

ఎరుపు గల నేత్రములు కలవాడు. ఇది 'అసావృషభో లోహితాక్షః'- అను శ్రుతిచే ప్రసిద్ధము.

౫౯. ప్రతర్దనః -

ప్రలయకాలమందు భూతకోటిని హింసించువాడు గాన, 'ప్రతర్దనః' అనబడును.

౬౦. ప్రభూతః -

జ్ఞానైశ్వర్యాది గుణసంపన్నుడు కాన, 'ప్రభూత' శబ్ద వాచ్యు డగుచున్నాడు.

౬౧. త్రికకుబ్ధామ-

ఊర్ధ్వ-అధో-మధ్య-భేదములచే త్రివిధ దిశలకు ఆశ్రయ మైనవాడగుటచే 'త్రికకుబ్ధామ-' యనబడును.

౬౨. పవిత్రమ్-

'పూయతేఽనేనేతి పవిత్రమ్' అను వ్యుత్పత్తిచే ఋషి- అనగా వేదమ స్త్రము పవిత్ర మనబడును. పునాత్యసౌ, అను వ్యుత్పత్తిచే దేవత 'పవిత్ర' మనబడును.

౬౩. మంగలంపరమ్ -

విష్ణుపురాణ వచనానుసారము ఏ బ్రహ్మ, స్మరణ

మాత్రమున అశుభములను నిరాకరించి శుభపరంపరను విస్తరింపజేయునో ఆ బ్రహ్మ 'మంగల' శబ్దము చే నొప్పును. కల్యాణరూపమగుటచే గూడ 'మంగల' శబ్దాభిధేయు డగునని తెలియనలయును. పరమ్ - సర్వభూతములకంటె ఉత్కృష్టమైనది బ్రహ్మ, 'మంగలంపరమ్' అని విశేషణవిశిష్టమగు ఏక నామముగ గ్రహింప నగును.

శ్లో॥ ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః॥ 21

శం. భా. :- సర్వభూతనియన్తృత్వాత్ ఈశానః. ప్రాణాన్ దదాతి చేష్టయతీతి వా ప్రాణదః. 'కో హ్యేవాऽన్యాత్ కః ప్రాణ్యాత్' ఇతి శ్రుతేః. యద్వా. ప్రాణాన్ కాలాత్మనా ద్యతి ఖండయతీతి ప్రాణదః. ప్రాణాన్ దీపయతి శోధయతీతి వా, ప్రాణాన్ దదాది లునాతీతి వా ప్రాణదః; ప్రాణితీతి ప్రాణః. క్షేత్రజ్ఞః, పరమాత్మా వా 'ప్రాణస్య ప్రాణమ్' ఇతి శ్రుతేః, ముఖ్యప్రాణో వా వృద్ధతమో జ్యేష్ఠః. 'జ్య చ' ఇత్యధికారే 'వృద్ధస్య చ' ఇతి వృద్ధశబ్దస్య జ్యాదేశవిధానాత్, ప్రశస్యతమః శ్రేష్ఠః. 'ప్రశస్యస్య శ్రః' ఇతి శ్రాదేశవిధానాత్, 'ప్రాణో వావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ' ఇతి శ్రుతేః, ముఖ్యప్రాణో వా, 'శ్రేష్ఠశ్చ' ఇత్యధికరణసిద్ధత్వాత్, సర్వకారణత్వాద్వా జ్యేష్ఠః, సర్వాతిశయత్వాద్వా శ్రేష్ఠః, ఈశ్వరత్వేన సర్వాసాం ప్రజానాం పతిః ప్రజాపతిః. హిరణ్మయాండాన్తర్వర్తిత్వాత్ హిరణ్యగర్భో బ్రహ్మ విరించిః తదాత్మా. 'హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే' ఇతి శ్రుతేః, భూః గర్భే యస్య సః, భూగర్భః. మాయాః శ్రియః ధవః పతిః- మాధవః, మధువిద్యాऽవబోధ్యత్వాద్వా మాధవః. 'మౌనాద్ధ్యానాచ్చ యోగాచ్చ విద్ధి భారత మాధవమ్' ఇతి వ్యాసవచనాద్వా మాధవః, మధు

నామాన మసురం సూదితవానితి మధుసూదనః.

"కర్ణమిశ్రోద్భవం చాపి మధు నామ మహాసురమ్।
బ్రహ్మణో౽పచితిం కుర్వన్ జఘాన పురుషోత్తమః
తస్య తాత వధాదేవ దేవదానవమానవాః ।
మధుసూదన ఇత్యాహుః ఋషయశ్చ జనార్దనమ్॥" ఇతి మహాభారతే.

౬౪. ఈశానః-

సర్వభూతనియంతృత్వ న్తృమును బట్టి 'ఈశానః' అని చెప్పబడును.

౬౫. ప్రాణదః-

ప్రాణము లిచ్చినవాడు, ప్రాణచేష్టలను కలిగించువాడు నగుటచే, 'ప్రాణద' నామముచే పిలువబడుచున్నాడు. ఇది శ్రుతి సిద్ధము. లేదా, కాలస్వరూపముతో ప్రాణములను ఖండించువాడు, మరియు, ప్రాణములకు దీప్తి నిచ్చువాడు, ప్రాణములను శోధించువాడు, ఛేదించువాడు నగుట వలనను 'ప్రాణద' సంజ్ఞతో నొప్పారుచుండును.

౬౬. ప్రాణః-

ప్రాణన వ్యాపారము (ఉచ్ఛ్వాస నిఃశ్వాసములు) కల క్షేత్రజ్ఞుడు; 'ప్రాణస్యప్రాణమ్' అను శ్రుతినిబట్టి పరమాత్మ లేదా, ముఖ్యప్రాణము నగుటచే 'ప్రాణః' యని కొనియాడ బడుచున్నాడు.

౬౭. జ్యేష్ఠః-

వృద్ధతముడు; వృద్ధ శబ్దమునకు 'జ్యా'దేశము విధింప బడినది.

౭౮. శ్రేష్ఠః-

ప్రశస్యతముడు. ప్రశస్య శబ్దమునకు ప్రాదేశము విధింపబడినది. 'ప్రాణోవావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ' అను శ్రుతిని బట్టి 'శ్రేష్ఠశ్చ' అను బ్రహ్మసూత్రనిర్ణయప్రకారము ముఖ్య ప్రాణము కావచ్చును. సర్వకారణత్వమును పురస్కరించుకొని జ్యేష్ఠుడును, సర్వాతిశయత్వమునుబట్టి శ్రేష్ఠుడును, అగును.

౭౯. ప్రజాపతిః-

ఈశ్వరత్వధర్మముచే సర్వప్రజలకు పతిగాన 'ప్రజాపతిః' అనబడును.

౭౦. హిరణ్యగర్భః-

హిరణ్మయాండ (బ్రహ్మాండ) అన్తర్వర్తిత్వముచేత హిరణ్యగర్భుడు బ్రహ్మ, తత్స్వరూపుడు నగుటచే 'హిరణ్యగర్భః' యని చెప్పనగును. ఇది హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే' అను శ్రుతిచే సిద్ధము.

౭౧. భూగర్భః-

భూమి గర్భమందు కలవాడు. గాన, 'భూగర్భః' యని, కీర్తింపబడుచున్నాడు.

౭౨. మాధవః-

మా అనగా, శ్రీదేవి ఆమెకు ధవుడు (పతి) గాన 'మాధవః' యనబడును. లేదా ఉపనిషత్ప్రసిద్ధ మధువిద్యచే అవగమ్యమానుడు, లేదా 'మౌనము చేత ధ్యానము చేత యోగము చేత మాధవుని తెలిసికొనుము' అను వ్యాస

వచనమును బట్టి పై సాధనములకు వేద్యుడగుటచేతను 'మాధవః' యను నామముతో నొప్పారుచున్నాడు

23. మధుసూదనః-

మధు వను అసురుని సంహరించినవాడగుటచేత 'మధుసూదన' శబ్దముచే చెప్పబడుచున్నాడు. కర్ణమిశ్రోద్భవుడు (కర్ణమలోద్భవుడు) అగు మధు నామక మహాసురుని వధించుట చేతనే దేవ, దానవ, మానవులు, మహర్షులు, జనార్దనుని మధుసూదనుడని కీర్తించిరి, అని మహాభారత వచనము వలన తెలియును.

శ్లో॥ ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః।
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతి రాత్మవాన్ ॥ ౨౨ ॥

శం. భా. :- సర్వశక్తిమత్తయా ఈశ్వరః. విక్రమః శౌర్యమ్. తద్యోగాత్ విక్రమీ. ధనురస్యాస్తీతి ధన్వీ. వ్రీహ్యాదిత్వా దినిప్రత్యయః. 'రామశ్శస్త్రభృతామహమ్' ఇతి భగవద్వచనాత్. మేధా- బహుగ్రన్థధారణసామర్థ్యమ్. సా యస్యాస్తి స మేధావీ. 'అస్మాయా మేధా స్రజో వినిః' ఇతి పాణినివచనాత్ వినిప్రత్యయః. విచక్రమే జగత్ విశ్వం, తేన విక్రమః. వినా గరుడేన పక్షిణా క్రమణాద్వా. క్రమణాత్ క్రమహేతుత్వాద్వా క్రమః. 'క్రాన్తే విష్ణుమ్' ఇతి మనువచనాత్. అవిద్యమానః ఉత్తమో యస్మాత్సః అనుత్తమః 'యస్మాత్పరం నాఽపరమస్తి కించిత్' ఇతి శ్రుతేః. 'న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యః' ఇతి స్మృతేశ్చ. దైత్యాదిభి ర్ధర్షయితుం న శక్యత ఇతి దురాధర్షః. ప్రాణినాం పుణ్యాపుణ్యాత్మకం కర్మ కృతం జానాతీతి కృతజ్ఞః. పత్రపుష్పాదికమల్పమపి ప్రయచ్ఛతాం మోక్షం దదాతీతి వా. పురుషప్రయత్నః కృతిః క్రియా వా, సర్వాత్మకత్వా త్తదాధార

తయా వా లక్ష్యతే కృత్యా ఇతి వా కృతిః స్వమహిమప్రతిష్ఠితత్వాత్ ఆత్మవాన్. 'స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని' ఇతి శ్రుతేః.॥

౭౪. ఈశ్వరః-

పరమాత్మ, సర్వశక్తిమత్త్వ ధర్మముచేత 'ఈశ్వరః' అని చెప్పబడుచున్నాడు.

౭౫. విక్రమీ-

శౌర్యశాలి. గాన, 'విక్రమీ' యని, కీర్తింపబడుచున్నాడు.

౭౬. ధన్వీ-

'రామశ్శస్త్రభృతామహమ్' అను భగవద్వచనానుసారము ధనుర్ధరుడు గాన, 'ధన్వీ' యనబడుచున్నాడు.

౭౭. మేధావీ-

బహుగ్రన్థధారణ సామర్థ్యము కలవాడు గాన 'మేధావీ' యని చెప్పబడుచున్నాడు.

౭౮. విక్రమః-

విశ్వమును పాదముచే ఆక్రమించినవాడు, లేదా, వి = పక్షి-గరుత్మంతుడు; వానితో సంచరించువాడు, 'విక్రమ' శబ్దవాచ్యుడు.

౭౯. క్రమః-

'క్రాన్తే విష్ణుమ్' అను మనువచనానుసారము బాహ్యకాశాదులకు దైహికాకాశాదులయందు ఏకత్వధారణ చెప్పుచు,

పాదేన్ద్రియమందు విష్ణువుగా భావింపవలె ననుటచే గమన క్రియకు హేతువైనవాడు కనుక 'క్రమః', అనబడును.

౮౦. అనుత్తమః-

ఎవనికంటె ఉత్తముడు లేడో ఆతడు 'అనుత్తమః' అని చెప్పబడును. ఈ విషయము 'యస్మాత్పరం'-అను శ్రుతి వలనను 'నత్వత్సమోఽస్తి అను స్మృతివలనను సిద్ధము.

౮౧. దురాధర్షః-

దైత్యాదులచే తిరస్కరింప శక్యము కానివాడగుటచే 'దురాధర్షః' యనబడును.

౮౨. కృతజ్ఞః-

ప్రాణులచే జేయబడిన పుణ్యాపాపకర్మలను తెలిసికొను వాడు. మరియు, అల్పమగు పత్రపుష్పాదికము సమర్పించిన వారికైనను మోక్షమిచ్చువాడు గాన, 'కృతజ్ఞః' యని కీర్తింపబడుచున్నాడు.

౮౩. కృతిః-

పురుషప్రయత్నము, లేక క్రియ 'కృతిః' యని చెప్ప బడును. సర్వాత్మకుడగుటచే దానికాధారముగ కృతిచేత లక్షితుడగువాడుగాన, 'కృతి'శబ్ద వాచ్యుడు.

౮౪. ఆత్మవాన్-

'స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని' యను శ్రుతిచెప్పినట్లు స్వమహిమయందే ప్రతిష్ఠితుడు కాన, పరమాత్మ 'ఆత్మవాన్' అని కొనియాడబడుచున్నాడు.

శ్లో॥ సురేశః శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః॥
అహః సంవత్సరో వ్యాలః ప్రత్యయః సర్వదర్శనః॥ ౨౩

శం. భా. :- సురాణాం దేవానా మీశః. సురేశః సూపపదో వా రా ధాతుః శోభనదాతౄణా మీశః. సురేశః ఆర్తానా మార్తిహరణత్వాత్ శరణమ్. పరమానన్దరూపత్వాత్ శర్మ. విశ్వస్యకారణత్వాత్ విశ్వరేతాః. సర్వాః ప్రజా యత్సకాశా దుద్భవన్తి స ప్రజాభవః; ప్రకాశరూపత్వాత్ అహః. కాలాత్మనా స్థితో విష్ణుః సంవత్సర ఇత్యుక్తః. వ్యాలవత్ గ్రహీతు మశక్యత్వాత్ వ్యాలః. ప్రతీతిః ప్రజ్ఞా ప్రత్యయః. 'ప్రజ్ఞానం బ్రహ్మ' ఇతి శ్రుతేః. సర్వాణి దర్శనాత్మకాని అక్షీణి యస్య సః సర్వదర్శనః. సర్వాత్మకత్వాత్ 'విశ్వతశ్చక్షుః' 'విశ్వాక్షమ్' ఇతి శ్రుతేః॥

౨౫౯. సురేశః-

దేవతలకు ఈశుడు. లేదా, 'సు' ఉపసర్గగా కల 'రా' ధాతువు యొక్క రూపము 'సురా' యగును. శుభముల నిచ్చు వారని అర్థము. వారికి ఈశుడు గాన 'సురేశ' నామమున బరగినాడు.

౨౬౦. శరణమ్-

ఆర్తుల ఆర్తిని హరించువాడు గాన, 'శరణ'శబ్దవ్యప దేశ్యుడు.

౨౬౧. శర్మ-

పరమానన్దస్వరూపు డగుటచేత శర్మ' నామమున విలసిల్లును.

౨౬౨. విశ్వరేతాః-

విశ్వమునకు కారణ మయినవాడు కాన, 'విశ్వరేతాః'

యనబడును.

౮౯. ప్రజాభవః-

సర్వప్రజల ఉద్భవమునకు మూల మయినవాడు కనుక 'ప్రజాభవ' శబ్దముచే చెప్పబడుచున్నాడు.

౯౦. అహః-

ప్రకాశస్వరూపుడు గాన 'అహః' యనియు.

౯౧. సంవత్సరః-

కాలాత్మకుడై యున్నవాడు కాన 'సంవత్సరః' యనియు,

౯౨. వ్యాలః-

వ్యాలము (సర్పము) వలె గ్రహింపశక్యము కానివాడగుటచే 'వ్యాలః' యనియు చెప్పబడుచున్నాడు.

౯3. ప్రత్యయః-

ప్రజ్ఞాత్మకుడు గాన, 'ప్రత్యయ' శబ్దవాచ్యుడగుచున్నాడు. ఈ విషయము 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను శ్రుతివలన తెలియును.

౯౪. సర్వదర్శనః-

సర్వమైన దర్శనసాధనములు- నేత్రములుగా కలవాడు, సర్వాత్మకుడు నగుటచే 'సర్వదర్శనః' యని చెప్పబడుచున్నాడు. ఈ విషయము 'విశ్వతశ్చక్షుః' అను శ్రుతి చెప్పుచున్నది.

శ్లో॥ 'అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిరచ్యుతః ।
వృషాకపి రమేయాత్మా సర్వయోగవినిస్సృతః॥ ౨౪

శం. భా. :- న జాయత ఇత్యజః 'న జాతో న జనిష్యతే' ఇతి శ్రుతేః. "నహి జాతో న జాయేఽహం న జనిష్యే కదాచన క్షేత్రజ్ఞ స్సర్వభూతానాం తస్మా దహ మజః స్మృతః" ఇతి మహాభారతే. సర్వేషా మీశ్వరాణా మీశ్వరః సర్వేశ్వరః. 'ఏష సర్వేశ్వరః' ఇతి శ్రుతేః నిత్యనిష్పన్నరూపత్వాత్ సిద్ధః. సర్వవస్తుషు సంవి ద్రూపత్వాత్, నిరతిశయరూపత్వాత్, ఫలరూపత్వాద్వా సిద్ధిః. స్వర్గాదీనాం వినాశిత్వా దఫలత్వమ్. సర్వభూతానా మాదికారణత్వాత్ సర్వాదిః. స్వరూపసామర్థ్యాత్ న చ్యుతో, న చ్యవతే, న చ్యవిష్యతే ఇతి అచ్యుతః 'శాశ్వతం శివ మచ్యుతమ్' ఇతి శ్రుతేః తథా చ భగవద్వచనమ్- 'యస్మా న్న చ్యుతపూర్వోఽహ మచ్యుత స్తేనకర్మణా' ఇతి, ఇతి నామ్నాం శత మాద్యం వివృతమ్. వర్షణా త్సర్వకామానాం ధర్మో వృషః. కాత్ తోయాత్ భూమి ముపాదిత కపి ర్వరాహః. వృషరూపత్వా త్కపిరూప త్వాచ్చ వృషాకపిః

శ్లో॥ "కపిర్వరాః శ్రేష్ఠశ్చ ధర్మశ్చ వృష ఉచ్యతే ।
తస్మా ద్వృషాకపిం ప్రాహ కాశ్యపో మాం ప్రజాపతిః" ॥

ఇతి మహాభారతే.

ఇయానితి మాతుం పరిచ్ఛేత్తుం న శక్యతే ఆత్మా యస్యేతి. అమే యాత్మా సర్వసంబన్ధ వినిర్గతః. సర్వయోగవినిస్సృతః. 'అసంగోహ్యయం పురుషః' ఇతి శ్రుతేః నానాశాస్త్రోక్తాన్యోగా దపగతత్వాద్వా ॥

నా॥. అజః-

జన్మలేనట్టివాఁడు కాన 'అజ' నామముతో విరాజిల్లు చున్నాఁడు. ఈ విషయము, 'ఎప్పుడును ఏ కాలమందును జన్మ లేనివాఁడను సర్వభూతములకు క్షేత్రజ్ఞుఁడ నగు నేను అజుఁడ నని స్మరింపబడితిని' అను శ్రుతి స్మృతివచన తాత్పర్యానుసారము ప్రసిద్ధము.

౯౬. సర్వేశ్వరః-

'ఏష సర్వేశ్వరః' అను శ్రుతినిబట్టి ఈశ్వరుల కందరకు ఈశ్వరుడు గాన 'సర్వేశ్వరః' యనబడును.

౯౭. సిద్ధః-

నిత్యనిష్పన్నస్వరూపుడు గాన సిద్ధశబ్దవాచ్యుడు.

౯౮. సిద్ధిః-

సర్వవస్తువులందు ంను సంవిద్రూప మగుటచేత నిరతిశయ రూప మగుటచేత ఫలస్వరూప మగుటచేతను 'సిద్ధిః' అను నామము పరమేశ్వరునియందు వర్తించును. స్వర్గాదులు నశించునవి కనుక అవి ఫలముగా చెప్పబడవు.

౯౯. సర్వాదిః-

సర్వభూతములకు ఆదికారణము కాన 'సర్వాదిః' యనబడుచున్నాడు.

౧౦౦. అచ్యుతః-

స్వరూపసామర్థ్యముచే ఏ కాలమందును చ్యుతి లేనట్టివాడు అచ్యుతనామముచే పేర్కొనబడుచున్నాడు. ఈ యంశము 'శాశ్వతం శివమచ్యుతం' అను శ్రుతిచే సిద్ధము. మరియు 'యస్మాన్న చ్యుతపూర్వోఽహమ్' - అను భగవద్వచనానుసారముగ గూడ పై విషయము తెలియుచున్నది. ఇంతవరకు సహస్రనామములలో నామశతము వివరింపబడినది.

౧౦౧. వృషాకపిః-

సర్వకామములను వర్షించునదగుటచే ధర్మము 'వృష'

మనబడును. 'క' శబ్దమునకు జలమని యర్థము. కనుక జలము నుండి భూమిని 'అపాత్' ఉద్ధరించినది 'కపి' యనబడును. అది వరాహావతారము. వృషరూప, కపిరూపములను బట్టి 'వృషాకపి' నామము వర్ణించినది. 'కపిర్వరాహశ్చ శ్రేష్ఠశ్చ ధర్మశ్చ వృష ఉచ్యతే' అను మహాభారతవచనము పైన చూపబడిన వ్యుత్పత్తి ద్వారా 'వృషాకపి' శబ్దమును వివరించినది

౧౦౨. అమేయాత్మా–

ఇంతటిదని పరిచ్ఛేదమునకు శక్యముకాని స్వరూపము కలవాడు గాన 'అమేయాత్మా' అని కొనియాడబడుచున్నాడు.

౧౦౩. సర్వయోగవినిస్సృతః

సర్వసంబన్ధ వినిర్ముక్తుడు, కనుకనే 'అసంగోహ్యయం పురుషః' అని శ్రుతి చెప్పుచున్నది నానాశాస్త్రోక్తయోగము నుండి తొలగువాడును అగుటచేత 'సర్వయోగవినిస్సృతః' యను నామము పరమేశ్వరునియందు ప్రసిద్ధము.

శ్లో॥ వసుర్వసుమనాః సత్యః సమాత్మాఽసమ్మితః సమః
అమోఘః పుండరీకాక్షో వృషకర్మా వృషాకృతిః ॥ ౧౨

శం. భా. :– వసన్తి సర్వభూతాని యత్ర తేష్వయమపి వసతీతి వా వసుః, 'వసూనాం పావకశ్చాఽస్మి' ఇత్యుక్తో వా వసుః. వసుశబ్దేన ధనవాచినా ప్రాశస్త్యం లక్ష్యతే. ప్రశస్తం మనో యస్య స వసుమనాః రాగద్వేషాదిభిః క్లేశైః మదాదిభి రుపక్లేశైశ్చ యతో న కలుషితం చిత్తం తత స్తన్మనః ప్రశస్తమ్. అవితథరూపత్వా త్పరమాత్మా సత్యః. 'సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ' ఇతి శ్రుతేః. మూర్తామూర్తాత్మకత్వాద్వా. 'సచ్చ త్యచ్చాఽ

భవతు' ఇతి శ్రుతేః. సదితి ప్రాణాః, తీత్యన్నమ్, యమితి దివాకరః. తేన ప్రాణాన్నాదిత్యరూపాద్వా సత్యః. 'సదితి ప్రాణా స్తీత్యన్నం యమిత్యసావాదిత్యః' ఇతి శ్రుతేః. సత్సు సాధుత్వాద్వా సత్యః సమ ఆత్మా మనో యస్య రాగద్వేషాదిభి రదూషితః స సమాత్మా. సర్వభూతేషు సమ ఏక ఆత్మా వా, 'సమ ఆత్మేతి విద్యాత్' ఇతి శ్రుతేః సర్వైరర్థజాతైః పరిచ్ఛిన్నః సమ్మితః, సర్వై రపరిచ్ఛిన్నోఽమిత ఇతి అసమ్మితః సర్వకాలేషు సర్వవికారరహితత్వాత్ సమః, మయా లక్ష్మ్యా సహ వర్తతే ఇతి వా సమః. పూజితః స్తుతః సంస్మృతో వా సర్వఫలం దదాతి న వృథా కరోతీతి అమోఘః, అవితథసంకల్పాద్వా 'సత్యసంకల్పః' ఇతి శ్రుతేః, హృదయస్థం పుండరీక మశ్నుతే వ్యాప్నోతి తత్రోపలక్షిత ఇతి పుండరీకాక్షః. 'యత్పుండరీకం పురమధ్యసంస్థమ్' ఇతి శ్రుతేః. పుండరీకాకారే ఉభే అక్షిణీ యస్యేతి వా. ధర్మలక్షణం కర్మాస్యేతి వృషకర్మా. ధర్మార్థమాకృతిః శరీరం యస్య స వృషాకృతిః 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' ఇతి భగవద్వచనాత్ ॥

౧౦౪. వసుః–

సర్వభూతములు తనయందే ఉన్నవాడును తాను సర్వభూతముల యందున్నవాడును వసు శబ్దవాచ్యుడగును. 'వసువులలో పావకుడను నేను', అను భగవద్వచనమునుబట్టియు పరమేశ్వరుడు వసుస్వరూపుడు అని తెలియనగును.

౧౦౫. వసుమనాః–

ధనవాచకమైన వసు శబ్దము ఇక్కడ ప్రాశస్త్యపరము. వసు – ప్రశస్తం, మనో యస్య సః – అను వ్యుత్పత్తితో ప్రశస్తమైనమనస్సుకలవాడు, అనగా రాగద్వేషాదులతో గాని

మద - మాత్సర్యాదులతోగాని కలుషితము కాని మనస్సు కలవాడు కాన 'వసుమనాః' యని పిలువబడును.

౧౦౬. సత్యః-

'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' అను శ్రుతినిబట్టి సత్య స్వరూపుడు అగుటచేతను లేదా 'సచ్చ త్యచ్చాభవత్' అను శ్రుతిననుసరించి 'సత్'- మూర్తస్వరూపము 'త్యత్' అమూర్త స్వరూపము అగుటచేతను 'సత్యః' అనబడును. మరియు సత్య శబ్దములోని 'సత్' శబ్దమునకు ప్రాణములనియు ఆపై 'త' కారమునకు అన్న మనియు ఆపై 'యమ్'నకు ఆదిత్యుడనియు సత్యశబ్దార్థము శ్రుతిచే వివరి పబడుటవలన ప్రాణ-అన్న-ఆదిత్య రూపుడగు పరమేశ్వరుడు 'సత్యః' అను నామముచేత స్తుతింప బడుచున్నాడనియు, సత్పురుషులయందు సాధుత్వము కలవా డగుటవలనగూడ 'సత్యః' యనబడు ననియు తెలియనగును.

౧౦౭. సమాత్మా-

సమః-రాగద్వేషాదులచే దూషితము కానట్టి ఆత్మా- మనస్సు కలవాడు; లేదా సర్వభూతములయందును సమమగు- ఏకమగు-ఆత్మ కలవాడు కాన 'సమాత్మా' యనబడును. ఈ విషయము 'సర్వభూతేషు సమ ఆత్మా'- ఇత్యాది శ్రుతు లచే సిద్ధము.

౧౦౮. అసమ్మితః-

సర్వపదార్థములచేత పరిచ్ఛిన్నుడు, సమ్మితుడు, సర్వ పదార్థములచేత అపరిచ్ఛిన్నుడు- అమితుడును కనుక 'అసమ్మి

తః' యని చెప్పబడును.

౧౦౯. సమః-

సర్వకాలములయందు సర్వవికారరహితుడు, లేదా మా-లక్ష్మీదేవి ఆమెతో కూడ నుండువాడు గాన 'సమః'అని ప్రస్తుతింపబడుచున్నాడు.

౧౧౦. అమోఘః-

పూజింపబడి స్తుతింపబడి సంస్మరింపబడి సర్వఫలముల నిచ్చువాడును, వృథా చేయనివాడును, 'సత్యసంకల్పః' అను శ్రుతిని బట్టి మోఘముకాని సంకల్పముకలవాడును అగుటచే 'అమోఘ' శబ్దముచే పరిలక్షితుడగుచున్నాడు.

౧౧౧. పుండరీకాక్షః-

'యథాప్పుండరీకం పురమధ్యసంస్థమ్' అను శ్రుతి ననుసరించి హృదయపుండరీకమును వ్యాపించి అట ఉపలక్షింపబడు వాడును, పుండరీకాకృతి గల నేత్రములు కలవాడును, అగుట వలన 'పుండరీకాక్ష' నామమున బరగుచున్నాడు.

౧౧౨. వృషకర్మా-

ధర్మలక్షణ మయిన కర్మ కలవాడు గాన 'వృషకర్మా' యనియు.

౧౧౩. వృషాకృతిః-

'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి' అను భగవద్వచనానుసారము ధర్మార్థము ఆకృతి - శరీరము - కలవాడు గాన 'వృషాకృతిః' యనియు చెప్పబడుచున్నాడు.

శ్లో॥ రుద్రో బహుశిరా బభ్రు ర్విశ్వయోనిః శుచిశ్రవాః ।
అమృతః శాశ్వతస్థాణుః వరారోహో మహాతపాః ॥ ౨౬

శం. భా. :- సంహారకాలే ప్రజా స్సంహరన్ రోదయతీతి రుద్రః, రుదం, రాతి దదాతీతి వా రుః దుఃఖం, దుఃఖకారణం వా ద్రావయతీతి వా రుద్రః, రోదనాత్ ద్రావణాద్వాఽపి రుద్ర ఇత్యుచ్యతే. "రుర్దుఃఖం దుఃఖ హేతుం వా తద్ద్రావయతి యః ప్రభుః రుద్ర ఇత్యుచ్యతే తస్మాచ్ఛివః పరమకారణమ్" ఇతి శివపురాణ వచనాత్ బహుశిరాః — బహూని శిరాంసి యస్యేతి బహుశిరాః, 'సహస్రశీర్షా పురుషః' ఇతి మన్త్రవర్ణాత్, బిభర్తి లోకానితి బభ్రుః, విశ్వస్య కారణత్వాత్ విశ్వయోనిః. శుచీని శ్రవాంసి నామాని శ్రవణీయా న్యస్యేతి శుచిశ్రవాః. న విద్యతే మృతం మరణ మస్యేతి అమృతః. 'అజరోఽమరః' ఇతి శ్రుతేః. శాశ్వతశ్చాసౌ స్థాణు శ్చేతి శాశ్వతస్థాణుః. వర ఆరోహో ఽంకో యస్యేతి వరారోహః వర మారోహణం యస్మిన్నితి వా. ఆరూఢానాం పునరావృత్త్యసంభవాత్. 'న చ పునరావర్తతే' ఇతి శ్రుతేః 'యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ' ఇతి భగవద్వచనాత్. మహత్ సృజ్యవిషయం తపోజ్ఞాన మస్యేతి మహాతపాః. 'యస్య జ్ఞానమయం తపః' ఇతి శ్రుతేః ఐశ్వర్యం ప్రతాపో వా తపో మహ దస్యేతి వా మహాతపాః ॥

౧౧౪. రుద్రః-

సంహారకాలమందు ప్రజలను సంహరించుచు దుఃఖింప జేయువాడు, దుఃఖము నిచ్చువాడు, 'రుర్దుఃఖం దుఃఖహేతుం వా' అను శివపురాణవచనానుసారము దుఃఖమును దుఃఖ కారణమును పోగొట్టువాడును అగుటచేత 'రుద్ర' సంజ్ఞతో నొప్పును.

౧౧౫. బహుశిరాః-

'సహస్రశీర్షా పురుషః' అను శ్రుత్యనుసారము బహు శిరస్సులుకలవాడు కాన 'బహుశీర్షాః' యనబడును.

౧౧౬. బభ్రుః-

లోకములను భరించువాడు గాన 'బభ్రుః' అనియు.

౧౧౭. విశ్వయోనిః-

విశ్వమునకు కారణ మయినవాడగుటచే 'విశ్వయోనిః' అనియు చెప్పబడుచున్నాడు.

౧౧౮. శుచిశ్రవాః-

శుచియు, శ్రవణీయములు నయిన నామములు కల వాడు గాన పరమేశ్వరునకు 'శుచిశ్రవాః' యను నామము ప్రసిద్ధము.

౧౧౯. అమృతః-

మరణరహితుడు గాన 'అమృత' శబ్దముచే కీర్తింపబడు చున్నాడు. ఇది 'అజరోఽమరః' అను శ్రుతిచే సిద్ధము.

౧౨౦. శాశ్వతస్థాణుః-

శాశ్వతుడగు నిశ్చలస్వరూపుడగుటచే 'శాశ్వతస్థాణుః' అనబడును.

౧౨౧. వరారోహః-

శ్రేష్ఠమయిన అంకము కలవాడు, శ్రేష్ఠమయిన ఆరోహణమునకు ఆధార మయినవాడును, ఆ యంకమున ఆరూఢు

లయినవారికి 'న చ పునరావర్తతే' అను శ్రుతినిబట్టియు 'యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ' అను భగవద్వచనానుసారముగను పునరావృత్తి సంభవింపదు గాన పరమేశ్వరుడు 'నరారోహ' శబ్దముచే చెప్పబడుచున్నాడు.

౧౨౨. మహాతపాః-

సృష్టివిషయమైన మహాజ్ఞానము కలవాడు. 'యస్య జ్ఞానమయం తపః' అను శ్రుతిని బట్టి ఇక్కడ తపస్సు-జ్ఞానము, లేదా తపః - ఐశ్వర్యము, లేక ప్రతాపము అధికముగా గలవాడు నగుటచే 'మహాతపాః' అని పిలవబడుచున్నాడు.

శ్లో॥ సర్వగః సర్వవిద్భాను ర్విష్వక్సేనో జనార్దనః ।
వేదో వేదవి దవ్యఙ్గో వేదాఙ్గో వేదవిత్ కవిః ॥ ౨౮

శం. భా :- సర్వత్ర గచ్ఛతీతి సర్వగః. కారణత్వేన వ్యాప్తత్వాత్సర్వత్ర, సర్వం వేత్తి విన్దతీతి వా సర్వవిత్, భాతీతి భానుః. 'తమేవ భాన్త మనుభాతి సర్వమ్' ఇతి శ్రుతేః. 'యదాదిత్యగతం తేజో జగ ద్భాసయతేఽఖిలమ్' ఇత్యాది స్మృతేశ్చ. సర్వవిచ్చాసౌ భానుశ్చ సర్వవిద్భానుః విష్వక్-అవ్యయం సర్వత్రార్థే. విష్వగఞ్చతి-పలాయతే దైత్యసేనా యస్య రణోద్యోగమాత్రేణేతి విష్వక్సేనః. జనాన్ దుర్జనా నర్దయతి హినస్తి నరకాదీన్ గమయతీతి వా జనైర్ద్యతే పురుషార్థ మభ్యుదయనిశ్శ్రేయసలక్షణం యాచ్యత ఇతి జనార్దనః. వేదరూపత్వా ద్వేదః. వేదయతీతి వా వేదః. "తేషామేవాఽనుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః । నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా" ఇతి భగవద్వచనాత్.

యథావ ద్వేదం వేదార్థం చ వేత్తీతి వేదవిత్. 'వేదాన్తకృ ద్వేదవిదేవ చాహమ్' ఇతి భగవద్వచనాత్.

శ్లో॥ "సర్వే వేదాః సర్వవేద్యాః సశాస్త్రాః
సర్వే యజ్ఞాః సర్వ ఇజ్యాశ్చ కృష్ణః ।
విదుః కృష్ణం బ్రాహ్మణా స్తత్త్వతో యే
తేషాం రాజన్ సర్వయజ్ఞా స్సమాప్తాః" ॥ ఇతి మహాభారతే.

అవ్యంగః - జ్ఞానాదిభిః పరిపూర్ణోఽవికల ఇతి ఉచ్యతే. వ్యంగో వ్యక్తి ర్న విద్యతే ఇతి అవ్యంగో వా. 'అవ్యక్తోఽయమ్' ఇతి భగవద్వచనాత్, వేదా అంగభూతా యస్య స వేదాంగః వేదాన్ విన్తే-విచారయతీతి వేదవిత్. క్రాన్తదర్శీ కవిః. సర్వదృక్. 'నాన్యోఽతో స్తిద్రష్టా' ఇత్యాది శ్రుతేః 'కవిర్మనీషీ' ఇత్యాది మన్త్రవర్ణాత్ ॥

౧౨౩. సర్వగః-

సర్వకారణ మగుటచే సర్వత్ర వ్యాప్తమై యున్నవాడు కాన 'సర్వగః' యని చెప్పబడుచున్నాడు.

౧౨౪. సర్వవిద్భానుః-

సర్వము తెలిసినవాడును, సర్వము ప్రాప్త మయినవాడును, ఆయన ప్రకాశము ననుసరించియే సర్వము ప్రకాశించుచున్నదనియు, ఆదిత్యాదిగతమగు తేజస్సు పరమాత్మదే అనియు నుద్ఘోషించు శ్రుతిస్మృతుల ననుసరించి ప్రకాశస్వరూపుడు, భానువు, కనుక 'సర్వవిద్భానుః' అని స్తుతింపబడుచున్నాడు.

౧౨౫. విష్వక్సేనః-

సర్వదైత్యసేనను తన యుద్ధోద్యమమాత్రమున పలాయనము చేయించువాడు కాన 'విష్వక్సేన' శబ్దముచే సంకీర్తనము చేయబడుచున్నాడు.

౧౨౬. జనార్దనః-

దుర్జనులను హింసించువాడు, నరకాదులను పొందించు వాడును, అభ్యుదయ-నిశ్శ్రేయస-లక్షణ మయిన పురుషార్థ మును గూర్చి జనులచే యాచింపబడువాడును అగుటచే పరమేశ్వరుడు 'జనార్దన' నామముచే సంకీర్తితుడగుచున్నాడు.

౧౨౭. వేదః-

వేదస్వరూపుడు, వేదము-తెలియజేయువాడును, కనుకనే 'వారియందనుగ్రహముచేత నేను వారి యందుండి వారి అజ్ఞానమును పోగొట్టుచున్నా నని భగవద్వచనము చెప్పు చున్నది కాన 'వేదః' యని చెప్పబడుచున్నాడు.

౧౨౮. వేదవిత్ -

యథాతథముగా వేదము వేదార్థము తెలిసినవా డగుటచే 'వేదవిత్'అని చెప్పబడుచున్నాడు. 'వేదాన్తకృత్ వేద విదేవచాహమ్' అను భగవద్గీతా వచనము పై విషయమును స్ఫురింపజేయును. మహాభారతములో- సర్వవేదములు, సర్వ వేద్యములు, సర్వశాస్త్రములు, సర్వయజ్ఞములు, సర్వ పూజనీయదేవతలు, కృష్ణుడే అని తత్త్వతః తెలిసికొనిన బ్రాహ్మణులకు సర్వయజ్ఞసమాప్తిఫలము లభించునని చెప్ప బడినది.

౧౨౯. అవ్యంగః-

జ్ఞానాదులచేత పరిపూర్ణుడు, అవికలుడు, 'అవ్యక్తోఽ యమ్' అను భగవద్వచనము ననుసరించి వ్యక్తము కానట్టి

వాడును అగుటవలన 'అవ్యంగ' నామముతో విరాజిల్లు చుండును.

౧౩౦. వేదాంగః-

వేదములు అంగములుగా నున్నవాడు కాన 'వేదాంగః' యనియు కీర్తింపబడుచున్నాడు.

౧౩౧. వేదవిత్-

వేదములను విచారణ చేయువాడు గాన 'వేదవిత్' అనియు చెప్పబడుచున్నాడు.

౧౩౨. కవిః-

'నాన్యోఽతోస్తి ద్రష్టా' అను శ్రుతి ననుసరించి సర్వద్రష్ట యగుటచేతను 'కవిర్మనీషీ' అను శ్రుతియు సర్వద్రష్టృత్వము నే ప్రతిపాదించుచుండుట చేతను పరమేశ్వరుడు 'కవి' శబ్ద వ్యపదేశ్యు డగుచున్నాడు.

శ్లో॥ లోకాధ్యక్ష స్సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః ।
చతురాత్మా చతుర్వ్యూహ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్భుజః ॥

శం భా :- లోకా నధ్యక్షయతీతి లోకాధ్యక్షః. సర్వేషాం లోకానాం ప్రాధాన్యేనోపద్రష్టా. లోకపాలాది సురాణా మధ్యక్షః సురాధ్యక్షః. ధర్మాధర్మౌ సాక్షా దీక్షతేఽనురూపం ఫలం దాతుం, తస్మా ద్ధర్మాధ్యక్షః, కతృశ్చ కార్యరూపేణ, అకృతశ్చ కారణరూపేణేతి కృతాకృతః. సర్గాదిషు పృథగ్విభూతయః చతస్రః ఆత్మానో మూర్తయో యస్య సః చతురాత్మా.

శ్లో॥ "బ్రహ్మా దక్షాదయః కాల స్తథైవాఖిలజన్తవః ।
విభూతయో హరేరేతా జగత స్సృష్టిహేతవః ॥

"విష్ణు ర్మన్వాదయః కాల స్సర్వభూతాని చ ద్విజ ।
స్థితే ర్నిమిత్తభూతస్య విష్ణోరేతా విభూతయః ॥
"రుద్రః కాలో౽న్తకాద్యాశ్చ సమస్తాశ్చైవ జన్తవః ।
చతుర్ధా ప్రలయాయైతా జనార్దనవిభూతయః ॥
—ఇతి వైష్ణవపురాణే.

శ్లో॥ "వ్యూహ్యాత్మానం చతుర్ధా వై వాసుదేవాదిమూర్తిభిః ।
సృష్ట్యాదీన్ ప్రకరోత్యేష విశ్రుతాత్మా జనార్దనః" ॥
—ఇతి వ్యాసవచనాత్ చతుర్వ్యూహః.

దంష్ట్రా శ్శృతస్రో యస్యేతి చతుర్దంష్ట్రః నృసింహవిగ్రహః । యద్వా. సాదృశ్యా చ్ఛృంగం దంష్ట్రే త్యుచ్యతే 'చత్వారి శృంగాః' ఇతి శ్రుతేః. చత్వారో భుజా అస్యేతి చతుర్భుజః"

౧౩౩. లోకాధ్యక్షః-

సర్వలోకములను ప్రధానముగా చూచుచుండువాడు గాన 'లోకాధ్యక్ష' శబ్దము చేతను,

౧౩౪. సురాధ్యక్షః-

లోకపాలాది దేవతలకు అధ్యక్షుడు కాన 'సురాధ్యక్ష' పదము చేతను,

౧౩౫. ధర్మాధ్యక్షః-

ధర్మాధర్మములకు తగిన ఫల మిచ్చుటకై సాక్షాత్తుగ నీక్షించువాడు కాన 'ధర్మాధ్యక్ష' శబ్దము చేతను ప్రస్తుతింపబడుచున్నాడు.

౧౩౬. కృతాకృతః-

కార్యరూపమున కృతుడు, కారణరూపమున అకృతుడు కనుక 'కృతాకృత' నామము పరమేశ్వరునియందు సార్థకమై ఒప్పును.

౧౩౭. చతురాత్మా-

సర్గ-స్థితి-లయము లందు విభూతులగు నాలుగుమూర్తులు కలవాడు కనుక 'చతురాత్మా' యని చెప్పబడును. విష్ణు పురాణములో 'బ్రహ్మ, దక్షాది ప్రజాపతులు, కాలము, సకల జీవులు- ఈ నాల్గు సృష్టిహేతువులగు విభూతులు. విష్ణువు, మన్వాదులు, కాలము, సర్వభూతములు- ఈ నాల్గును స్థితి హేతువులగు శ్రీహరివిభూతులు.

రుద్రుడు, కాలము, అన్తకాదులు, సమస్తజంతువులు, ఈనాల్గును ప్రలయనిమిత్తములైన భగవంతుని విభూతులు'- అని విభూతిచతుష్టయము వివరింపబడినది.

౧౩౮. చతుర్వ్యూహః-

వ్యాసవచనానుసారము భగవానుడు, వాసుదేవాది మూర్తులతో నాల్గు విధములవ్యూహము నొంది సృష్ట్యాది కార్యములను చేయువాడగాన 'చతుర్వ్యూహ' శబ్దముచే కీర్తింపబడుచున్నాడు.

౧౩౯. చతుర్దంష్ట్రః-

నాలుగు దంష్ట్రలు కలవాడు, దీనివలన నృసింహవిగ్రహము సూచితము. లేదా శృంగసామ్యముచే నాల్గు శృంగ

ములు కలవాడు గాన 'చతుర్దంష్ట్రః' యని పిలువబడుచున్నాడు. 'చత్వారిశృంగా' అను శ్రుతి యిందుకు ప్రమాణము.

౧౪౦. చతుర్భుజః-

నాల్గు భుజములు కలవాడు కాన 'చతుర్భుజ' నామముచే స్తుతింపబడుచున్నాడు.

శ్లో॥ "భ్రాజిష్ణు ర్భోజనం భోక్తా సహిష్ణు ర్జగదాదిజః।
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః" ॥ ౧౫

శం. భా. :- ప్రకాశైకరసత్వాత్ భ్రాజిష్ణుః. భోజ్యరూపతయా ప్రకృతిర్మాయా, భోజన మిత్యుచ్యతే. పురుషరూపేణ తాం భుఙ్క్తే ఇతి భోక్తా. హిరణ్యాక్షాదీన్ సహతే అభిభవతీతి సహిష్ణుః. హిరణ్యగర్భరూపేణ జగదాదౌ ఉత్పద్యతే స్వయమితి జగదాదిజః అఘం న విద్యతేఽస్యేతి అనఘః. 'అపహతపాప్మా' ఇతి శ్రుతేః విజయతే జ్ఞానవైరాగ్యైశ్వర్యాదిభి ర్గుణై ర్విశ్వ మితి విజయః యతో జయ త్యతిశేతే సర్వభూతాని స్వభావతోఽతో జేతా, విశ్వం యోని ర్యస్య. విశ్వశ్చాసౌ యో నిశ్చేతి వా విశ్వయోనిః. పునఃపునః శరీరేషు వసతి క్షేత్రజ్ఞరూపేణేతి పునర్వసుః ॥

౧౪౧. భ్రాజిష్ణుః-

ప్రకాశైకస్వరూపుడు కాన 'భ్రాజిష్ణుః' అనియు.

౧౪౨. భోజనమ్-

భోజ్యరూప మగుటచే ప్రకృతి - మాయ భోజన మనబడును.

౧౪౩. భోక్తా-

ఆ ప్రకృతిని పురుషరూపమున అనుభవించువాడు కాన

'భోక్తా' యని చెప్పబడును.

౧౪౪. సహిష్ణుః-

హిరణ్యాక్షాదులను సహించువాడు- తిరస్కరించువాడు కాన 'సహిష్ణు' శబ్దముచే చెప్పబడుచున్నాడు.

౧౪౫. జగదాదిజః-

జగదాదియందు హిరణ్యగర్భరూపమున స్వయముగ అవిర్భవించిన వాడగుటచే 'జగదాదిః' యని ప్రస్తుతింపబడు చున్నాడు.

౧౪౬. అనఘః

'అపహతపాప్మా' అను శ్రుతిని బట్టి పాపరహితుడు గాన 'అనఘ' శబ్దవాచ్యుడు.

౧౪౭. విజయః-

జ్ఞానము వైరాగ్యము ఐశ్వర్యము ఐన్నగు గుణముల చేత విశ్వవిజయము కలవాడు కాన 'విజయ' సంజ్ఞచే నొప్పును.

౧౪౮. జేతా-

స్వభావముచేత సర్వభూతములను అతిశయించువాడు కాన 'జేతా' యని చెప్పబడుచున్నాడు.

౧౪౯. విశ్వయోనిః-

విశ్వము ఆధారమయినవాడు, విశ్వరూపుడు, కారణ భూతుడును అగుటచే 'విశ్వయోనిః'అని కీర్తింపబడుచున్నాడు.

౧౪౦. పునర్వసుః.

క్షేత్రజ్ఞరూపమున శరీరములయందు పునఃపునః వసించుచుండువాడు గాన 'పునర్వసుః' యని కొనియాడబడుచున్నాడు.

శ్లో॥ ఉపేన్ద్రో వామనః ప్రాంశు రమోఘు శ్శుచి రూర్జితః ।
అతీన్ద్ర స్సంగ్రహ స్సర్గో ధృతాత్మా నియమో యమః॥

శం. భా. :- ఇన్ద్ర ముపగతోఽనుజత్వేనేతి ఉపేన్ద్రః. యద్వా ఉపరి ఇన్ద్రః ఉపేన్ద్రః. "మమోపరి యథేన్ద్ర స్త్వం స్థాపితో గోభి రీశ్వరః ఉపేన్ద్ర ఇతి కృష్ణ త్వాం గాస్యన్తి భువి దేవతాః, ఇతి హరివంశే. బలిం వామనరూపేణ యాచితవానితి వామనః. సంభజనీయ ఇతి వా, వామనః, "మధ్యే వామన మాసీనం విశ్వేదేవా ఉపాసతే" ఇతి మన్త్రవర్ణాత్, స ఏవ జగత్త్రయం క్రమమాణః ప్రాంశు రభూదితి, ప్రాంశుః. "తోయే తు పతితే హస్తే వామనోఽభూ దవామ ః సర్వదేవమయం రూపం దర్శయామాస వై ప్రభుః" "భూః పాదౌ ద్యౌ శ్శిరశ్చాఽస్య చన్ద్రాదిత్యౌ చ చక్షుషీ" ఇత్యాది విశ్వరూపం దర్శయిత్వా-

శ్లో॥ "తస్య విక్రమతో భూమిం చన్ద్రాదిత్యౌ స్తనాన్తరే
నభః ప్రక్రమమాణస్య నాభ్యాం తౌ సమవస్థితౌ
దివ మాక్రమమాణస్య జానుమూలే వ్యవస్థితౌ" ।

ఇతి ప్రాంశుత్వం దర్శయతి హరివంశే ॥

అమోఘః-న మోఘం చేష్టితః యస్య సః. స్మరతాం స్తువతా మర్చయతాః చ పావనత్వాత్, శుచిః, 'అన్య స్పర్శశ్చ మహాన్ శుచిః' ఇతి మన్త్రవర్ణాత్, బలప్రకర్షశాలిత్వాత్ ఊర్జితః అతీత్యేన్ద్రం స్థితో జ్ఞానైశ్వర్యా

దిభి స్స్వభావసిద్ధైరితి అతీన్ద్రః. సర్వేషాం ప్రతిసంహారాత్ సంగ్రహః. సృజ్యహేతుతయా స్వర్గహేతుత్వాత్ సర్గః. ఏకరూపేణ జన్మాదిరహితతయా ధృత ఆత్మా యేన సః ధృతాత్మా. స్వేషు స్వేష్వధికారేషు ప్రజానియమయతీతి నియమః. అన్తర్యచ్ఛతీతి యమః ॥

౧౪౧. ఉపేన్ద్రః-

ఇన్ద్రునకు అనుజుడయినవాడు, లేదా హరివంశోక్త ప్రకారము- శ్రీకృష్ణా! గోలోకవాసివగు నీవు నాకు 'ఉపరి' మీద 'ఇన్ద్రుడవు' ప్రభువై యుండుటచే నిన్ను ఉపేన్ద్రుడని కీర్తింతురు. అనుటవలన ఇంద్రుని మీద ప్రభువు కాన 'ఉపేంద్రః' యని కీర్తింపబడినాడు.

౧౪౨. వామనః-

బలిని వామనరూపముతో యాచించినవాడు, 'మధ్యే వామన మాసీనం విశ్వేదేవా ఉపాసతే'-అను మంత్రవచనాను సారము ఉపాసింపబడువాడగుటగాన 'వామనః' యని చెప్ప బడుచున్నాడు.

౧౪౩. ప్రాంశుః-

ఆ వామనమూర్తియే జగత్త్రయమును ఆక్రమించు నపుడు అత్యంతోన్నత స్వరూపుడగుటచే 'ప్రాంశుః' యని కీర్తింపబడినాడు. ఈ విషయము హరివంశములో ఇట్లున్నది- బలిచక్రవర్తి, వామనమూర్తి హస్తమున ఉదకము విడిచి నంతనే ఆ వామనరూపము మారిపోయి సర్వదేవమయ రూపము గోచరించెను భూమి పాదములుగా, ద్యులోకము

శిరస్సుగా, చన్ద్రసూర్యులు చక్షుస్సులుగా, విశ్వరూపమును ప్రదర్శించుచు భూమిని వ్యాపించునపుడు చన్ద్రసూర్యులు వక్షస్థనము నందుండిరి ఆకాశమును వ్యాపించునపుడు వారు నాభిస్థాన మందుండిరి; మరల ద్యులోకమును వ్యాపించునపుడు వారు జానుమూలములందుండిరి. అని చెప్పబడిన ప్రాంశుత్వము కలవాడు.

౧౫౪. అమోఘః-

మోఘము కానట్టి చేష్ట కలవాడు కాన 'అమోఘ' శబ్దవాచ్యుడు.

౧౫౫. శుచిః-

'అస్య స్పృశ్య మహాన్ శుచిః'- అను మంత్రవర్ణము ననుసరించి స్మరించువారిని, స్తుతించువారిని, అర్చించువారిని పవిత్రముచేయువాడు గాన 'శుచిః' యనబడుచున్నాడు.

౧౫౬. ఊర్జితః-

బలప్రకర్ష శాలి గాన 'ఊర్జిత' నామముతో నొప్పును.

౧౫౭. అతీన్ద్రః-

స్వభావసిద్ధములైన జ్ఞానైశ్వర్యాదులచేత ఇంద్రుని అతిక్రమించినవాడు గాన 'అతీంద్రః'యని పిలువబడుచున్నాడు.

౧౫౮. సంగ్రహః-

సర్వమును ప్రతిసంహరించువాడు గాన 'సంగ్రహ' శబ్దముచే చెప్పబడుచున్నాడు.

౧౫౯. సర్గః-

సృజ్యమైన జగద్రూపుడు, సర్గహేతువును అగుటచే 'సర్గః' యని కీర్తింపబడుచున్నాడు.

౧౬౦. ధృతాత్మా-

జన్మాదిరహితు డగుటచేత ఏకవిధమైన ఆత్మను ధరించినవాడు గాన 'ధృతాత్మా' యని ప్రస్తుతింపబడును.

౧౬౧. నియమః-

ప్రజలను తమ తమ యధికారములలో నియమించువాడు గాన 'నియమః' యని చెప్పబడుచున్నాడు.

౧౬౨. యమః-

అన్తర్గతుడై పరోపద్రవాదుల నుపరమింపజేయువాడు గాన 'యమః' యను నామమును బరగుచున్నాడు.

శ్లో॥ వేద్యో వైద్యః సదా యోగీ వీరహా మాధవో మధుః ।
అతీన్ద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః॥

శం. భా. :- నిశ్రేయసార్థిభి ర్వేదనార్హత్వాత్ వేద్యః. సర్వవిద్యానాం వేదితృత్వాత్ వైద్యః. సదా ఆవిర్భూత స్వరూపత్వాత్ సదాయోగీ. ధర్మత్రాణాయ వీరాన్ అసురాన్ హన్తీతి వీరహా. మాయాః-విద్యాయాః పతిః మాధవః "మా విద్యా చ హరే ప్రోక్తా తస్యా ఈశో యతో భవాన్ తస్మా న్మాధవనామాసి ధవ స్స్వామీతి శబ్దితః. ఇతి హరివంశే. యథా మధు పరాం ప్రీతి ముత్పాదయతి అయమపి తథేతి మధుః, శబ్దాదిరహితత్వా దిన్ద్రియాణా మవిషయ ఇతి అతీన్ద్రియః, 'అశబ్ద మస్పర్శమ్' ఇతి శ్రుతేః. మాయావినా మపి మాయాకారిత్వాత్ మహామాయః, 'మమ మాయా దుర

త్యయా' ఇతి భగవద్వచనాత్, జగదుత్పత్తిస్థితిలయార్థ ముద్యుక్తత్వాత్ మహోత్సాహః, బలినా మపి బలవత్త్వాత్ మహాబలః ॥

౧౬౩. వేద్యః-

మోక్షార్థుల చేత వేదనీయుడు గాన 'వేద్యః' అనియు.

౧౬౪. వైద్యః-

సర్వవిద్యావేదనము కలవాడు గాన 'వైద్యః' అనియు పిలవబడుచున్నాడు.

౧౬౫. సదాయోగీ-

సదా ఆవిర్భూత స్వరూపము కలవాడగుటచే 'సదాయోగీ' యని చెప్పబడును.

౧౬౬. వీరహా-

ధర్మరక్షణము కొరకు వీరులగు అసురులను సంహరించువాడు కాన 'వీరహా' యను నామము పరమేశ్వరునియందు ప్రసిద్ధము.

౧౬౭. మాధవః-

'మా' శబ్దమునకు విద్య అని యర్థము; 'ధవ' శబ్దమునకు అధిపతి అని యర్థము కాన 'మాధవ' శబ్దముచే వ్యపదేశ్యుడు. హరివంశము 'మా విద్యా చ హరే ప్రోక్తా' యను శ్లోకమున 'మాధవ' శబ్దము పైరీతిని నిర్వచించి పరమేశ్వరుడు విద్యాధిపతి యగుటచే 'మాధవ' శబ్దవ్యపదేశ్యుడని వివరించినది.

౧౮౮. మధుః-

మధువువలె పరమ ప్రీతిని కలిగించువాడు గాన 'మధుః' యను సంజ్ఞతో నొప్పును.

౧౮౯. అతీన్ద్రియః-

'అశబ్ద మస్పర్శమ్' అను శ్రుతిని బట్టి ఇన్ద్రియగోచరములగు శబ్దాదులు లేనివాడగుటచే ఇన్ద్రియాతీతుడు గాన 'అతీన్ద్రియః' యని చెప్పబడుచున్నాడు.

౧౯౦. మహామాయః-

'మమ మాయా దురత్యయా' అను భగవద్వచనానుసారము మాయావులను కూడ మాయ చేయువాడు గాన 'మహామాయః' యనబడును.

౧౯౧. మహోత్సాహః-

జగదుత్పత్తి-స్థితి-లయములకై ఉద్యుక్తుడగువాడుగాన 'మహోత్సాహః' యనియు.

౧౯౨. మహాబలః-

బలవంతులలో బలవంతుడగు వాడగుటవలన 'మహాబలః' యనియు కీర్తింపబడుచున్నాడు.

శ్లో॥ మహాబుద్ధి ర్మహావీర్యో మహాశక్తి ర్మహాద్యుతిః ।
అనిర్దేశ్యవపుః శ్రీమా నమేయాత్మా మహాద్రిధృక్ ॥

శం. భా. :- బుద్ధిమతామపి బుద్ధిమత్త్వాత్ మహాబుద్ధిః. మహత్-ఉత్పత్తికారణ మవిద్యాలక్షణం వీర్య మస్యేతి మహావీర్యః. మహతీ శక్తిః సామర్థ్య మస్యేతి మహాశక్తిః. మహతీ ద్యుతిః బాహ్యాభ్యన్తరా చ అస్యేతి

మహాద్యుతిః, 'స్వయంజ్యోతిః' 'జ్యోతిషాం జ్యోతిః' ఇత్యాది శ్రుతేః. ఇదం తదితి నిర్దేష్టుం యన్నశక్యతే పరస్మై స్వ సంవేద్యత్వాత్ తద నిర్దేశ్యం వపు రస్యేతి అనిర్దేశ్యవపుః, ఐశ్వర్యాద్యక్షిణా సమగ్రా శ్రీ ర్యస్య సః. శ్రీమాన్. సర్వైః ప్రమాణై రమేయా బుద్ధి రాత్మా యస్య సః అమేయాత్మా. మహాన్త మద్రిం-గిరిం మన్దరం గోవర్ధనం చ అమృతమథనే గోరక్షణే చ ధృతవానితి మహాద్రిధృక్ షాన్తోఽయమ్॥

౧౭౩. మహాబుద్ధిః-

బుద్ధిమంతులలో గూడ బుద్ధిమంతుడు, అగుటవలన 'మహాబుద్ధిః' యని ప్రస్తుతింపబడెను.

౧౭౪. మహావీర్యః-

ఉత్పత్తికారణమగు అవిద్యాలక్షణమైన మహావీర్యము కలవాడు కాన 'మహావీర్యః' అని చెప్పబడుచున్నాడు.

౧౭౫. మహాశక్తిః-

మహాసామర్థ్యము కలవాడు కావున 'మహాశక్తిః' యను పేర బరగుచున్నాడు.

౧౭౬. మహాద్యుతిః-

'స్వయంజ్యోతిః' 'జ్యోతిషాం జ్యోతిః' అను శ్రుతులను బట్టి బాహ్యాభ్యన్తర ప్రకాశస్వరూపుడు కావున 'మహాద్యుతిః' యని కొనియాడబడుచున్నాడు.

౧౭౭. అనిర్దేశ్యవపుః-

'ఇది అది' యని పరులకు నిర్దేశించి చెప్ప శక్యముకాని స్వరూపము కలవాడు, స్వసంవేద్య స్వరూపమును కాన

'అనిర్దేశ్యవపుః' అని ప్రస్తుతింపబడుచున్నాడు.

౧౭౮. శ్రీమాన్-

ఐశ్వర్యలక్షణమగు సమగ్రశ్రీ కలవాడు గాన 'శ్రీమాన్' యనబడును.

౧౭౯. అమేయాత్మ-

సర్వప్రాణులకు అమేయమైన బుద్ధి ఆత్మ- కలవాడు కనుక 'అమేయాత్మా' యను నామముచే చెప్పబడుచున్నాడు.

౧౮౦. మహాద్రిధృక్-

అమృతమథనసమయమందు మన్దరము, గోరక్షణసమయ మందు గోవర్ధనము అను మహాపర్వతములను ధరించినవాడు గాన 'మహాద్రిధృక్' యని స్తుతింపబడుచున్నాడు. ఇక్కడ 'హాన్తోఽయమ్' అనుటచే నిది 'ధృష' ధాతురూపము.

శ్లో॥ "మహేష్వాసో మహీభర్తా శ్రీనివాస స్సతాంగతిః
అనిరుద్ధ స్సురానన్దో గోవిన్దో గోవిదాంపతిః" ॥ 33

శం. భా. :- మహా నిష్వాస. ఇషుక్షేపః యస్య సః మహేష్వాసః, ఏకార్ణవాప్లుతాం దేవీం మహీం చ బభారేతి మహీభర్తా. యస్య వక్ష స్యన పాయినీ శ్రీ ర్వసతి సః శ్రీనివాసః, సతాం వైదికానాం సాధూనాం పురు షార్థసాధనహేతుః సతాంగతిః, న కేనాపి ప్రాదుర్భావేషు నిరుద్ధ ఇతి. అనిరుద్ధః సురా నానన్దయతీతి. సురానన్దః, "నష్టాం వై ధరణీం పూర్వ మవిన్ద ద్యద్గుహాగతామ్ గోవిన్ద ఇతి తేనాహం దేవై ర్వాగ్భి రభిష్టుతః" ఇతి మోక్షధర్మవచనాత్ గోవిన్దః, "అహం కిలేన్ద్రో దేవానాం త్వం గవా మిన్ద్రతాం గతః గోవిన ఇతి లోకా స్త్వాం స్తోష్యన్తి భువి శాశ్వతమ్"

ఇతి "గౌరేషా తు యతో వాణీ తాం చ విన్దయతే భవాన్ గోవిన్దస్తు తతో దేవమునిభిః కథ్యతే భవాన్" ఇతి చ హరివంశే, గౌర్వాణీ తాం విదన్తీతి గోవిదః, తేషాం పతిః విశేషేణేతి గోవిదాంపతిః.

౧౮౧. మహేష్వాసః-

మహాధనుర్ధారి యగుటవలన 'మహేష్వాసః'-యనబడుచున్నాడు.

౧౮౨. మహీభర్తా-

ప్రలయకాలమందయిన ఏకార్ణవమందు మునిగిపోయిన మహీదేవిని ఉద్ధరించినవాడు కాన 'మహీభర్తా' యని కీర్తింపబడుచున్నాడు.

౧౮౩. శ్రీనివాసః-

వక్షస్థలమందు విడువక నిరంతరము వసించు శ్రీదేవి కలవాడు గాన శ్రీనివాసశబ్దాభిధేయు డగుచున్నాడు.

౧౮౪. సతాంగతిః-

వైదికధర్మావలంబులగు సత్పురుషుల పురుషార్థసాధనమునకు హేతు వయినవాడు గాన 'సతాంగతిః' యను నామమున విరాజిల్లును.

౧౮౫. అనిరుద్ధః-

ప్రాదుర్భావములలో ఎవ్వనిచేతను నిరోధింపబడనివాడు కాన 'అనిరుద్ధ' శబ్దముచే చెప్పబడుచున్నాడు.

౧౮౬. సురానన్దః-

సురుల నానందింపజేయువాడు కనుక 'సురానన్ద' నామ

వసుతో నొప్పును.

౧౮౭. గోవిన్దః-

పూర్వము నష్టమై పాతాళగతమయిన ధరణిని పొందిన వాడు. అను మోక్షధర్మవచన తాత్పర్యము ననుసరించియు దేవతలకు నేనింద్రుడను, గోవులకు నీవింద్రుడవై యుంటివి. అందుచే నిన్ను గోవిన్దుడని స్తుతింతురు. అదియు, 'గో' శబ్దము చేత వాక్కు చెప్పబడును. ఆ వాక్కును ప్రాప్తింపజేయువాడ వగుటచే గోవిన్దుడని కీర్తింపబడుచున్నావు'- అను హరివంశ వచన తాత్పర్యము ననుసరించియు 'గోవిన్దః' యని కీర్తింపబడు చున్నాడు.

౧౮౮. గోవిదాంపతిః-

'గో' శబ్దము వాణిని చెప్పును. ఆ వాణిని తెలిసికొనిన వారు, పొందినవారు గోవిదులు. అట్టివారికి అధిపతి గాన 'గోవిదాంపతిః' యని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ "మరీచి ర్దమనో హంస స్సుపర్ణో భుజగోత్తమః ।
హిరణ్యనాభ స్సుతపాః పద్మనాభః ప్రజాపతిః ॥" ౩౮

శం. భా. :- తేజస్వినామపి తేజస్విత్వాత్ మరీచిః. 'తేజ స్తేజస్వినా మహమ్' ఇతి భగవద్వచనాత్. స్వాధికారాత్ ప్రమాద్యతీః ప్రజా దమయితుం శీల మస్య వైవస్వతాదిరూపేణేతి దమనః. అహం స ఇతి తాదాత్మ్యభావినః సంసారభయం హన్తీతి హంసః పృషోదరాదిత్వాత్ వర్ణవృద్ధి సాధుత్వం, హన్తి గచ్ఛతి సర్వశరీరేష్వితి వా హంసః. 'హంసః శుచిషత్' ఇతి మన్త్రవర్ణాత్. శోభన ధర్మాధర్మరూప పర్ణత్వాత్ సుపర్ణః. 'ద్వా సుపర్ణా'

ఇతి మన్త్రవర్ణాత్. శోభనం పర్ణం యస్యేతి వా సుపర్ణః. 'సుపర్ణః పతతా మస్మి' ఇతీశ్వరవచనాత్. భుజేన గచ్ఛతా ముత్తమః భుజగోత్తమః. హిరణ్యమివ కల్యాణీ నాభి రస్యేతి హిరణ్యనాభః, హితరమణీయనాభిత్వాద్వా హిరణ్యనాభః. బదరికాశ్రమే నరనారాయణ రూపేణ శోభనం తప శ్చరతీతి సుతపాః. 'మనస శ్చేన్ద్రియాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తపః' ఇతి స్మృతేః, పద్మమివ సువర్తులా నాభి రస్యేతి హృదయపద్మస్య నాభౌ-మధ్యే ప్రకాశనాద్వా పద్మనాభః, పృషోదరాదిత్వా త్సాధుత్వమ్. ప్రజానాం పతిః పితా ప్రజాపతిః ॥

౧౮౯. మరీచిః-

'తేజ స్తేజస్వినా మహమ్' అను భగవద్వచనమును బట్టి తేజశ్శాలులలో తేజస్స్వరూపుడు గాన పరమేశ్వరుడు 'మరీచి' శబ్దవాచ్యుడు.

౧౯౦. దమనః-

స్వాధికారమునుండి ప్రమాదము నొందెడి ప్రజలను వైవస్వత (యమధర్మరాజ) రూపమున శిక్షించు స్వభావము కలవాడు గాన 'దమనః' యని చెప్పబడుచున్నాడు.

౧౯౧. హంసః-

'అహం సః' అని తాదాత్మ్యభావన చేయువారికి సంసారభయము పోగొట్టువాడు కావున 'హంసః' యని కీర్తింపబడుచున్నాడు, 'అహం సః' అనునది 'హంసః' యని పృషోదరాదిత్వముచేత సిద్ధించును. లేదా, 'హంస శ్శుచిషత్' అను మంత్రము ననుసరించి సర్వశరీరగామి యగుటవలనను 'హంసః' యని పిలవబడుచున్నాడు.

౧౯౨. సుపర్ణః-

'ద్వా సుపర్ణా' అను మన్త్రమును బట్టి ధర్మాధర్మ రూపములైన శోభన పర్ణములు కలవాడు; అథవా, 'సుపర్ణః పతతా మస్మి' అను భగవద్వచనము ననుసరించి శోభనమైన రెక్కలు గల గరుడస్వరూపుడు నగుటచేత పరమేశ్వరుడు 'సుపర్ణ' శబ్దవాచ్యుడగుచు.

౧౯౩. భుజగోత్తమః-

భుజములతో గమనము చేయువానిలో నుత్తముడు అనగా శేష-వాసుకి-స్వరూపుడు కాన 'భుజగోత్తమ' శబ్దముచే ప్రసిద్ధుడు.

౧౯౪. హిరణ్యనాభః-

హిరణ్యము వలె కల్యాణరూపమగు నాభి కలవాడు, హితము రమణీయము నగు నాభి కలవాడును అగుటచే 'హిరణ్యనాభ' సంజ్ఞతో విలసిల్లును.

౧౯౫. సుతపాః-

మనస్సునకు ఇంద్రియములకు ఏకాగ్రతయే పరమ తపస్సు, అని స్మృతివచనము. అట్టి శోభన తపస్సును బదరి కాశ్రమములో నరనారాయణ రూపముతో చేయువాడు కాన 'సుతపాః' యని కీర్తింపబడెను.

౧౯౬. పద్మనాభః-

పద్మమువలె వర్తులమైన నాభి కలవాడు, మరియు, పద్మము అనగా హృదయపద్మము యొక్క నాభి యందు-

మధ్యమందు - ప్రకాశించువాడును అగుటచే 'పద్మనాభ' శబ్దము చే ప్రసిద్ధుఁడు.

౧౯౭. ప్రజాపతిః-

ప్రజలకు పతి-తండ్రియైనవాఁడు-కాన పరమాత్మ 'ప్రజాపతి' నామముతో నొప్పుచున్నాఁడు.

శ్లో॥ "అమృత్యుః సర్వదృక్ సింహః సన్ధాతా సన్ధిమాన్ స్థిరః ।
అజో దుర్మర్షణః శాస్తా విశ్రుతాత్మా సురారిహా ॥ 39॥

**శం. భా. :-** మృత్యు ర్వినాశ స్తద్ధేతుర్వా అస్య న విద్యతే **ఇతి.** **అమృత్యుః** ప్రాణినాం కృతాకృతం సర్వం పశ్యతి స్వాభావికేన బోధేనేతి సర్వదృక్ హిన స్తీతి సింహః. పృషోదరాదిత్వాత్సాధుత్వమ్. ఇతి నామ్నాం ద్వితీయం శతం వివృతమ్ కర్మఫలైః పురుషాన్ సన్ధత్తే ఇతి సన్ధాతా. ఫలభోక్తా చ స ఏవేతి సన్ధిమాన్ సదైకరూపత్వాత్ స్థిరః, అజతి గచ్ఛతి క్షిపతీతి వా అజః. మర్షితుం సోఢుం దానవాదిభి ర్నశక్యతే ఇతి దుర్మర్షణః శ్రుతిస్మృత్యాదిభిః సర్వేషా మనుశిష్టిం కరోతీతి శాస్తా విశేషేణ శ్రుతో యేన సత్యజ్ఞానాదిలక్షణ ఆత్మా. అతో విశ్రుతాత్మా సురారీణాం విహన్తృత్వాత్ సురారిహా ॥

౧౯౮. అమృత్యుః-

మృత్యువు అనగా వినాశముగాని, వినాశహేతువుగాని లేనివాఁడు కాన 'అమృత్యుః' యని చెప్పఁబడుచున్నాఁడు.

౧౯౯. సర్వదృక్-

ప్రాణుల కృతాకృత కర్మల నన్నిటిని స్వాభావికబోధచేత తెలిసికొనువాఁడు కావున 'సర్వదృక్' శబ్దముచే చెప్పఁబడుచున్నాఁడు.

౨౦౦. సింహః-

కాలానుసారము హింసించువాడు గాన 'సింహః' యని పిలవబడుచున్నాడు. ఇంతవరకు నామములలో ద్వితీయ శతము వివరింపబడినది.

౨౦౧. సన్ధాతా-

కర్మఫలములతో సన్ధానము చేయువాడు గాన 'సన్ధాత' యనబడుచున్నాడు.

౨౦౨. సన్ధిమాన్-

ఫలభోక్తృస్వరూపమై యున్నవాడు కనుక 'సన్ధిమాన్' శబ్దము పరమేశ్వరునియందు ప్రసిద్ధము.

౨౦౩. స్థిరః-

సదా ఏకరూపము గలవాడు కాన 'స్థిర' శబ్దముచే ప్రస్తుతింపబడుచున్నాడు.

౨౦౪. అజః-

అజధాతువునకు వెళ్లుట లేక విసరివేయుట అని యర్థము. భక్తుల హృదయములలో మెలగుచుండుటచేతను అసురాది దుష్టులను దూరము చేయుటచేతను పరమేశ్వరునకు 'అజః' అని పేరు.

౨౦౫. దుర్మర్షణః-

దానవాదులచేత సహింపబడుటకు శక్యము కానివాడగుటచే పరమేశ్వరునకు 'దుర్మర్షణః' అను పేరు ప్రసిద్ధము.

౨౦౬. శాస్తా-

శ్రుతులు, స్మృతులు మున్నగువానిచే అందరను శాసించు వాడగుటచే 'శాస్తా' యని చెప్పబడుచున్నాడు.

౨౦౭. విశ్రుతాత్మా-

సత్యజ్ఞానాది లక్షణమైన ఆత్మయొక్క విశేషశ్రుతి కలవాడు కాన 'విశ్రుతాత్మా' యని చెప్పబడును.

౨౦౮. సురారిహా-

సురారులను హింసించువాడు గాన 'సురారిహా' శబ్దము పరమేశ్వరుని నామముగా రూఢము.

శ్లో॥ "గురు ర్గురుతమో ధామ సత్యః సత్యపరాక్రమః ।
నిమిషోఽనిమిషః స్రగ్వీ వాచస్పతి రుదారధీః ॥ ౩౬

శం. భా. :- సర్వవిద్యానా ముపదేష్టృత్వా త్సర్వేషాం జనకత్వాద్వా గురుః. విరించ్యాదీనామపి బ్రహ్మవిద్యాసంప్రదాయకత్వాత్ గురుతమః. 'యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్' ఇతి మన్త్రవర్ణాత్. ధామ — జ్యోతిః. 'నారాయణపరో జ్యోతిః' ఇతి మన్త్రవర్ణాత్' సర్వకామానా మాస్పదత్వాద్వా ధామ 'పరమం బ్రహ్మ పరంధామ' ఇతి శ్రుతేః. సత్యవచనధర్మరూపత్వాత్ సత్యః. 'తస్మా త్సత్యం పరమం వదన్తి' ఇతి శ్రుతేః 'సత్యస్య సత్యమ్' ఇతి వా. 'ప్రాణా వై సత్యం తేషా మేష సత్యమ్' ఇతి శ్రుతేః. సత్యః అవితథః పరాక్రమో యస్య సః 'సత్యపరాక్రమః' నిమీలితే యతో నేత్రే యోగనిద్రారతస్య అతో నిమిషః; నిత్యప్రబుద్ధస్వరూపత్వాత్, అనిమిషః. మత్స్యరూపతయా వా ఆత్మరూపతయా వా అనిమిషః భూతతన్మాత్ర రూపాం వైజయన్త్యాఖ్యాం స్రజం నిత్యం బిభర్తీతి స్రగ్వీ. వాచో విద్యాయాః

పతిః వాచస్పతిః. సర్వార్థవిషయా ధీర్బుద్ధి రస్యేతి ఉదారధీః వాచస్పతి రుదారధీ రిత్యేకం నామ ॥

౨౦౯. గురుః-

సర్వవిద్యోపదేశకుడు, సర్వజనకుడును అగుటచే 'గురుః' యని కీర్తింపబడుచున్నాడు.

౨౧౦. గురుతమః-

'యోబ్రహ్మాణంవిదధాతిపూర్వమ్' అను మంత్ర వచనానుసారము బ్రహ్మాదులకు బ్రహ్మవిద్యాప్రదాత కావున 'గురుతమః' యని చెప్పబడుచున్నాడు.

౨౧౧. ధామ-

జ్యోతిస్స్వరూపుడు, సర్వకామాస్పదుడును అగుటవలన 'ధామ' శబ్దవాచ్యుడు ఈవిషయము 'నారాయణపరోజ్యోతిః', 'పరమం బ్రహ్మ పరం ధామ' యను శ్రుతివచనములవలన తెలియును.

౨౧౨. సత్యః-

సత్యభాషణధర్మస్వరూపుడు గాన 'సత్యః' యనబడును. ఈ విషయమును 'సత్యాత్సత్యం పరమం వదన్తి' మున్నగు శ్రుతు లుద్ఘోషించుచున్నవి.

౨౧౩. సత్యపరాక్రమః-

అమోఘపరాక్రమశాలి గాన 'సత్యపరాక్రమః' యని స్తుతింపబడుచున్నాడు.

౨౧౪. నిమిషః-

యోగనిద్రచే నిమీలితనేత్రుడు కావున 'నిమిషః' యను నామముతో నొప్పును.

౨౧౫. అనిమిషః-

నిత్యప్రబుద్ధస్వరూపుడు, మత్స్యరూపుడు, ఆత్మస్వరూపుడు నగుటచే పరమేశ్వరుడు 'అనిమిషః' యను నామముచే స్తవనీయుడు.

౨౧౬. స్రగ్వీ-

భూతతన్మాత్రరూపమైన వైజయన్తీమాలను నిత్యము ధరించువాడు కావున 'స్రగ్వీ' యని కీర్తింపబడుచున్నాడు.

౨౧౭. వాచస్పతిరుదారధీః-

వాక్కు-కు-విద్యకు-పతి, వాచస్పతి, సర్వార్థవిషయమగు బుద్ధికలవాడు ఉదారధీః. ఈ రెండును ఏకనామమగుటంజేసి 'వాచస్పతిరుదారధీః' యను నామమున ప్రసిద్ధుడు.

శ్లో॥ అగ్రణీ ర్గ్రామణీ శ్శ్రీమాన్ న్యాయో నేతా సమీరణః।
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షః సహస్రపాత్ ॥

శం. భా. :- అగ్రం ప్రకృష్టం పదం నయతి ముముక్షూనితి అగ్రణీః, భూతగ్రామస్య నేతృత్వాత్ గ్రామణీః. శ్రీః కాన్తి స్సర్వాతిశాయి న్యస్యేతి శ్రీమాన్ ప్రమాణానుగ్రాహకోఽభేదకారక స్తర్కో న్యాయః జగద్యన్త్ర నిర్వాహకో నేతా శ్వసనరూపేణ భూతాని చేష్టయతీతి సమీరణః సహస్రాణి మూర్ధానోఽస్యేతి సహస్రమూర్ధా. విశ్వస్యాత్మా విశ్వాత్మా. సహస్రాణ్యక్షీణి

అక్షిణి వా యస్య సః సహస్రాక్షః సహస్రాణి పాదా అస్యేతి సహస్ర పాత్. 'సహస్రశీర్షా పురుష స్సహస్రాక్ష సహస్రపాత్' ఇతి శ్రుతేః ॥

౨౧౮. అగ్రణీః-

ముముక్షువులను ఉత్తమస్థానము పొందించువాడు కావున 'అగ్రణీః' యను నామముతో భజనీయు డగుచున్నాడు.

౨౧౯. గ్రామణీః-

భూతగ్రామమునకు నాయకుడు కాన 'గ్రామణీః' యని చెప్పబడుచున్నాడు.

౨౨౦. శ్రీమాన్-

సర్వోత్తమమగు కాన్తి కలవాడు కనుక 'శ్రీమాన్' యని ప్రసిద్ధుడు.

౨౨౧. న్యాయః-

ప్రమాణమునకు బలకరమయి భేదనివారకమగు తర్కము యొక్క స్వరూపము కాన 'న్యాయః' శబ్దవాచ్యుడు.

౨౨౨. నేతా-

జగద్యన్త్రనిర్వాహకుడు అగుటచే 'నేతా' యని చెప్ప బడును.

౨౨౩. సమీరణః-

ప్రాణవాయురూపమున ప్రాణులకు చేష్టలు కలిగించు వాడు కనుక 'సమీరణ' నామముతో విరాజిల్లును.

౨౨౪. సహస్రమూర్ధా-

సహస్రశిరస్సులు కలవాడు 'సహస్రమూర్ధా' యని

స్తుతింపబడుచున్నాడు.

౨౨౬. విశ్వాత్మా-

విశ్వమునకు ఆత్మయైనవాడు గాన 'విశ్వాత్మా' యని చెప్పబడుచున్నాడు.

౨౨౭. సహస్రాక్షః-

అక్షి సహస్రము కలవాడు, లేక అక్ష- ఇన్ద్రియసహస్రము కలవాడు గాన 'సహస్రాక్ష' నామముచే బరగుచున్నాడు.

౨౨౮. సహస్రపాత్-

సహస్రపాదములు కలవాడు అగుటంజేసి 'సహస్రపాత్' అని పిలవబడుచున్నాడు. ఈ విషయము - 'సహస్రశీర్షాపురుషః సహస్రాక్ష స్సహస్రపాత్' అను శ్రుతివలన సిద్ధము అని తెలియ నగును.

శ్లో॥ "ఆవర్తనో నివృత్తాత్మా సంవృతః సంప్రమర్దనః ।
అహస్సంవర్తకో వహ్ని రనిలో ధరణీధరః ॥ ౩౮

శం. భా. :- ఆవర్తయితుం సంసారచక్రం శీల మస్యేతి ఆవర్తనః, సంసారబన్ధా న్నివృత్త ఆత్మా స్వరూప మస్యేతి, నివృత్తాత్మా. ఆచ్ఛాదికయా అవిద్యయా సంవృతత్వాత్. సంవృతః సమ్యక్ ప్రమర్దయతీతి రుద్ర కాలాద్యాభి ర్విభూతిభి రితి సంప్రమర్దనః సమ్యగహ్నాం ప్రవర్తనాత్, సూర్యః అహస్సవర్తకః. హవిర్వహనాత్ వహ్నిః. అనిలయః-అనిలః అనాదిత్వా దనిలః, అనాదానాద్వా అననాద్వా అనిలః శేష, దిగ్గజాదిరూపేణ వరాహరూపేణ చ ధరణీం ధత్తే ఇతి ధరణీధరః ॥

౨౨౮. ఆవర్తనః-

సంసారచక్రమును ఆవర్తింపజేయు స్వభావము కలవాడు కావున 'ఆవర్తనః' యని కొనియాడబడుచున్నాడు.

౨౨౯. నివృత్తాత్మా-

సంసారబన్ధమునుండి నివృత్తమైన స్వరూపము కలవాడు గాన 'నివృత్తాత్మా' యని చెప్పబడుచున్నాడు.

౨౩౦. సంవృతః-

ఆచ్ఛాదించు స్వభావము గల అవిద్యచేత సంవృతమైన వాడు కాన 'సంవృతః' యని స్మరింపబడుచున్నాడు.

౨౩౧. సంప్రమర్దనః-

రుద్ర- కాల- ఇత్యాది విభూతులచేత సంప్రమర్దనము చేయువాడు అగుటవలన 'సంప్రమర్దన' నామముతో నొప్పును.

౨౩౨. అహస్సంవర్తకః-

సక్రమముగా అహస్సులను ప్రవర్తింపజేయు సూర్యుడై యొప్పువాడు గాన 'అహస్సంప్రవర్తకః' యనబడుచున్నాడు.

౨౩౩. వహ్నిః-

హవిస్సును వహించు వహ్నియై యొప్పువాడు గాన 'వహ్నిః' యని స్తుతింపబడును.

౨౩౪. అనిలః-

అనిలయః- ఒక నివాసస్థానము నిశ్చితమైనది లేనివా డగుట వలనను అనాదిత్వమును బట్టియు, అనాదానము ఆదా

నము- గ్రహించుట- లేకుండుటను బట్టియు అననము- ప్రాణ చేష్టను బట్టియు 'అనిల' నామముతో వ్యవహరింపబడును.

౨౩౫. ధరణీధరః-

శేష- దిగ్గజాది రూపముతోను వరాహరూపముతోను ధరణిని ధరించినవాడు కావున 'ధరణీధరః' యను సంజ్ఞచే విరాజిల్లును.

శ్లో॥ "సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వధృక్ విశ్వభు గ్విభుః ।
సత్కర్తా సత్కృత స్సాధు ర్జహ్ను ర్నారాయణో నరః ॥

శం. భా. :- శోభనః ప్రసాదః యస్య; అపకారవతామపి శిశుపాలాదీనాం మోక్షప్రదాతృత్వాదితి, సుప్రసాదః. రజస్తమోభ్యా మకలుషిత ఆత్మాఽన్తఃకరణ మస్యేతి, ప్రసన్నాత్మా కరుణార్ద్రస్వభావత్వాద్వా. యద్వా. ప్రసన్నస్వభావః కారుణిక ఇత్యర్థః అవాప్త సర్వకామత్వాద్వా. విశ్వం ధృష్ణోతీతి విశ్వధృక్, ఞిధృషాప్రాగల్భ్యే విశ్వం భుఙ్క్తే భునక్తి. పాలయతీతి వా విశ్వభుక్ హిరణ్యగర్భాదిరూపేణ వివిధం భవతీతి విభుః 'నిత్యం విభుమ్' ఇతి మన్త్రవర్ణాత్. సత్కరోతి-పూజయతీతి సత్కర్తా. పూజితైరపి పూజితః సత్కృతః. న్యాయప్రవృత్తతయా సాధుః సాధయతీతి వా సాధ్యభేదాన్ ఉపాదానాత్ సాధ్యమాత్రసాధకో వా. జనాన్ సంహారసమయే అపహ్నుతే అపనయతీతి జహ్నుః. జహాత్యవిదుషో భక్తాన్నయతి పరం పద మితి వా. నర ఆత్మా. తతో జాతా న్యాకాశాదీని నారాణి కార్యాణి, తా న్యయం కారణాత్మనా వ్యాప్నోతి; అతశ్చ తా న్యయన మస్యేతి నారాయణః. 'యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' ఇతి మన్త్రవ[illegible].

శ్లో॥ 'నరా జ్జాతాని తత్త్వాని నారాణీతి తతో విదుః ।
తాన్యేవ చాఽయనం తస్య తేన నారాయణః స్మృతః' ॥
—ఇతి మహాభారతే.

నారాణాం జీవానా మయనత్వా త్ప్రళయ ఇతి వా నారాయణః 'యత్ప్రయ న్త్యభిసంవిశ న్తి' ఇతి శ్రుతేః, 'నారాణా మయనం యస్మా త్తస్మా న్నారాయణః స్మృతః' ఇతి బ్రహ్మవైవర్తాత్. 'ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః తా యదస్యాఽయనం పూర్వం తేన నారాయణ స్మృతః' ఇతి మనువచనాద్వా నారాయణః.

శ్లో॥ 'నారాయణాయ నమ ఇత్యయమేవ సత్యః
సంసారఘోరవిషసంహరణాయ మన్త్రః
శృణ్వన్తు భవ్యమతయో యతయోఽ స్తరాగా
ఉచ్చై స్తరా ముపదిశా మ్యహ మూర్ధ్వబాహుః' ॥
—ఇతి శ్రీనారసింహపురాణే

'నయతీతి నరః ప్రోక్తః పరమాత్మా సనాతనః' ఇతి వ్యాసవచనమ్.

౭౩౬. సుప్రసాదః-

అపకారులగు శిశుపాలాదులకును మోక్షప్రదు డగుటచే శోభనమైన అనుగ్రహము కలవాడు గాన 'సుప్రసాదః' యని కీర్తింపబడుచున్నాడు.

౭౩౭. ప్రసన్నాత్మా-

రజ స్తమస్సులచే కలుషితము కానట్టి అన్తఃకరణము కలవాడు; లేదా, కరుణార్ద్ర స్వభావము కలవాడు, లేదా, ప్రసన్నస్వభావుడు (కరుణామయుడు) అవాప్త సర్వకాముడును యగుటచే 'ప్రసన్నాత్మా' యని చెప్పబడుచున్నాడు.

౨౩౮. విశ్వధృక్ -

విశ్వధారణప్రాగల్భ్యము గలవాడు గాన 'విశ్వధృక్' యనియు,

౨౩౯. విశ్వభుక్ -

విశ్వమును భక్షించువాడు, పాలించువాడును అగుటచే 'విశ్వభుక్' యనియు ప్రస్తుతింపబడుచున్నాడు.

౨౪౦. విభుః-

హిరణ్యగర్భాదిరూపమున వివిధముగ నగువాడు గాన 'విభు' శబ్దవాచ్యుడు. 'నిత్యం విభుమ్' అను మంత్రవర్ణముచే ఈ విషయము సూచితము.

౨౪౧. సత్కర్తా-

పూజించువాడు గాన 'సత్కర్తా' యనియు,

౨౪౨. సత్కృతః-

పూజితులచే గూడ పూజింపబడువాడుగాన 'సత్కృతః' యనియు చెప్పబడును.

౨౪౩. సాధుః-

న్యాయప్రవృత్తి కలవాడు, సాధ్యవిశేషములను సాధించువాడు; ఉపాదానకారణ మగుటచే సాధ్యసాధకుడును అగుటవలన 'సాధుః' యను నామముతో బరగును.

౨౪౪. జహ్నుః-

సంహారసమయమున జనులను అంతర్గతుల జేయువాడు;

మఱియు, అజ్ఞానులను విడిచిపెట్టువాడై భక్తులను పరమపద మును పొందించువాడును గాన 'జహ్ను' నామముచేకీ సం కీర్తితు డగుచున్నాడు.

౨౪౫. నారాయణః-

నరు డనగా ఆత్మ; ఆత్మ యగు నరుని వలన కలిగిన ఆకాశాది కార్యములు నారములు; అట్టి కార్యరూపములగు ఆకాశాదులను కారణరూపమున వ్యాపించి యున్నందున ఆ నారములగు కార్యములు అయన మగుటచే 'నారాయణః' యను నామము పరమేశ్వరునియందు వర్తించుచున్నది.

ఈ విషయము- 'దృష్టము; శ్రుతము నగుచున్న సర్వ జగత్తును అన్తర్బహిర్భాగములలో నారాయణుడు వ్యాపించి యుండెను. 'యచ్చ కిఞ్చి జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' - అను మంత్ర వచన తాత్పర్యము చేతను, నరుని వలన కలిగినవి నారములు; అవి అయనము-స్థానమయినవాడు నారాయణుడు- అను మహాభారత వచనము చేతను 'నారాయణః' యను నామముచే ప్రస్తుతింపబడుచున్నాడు.

మఱియు ప్రళయకాలమందు నారములకు-జీవులకు- అయనము - స్థానము - అయినవాడును గాన 'నారాయణ' శబ్దముచే చెప్పబడుచున్నాడు. 'యత్ప్రయ న్త్యభిసంవిశన్తి' యను శ్రుతియు, 'నారాణా మయనంయస్మాత్' అను బ్రహ్మవైవర్త వచనము 'ఆపో నారా ఇతి ప్రోక్తా' యను మను

స్మృతి వచనము ను నారాయణ శబ్దమునకు ఈరీతిగానే నిర్వచించినది.

నారసింహ పురాణములో- 'నారాయణాయ నమః' అను మన్త్రము సంసారఘోరవిషహార మనియు, సద్బుద్ధి కలవారందరు వినవలసినదనియు ఊర్ధ్వబాహువునై ఉపదేశించుచున్నా ననియు నారాయణ శబ్ద మాహాత్మ్యము ముక్తకంఠముగ కీర్తింపబడినది.

౨౪౬. నరః-

వ్యాసవచనానుసారము ఉత్తమ స్థితిని పొందించు సనాతన పరమాత్మ గాన 'నరః' యని కీర్తింపబడుచున్నాడు.

శ్లో॥ "అసంఖ్యేయోఽప్రమేయాత్మా విశిష్ట శ్శిష్టకృ చ్ఛుచిః ।
సిద్ధార్థ స్సిద్ధసంకల్ప స్సిద్ధిద స్సిద్ధిసాధనః ॥" ౪౦

శం. భా. :- యస్మిన్ సంఖ్యా. నామ-రూప-భేదాదిః న విద్యతే ఇతి అసంఖ్యేయః. అప్రమేయ ఆత్మా స్వరూప మస్యేతి అప్రమేయాత్మా. అతిశేతే సర్వ మితో విశిష్టః. శిష్టం-శాసనమ్ తత్కరోతీతి శిష్టకృత్. శిష్టాన్ కరోతి పాలయతీతి వా సామాన్యవచనో ధాతు ర్విశేషవచనో దృష్టః-కురు కాష్ఠాపి త్యాహరణే యథా. తద్వదితి వా శిష్టకృత్ శుచిః-నిరంజనః. సిద్ధో నిర్వృత్తః అర్థ్యమానోఽర్థోఽస్యేతి సిద్ధార్థః 'సత్యకామః' ఇతి శ్రుతేః. సిద్ధో నిష్పన్న స్సంకల్పోఽస్యేతి సిద్ధసంకల్పః. 'సత్యసంకల్పః' ఇతి శ్రుతేః. సిద్ధిం ఫలం కర్తృభ్య స్స్వాధికారానురూపతో దదాతీతి. సిద్ధిదః. సిద్ధేః క్రియాయా స్సాధకత్వాత్ సిద్ధిసాధనః ॥

౨౮౭. అసంఖ్యేయః-

సంఖ్య అనగా నామ- రూప- భేదాదికము లేనివాడు గాన 'అసంఖ్యేయ' శబ్దముచే చెప్పబడుచున్నాడు.

౨౮౮. అప్రమేయాత్మా-

అప్రమేయమైన స్వరూపము కలవాడు అగుటచే 'అప్రమేయాత్మా' యని కీర్తింపబడుచున్నాడు.

౨౮౯. విశిష్టః-

సర్వమును అతిశయించి యున్నవాడు గాన 'విశిష్ట' శబ్దాభిధేయు డగుచున్నాడు.

౨౯౦. శిష్టకృత్-

శిష్టము- శాసనము- చేయువాడు, లేదా శిష్టులను చేయువాడు అనగా, పాలించువాడు కావున 'శిష్టకృత్' యని వ్యవహరింపబడుచున్నాడు. క్రియాసామాన్యమును చెప్పునట్టి ధాతువు విశేషక్రియను చెప్పుట కనబడుచున్నందున ఇట 'కృ' ధాతువు పాలనార్థకము అని తెలియనగును.

౨౯౧. శుచిః-

నిరంజనుడు- నిర్మలుడు గాన 'శుచిః' యని కీర్తింప బడుచున్నాడు.

౨౯౨. సిద్ధార్థః-

కోరబడు పదార్థ మంతయు సిద్ధించియే యున్నవాడు, కాన సిద్ధార్థనామముతో బరగును. ఇది 'సత్యకామః' అను

శ్రుతిచే సిద్ధము.

౨౫౩. సిద్ధసంకల్పః-

'సత్యసంకల్పః' అను శ్రుతినిబట్టి 'సిద్ధసంకల్పః' యని చెప్పబడును.

౨౫౪. సిద్ధిదః-

కర్తలకు సిద్ధిని- కర్మఫలమును- వారి వారి, అధికారానుగుణముగ ఇచ్చువాడుఅగుటచే 'సిద్ధిద' శబ్దవాచ్యుడు.

౨౫౫. సిద్ధిసాధనః-

క్రియాసాధకుడు గాన 'సిద్ధిసాధనః' యని ప్రస్తుతింపబడుచున్నాడు.

శ్లో॥ "వృషాహీ వృషభో విష్ణు ర్వృషపర్వా వృషోదరః ।
వర్ధనో వర్ధమానశ్చ వివిక్తః శ్రుతిసాగరః ॥ ౪౧

శం. భా. :- వృషో ధర్మః పుణ్యమ్- తదేవాఽహః ప్రకాశసాధర్మ్యాత్ ద్వాదశాహప్రభృతి ర్వృషాహః సోఽస్యాస్తీతి వృషాహీ వృషాహ ఇత్యత్ర 'రాజాహ స్సఖిభ్యష్టచ్' ఇతి టచ్ ప్రత్యయ స్సమాసాన్తః వృషభః- వర్షత్యేష భక్తేభ్యః కామానితి విష్ణుః- 'విష్ణు ర్విక్రమణాత్' ఇతి వ్యాసోక్తేః వృషరూపాణి సోపానపర్వా ణ్యాహుః పరంధామా రురుక్షో రిత్యతో వృషపర్వా. ప్రజా వర్షతీవ ఉదర మస్యేతి వృషోదరః, వర్ధయతీతి వర్ధనః, ప్రపంచ రూపేణ వర్ధతే ఇతి వర్ధమానః. ఇత్థం వర్ధమానోఽపి పృథగేవ తిష్ఠతీతి వివిక్తః. శ్రుతయః సాగర ఇవాఽత్ర వి ధీయన్తే ఇతి శ్రుతిసాగరః ॥

౨౫౬. వృషాహీ-

వృష మనగా, ధర్మము- పుణ్యము. అదియే ప్రకాశ

సామ్యమును బట్టి అహస్సు, అనగా ద్వాదశాహాది క్రతువు, వృషాహము. అది కలవాడు అగుటవలన 'వృషాహీ' యని చెప్పబడును.

౨౫౭. వృషభః-

భక్తుల కోరికలను వర్షించువాడు కాన 'వృషభః' యను నామముతో స్తవనీయుడు.

౨౫౮. విష్ణుః-

సర్వజగత్తును విక్రమించినవాడు- వ్యాపించినవాడు నగుటచే పరమాత్మ 'విష్ణు' శబ్దముచే చెప్పబడును.

౨౫౯. వృషపర్వా-

పరమపదము నధిష్ఠింప గోరువారికి ధర్మరూపములైన సోపానములు ఆలంబనముగ చెప్పుచున్నందున ధర్మరూపము లగు సోపానములు కలవాడు గాన 'వృషపర్వా' యని స్తుతింప బడుచున్నాడు.

౨౬౦. వృషోదరః-

ప్రజలను వర్షించునదిగా నున్న ఉదరము కలవాడు కనుక 'వృషోదర' శబ్దముచే నొప్పారును.

౨౬౧. వర్ధనః-

వృద్ధి పరచువాడు గాన 'వర్ధనః' అనియు,

౨౬౨. వర్ధమానః-

ప్రపంచరూపమున ప్రవర్ధమానుడు గాన 'వర్ధమానః'

అనియు చెప్పబడుచున్నాడు.

౭౬౩. వివిక్తః-

ఇట్లు ప్రవర్ధమానుడై కూడ వేరుగనే ఉండువాడగుట వలన 'వివిక్తః' యను నామముతో బరగును.

౭౬౪. శ్రుతిసాగరః-

శ్రుతులు, సాగరమందువలె తన యందు నిహితములై యుండువాడు గాన 'శ్రుతిసాగరః' యను అన్వర్థసంజ్ఞతో విరాజిల్లుచుండును.

శ్లో॥ సుభుజో దుర్ధరో వాగ్మీ మహేన్ద్రో వసుదో వసుః ।
నైకరూపో బృహద్రూప శ్శిపివిష్టః ప్రకాశనః ॥ ౭౫

శం. భా. :- శోభనా భుజా జగద్రక్షకరా అస్యేతి సుభుజః పృథివ్యాదీన్యపి లోకధారకాణ్యన్యై ర్ధారయితు మశక్యాని ధారయన్ న కేనచి ద్ధారయితుం శక్య ఇతి దుర్ధరః, దుఃఖేన ధ్యానసమయే ముముక్షుభిః హృదయే ధార్యత ఇతి వా దుర్ధరః. యతో నిస్సృతా బ్రహ్మమయీ వాక్ తస్మాత్ వాగ్మీ మహాంశ్చాసా విన్ద్రశ్చేతి మహేన్ద్రః, ఈశ్వరాణా మపీశ్వరః. వసు ధనం దదాతీతి వసుదః 'అన్నాదో వసుదానః' ఇతి శ్రుతేః. దీయమానం తద్వ స్త్వపి స ఏవేతి వా వసుః ఆచ్ఛాదయ త్యాత్మస్వరూపం మాయయేతి వా వసుః, అన్తరిక్ష ఏవ వసతి నాన్యత్రేతి అసాధారణేన వసనేన వాయుర్వా వసుః. 'వసుర న్తరిక్షసత్' ఇతి శ్రుతేః. ఏకం రూప మస్య న విద్యత ఇతి నైకరూపః. 'ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే' ఇతి శ్రుతేః, 'జ్యోతింషి విష్ణుః' ఇత్యాది స్మృతేశ్చ బృహ న్మహద్వరాహాదిరూప మస్యేతి బృహద్రూపః. శిపయః పశవః తేషు విశతి ప్రతితిష్ఠతి యజ్ఞరూపేణేతి శిప

విష్టః. యజ్ఞమూర్తిః 'యజ్ఞో వై విష్ణుః పశవ శ్శిపిః యజ్ఞ ఏవ పశుషు ప్రతితిష్ఠతి' ఇతి శ్రుతేః, శిపయో రశ్మయ స్తేషు నివిష్ట ఇతి వా.

శ్లో॥ "శైత్యా చ్ఛయనయోగాచ్చ శీతి వారి ప్రచక్షతే ।
తత్పానా ద్రక్షణాచ్చైవ శిపయో రశ్మయో మతాః ॥
తేషు ప్రవేశా ద్విశ్వేశ శ్శిపివిష్ట ఇహోచ్యతే ॥

సర్వేషాం ప్రకాశనశీలత్వాత్ ప్రకాశనః.

౨౬౫. సుభుజః-

జగద్రక్షాకరములైన భుజములు కలవాడు కాన 'సుభుజః' యను నామముచే స్తవనీయుడు.

౨౬౬. దుర్ధరః-

లోకధారకములై యున్నవి పృదివ్యాదులు. అన్యుల చేత ధరింపశక్యము కానట్టి యాపృథివ్యాదులను ధరించుచున్న వాడై ఎవరిచేతను ధరింప శక్యము కానట్టివాడు; మరియు ధ్యానసమయములో ముముక్షువులచేత హృదయమందు కష్టముతో ధరింపబడువాడును కాన 'దుర్ధరః' యను నామముతో నొప్పారును.

౨౬౭. వాగ్మీ-

వేదమయ వాక్కును ప్రసరింపజేయువాడు కనుక 'వాగ్మీ' యని చెప్పబడుచున్నాడు.

౨౬౮. మహేన్ద్రః-

ఈశ్వరులకును ఈశ్వరుడు అగుటవలన మహేన్ద్రశబ్ద వాచ్యుడు.

౨౯౯. వసుదః-

వసువును - ధనము నిచ్చువాడు గాన 'వసుదః' యని స్తవనీయుడు. 'అన్నాదో వసుదానః' అను శ్రుతిచే నీ విషయము సిద్ధము.

౨౭౦. వసుః-

ఇవ్వబడునట్టి యావస్తువుకూడ ఆయనయే కనుకను ఆత్మస్వరూపమును మాయచేత నాచ్ఛాదించువాడగుటను బట్టియు వసునామము పరమేశ్వరునియందు రూఢము. 'వసురన్తరిక్షసత్' అను శ్రుతినిబట్టి అన్తరిక్షమందు మాత్రమే వసించుచు ఇతరత్ర వసింపని కారణమున వాయుస్వరూపుడు నగుటచే వసుశబ్దాభిధేయు డగుచున్నాడు.

౨౭౧. నైకరూపః-

'ఇన్ద్రో మాయాభిః పురురూపః' అను శ్రుతి వచనము ననుసరించి ఏకమైన రూపము లేనట్టివాడు కావున 'నైకరూపః' యని చెప్పబడును. 'జ్యోతీంషి విష్ణుః' అను స్మృతి కూడ పై విషయమునే వివరించుచున్నది.

౨౭౨. బృహద్రూపః-

మహావరాహాదిరూపము కలవాడు కాన 'బృహద్రూపః' యను నామముతో విరాజిల్లుచున్నాడు.

౨౭౩. శిపివిష్టః-

'యజ్ఞో వై విష్ణుః, పశవ శ్శిపిః' అను శ్రుతిని బట్టి యజ్ఞపశువులయందు యజ్ఞరూపమున ప్రవేశించియుండు

యుష్ణమూర్తి గాన పరమేశ్వరుడు 'శిపివిష్ట' శబ్దముచే భజ పియుడు.

లేదా, 'శిపి' శబ్దమందలి 'శి' కి, శైత్యమును బట్టియు భగవంతుని శయనమును బట్టియు జలము అని యర్థము. తరువాత నున్న 'పి' కి, పానము, పాలనము అర్థము. కావున 'శిపయః' అనగా జలపాన, పాలన క్రియలు గల రశ్ములు అని యర్థము. ఆ రశ్ములయందు ప్రవేశించుటచే విశ్వేశుడు 'శిపివిష్టః' యని కీర్తింపబడుచున్నాడు.

౨౭౮. ప్రకాశనః-

సర్వమును ప్రకాశింపజేయువాడు కాన 'ప్రకాశనః' యని చెప్పబడును.

శ్లో॥ ఓజస్తేజోద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః ।
బుద్ధః స్పష్టాక్షరో మన్త్రి శ్చన్ద్రాంశు ర్భాస్కరద్యుతిః ॥

శం. భా. :- ఓజః ప్రాణబలమ్, తేజః శౌర్యాదయో గుణాః ద్యుతి ర్దీప్తిః, తాః ధారయతీతి ఓజస్తేజోద్యుతిధరః అథవా, ఓజః తేజః ఇతి నామద్వయం' 'బలం బలవతాం చాహమ్' 'తేజస్తేజస్వినామహమ్' ఇతి భగవద్వచనాత్. ద్యుతిం జ్ఞానలక్షణాం దీప్తిం ధారయతీతి ద్యుతిధరః. ప్రకాశస్వరూప ఆత్మా యస్య స ప్రకాశాత్మా. సవిత్రాది విభూతిభిః విశ్వం ప్రతాపయతీతి ప్రతాపనః. ధర్మ-జ్ఞాన-వైరాగ్యాదిభి రూపేతత్వాత్ బుద్ధః. స్పష్ట ముదాత్త మోంకారలక్షణ మక్షర మస్యేతి స్పష్టాక్షరః. ఋగ్యజుస్సామలక్షణో మన్త్రః. మన్త్రబోధ్యత్వాద్వా మన్త్రః. సంసారతాప తిగ్మాంశుతాప తాపితచేతసామ్ చన్ద్రాంశు రివాహ్లాదకరత్వాత్ చన్ద్రాంశుః. భాస్కరద్యుతిసాధర్మ్యాత్. భాస్కరద్యుతిః ॥

౨౭౫. ఓజస్తేజోద్యుతిధరః-

ప్రాణబలము, శౌర్యాదిగుణములు, దీప్తి - వీనిని ధారణ చేసినవాడు గాన 'ఓజస్తేజోద్యుతిధరః' అను నామముచే కీర్తనీయుడు. లేదా, ఓజః, తేజః, అని నామద్వయము. 'బలం బలవతాం చాహమ్' అని చెప్పుటచేతను 'తేజస్తేజస్వినామహమ్' అని చెప్పుటవలనను భగవంతుడు ఓజస్స్వరూపుడును తేజస్స్వరూపుడును అగును. ద్యుతి- జ్ఞానలక్షణ దీప్తిని ధారణ చేయువాడు గాన 'ద్యుతిధరః' యని చెప్పబడును.

౨౭౬. ప్రకాశాత్మా-

ప్రకాశస్వరూపమైన ఆత్మకలవాడు అగుటచే 'ప్రకాశాత్మ' యని స్తుతింపబడుచున్నాడు.

౨౭౭. ప్రతాపనః-

సూర్యాది విభూతులచేత విశ్వమును విశేషముగ తపింపజేయువాడు గాన 'ప్రతాపన' శబ్దవాచ్యుడు.

౨౭౮. ఋద్ధః-

ధర్మ- జ్ఞాన- వైరాగ్యాదులచే సమృద్ధుడు కనుక 'ఋద్ధః' యను నామము పరమేశ్వరునియందు ప్రసిద్ధము.

౨౭౯. స్పష్టాక్షరః-

స్పష్టము ఉదాత్తము నగు ఓంకారరూపమైన అక్షరము కలవాడు కాన 'స్పష్టాక్షరః' యను శబ్దముచే చెప్పబడుచున్నాడు.

౨౮౦. మన్త్రీ—

ఋగ్యజుస్సామలక్షణ మన్త్రస్వరూపుడు, మన్త్రబోధ్యుడును అగుటవలన 'మన్త్రి' శబ్దవాచ్యు డగుచున్నాడు.

౨౮౧. చంద్రాంశుః—

సంసారతాపసంతప్త చిత్తులకు చంద్రాంశువు వలె ఆహ్లాదకరుడు అగుటచే 'చంద్రాంశు' నామముచే స్తవనీయుడు.

౨౮౨. భాస్కరద్యుతిః—

సూర్యదీప్తితో తుల్యదీప్తి కలవాడు గాన 'భాస్కరద్యుతిః' యను నామముతో శోభిల్లుచున్నాడు.

శ్లో॥ అమృతాంశూద్భవో భాను శ్శశబిన్దు స్సురేశ్వరః ।
ఔషధం జగతస్సేతు స్సత్యధర్మపరాక్రమః ॥ ౨౨

శం భా. :- మథ్యమానే పయోనిధా వమృతాంశో శ్చన్ద్రస్య ఉద్భవో యస్మాత్సః అమృతాంశూద్భవః భాతీతి భానుః. 'తమేవ భాన్త మనుభాతి సర్వమ్' ఇతి శ్రుతేః. శశ ఇవ బిన్దు ర్లాంఛన మస్యేతి శశబిన్దుః శ్చన్ద్రః. తద్వత్ ప్రజాః పుష్ణాతీతి శశబిన్దుః "పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః" ఇతి భగవద్వచనాత్ సురాణాం దేవానాం శోభన దాతౄణాం చేశ్వరః సురేశ్వరః. సంసారరోగభేషజత్వాత్ ఔషధమ్. జగతాం సముత్తారణహేతుత్వా దసంభేదకారణత్వాద్వా సేతువత్ వర్ణాశ్రమాదీనాం జగతస్సేతుః. 'ఏష సేతు ర్విధరణ ఏషాం లోకానా మసంభేదాయ' ఇతి శ్రుతేః. సత్యా అవితథా ధర్మా జ్ఞానాదయో గుణాః పరాక్రమశ్చ యస్య సః. సత్యధర్మపరాక్రమః ॥

౨౮౩. అమృతాంశూద్భవః—

సముద్రమథన కాలమందు అమృతాంశువు యొక్క -

చంద్రునియొక్క— ఉద్భవమునకు హేతు వయినవాడు గాన 'అమృతాంశూద్భవః' యని కీర్తింపబడుచున్నాడు.

౨౮౪. భానుః—

'తమేవ భాన్త మనుభాతి సర్వమ్' అని శ్రుత్యుక్త ప్రకారము ప్రకాశస్వరూపుడు కాన 'భానుః' యని ప్రస్తుతింపబడుచున్నాడు.

౨౮౫. శశబిన్దుః—

శశమువంటి బిందువు– లాంఛనము– కలవాడు చంద్రుడు; చంద్రునివలె ప్రజలను పోషించువాడు గాన 'శశబిన్దుః' పరమేశ్వరునియందు ప్రసిద్ధము. 'పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః'– అను వచనము ఈపై విషయమును వివరించుచున్నది.

౨౮౬. సురేశ్వరః—

దేవతలకును, శుభప్రదాతలకును ఈశ్వరుడు కాన 'సురేశ్వర' నామాంచితుడు.

౨౮౭. ఔషధమ్—

సంసారరోగ నివారకత్వమును బట్టి ఔషధరూపుడు అగుటచే 'ఔషధమ్' అనియు భగవంతుని నామము ప్రసిద్ధము.

౨౮౮. జగతస్సేతుః—

జగత్తును సంసార సాగరము నుండి దాటించువాడును; వర్ణాశ్రమాదుల అసంభేదమునకు – వ్యవస్థకు – కారణమైనవాడును అగుటచే 'జగతస్సేతుః' యని చెప్పబడుచున్నాడు.

ఈ విషయము 'ఏష సేతుర్విధరణ ఏషాంలోకానా మసంభేదాయ' అను శ్రుతిచే సిద్ధము.

౨౮౯. సత్యధర్మ పరాక్రమః-

అమోఘములైన జ్ఞానాదిగుణములు, పరాక్రమము కలవాడు గాన 'సత్యధర్మ పరాక్రమః' యని భగవంతుడు కీర్తనీయు డగుచున్నాడు.

శ్లో॥ "భూతభవ్యభవన్నాథః పవనః పావనోఽనలః ॥
కామహా కామకృత్ కాన్తః కామః కామప్రదః ప్రభుః ॥"

శం. భా. :- భూతభవ్యభవతాం భూతగ్రామాణాం నాథః తైర్యాచ్యతే. తా నుపతపతి; తేషా మీష్టే శాస్తీతి వా భూతభవ్యభవన్నాథః. పవత ఇతి పవనః. 'పవనః పవతా మస్మి' ఇతి భగవద్వచనాత్. పావయతీతి పావనః. 'భీషాఽస్మా ద్వాతః పవతే' ఇతి శ్రుతేః. అనాన్ ప్రాణాన్ ఆత్మత్వేన లాతీతి జీవః అనలః. అలాతేర్గన్ధవాచినో నఞ్ పూర్వాద్వా 'అగన్ధ మరసమ్' ఇతి శ్రుతేః న అలం పర్యాప్త మస్య విద్యతే ఇతి వా అనలః కామాన్ హన్తి ముముక్షూణాం భక్తానాం హింసకానాంచేతి కామహా. సాత్త్వికానాం కామాన్ కరోతీతి కామకృత్. కామః ప్రద్యుమ్న తస్య జనకత్వాద్వా అభిరూపతమః కాన్తః. కామ్యతే పురుషార్థాభికాంక్షిభిరితి కామః. భక్తేభ్యః కామాన్ ప్రకర్షేణ దదాతీతి. కామప్రదః. ప్రకర్షేణ భవనాత్ ప్రభుః ॥

౨౯౦. భూతభవ్యభవన్నాథః-

భూత భవిష్య ద్వర్తమానకాలములకు చెందిన భూతకోటికి నాథుడు, అనగా భూతకోటిచే యాచింపబడువాడును, భూతకోటిని తపింపజేయువాడును, భూతకోటికి ఈశుడును,

భూతకోటిని శాసించువాడును గాన 'భూతభవ్యభవన్నాథః' యని పిలవబడుచున్నాడు.

౨౯౧. పవనః-

'పవనః పవతామస్మి' అను భగవద్వచనానుసారము పవిత్రీకరించు వాయుస్వరూపుడు కాన 'పవన' శబ్దవాచ్యుడు.

౨౯౨. పావనః-

పావయతీతి పావనః 'భీషాస్మా ద్వాతః పవతే' అను శ్రుతి ననుసరించి వాయువును ప్రవర్తింపజేయువాడు గాన 'పావనః' యనబడును.

౨౯౩. అనలః-

అన- ప్రాణములను, ఆత్మభావముతో 'ల' గ్రహించువాడు; జీవుడు గాన 'అనలః' యని స్తోతవ్యుడు. లేదా గన్ధవాచక 'ణల' ధాతువు నఞ్ పూర్వకమై 'అనల' శబ్దమగును. 'అగన్ధ మరసమ్' అను శ్రుతిప్రకారము ఆత్మస్వరూపమని యర్థము. లేదా, 'న, అలం-పర్యాప్త మస్య విద్యతే', అను వ్యుత్పత్తిని బట్టి పర్యాప్తము- చాలినది తనకు లేనివాడు అనియు తెలియనగును.

౨౯౪. కామహా-

ముముక్షువులగు భక్తులకు కామములను పోగొట్టువాడు, హింసకుల కామములకు విఘాతము చేయువాడును అగుటచే 'కామహా' యను నామము భగవంతునియందు అన్వర్థము.

౨౯౫. కామకృత్-

సాత్త్వికుల కామము లీడేర్చువాడు; కామః ప్రద్యుమ్నుడు, ప్రద్యుమ్నజనకత్వముచే గూడ 'కామకృత్' శబ్ద వాచ్యుడు.

౨౯౬. కాన్తః-

అత్యన్త కమనీయరూపముతో ప్రకాశించువాడు కాన 'కాన్తః' యనుచు పరమేశ్వరనామము ప్రసిద్ధము.

౨౯౭. కామః-

పురుషార్థాభిలాషులచే కోరబడువాడు గాన పరమాత్మ 'కామః' యనుచు స్తుతింపబడుచున్నాడు.

౨౯౮. కామప్రదః-

భక్తులకు కామములను అధికముగ నిచ్చువాడు కనుక 'కామప్రదః' యను శబ్దము పరమేశ్వరునియందు రూఢము.

౨౯౯. ప్రభుః-

ప్రకృష్ట స్థితి కలవాడు గాన పరమాత్మ 'ప్రభుః' యను సంజ్ఞచే నొప్పును.

శ్లో॥ యుగాదికృత్ యుగావర్తో నైకమాయో మహాశనః ।
అదృశ్యో వ్యక్తరూపశ్చ సహస్రజి దనన్తజిత్ ॥ ౩౬

శం. భా. :- యుగాదేః కాలభేదస్య కర్తృత్వాత్, యుగాదికృత్, యుగానా మాది మారంభం కరోతీతి వా ఇతి నామ్నాం తృతీయం శతం వివృతమ్, యుగాని కృతాదీని అవర్తయతి కాలాత్మనేతి యుగావర్తః

ఏకా మాయా న విద్యతే బహ్వీ ర్మాయా వహతీతి నైకమాయః. 'న లోపో నఞః' ఇతి నకారలోపో న భవతి, ఞకారానుబన్ధరహితస్యాపి నకారస్య ప్రతిషేధవాచినో విద్యమానత్వాత్. మహ దశన మస్యేతి మహాశనః. కాల్పాన్తే సర్వగ్రసనాత్ సర్వేషాం బుద్ధీన్ద్రియాణా మగమ్యః. అదృశ్యః. స్థూలరూపేణ వ్యక్తం స్వరూప మస్యేతి వ్యక్తరూపః స్వయం ప్రకాశమానత్వాత్ యోగినాం వ్యక్తరూప ఇతి వా సురారీణాం సహస్రాణి యుద్ధే జయతీతి సహస్రజిత్. సర్వాణి భూతాని యుద్ధక్రీడాదిషు సర్వత్రాఽచిన్త్య శక్తితయా జయతీతి అనన్తజిత్ ॥

300. యుగాదికృత్ -

యుగాదిరూప కాలభేదమునకు కర్త, యుగముల నారంభము చేయువాడును గాన 'యుగాదికృత్' యను నామముచే స్తుతింపబడుచున్నాడు.

ఇక్కడకు నామములలో తృతీయశతము వివరింపబడెను.

301. యుగావర్తః-

కృతాదియుగములను కాలరూపమున ఆవర్తింపజేయువాడు కనుక 'యుగావర్తః' యనుచు భగవానుడు ధ్యాతవ్యుడు.

302. నైకమాయః-

ఏకమైన మాయకలవాడు కాడు; బహుమాయలు వహించినవాడు సగుటచే 'నైకమాయః' యని చెప్పబడును.

303. మహాశనః-

కల్పాంతమునందు సర్వగ్రాసము చేయువాడు కాన

శిఖండః కలాపః అలంకారోఽస్యేతి శిఖండీ, యతో గోపవేషధరః నహ్యతి భూతాని మాయయా అతో నహుషః, 'ణహ బన్ధనే' కామానాం వర్షణాత్ వృషః ధర్మః.

శ్లో॥ 'వృషో హి భగవాన్ ధర్మః స్మృతో లోకేషు భారత ।
వైఘంటుక పదాఖ్యానై ర్విద్ధి మాం వృష ముత్తమమ్' ॥
— ఇతి మహాభారతే.

సాధూనాం క్రోధం హన్తీతి క్రోధహా. అసాదుషు క్రోధం కరోతీతి క్రోధకృత్ క్రియతే ఇతి కర్మ, జగత్, తస్య కర్తా. 'యో వై బాలాక ఏతేషాం పురుషాణాం కర్తా, యస్య వై తత్ కర్మ స వేదితవ్యః' ఇతి శ్రుతేః, క్రోధకృతాం దైత్యాదీనాం కర్తా ఛేదక ఇత్యేకం వా నామ, విశ్వేషా మాలంబనత్వేన విశ్వే బాహవోఽస్యేతి విశ్వతో బాహవోఽస్యేతి వా 'విశ్వ బాహుః విశ్వతోబాహుః' ఇతి శ్రుతేః, మహీం పూజాం ధరణీం వా ధరతీతి మహీధరః ॥

౩౦౮. ఇష్టః–

పరమానన్దస్వరూపు డగుటచే ప్రియమైనవాడు యజ్ఞ విధానమున పూజింపబడువాడును అగుటవలన 'ఇష్టః' యను నామము ప్రసిద్ధము.

౩౦౯. అవిశిష్టః–

సర్వాన్తర్యామియై యున్నవాడు కాన 'అవిశిష్టః'యను శబ్దముచే అభిహితుడగుచున్నాడు.

౩౧౦. శిష్టేష్టః–

విద్వాంసులకు ఇష్టమైనవాడు, శిష్టులు ఇష్టులుగ నొప్పు వాడు గాన పరమేశ్వరుడు 'శిష్టేష్టః' యను నామముతో

కీర్తనీయుఁడు.

'ప్రియో హి జ్ఞానినో౽త్యర్థ మహం స చ మమప్రియః' అని భగవద్గీతలో చెప్పబడెను. అనగా, జ్ఞానులకు నేను ప్రియుడను; నాకు జ్ఞానులు ప్రియులు- అని భావము. లేక శిష్టులచే పూజింపబడువాడు గాన పరమేశ్వరుడు 'శిష్టేష్ట' నామాంచితు డగుచున్నాడు.

౩౧౧. శిఖండీ-

గోపవేషధరు డగుటచే నెమలిపింఛము అలంకారముగా గలవాడు గాన 'శిఖండీ' యని చెప్పబడుచున్నాడు.

౩౧౨. నహుషః-

భూతములను మాయతో 'నహ్యతి' బంధించువాడు కావున 'నహుష' శబ్దవాచ్యుడు.

౩౧౩. వృషః-

కామములను వర్షించునట్టి ధర్మమై యొప్పువాడు కనుక 'వృషః' యని స్తుతింపబడుచున్నాడు. 'వృషో హి భగవాన్ ధర్మః' యను మహాభారత శ్లోకముచే ఈ విషయము సూచితము.

౩౧౪. క్రోధహా-

సాధువుల క్రోధమును హరించువాడు కాన 'క్రోధహా' యనియు.

౩౧౫. క్రోధకృత్-

అసాధువులయందు క్రోధము కలవాడు కనుక 'క్రోధ

కృత్' యనియు చెప్పబడును. అసాధువులయందు క్రోధము గలవాడు. కర్తా- జగత్కర్త, ఇది 'యోవై బాలాక ఏతేషాం పురుషాణాం' యను శ్రుతిచే సిద్ధము. క్రోధము కల దైత్యాదులను 'కర్తా' ఛేదించువాడు అను అర్థముతో 'క్రోధకృత్కర్తా' అని ఏకనామముగా వచ్చును.

౩౧౬. విశ్వబాహుః-

విశ్వమునకు ఆలంబన మగుటచేత విశ్వబాహువులు కలవాడు; 'విశ్వతః' సర్వతః బాహువులు కలవాడును గాన 'విశ్వబాహుః' అను నామముచే కీర్తనీయుడు. 'విశ్వబాహుః విశ్వతో బాహుః' యను శ్రుతి ఉక్తవిషయమునే ప్రతిపాదించుచున్నది.

౩౧౭. మహీధరః-

మహీమ్- పూజను, లేదా భూమిని- ధరించువాడుగాన పరమేశ్వరుడు 'మహీధరః' యను నామముచే సంకీర్తనీయుడు.

శ్లో॥ "అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః ।
అపాంనిధి రధిష్ఠాన మప్రమత్తః ప్రతిష్ఠితః" ॥ ౪౫

శం. భా. :- షడ్భావవికారరహితత్వాత్ అచ్యుతః, 'శాశ్వతం శివ మచ్యుతమ్' ఇతి శ్రుతేః, జగదుత్పత్త్యాది కర్మభిః ప్రఖ్యాతః ప్రథితః సూత్రాత్మనా ప్రజాః ప్రాణయతీతి ప్రాణః, 'ప్రాణో వా అహ మస్మి' ఇతి బహ్వృచాః, సురాణా మసురాణాం చ ప్రాణం-బలం-దదాతి ద్యతివేతి ప్రాణదః, అదిత్యాం కశ్యపా ద్వాసవ స్యానుజో జాత ఇతి వాసవానుజః, ఆపో యత్ర నిధీయన్తే సః అపాంనిధిః, 'సరసా మస్మి సాగరః' ఇతి

భగవద్వచనాత్. అధితిష్ఠన్తి భూతాని ఉపాదానకారణత్వేనేతి బ్రహ్మ అధిష్ఠానమ్. 'మత్స్థాని సర్వభూతాని' ఇతి భగవద్వచనాత్. అధికారిభ్యః కర్మానురూపం ఫలం ప్రయచ్ఛన్నప్రమాద్యతీతి అప్రమత్తః. స్వే మహిమ్ని స్థితః ప్రతిష్ఠితః. 'స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి; స్వేమహిమ్ని ఇతి శ్రుతేః ॥

३०८. అచ్యుతః-

'శాశ్వతం శివ మచ్యుతమ్' అను శ్రుతివచనానుసారము, భావపదార్థములకు గల జన్మ మొదలు నాశాన్తమయిన షడ్విధవికారములు లేనివాడు కాన అచ్యుతనామముచే స్తవము చేయబడుచున్నాడు

३०९. ప్రథితః-

జగదుత్పత్త్యాదులను బట్టి ప్రఖ్యాతుడై యున్నవాడు కనుక 'ప్రథితః' యని చెప్పబడును.

३१०. ప్రాణః-

సూత్రాత్మరూపమున ప్రజలను ప్రాణవంతులను చేయువాడు గాన ప్రాణశబ్దవాచ్యుడు. 'ప్రాణో వా అహమస్మి' అను శ్రుతిచే ఈ విషయము సిద్ధము.

३११. ప్రాణదః-

సురులకు ప్రాణము- బలమును ఇచ్చువాడును అసురుల ప్రాణమును- బలమును- హరించువాడును గావున 'ప్రాణదః' యను నామముచే స్తవనీయుడగుచున్నాడు.

3_౨౨. వాసవానుజః-

అదితియందు కశ్యపుని వలన ఇంద్రునకు అనుజుడుగా ఆవిర్భవించినవాడు 'వాసవానుజ' శబ్దముచే కీర్తింపబడు చున్నాడు.

3_౨3. అపాంనిధిః-

'సరసామస్మి సాగరః' అను భగవద్వచన మును బట్టి జలము నకు నిధియైన సాగరమై యొప్పువాడు కాన 'అపాంనిధిః' యని చెప్పబడుచున్నాడు.

3_౨౪. అధిష్ఠానమ్-

'మత్ స్థాని సర్వభూతాని' అను భగవద్వచనానుసారము ఉపాదానకారణమై సర్వభూతములకు ఆధారమై యున్నవాడు గాన 'అధిష్ఠానమ్' అని యనబడుచున్నాడు.

3_౨౫. అప్రమత్తః-

ఆ యా అధికారులకు వారి వారి కర్మానుగుణముగ ఫల మిచ్చుచు ప్రమాదమును పొందనట్టివాడు కాన 'అప్రమత్తః' యని పిలవబడుచున్నాడు.

3_౨౬. ప్రతిష్ఠితః-

'కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి, స్వే మహిమ్ని' అని శ్రుత్యుక్త ప్రకారము తన మహిమయందే ఉన్నవాడు గాన 'ప్రతిష్ఠితః' యను నామముచే విరాజిల్లుచున్నాడు.

శ్లో॥ "స్కన్దః స్కన్దధరో ధుర్యో వరదో వాయువాహనః ।
వాసుదేవో బృహద్భాను రాదిదేవః పురన్దరః ॥ ౭౧

శం. భా. :- స్కన్న త్యమృతరూపేణ గచ్ఛతి వాయురూపేణ శోష యతీతి వా స్కన్దః స్కన్దం ధర్మపథం ధారయతీతి స్కన్దధరః. ధురం వహతి సమస్తభూత జన్మాదిలక్షణా మితి ధుర్యః అభిమతాన్ వరాన్ దదాతీతి, వరం-గాం దక్షిణాం దదాతి యజమానరూపేణేతి వా వరదః. 'గౌర్వై వరః' ఇతి శ్రుతేః మరుతః సప్త ఆవహాదీన్ వాహయతీతి వాయువాహనః. వసతి వాసయతి ఆచ్ఛాదయతి సర్వమితి వా వాసుః, దీవ్యతి క్రీడతే విజిగీషతే వ్యవహరతి ద్యోతతే స్తూయతే గచ్ఛతీతి వా దేవః వాసుశ్చాసౌ దేవశ్చేతి వాసుదేవః ॥

శ్లో॥ "ఛాదయామి జగత్సర్వం భూత్వా సూర్య ఇవాంశుభిః ।
సర్వభూతాధివాసశ్చ వాసుదేవ స్తత స్స్మృతః" ॥
"వాసనా త్సర్వభూతానాం వసుత్వా ద్దేవయోనితః ।
వాసుదేవ స్తతో వేద్యః యోగిభి స్తత్త్వ దర్శిభిః" ॥
—ఇతి ఉద్యోగపర్వణి.

'సర్వత్రాసౌ సమస్తం చ వస త్యత్రేతి వై యతః ।
తత స్స వాసుదేవేతి విద్వద్భిః పరిపఠ్యతే' ॥
'సర్వాణి తత్ర భూతాని వసన్తి పరమాత్మని ।
భూతేషు చ స సర్వాత్మా వాసుదేవ స్తతః స్మృతః' ॥
—ఇతి చ విష్ణుపురాణే.

'బృహన్తో భానవో యస్య చన్ద్రసూర్యాదిగామినః ।
తై ర్విశ్వం భాసయతి యః స బృహద్భాను రుచ్యతే' ॥

ఆదిః కారణం స చాసౌ దేవశ్చేతి ఆదిదేవః. ద్యోతనాది గుణవాన్ దేవః. సురశత్రూణాం పురాణాం దారణాత్ పురన్దరః, 'వాచంయమ పురన్దరౌ చ' ఇతి పాణినా నిపాతనాత్ ॥

౩౨౭. స్కన్దః-

అమృతరూపముతో ప్రవర్తించువాడును వాయురూపముతో శోషింపజేయువాడును గాన 'స్కన్ద' శబ్దముచే చెప్పబడుచున్నాడు.

౩౨౮. స్కన్దధరః-

స్కన్ద- ధర్మపథమును ధరింపజేయువాడు కనుక 'స్కన్దధరః' యను నామముతో ధ్యాతవ్యుడు.

౩౨౯. ధుర్యః-

సమస్తభూతముల యొక్క జన్మాదిలక్షణమైన భారమును వహించువాడు గాన 'ధుర్యః' యని చెప్పబడుచున్నాడు.

౩౩౦. వరదః-

అభిమతములైన వరముల నిచ్చువాడు, 'గౌర్వై వరః' అను శ్రుతిని బట్టి యజమానరూపమున గోవును దక్షిణగ నిచ్చువాడును కావున 'వరదః'యను నామముచే కీర్తనీయుడు.

౩౩౧. వాయువాహనః-

ఆవహ-ప్రవహ-అనువహ-సంవహ - వివహ-పరావహ-పరివహ - భేదములతో సప్తవిధములైన వాయువులను భూమి మొదలుకొని ధ్రువమండల పర్యంతము ప్రవర్తింపజేయువాడు గాన 'వాయువాహనః' యని స్తుతింపబడుచున్నాడు.

౩౩౨. వాసుదేవః-

సర్వత్ర వసించుట, సర్వమును ఆచ్ఛాదించుట కారణముగా 'వాసుః' అనియు, 'దివ్' ధాత్వర్థము లయిన క్రీడా-

విజిగీషా-వ్యవహార-ద్యుతి-స్తుతి-గతి-అర్థములను బట్టి 'దేవః' అనియు సిద్ధించును. వాసువయిన దేవుడు కనుక 'వాసుదేవః' అని సంకీర్తనీయుడు. ఈ విషయము మహాభారత మందలి 'ఛాదయామి జగత్సర్వమ్' మరియు, వాసనాత్సర్వభూతానాం' అను శ్లోకములలో చెప్పబడినది. 'పరమాత్మయందు సర్వ భూతములును ఆ పరమాత్మ సర్వభూతముల యందును ఉండు టనుబట్టి వాసుదేవుడని చెప్పబడినది' అని యనుచు విష్ణు పురాణ మందలి 'సర్వత్రాసౌ సమస్తంచ' మున్నగు శ్లోకములు పై విషయమును వివరించుచున్నవి.

333. బృహద్భానుః

సూర్యచంద్రగతములగు తన మహాతేజస్సులచేత విశ్వ మును ప్రకాశింప జేయుచున్నవాడు కావున 'బృహద్భానుః' యను నామముచే స్తోతవ్యుడు.

334. ఆదిదేవః-

కారణమై దీప్తి మొదలగు గుణములతో విరాజిల్లు వాడు గాన 'ఆదిదేవః' యను సంజ్ఞచే ఒప్పారుచున్నాడు.

335. పురన్దరః-

సురశత్రువులగు పురములను భగ్నము చేసినవాడు గాన 'పురన్దర శబ్దవ్యపదేశ్యుడు' ఈ శబ్దము పాణినిసూత్రము చేత సాధువు.

శ్లో॥ అశోక స్తారణ స్తారః శూర శ్శౌరి ర్జనేశ్వరః ।
అనుకూల శ్శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః ॥ ౫౦

శం. భా :- శోకాది షడూర్మిరహితః అశోకః, సంసారసాగరా త్తార యతీతి తారణః గర్భజన్మ-జరా-మృత్యులక్షణా ద్భయా త్తారయతీతి తారః విక్రమణాత్ శూరః, శూరస్యాఽపత్యం వసుదేవస్య సుతః శౌరిః, జనానాం జన్తూనా మీశ్వరః జనేశ్వరః, ఆత్మత్వేన హి సర్వేషా మనుకూలః నహి స్వస్మినే ప్రాతికూల్యం స్వయ మాచరతి, ధర్మత్రాణాయ శత మావర్తనాని ప్రాదుర్భావా అస్యేతి శతావర్తః, నాడీశతే ప్రాణరూపేణ వర్తతే ఇతి వా, పద్మం హస్తే విద్యతే ఇతి పద్మీ పద్మనిభే ఈక్షణే దృశా వస్యేతి పద్మ నిభేక్షణః ॥

33౬. అశోకః-

శోకమోహములు, క్షుత్పిపాసలు, జరామృత్యువులు, అను షడూర్ములు లేనివాడు కావున 'అశోకః' యని చెప్ప బడుచున్నాడు.

33౭. తారణః-

సంసారసాగరము నుండి తరింపజేయువాడు అగుటచే 'తారణః' యని కీర్తింపబడుచున్నాడు.

33౮. తారః-

గర్భ-జన్మ-జరా-మృత్యు-రూపమైన భయము నుండి తరింపజేయువాడు కనుక 'తార' శబ్దము చే సంస్తవనీయుడు.

33౯. శూరః-

విక్రమవిశేషము కలవాడు కాన 'శూరః' యనబడు చున్నాడు.

3౪౦. శౌరిః-

శూరుని సంతతికి చెందినవాడు వసుదేవసుతుడును

కావున 'శౌరిః' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు.

౩౮౧. జనేశ్వరః-

జనులకు ప్రాణులకు-ఈశ్వరుడు గాన 'జనేశ్వరః' యను నామముచే స్తోతవ్యు డగుచున్నాడు.

౩౮౨. అనుకూలః-

ఆత్మ అగుటచేత సర్వులకు అనుకూలుడు; తనయందు తాను ప్రతికూలుడును గావున 'అనుకూల' శబ్దవ్యపదేశ్యు డగుచున్నాడు.

౩౮౩. శతావర్తః-

ధర్మరక్షణార్థము శతావతారములు కలవాడు; లేదా, నాడీశతమందు ప్రాణరూపముతో నుండువాడు కాన 'శతావర్తః' యను నామముచే సంకీర్తనీయుడు.

౩౮౪. పద్మీ-

పద్మము హస్తమందు గలవాడు కనుక 'పద్మీ' యనుచు స్తోతవ్యు డగుచున్నాడు.

౩౮౫. పద్మనిభేక్షణః-

పద్మములవంటి దృష్టులు కలవాడు గాన 'పద్మనిభేక్షణః' యను ప్రసిద్ధి కలవాడు.

శ్లో॥ పద్మనాభోఽరవిన్దాక్షః పద్మగర్భ శ్శరీరభృత్ ।
మహర్ద్ధి రృద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః ॥ ౫౧

శం. భా. :- పద్మస్య నాభౌ మధ్యే కర్ణికాయాం స్థిత ఇతి పద్మనాభః. అరవిన్దసదృశే అక్షిణీ అస్యేతి అరవిన్దాక్షః. పద్మస్య హృదయాఖ్యస్య

మధ్యే ఉపాస్యత్వాత్ పద్మగర్భః. పోషయ న్నన్నరూపేణ ప్రాణరూపేణ వా శరీరిణాం శరీరాణి ధారయతీతి శరీరభృత్. స్వ మాయయా, శరీరాణి బిభర్తీతి వా. మహతీ ఋద్ధిః విభూతి రస్యేతి మహర్ద్ధిః. ప్రపంచరూపేణ వర్తమానత్వాత్ ఋద్ధః వృద్ధః పురాతన ఆత్మా యస్యేతి వృద్ధాత్మా. మహతీ అక్షిణీ మహాన్త్యక్షిణి వా అస్యేతి మహాక్షః. గరుడాంకో ధ్వజో యస్యేతి గరుడధ్వజః ॥

౩౮౬. పద్మనాభః-

పద్మము (హృదయపద్మము) యొక్క నాభి - మధ్య నున్న కర్ణిక- దానియందు ఉండువాడు గాన 'పద్మనాభ' శబ్ద వాచ్యుడు.

౩౮౭. అరవిన్దాక్షః-

అరవిన్దసదృశములగు అక్షులు కలవాడు గాన 'అరవిన్దాక్ష' నామముచే నొప్పారు.

౩౮౮. పద్మగర్భః-

హృదయపద్మ మధ్య నుపాసింపబడువాడు గాన 'పద్మగర్భః' యను నామము పరమేశ్వరునియందు ప్రసిద్ధము.

౩౮౯. శరీరభృత్-

శరీరధారుల శరీరములకు అన్నరూపమున ప్రాణరూపమున గూడ పోషణ చేయువాడు; లేదా, స్వకీయ మాయాశక్తి చేత శరీరములను ధరించువాడు నగుటచే 'శరీరభృత్' యని ప్రస్తుతింపబడుచున్నాడు.

౩౫౦. మహర్ద్ధిః-

మహావిభూతులు కలవాడు కావున 'మహర్ద్ధిః' యని కీర్తింపబడుచున్నాడు.

౩౫౧. ఋద్ధః-

ప్రపంచ రూపమున నొప్పువాడు అగుటవలన 'ఋద్ధః' యను నామముచే సంస్తవనీయుడు.

౩౫౨. వృద్ధాత్మా-

పురాతన స్వరూపము కలవాడు కాన 'వృద్ధాత్మా' యనుచు ధ్యాతవ్యుడగుచున్నాడు.

౩౫౩. మహాక్షః-

విశాలమైన నేత్రములు కలవాడు; అందుచే 'మహాక్షః' యని పరమేశ్వరుడు సంకీర్తింపబడుచున్నాడు.

౩౫౪. గరుడధ్వజః-

గరుడచిహ్నముతో విరాజిల్లు ధ్వజము కలవాడు కావున శ్రీహరి 'గరుడధ్వజః' యను నామముతో స్తవనీయుడు.

శ్లో॥ అతుల శ్శరభో భీమ స్సమయజ్ఞో హవిర్హరిః ।
సర్వలక్షణలక్షణ్యో లక్ష్మీవాన్ సమితింజయః ॥ ౩౭

శం. భా. :- తులా ఉపమాన మస్య న విద్యతే ఇతి అతులః. 'న తస్య ప్రతిమా౽స్తి యస్య నామ మహద్యశః' ఇతి శ్రుతేః, 'న త్వత్సమో౽స్త్యభ్యధికః కుతో౽న్యః' ఇతి స్మృతేశ్చ. శరా శ్శరీరాణి శీర్యమాణత్వాత్ తేషు ప్రత్యగాత్మతయా భాతీతి శరభః. బిభే త్యస్మా త్సర్వమితి భీమః,

'భీమాదయోఽపాదానే' ఇతి పాణినిస్మృతేః. సన్మార్గవర్తినా మభీషుః ఇతి వా. సృష్టి - స్థితి - సంహారసమయవిత్ షట్సమయాన్ జానాతీతి వా సమయజ్ఞః. సర్వభూతేషు సమత్వం యజనం సాధ్వస్యేతి వా. 'సమత్వ మారాధన మచ్యుతస్య' ఇతి ప్రహ్లాదవచనాత్. యజ్ఞేషు హవిర్భాగం హరతీతి హవిర్హరిః. 'అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ' ఇతి భగవద్వచనాత్. అథవా, హూయతే హవిషేతి హవిః. 'అబధ్నన్ పురుషం పశుమ్' ఇతి హవిష్ట్వం శ్రూయతే, స్మృతిమాత్రేణ పుంసాం పాపం సంసారం. వా హరతీతి. హరిద్వర్ణత్వాద్వా హరిః.

శ్లో॥ 'హరా మ్యఘం చ స్మర్తౄణాం హవిర్భాగం క్రతుష్వహం ।
వర్ణశ్చ మే హరిశ్శ్రేష్ఠ స్తస్మాద్ధరి రహం స్మృతః ॥

ఇతి భగవద్వచనాత్. సర్వై ర్లక్షణైః ప్రమాణైః లక్షణం జ్ఞానం జాయతే యత్ర ద్వినిర్దిష్టం సర్వలక్షణలక్షణం తత్ర సాధుః సర్వలక్షణ లక్షణ్యః తస్యైవ పరమార్థత్వాత్. లక్ష్మీ రస్య వక్షసి నిత్యం వసతీతి లక్ష్మీవాన్. సమితిం యుద్ధం జయతీతి సమితింజయః ॥

౩౫౫. అతులః -

'న తస్య ప్రతిమాఽ స్తి' అను శ్రుతి చెప్పినరీతిగ సాటి లేనివాడు కాన పరమాత్మ 'అతుల' శబ్దవాచ్యుడు. 'న త్వత్స మోఽ స్తి' యను శ్లోకమున- నీకు సమానుడే లేడు; అధికు డెక్కడ ?- యని భగవద్గీతలో చెప్పబడినది.

౩౫౬. శరభః-

శరము లనగా శీర్ణములు (నష్టములు) అగు శరీరములు; వానియందు ప్రత్యగాత్మగా భాసించువాడు కావున 'శరభః' యను నామముచే ఒప్పారును.

౩౫౭. భీమః-

సర్వమునకు భయము కలిగించువాడు కనుక 'భీమ' శబ్దముచే నుతింపబడు చున్నాడు. 'శంభోऽభీమః' అన్నపుడు 'అభీమః' అని పదచ్ఛేదము చేసినచో సన్మార్గవర్తులయెడ సౌమ్యస్వరూపుడు గాన 'అభీమః' అను నామము అన్వర్థమని తెలియనగును.

౩౫౮. సమయజ్ఞః-

సృష్టి- స్థితి- సంహార- సమయములు తెలిసినవాడు, అథవా, షడృతులక్షణ సమయములు తెలిసినవాడు, లేదా, సమ- యజ్ఞ ఈ రెండు శబ్దములు కలసి 'సమయజ్ఞః' అగును. సమ శబ్దమునకు సమత్వము, యజ్ఞశబ్దమునకు యజనము అర్థమగుటచే, సమత్వరూపమైన ఆరాధన కలవాడు నగుటచేతను 'సమయజ్ఞః' యని ప్రస్తుతింపబడుచున్నాడు. 'సమత్వమారాధన మచ్యుతస్య' అను ప్రహ్లాదసూక్తి ఈ విషయమును వివరించుచున్నది.

౩౫౯. హవిర్హరిః-

యజ్ఞములలో హవిర్భాగము గ్రహించువాడు కావున 'హవిర్హరిః' యను నామము సిద్ధము. 'అహం హి సర్వ యజ్ఞానాం భోక్తా చ' అను భగవద్వచనము ననుసరించి పై యంశము సూచితము. లేదా, 'అబధ్నన్ పురుషం పశుమ్' అను శ్రుతిచే హవిర్భాగము చెప్పబడినందున హవిస్సుచే హవనము చేయబడును గనుక 'హవిః' అని యొక నామము, స్మరణమాత్రము చేత లోకుల పాపములను సంసారమును

హరించువాడు, హరిద్వర్ణము కలవాడును కనుక 'హరిః' అని నామాంతరము తెలియునగును. 'హరామ్యఘం చ స్మర్తౄణాం' అను భగవద్వచనముచే 'హరి' నామ నిర్వచనము చెప్పబడెను.

౩౬౦. సర్వలక్షణలక్షణ్యః-

సర్వప్రమాణముల చేత కలిగెడి జ్ఞానముచేత నిర్దిష్టమైనవాడు, పరమార్థస్వరూపము నగుటచే 'సర్వలక్షణలక్షణ్యః' యని చెప్పబడును.

౩౬౧. లక్ష్మీవాన్-

లక్ష్మీదేవి నిత్యము వక్షస్థలమందు కలవాడు గావున పరమాత్మ 'లక్ష్మీవాన్' యని ప్రస్తుతింపబడుచున్నాడు.

౩౬౨. సమితింజయః-

యుద్ధమును జయించువాడు గాన 'సమితింజయః' శబ్దముచే వ్యపదేశ్యుడగుచున్నాడు

శ్లో॥ విక్షరో రోహితో మార్గో హేతుర్దామోదర స్సహః
మహీధరో మహాభాగో వేగవా నమితాశనః ॥ ౫౩

శం. భా :- విగతః క్షరో నాశో యస్యాసౌ విక్షరః స్వచ్ఛన్దతయా రోహితాం మూర్తిం మత్స్యవిశేషమూర్తిం వా వహన్ రోహితః, ముముక్షవస్తవం దేవం మార్గయన్తీతి మార్గః. పరమానన్దో యేన ప్రాప్యతే స మార్గ ఇతి వా. ఉపాదానం నిమిత్తం చ కారణం స ఏవేతి హేతుః దమాది సాధనేన ఉదారా ఉత్కృష్టా మతి ర్యా తయా గమ్యత ఇతి దామోదరః, 'దమా ద్దామోదరో విభుః' ఇతి మహాభారతే. యశోదయా దామ్నా ఉదరే బద్ధ ఇతి వా దామోదరః.

శ్లో॥ "దదర్శ చాఽల్పదన్తాస్యం స్మితహాసం చ బాలకమ్
తయో ర్మధ్యగతం బద్ధం ధామ్నా గాఢం తథోదరే।
తతశ్చ దామోదరతాం స యయౌ దామబన్ధనాత్ ॥

— ఇతి బ్రహ్మపురాణే.

"దామాని లోకనామాని తాని యస్యోదరాన్తరే
తేన దామోదరో దేవః శ్రీధరః శ్రీసమాశ్రితః" ॥

— ఇతి వ్యాసవచనాద్వా దామోదరః.

సర్వా నభిభవతి. క్షమత ఇతి వా సహః మహీం గిరి రూపేణ ధరతీతి మహీధరః 'వనాని విష్ణు ర్గిరయో దిశశ్చ' ఇతి పరాశరోక్తేః స్వేచ్ఛయా ధారయన్ దేహం మహాన్తి ఉత్కృష్టాని భోజనాని భాగజన్యాని భుఙ్క్తే ఇతి మహాభాగః. మహాన్ భాగః భాగ్య మస్యాఽవతారేషు ఇతి వా, మహాభాగః. వేగో జవ స్తద్వాన్ వేగవాన్, 'అనేజదేకం మనసో జవీయః' ఇతి శ్రుతేః, సంహారసమయే విశ్వ మశ్నాతీతి అమితాశనః ॥

3౬3. విక్షరః-

నాశనము లేనివాడు కనుక 'అక్షరః' యను నామముతో విలసిల్లును.

3౬౪. రోహితః-

ఇచ్ఛానుసారము రోహితవర్ణము గల మూర్తిని, లేక రోహిత మను మత్స్యముయొక్క మూర్తిని వహించువాడు గాన రోహిత శబ్దవాచ్యు డగుచున్నాడు.

3౬౫. మార్గః-

ముముక్షువులు అన్వేషించెడి దేవుడు; పరమానన్ద ప్రాప్తికి మార్గ మయినవాడును అగుటవలన 'మార్గః' యను

నామముచే స్తోతవ్యుడు.

౩౬౬. హేతుః-

ఉపాదానము- నిమిత్తము- అను కారణద్వయము తానే అయి యున్నవాడు గాన 'హేతుః' అని చెప్పబడు చున్నాడు.

౩౬౭. దామోదరః-

'దమా ద్దామోదరో విభుః' అని మహాభారతోక్త ప్రకారము దమాది సాధనముచే కలిగెడి ఉదారబుద్ధిచేత గమ్యుడైనవాడు; లేదా, యశోదాదేవి చేత దామ- త్రాడు- ఆత్రాటితో ఉదరమందు బంధింపబడినవాడు వగుటచే పరమే శ్వరుడు 'దామోదరం' శబ్దాభిధేయుడు. ఈ విషయము బ్రహ్మ పురాణ మందలి 'దదర్శ చాల్పదన్తాస్యం' అను వచనముచే సూచితము. 'దామాని లోకనామాని' యను వేదవ్యాస వచనానుసారము. లోకము లను పేరు గల దామములు ఉదరాన్తరమున గలవాడును కావున 'దామోదరః' అని ప్రసిద్ధినొందెను.

౩౬౮. సహః-

సర్వులను తిరస్కరించువాడు, క్షమించువాడును అగుట వలన 'సహః' యను నామము పరమేశ్వరునియందు ప్రసిద్ధము.

౩౬౯. మహీధరః-

మహీ- భూమి; దానిని గిరిరూపమున ధరించువాడు కనుక 'మహీధర' శబ్దముచే సంకీర్తనుడగుచున్నాడు. 'వనాని

విష్ణుర్గిరయోదిశ్చ' అను పరాశరవచనము వలన ఈ విషయము తెలియును.

౩౭౦. మహాభాగః-

స్వేచ్ఛతో దేహధారణ చేసి భాగలబ్ధములగు ఆహార ము.లను అనుభవించువాడు, లేదా, అవతారములలో మహా భాగ్యము కలవాడు నగుటంజేసి 'మహాభాగః' యనుచు ధ్యాతివ్యుడు.

౩౭౧. వేగవాన్-

'మనసో జవీయః' అని శ్రుతి చెప్పినరీతిగ మహావేగము కలవాడు కాన 'వేగవాన్' శబ్దముచే ప్రస్తుతింపబడుచున్నాడు.

౩౭౨. అమితాశనః-

సంహారసమయమందు విశ్వమును కబళించువాడు గాన 'మహాశనః' యను నామము పరమాత్మ యందు సిద్ధము.

శ్లో॥ ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః ।
కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః ॥ ౪౪

శం. భా. :- ప్రపంచోత్పత్త్యుపాదానకారణత్వాత్ ఉద్భవః. సర్గకాలే ప్రకృతిం పురుషం చ ప్రవిశ్య క్షోభయామాసేతి క్షోభణః.

శ్లో॥ "ప్రకృతిం పురుషంచైవ ప్రవిశ్యాత్మేచ్ఛయా హరిః ।
క్షోభయామాస సంప్రాప్తే సర్గకాలే వ్యయావ్యయౌ" ॥

—ఇతి విష్ణుపురాణే.

యతో దీవ్యతి క్రీడతి సర్గాదిభిః. విజిగీషతే అసురాదీన్. వ్యవహరతి సర్వభూతేషు. ఆత్మతయా ద్యోతతే. స్తూయతే స్తుత్యైః సర్వత్ర గచ్ఛతి.

తస్మాత్ దేవః, 'ఏకో దేవః' ఇతి మన్త్రవర్ణాత్. శ్రీః విభూతిః జగద్రూపా యస్య గర్భే స్థితా స శ్రీగర్భః పరమశ్చాసౌ ఈశనశీలశ్చేతి. పరమేశ్వరః, 'సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్' ఇతి భగవద్వచనాత్, జగదుత్పత్తౌ సాధకతమం కరణమ్. ఉపాదానం నిమిత్తంచ కారణమ్ కర్తా-స్వతన్త్రః, విచిత్రం భువనం క్రియతే ఇతి వికర్తా. స ఏవ భగవాన్ విష్ణుః స్వరూపం సామర్థ్యం చేష్టితం వా తస్య జ్ఞాతుం న శక్యతే ఇతి, గహనః గూహతే సంవృణోతి స్వరూపాది నిజమాయయేతి గుహః, 'నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః' ఇతి భగవద్వచనాత్ ॥

323. ఉద్భవః-

ప్రపంచోత్పత్తికి ఉపాదానకారణ మైనవాడు కాన 'ఉద్భవ' శబ్దవాచ్యుడు.

324. క్షోభణః-

సృష్టికాలమందు ప్రకృతిని పురుషుని ప్రవేశించి క్షోభ కలిగించువాడు కాన 'క్షోభణః' యని చెప్పబడుచున్నాడు. ఈ విషయము విష్ణుపురాణములో 'ప్రకృతిం పురుషం చైవ'- అను శ్లోకమందు ఇట్లు చెప్పబడినది- శ్రీహరి ఆత్మేచ్ఛచే సృష్టికాలము ప్రాప్తించినపుడు, వికృతి నొందెడి ప్రకృతిని, అవికృతరూపమయిన పురుషుని ప్రవేశించి క్షోభకలిగించును.

అనగా, ప్రకృతికి గుణవైషమ్యము సృష్టి కున్ముఖీకరణము, పురుషునకు జ్ఞానవికాసము, సంస్కారోద్బోధము కలిగించు నని భావము.

325. దేవః-

సృష్ట్యాది క్రియలచే క్రీడించువాడు, అసురాదులను

జయించువాడు, సర్వభూతము లందుండి వ్యవహరించువాడు, ఆత్మ యగుటచే ప్రకాశస్వభావము కలవాడు, స్తోత్రములచే స్తుతింపబడువాడు, సర్వత్ర గమనము కలవాడు నగుటవలనను 'ఏకో దేవః' అను మన్త్రముచే 'దేవుడొక్కడే' యని ప్రతిపాదింపబడుటచేతను 'దేవః' యని స్తోతవ్యుడు.

౩౭౬. శ్రీగర్భః-

జగద్రూపమయిన శ్రీ- విభూతి- గర్భమందు గలవాడు గాన 'శ్రీగర్భః' యని చెప్పబడుచున్నాడు.

౩౭౭. పరమేశ్వరః-

అత్యధికమైన శాసనము కలవాడు 'సమం సర్వేషు భూతేషు' అను భగవద్వచనానుసారము సర్వభూతములలో సమముగా నుండువాడు నగుటచే 'పరమేశ్వరః' యని సంకీర్తనీయుడగుచున్నాడు.

౩౭౮. కరణమ్-

జగదుత్పత్తిలో సాధకతముడు గాన 'కరణమ్' అనియు,

౩౭౯. కారణమ్-

ఉపాదానకారణము, నిమిత్తకారణము అయినవాడు గాన 'కారణమ్' అనియు చెప్పబడును.

౩౮౦. కర్తా-

స్వతంత్రుడు గాన 'కర్తా' యనియు,

౩౮౧. వికర్తా-

విచిత్ర భువనకర్త గాన 'వికర్తా' యనియు స్తుతింపబడు

చున్నాడు.

౩౮౨. గహనః-

ఆ పరమేశ్వరుని స్వరూపముగాని, సామర్థ్యముగాని, చేష్టలుగాని తెలిసికొన శక్యము కానివాడు గాన 'గహనః' యను నామముచే కీర్తనీయుడు.

౩౮౩. గుహః-

'నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః' అని భగవద్వచనోక్త ప్రకారము నిజమాయాశక్తిచేత తన స్వరూపాదులను తెలియకుండురీతిగ జేయువాడు గాన 'గుహః' యను నామముచే స్తవనీయుడగుచున్నాడు.

శ్లో॥ వ్యవసాయో వ్యవస్థానః సంస్థానః స్థానదో ధ్రువః ।
పరర్ధిః పరమస్పష్టః తుష్టః పుష్టః శుభేక్షణః ॥ ౪౨

శం. భా. :- సంవిన్మాత్ర స్వరూపత్వాత్ వ్యవసాయః. అస్మిన్ వ్యవస్థితి స్సర్వస్యేతి వ్యవస్థానః లోకపాలాద్యధికార జరాయుజాండజోద్భిజ్జ బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్ర అవాన్తరవర్ణ బ్రహ్మచారి-గృహస్థ-వానప్రస్థ-సంన్యాస-లక్షణాశ్రమ తద్ధర్మాదికాన్ విభజ్య కరోతీతి వా వ్యవస్థానః, 'కృత్యల్యుటో బహుళమ్' ఇతి బహుళగ్రహణాత్, కర్తరి ల్యుట్ ప్రత్యయః అత్ర భూతానాం సంస్థితిః ప్రలయాత్మికా సమీచీనం స్థానమస్యేతి వా సంస్థానః ధ్రువాదీనాం కర్మానురూపం స్థానం దదాతీతి స్థానదః, అవినాశిత్వాత్ ధ్రువః. పరా బుద్ధి ర్విభూతి రస్యేతి పరర్ధిః. పరా మా శోభా అస్యేతి పరమః సర్వోత్కృష్టో వా. అనన్యాధీన సిద్ధిత్వాత్ సంవిదాత్మతయా స్పష్టః పరమస్పష్టః పరమానన్దైకరూపత్వాత్ తుష్టః, సర్వత్ర సంపూర్ణత్వాత్

పుష్టః. ఈక్షణం దర్శనం యస్య శుభం, శుభకరం, ముముక్షూణాం మోక్షదం, భోగార్థినాం భోగదం. సర్వసన్దేహవిచ్ఛేదకారణం, పాపినాం పావనం, హృదయగ్రన్థే ర్విచ్ఛేదకరం, సర్వకర్మణాం క్షపణం, అవిద్యాయాశ్చ నివర్తకం స శుభేక్షణః, 'భిద్యతే హృదయగ్రన్థిః' ఇత్యాది శ్రుతేః ॥

౩౮౪. వ్యవసాయః–

జ్ఞానమాత్ర స్వరూపుడు అగుటవలన 'వ్యవసాయః' అని చెప్పబడుచున్నాడు.

౩౮౫. వ్యవస్థానః–

సర్వముయొక్క వ్యవస్థితికి ఆధారమైనవాడు, లోకపాలాదుల అధికారములను జరాయుజ- అండజ- ఉద్భిజ్జములను, బ్రాహ్మణ- క్షత్రియ- వైశ్య- శూద్ర- అవాన్తర వర్ణములను, బ్రహ్మచారి- గృహస్థ- వానప్రస్థ- సంన్యాస- ఆశ్రమములను, తద్ధర్మములను విభాగముగ చేయువాడు నగుట వలన 'వ్యవస్థానః' అను నామముచే పరమేశ్వర సంబంధమైన వ్యవస్థాత్మధర్మము ప్రతిపాదింపబడును.

౩౮౬. సంస్థానః–

ప్రలయరూపమయిన భూతసంస్థితికి ఆధారమైనవాడు, సమీచీనమైన స్థాన మయినవాడును అగుటచే 'సంస్థాన' శబ్దముచే బరగుచున్నాడు.

౩౮౭. స్థానదః–

ధ్రువుడు మొదలగువారికి కర్మానుగుణమైన స్థానమిచ్చువాడు కాన 'స్థానదః' యని చెప్పబడును.

౩౮౮. ధ్రువః-

వినాశరహితుఁడు అగుటచే 'ధ్రువః' యని పిలవబడు చున్నాఁడు.

౩౮౯. పరర్ధిః-

పరమ విభూతి కలవాఁడు, పరాఉత్కృష్టమయిన శోభ-మా- కలవాఁడు, అన్యనిరపేక్షమైన సిద్ధికలవా డగుటవలన సర్వోత్కృష్టుఁడును కాన 'పరర్ధిః' యనబడును.

౩౯౦. పరమస్పష్టః-

జ్ఞానస్వరూపు డగుటవలన మిక్కిలి స్పష్టమైనవాఁడు గాన 'పరమస్పష్టః' యని చెప్పబడును.

౩౯౧. తుష్టః-

పరమానన్దస్వరూపు డగుటచే తుష్టుఁడు గాన 'తుష్టః' యనియు,

౩౯౨. పుష్టః-

సర్వత్ర సంపూర్ణు డగుటచే 'పుష్టః' యనియు చెప్ప బడుచున్నాఁడు.

౩౯౩. శుభేక్షణః-

శుభకరమైన దర్శనము కలవాఁడు గాన 'శుభేక్షణ' నామముచే నొప్పారునట్టివాఁడు. ఆ పరమాత్మదర్శనము-ముముక్షువులకు మోక్ష మిచ్చును; భోగార్థులకు భోగము లిచ్చును; సర్వసందేహ విచ్ఛేదము చేయును; పాపులకు పావనమైనది; హృదయగ్రన్థిని విచ్ఛేదించునది; సర్వకర్మలను నశింప

జేయునది; అవిద్యను నివర్తింపజేయునది. ఈ విషయము- 'భిద్యతే హృదయగ్రన్థిః' ఇత్యాది శ్రుతిసిద్ధము.

శ్లో॥ రామో విరామో విరతో మార్గో నేయో నయోఽనయః
వీరశ్శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః ॥ ౫౬

శం. భా. :- నిత్యానన్దలక్షణేఽస్మిన్ యోగినో రమన్తే ఇతి రామః.

శ్లో॥ రమన్తే యోగినో యస్మిన్ నిత్యానన్దే చిదాత్మని ।
ఇతి రామపదే నైతత్పరం బ్రహ్మాఽభిధీయతే ॥
—ఇతి పద్మపురాణే.

స్వేచ్ఛయా రమణీయం వపుర్వహన్వా దాశరథీ రామః విరామోఽవసానం ప్రాణినా మస్మిన్నితి విరామః విగతం రత మస్య విషయసేవాయామితి. విరతః యం విదిత్వా అమృతత్వాయ కల్పన్తే యోగినో ముముక్షవః స ఏవ పన్థాః మార్గః 'నాన్యః పన్థా విద్యతేఽయనాయ' ఇతి శ్రుతేః. మార్గేణ సమ్యక్ జ్ఞానేన జీవః పరమాత్మతయా నీయతే ఇతి నేయః నయతీతి నయః నేతా మార్గో, నేయో, నయ ఇతి త్రిరూపః పరికల్ప్యతే నాస్య నేతా విద్యతే ఇతి అనయః ఇతి నామ్నాం చతుర్థం శతం వివృతమ్ విక్రమశాలిత్వాత్ వీరః శక్తిమతాం విరించ్యాదీనామపి శక్తిమత్త్వాత్ శక్తిమతాం శ్రేష్ఠః, సర్వభూతానాం ధారణాత్ ధర్మః. 'అణురేష ధర్మః' ఇతి శ్రుతేః. ధర్మై రారాధ్యత ఇతి వా ధర్మః. శ్రుతయః స్మృతయశ్చ యస్యాజ్ఞాభూతాః స ఏవ సర్వధర్మవిధా ముత్తమః ఇతి ధర్మవిదుత్తమః.

౩౯౪. రాముః-

రమన్తే యోగినో యస్మిన్...' అను పద్మపురాణ వచనానుసారము యోగులు రమించెడి నిత్యానన్ద స్వరూపమగు పరబ్రహ్మ; మఱియు, ఇచ్ఛానుసారము రమణీయమైన

మూర్తిని వహించిన దశరథాత్మజుడగు రాముడును గాన 'రామః' యనుచు పరమేశ్వరుడు స్తోతవ్యుడగుచున్నాడు.

౩౯౫ విరామః-

ప్రాణులయొక్క అవసానము తనయందగునట్టివాడు కనుక 'విరామ శబ్దముచే కీర్తనీయుడు

౩౯౬. విరతః-

విషయసేవయందు విరతి కలవాడు అగుటచే 'విరతః' యని చెప్పబడుచున్నాడు.

౩౯౭. మార్గః-

'నాన్యః పన్థా విద్యతేఽయనాయ' అని శ్రుతి చెప్పినట్లు యోగులైన ముముక్షువులు అమృతత్వప్రాప్తికై తెలిసికొనవలసిన స్వరూపమై యొప్పువాడు కావున 'మార్గః' యను నామముచే బరగును.

౩౯౮. నేయః-

సమ్యక్ జ్ఞానరూపమగు మార్గముచేత జీవుడు పరమాత్మరూపము పొందింపబడుచున్నందున జీవుని పరమాత్మరూపమును పొందించువాడు కాన 'నేయ' శబ్దవాచ్యుడు.

౩౯౯. నయః-

నడిపించెడి నాయకుడు, మార్గ- నేయ- నయ- అనెడి త్రివిధరూపముగ పరికల్పింపబడువాడు గాన 'నయః' యనుచు స్తోత్రము చేయబడుచున్నాడు.

౪౦౦. అనయః-

తనకొక నాయకుడు లేనట్టివాడు కాన 'అనయః'యను నామము పరమేశ్వరునియందు ప్రసిద్ధము. ఇక్కడకు నామములలో చతుర్థ శతము వివరింపబడినది.

౪౦౧. వీరః-

పరాక్రమశాలి అగుటచే 'వీరః' యనియు,

౪౦౨. శక్తిమతాంశ్రేష్ఠః-

శక్తిమంతులైన బ్రహ్మాదులలో గూడ శక్తిమంతుడు గాన 'శక్తిమతాంశ్రేష్ఠః' యనియు చెప్పబడుచున్నాడు.

౪౦౩. ధర్మః-

సర్వభూతములను ధారణ చేయువాడు. 'అణురేష ధర్మః' అని శ్రుతి ఈ విషయమును చెప్పుచున్నది. ధర్మ మార్గములచేత ఆరాధింపబడువాడును గాన 'ధర్మః' యను నామముచే సంకీర్తనీయు డగుచున్నాడు.

౪౦౪. ధర్మవిదుత్తమః-

శ్రుతులును, స్మృతులును తన ఆజ్ఞలుగా గలవాడగుటచే ధర్మవిదులందరిలో ఉత్తముడు గాన 'ధర్మవిదాముత్తమః' యను నామముచే స్తోతవ్యుడగుచున్నాడు.

శ్లో॥ వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః ।
హిరణ్యగర్భ శ్శత్రుఘ్నో వ్యాప్తో వాయు రధోక్షజః ॥

శం. భా. :- వివిధా కుంఠా గతేః ప్రతిహతిః వికుంఠా, వికుంఠాయాః

కర్తేతి వైకుంఠః. జగదారంభే విశ్లిష్టాని భూతాని పరస్పరం సంశ్లేషయన్ తేషాం గతిం ప్రతిబధ్నాతీతి ॥

శ్లో॥ మయా సంశ్లేషితా భూమి రద్భిః వ్యోమ చ వాయునా
వాయుశ్చ తేజసా సార్ధం వైకుంఠత్వం తతో మమ ॥
—ఇతి శాన్తిపర్వణి.

సర్వస్మాత్పురా సదనాత్. సర్వపాపస్య సదనాద్వా పురుషః. 'స యత్పూర్వోఽస్మా త్సర్వస్మా త్సర్వాన్ పాప్మన ఔష త్తస్మా త్పురుషః' ఇతి శ్రుతేః, పురి శయనాద్వా పురుషః. 'స వా అయం పురుషః సర్వాసు పూర్షు పురిశయః' ఇతి శ్రుతేః. ప్రాణితి క్షేత్రజ్ఞరూపేణ, ప్రాణాత్మనా చేష్టయన్ వా ప్రాణః. 'చేష్టాం కరోతి శ్వసనస్వరూపీ' ఇతి విష్ణుపురాణే. ఖండయతి ప్రాణినాం ప్రాణాన్ ప్రలయాదిషు ఇతి ప్రాణదః. ప్రణౌతీతి ప్రణవః. 'తస్మా దోమితి ప్రణౌతి' ఇతి శ్రుతేః, ప్రణమ్యతే ఇతి వా ప్రణవః. 'ప్రణమన్తీహ వై వేదా స్తస్మాత్ప్రణవ ఉచ్యతే' ఇతి సనత్కుమారవచనాత్. ప్రపంచరూపేణ విస్తృతత్వాత్, పృథుః. హిరణ్యగర్భ సంభూతికారణం హిరణ్మయమండం యద్వీర్యా సంభూతం తదస్య గర్భ ఇతి హిరణ్యగర్భః. త్రిదశ శత్రూన్ హన్తీతి శత్రుఘ్నః. కారణత్వేన సర్వకార్యాణాం వ్యాపనాత్ వ్యాప్తః. వాతి గన్ధం కరోతీతి. వాయుః. 'పుణ్యో గన్ధః పృథివ్యాం చ' ఇతి భగవద్వచనాత్. 'అధో నక్షీయతే జాతు యస్మా త్తస్మా దధోక్షజః' ఇతి ఉద్యోగపర్వణి. ద్యౌరక్షం పృథివీ చాఽధః. తయో ర్యస్మా దజాయత మధ్యే వైరాజరూపేణ ఇతి వా అధోక్షజః. అధోభూతే ప్రత్యక్ప్రవాహితే అక్షగణే జాయత ఇతి వా అధోక్షజః

శ్లో॥ 'అధోభూతే హ్యక్షగణే ప్రత్యగ్రూపప్రవాహితే ।
జాయతే తస్య వై జ్ఞానం తేనాఽధోక్షజ ఉచ్యతే'' ॥ ఇతి.

౪౦౫. వైకుంఠః-

వివిధమైన గతికి ప్రతిఘాతము వికుంఠ యనబడును. వికుంఠకు కర్త వైకుంఠుడు. అనగా, జగదారంభమందు వేరుగా నున్న భూతములను పరస్పర మేళనము చేయుచు వాని గతిని ప్రతిబంధించువాడు కాన 'వైకుంఠః' యను నామము పరమేశ్వరుని యందు అన్వర్ధము. ఈ విషయము 'మయా సంశ్లేషితా భూమిః' అను శాన్తిపర్వమందలి శ్లోకముచే ఇట్లు సూచింపబడినది. నాచేత భూమి జలముతో, ఆకాశము వాయువుతో, వాయువు తేజస్సుతో, మేళనము చేయబడినది.

౪౦౬. పురుషః-

'స యత్పూర్వోఽస్మాత్సర్వస్మాత్సర్వాన్' - అను శ్రుత్యుక్తప్రకారము, సర్వమునకంటె పూర్వ మున్నందునను, సర్వపాపమును పోగొట్టుచున్నందునను లేక 'స వా అయం పురుషః......పురి శయః'- అను శ్రుతి ననుసరించి పుర మనబడు శరీరమందు శయనించువాడు కనుకను 'పురుషః' యనుచు స్తవనీయు డగుచున్నాడు.

౪౦౭. ప్రాణః-

క్షేత్రజ్ఞరూపమున 'ప్రాణితి' ప్రాణధారణ చేయువాడు గాన 'ప్రాణః' యని చెప్పబడుచున్నాడు. 'చేష్టాం కరోతి శ్వసనరూపీ' అని విష్ణుపురాణములో చెప్పినరీతిగ ప్రాణవాయు రూపమున చేష్ట కలిగించువాడును గాన ప్రాణశబ్దవ్యపదేశ్యుడు.

౪౦౮. ప్రాణదః-

ప్రలయాదులలో ప్రాణుల ప్రాణములను ఖండించు

వాడు కనుక 'ప్రాణదః' యనుచు ప్రస్తుతింపబడుచున్నాడు.

౪౦౯. ప్రణవః-

'తస్మాదోమితి ప్రణౌతి' అను శ్రుతిని బట్టి 'ఓమ్' అని స్తుతించుటవలనను. 'ప్రణమన్తీహ వై వేదా స్తస్మాత్ప్రణవ ఉచ్యతే' అను సనత్కుమారవచనమునుబట్టి ప్రణామము చేయబడు వాడగుటవలనను 'ప్రణవః' యను నామముచే చెప్పబడు చుండెను.

౪౧౦. పృథుః-

ప్రపంచరూపమున విస్తరించినవాడు గాన 'పృథుః' యనబడుచున్నాడు.

౪౧౧. హిరణ్యగర్భః-

హిరణ్యగర్భ (బ్రహ్మ) సంభవమునకు కారణము. హిరణ్మయము నైన అంశము ఎవని వీర్యమునుండి సంభవించి బ్రహ్మకు గర్భముగా నొప్పుచున్నదో అతడు 'హిరణ్యగర్భః' యనుచు భక్తులకు సమారాధనీయు డగుచున్నాడు.

౪౧౨. శత్రుఘ్నః-

దేవశత్రువులను హింసించువాడు గాన 'శత్రుఘ్న' శబ్దముచే బరగును.

౪౧౩. వ్యాప్తః-

సర్వకారణత్వముచేత సర్వకార్యములను వ్యాపించి యున్నవాడు గాన 'వ్యాప్తః' యను నామము పరమేశ్వరుని యందు ప్రసిద్ధము.

౨౧౨. వాయుః-

'పుణ్యో గన్ధః పృథివ్యాం చ' అను భగవద్వచనాను సారము; పుణ్యగన్ధమును కలిగించు వాయు వయి యొప్పు వాడు కనుక 'వాయు' శబ్దము పరమేశ్వర నామముగ ప్రసిద్ధము.

౨౧౩. అధోక్షజః-

ఉద్యోగపర్వములో- 'అధో నక్షీయతే జాతు యస్మా త్తస్మా దధోక్షజః' అను వచనమందలి 'యస్మాత్' అను శబ్దము నకు విగ్రహవాక్యము పూర్వము చూపబడినది. దానిబట్టి, సతతము ఊర్ధ్వరూపుడు; సంసారధర్మస్పర్శ రహితుడై ఉండు వాడు అని అర్థము. మరియు- 'ద్యౌరక్షం పృథివీచాధః' అను టచే భూమి ఆకాశముల మధ్య విరాడ్రూపముతో ప్రకా శించినవాడు; మరియు- 'అధోభూతేఽక్షగణే' అను వచనాను సారము, ఇన్ద్రియములు అన్తర్ముఖములుగా ప్రత్యగ్రూపమందు ప్రసారితములైనపుడు నిజరూపజ్ఞానము కలుగునట్టివాడును అగుటచే 'అధోక్షజః' యను శబ్దముచే స్తుతింపబడుచున్నాడు.

శ్లో॥ ఋతు స్సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః ।
ఉగ్ర స్సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః ॥ ౫౮

శం. భా :- కాలాత్మనా ఋతుశబ్దేన లక్ష్యత ఇతి ఋతుః. శోభనం నిర్వాణఫలం దర్శనం జ్ఞాన మస్యేతి. శుభే దర్శనే ఈక్షణే పద్మపత్రాయతే అస్యేతి. సుఖేన దృశ్యతే భక్తైరితి వా సుదర్శనః. కలయతి సర్వమితి కాలః 'కాలః కలయతా మహమ్' ఇతి భగవద్వచనాత్. పరమే ప్రకృష్టే స్వే మహిమ్ని హృదయాకాశే స్థాతుం శీల మస్యేతి పరమేష్ఠీ 'పరమేష్ఠీ విభ్రాజతే' ఇతి మన్త్రవర్ణాత్. శరణార్థిభిః పరితో గృహ్యత ఇతి సర్వగతత్వాత్.

పరితో జ్ఞాయత ఇతి వా, పత్రపుష్పాదికం భక్తై రర్పితం పరిగృహ్ణాతీతి వా, పరిగ్రహః. సూర్యాదీనా మపి భయహేతుత్వాత్ ఉగ్రః, 'భీషోదేతి సూర్యః' ఇతి శ్రుతేః, సంవసన్తి భూతాన్యస్మిన్నితి సంవత్సరః. జగద్రూపేణ వర్ధమానత్వాత్, సర్వకర్మాణి క్షిప్రంకరోతీతి వా, దక్షః సంసారసాగరే క్షుత్పిపాసాది షడూర్మిభి స్తరంగితే, అవిద్యాద్యై ర్మహాక్లేశైః పదాదిభి రుపక్లేశైశ్చ వశీకృతానాం విశ్రాన్తిం కాంక్షమాణానాం విశ్రామం మోక్షం కరోతీతి, విశ్రామః, విశ్వస్మాత్ దక్షిణః శక్తః విశ్వేషు కర్మసు దాక్షిణ్యాద్వా విశ్వదక్షిణః.

౪౧౬. ఋతుః-

కాలరూపమున తెలియబడువాడు గాన 'ఋతుః' యని సంకీర్తితుడగుచున్నాడు.

౪౧౭. సుదర్శనః-

శోభనమైన దర్శనము- నిర్వాణఫల మయిన తన జ్ఞానము కలవాడు; మరియు, పద్మపత్రములవలె విశాలములైన నేత్రములు గలవాడు, మరియు, భక్తులచేత సుఖముగా చూడబడువాడును అగుటచే 'సుదర్శనః' యను నామము సర్వవిధముల ఉపపన్నము.

౪౧౮. కాలః-

'కాలః కలయతా మహమ్' అనుటచే సర్వమును గణనచేయు కాలస్వరూపుడు గాన 'కాల' శబ్దవాచ్యుడు.

౪౧౯. పరమేష్ఠీ-

ప్రకృష్టమైన స్వకీయ మహిమ యందు హృదయాకాశమందు ఉండునట్టి స్వభావము కలవాడు గాన 'పరమేష్ఠీ' యనబడుచున్నాడు.

౪౨౦. పరిగ్రహః-

సర్వగతు డగుటచే శరణార్థులచే అంతటను గ్రహింప బడువాఁడు, అంతటను తెలియబడువాఁడు, భక్తులచే అర్పింప బడిన పత్రపుష్పాదికమును పరిగ్రహించువాడును అగుటవలన 'పరిగ్రహః' యనుచు చెప్పబడుచున్నాడు.

౪౨౧. ఉగ్రః-

'భీషోదేతి సూర్యః' అని శ్రుతిలో చెప్పినట్లు సూర్యాదులకును భయహేతు వయినవాడు గాన పరమాత్మ 'ఉగ్ర' శబ్దవాచ్యుడు.

౪౨౨. సంవత్సరః-

భూతముల వసతికి ఆధారమైనవాడు గాన 'సంవత్సరః' యను నామముచే నొప్పుచున్నాడు.

౪౨౩. దక్షః-

జగద్రూపమున వర్ధమానుడును, సర్వకర్మలను క్షిప్రముగా చేయువాడును గాన 'దక్షః' యను శబ్దముచే స్తవనీయుడగుచున్నాడు.

౪౨౪. విశ్రామః-

క్షుత్పిపాసాది షడ్విధములగు ఊర్ములతో తరంగితమగు సంసారసాగరమందు మహాక్లేశములైన అవిద్యాదులచేతను ఉపక్లేశములైన మదాదులచేతను పీడితులై విశ్రాంతిని వాంఛించుచుండువారికి విశ్రామము (మోక్షము) ను కలిగించువాడు గావున 'విశ్రామః' యని భగవానుడు స్తవనీయుడగుచున్నాడు.

౪౧౫. విశ్వదక్షిణః-

సర్వము కంటెను శక్తి కలవాడు; సర్వకర్మలయందు 'దక్షిణః' సమర్థుడను అగుటచే శ్రీహరి విశ్వదక్షిణః' యను సంజ్ఞతో బరగుచున్నాడు.

శ్లో॥ విస్తారః స్థావరస్థాణుః ప్రమాణం బీజమవ్యయమ్ ।
అర్థోఽనర్థో మహాకోశో మహాభోగో మహాధనః ॥ ౫౯

శం. భా. :- విస్తీర్యన్తే సమస్తాని జగన్త్యస్మిన్నితి విస్తారః స్థితి శీలత్వాత్ స్థావరః. స్థితిశీలాని పృథివ్యాదీని తిష్ఠన్త్యస్మిన్నితి స్థాణుః. స్థావరశ్చాఽసౌ స్థాణుశ్చ స్థావరస్థాణుః. సంవిదాత్మనా ప్రమాణమ్. అన్యథాభావ వ్యతిరేకేణ కారణమితి బీజ మవ్యయమ్. సవిశేషణమేకం నామ. సుఖ రూపత్వా త్సర్వై రర్థ్యత ఇతి అర్థః, న విద్యతే ప్రయోజన మాప్తకామత్వా దస్యేతి అనర్థః. మహాన్తః కోశాః అన్నమయాదయః అచ్ఛాదకా అస్యేతి మహాకోశః మహాన్ భోగః సుఖరూపోఽస్యేతి మహాభోగః. మహత్ భోగ సాధనలక్షణం ధన మస్యేతి మహాధనః ॥

౪౧౬. విస్తారః-

సమస్త జగత్తులు తనయందు విస్తృతములై యున్న వాడు కావున 'విస్తారః' యను నామముచే స్తుతింపబడు చున్నాడు.

౪౧౭. స్థావరస్థాణుః-

స్థితిశీలు డగుటచే స్థావర మనియు, స్థితిశీలములగు పృథివ్యాదులకు ఆధారభూతు డగుటచే స్థాణు వనియు చెప్ప బడుటవలన 'స్థావరస్థాణుః' అని కీర్తింపబడుచుండెను.

౨౨౮. ప్రమాణమ్-

సంవిత్ (జ్ఞాన) స్వరూపమైనవాడు గాన 'ప్రమాణమ్' అని చెప్పబడుచున్నాడు.

౨౨౯. బీజమవ్యయమ్-

మార్పులేకుండెడి కారణము కావున 'బీజమవ్యయమ్' అను నామముతో బరగునట్టివాడు. ఇది ఏకనామము.

౨౩౦. అర్థః-

సుఖరూప మగుటచే సర్వులచేతను అర్థింపబడువాడు కనుక 'అర్థః' అని చెప్పబడుచున్నాడు.

౨౩౧. అనర్థః-

ఆప్తకాము డగుటచే అపేక్షితమైన ప్రయోజన మేదియు లేనివాడు గాన 'అనర్థః' యను నామముచే చెప్పబడును.

౨౩౨. మహాకోశః-

అన్నమయాది మహాకోశములు ఆచ్ఛాదకములుగా గలవాడు అగుటచే 'మహాకోశః' యని స్తుతింపబడుచున్నాడు.

౨౩౩. మహాభోగః-

సుఖరూపమైన మహాభోగము కలవాడు కావున 'మహాభోగః' యను నామము పరమేశ్వరునియందు అన్వర్థము.

౨౩౪. మహాధనః-

భోగసాధనరూప మయినట్టి మహాధనము కలవాడు గాన పరమేశ్వరుడు 'మహాధన' శబ్దముచే ధ్యాతవ్యుడగు చున్నాడు.

శ్లో॥ అనిర్విణ్ణః స్థవిష్ఠోఽభూ ర్ధర్మయూపో మహామఖః ।
నక్షత్రనేమి ర్నక్షత్రీ క్షమః క్షామః సమీహనః ॥ ౭౦

శం. భా. :- అవాప్తకామత్వా న్నిర్వేదోఽస్య న విద్యత ఇతి అనిర్విణ్ణః వైరాజరూపేణ స్థితః స్థవిష్ఠః. 'అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ' ఇతి శ్రుతేః. అజత్వా దభూః అథవా భవతీతి భూః. 'భూ సత్తాయామ్' ఇత్యస్య సంపదాదిత్వాత్ క్విప్ మహీ వా, యూపే పశువత్ తత్సమారాధనాత్మకా ధర్మా స్తత్ర బధ్య న్త ఇతి ధర్మయూపః యస్మిన్నర్పితా మఖా యజ్ఞా నిర్వాణలక్షణఫలం ప్రయచ్ఛన్తో మహాన్తో జాయన్తే స మహామఖః ॥

శ్లో॥ "నక్షత్రతారకై స్సార్ధం చన్ద్రసూర్యాదయో గ్రహాః ।
వాయుపాశమయై ర్బన్ధై ర్నిబద్ధా ధ్రువసంజ్ఞితే" ॥

సజ్యోతిషాం చక్రం భ్రామయన్ తారామయస్య శిశుమారస్య పుచ్ఛదేశే వ్యవస్థితో ధ్రువః. తస్య శిశుమారస్య హృదయే జ్యోతిశ్చక్రస్య నేమివత్ ప్రవర్తకః స్థితో విష్ణు రితి నక్షత్రనేమిః శిశుమారవర్ణనే- 'విష్ణుర్హృదయమ్' ఇతి స్వాధ్యాయబ్రాహ్మణే శ్రూయతే చన్ద్రరూపేణ నక్షత్రీ. 'నక్షత్రాణా మహం శశీ' ఇతి భగవద్వచనాత్ సమస్తకార్యేషు సమర్థః క్షమః క్షమత ఇతి వా. 'క్షమయా పృథివీసమః' ఇతి వాల్మీకి వచనాత్, సర్వవికారేషు క్షపితేషు స్వాత్మనాఽవస్థిత ఇతి క్షామః. 'క్షాయోమః' ఇతి నిష్ఠాతకారస్య మకారః. సృష్ట్యాద్యర్థం సమ్యగీహత ఇతి సమీహనః ॥

౭౩౭. అనిర్విణ్ణః-

ఆప్తకాముడగుటచే నిర్వేదము లేనివాడు గాన 'అనిర్విణ్ణః' అనుచు స్తవనీయుడు.

౭౩౮. స్థవిష్ఠః-

'అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ' అను శ్రుతి చెప్పి

నట్లు విరాడ్రూపముతో నొప్పువాడుగాన 'స్థవిష్ఠః'యను నామముతో కీర్తనీయు డగుచున్నాడు.

౪౩౭. అభూః-

జన్మ లేనివాడు, లేదా, భూః అనియే పదచ్ఛేదము చేసిన 'భూసత్తాయామ్' అని సత్తాస్వరూపుడు, లేదా, పృథివి గాన 'అభూః' యనబడును.

౪౩౮. ధర్మయూపః-

యూపమందు పశువు వలె భగవదారాధన రూపములగు ధర్మములు తనయందు బంధింపబడినవాడు గాన 'ధర్మయూపః" అను నామము ప్రసిద్ధము.

౪౩౯. మహామఖః-

ఆ పరమాత్మకు అర్పింపబడిన మఖములు (యజ్ఞములు) నిర్వాణ (మోక్ష) రూప మహాఫల మిచ్చునవగుటచే 'మహామఖః' అను నామముచే స్తుతింపబడుచున్నాడు.

౪౪౦. నక్షత్రనేమిః-

నక్షత్రతారకలతో కూడిన చంద్రసూర్యాదిగ్రహములు వాయుపాశమయ బన్ధములచే ధ్రువుని యందు నిబంధింపబడి యున్నవి; ఆ ధ్రువుడు జ్యోతిశ్చక్రమును భ్రమణము నొందించుచు తారమయమైన శిశుమారచక్రమునకు పుచ్ఛప్రదేశ మందుండెను.

ఆ శిశుమారమునకు హృదయస్థానమందు జ్యోతిశ్చక్రమునకు నేమి వలె ఉన్నవాడు గాన 'నక్షత్రనేమిః' యను

నామముచే విరాజిల్లుచున్నాడు. కనుకనే శిశుమార వర్ణనములో స్వాధ్యాయ బ్రాహ్మణమందు 'విష్ణుర్హృదయమ్' అని చెప్పబడినది.

౮౮౧. నక్షత్రీ-

'నక్షత్రాణా మహం శశీ' అను భగవద్వచనమును బట్టి చంద్రరూపమును నొందినవాడు 'నక్షత్రీ' యని భగవానుని నామము ప్రసిద్ధము.

౮౮౨. క్షమః-

సమస్త కార్యములలో సమర్థుడు. 'క్షమయా పృథివీ సమః' అను వాల్మీకి వచనానుసారము క్షమ (ఓర్పు సహనం) కలవాడు గాన 'క్షమః' యనుచు కొనియాడబడుచున్నాడు.

౮౮౩. క్షామః-

సమస్త వికారములు క్షయమై పోగా స్వస్వరూపముతో నుండువాడు గాన 'క్షామ' శబ్దముచే చెప్పబడుచున్నాడు.

౮౮౪. సమీహనః-

సృష్ట్యాది కార్యములకై సమీచీన మగు చేష్ట కలవాడు గాన 'సమీహనః' యను నామముచే నొప్పారుచున్నాడు.

శ్లో॥ "యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుః సత్రం సతాంగతిః।
సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్ ॥" ౯౧

శం. భా. :- సర్వయజ్ఞం స్వరూపత్వాత్ యజ్ఞః, సర్వేషాం దేవానాం తుష్టికారకో యజ్ఞాకారేణ ప్రవర్తత ఇతి వా, 'యజ్ఞో వై విష్ణుః' ఇతి శ్రుతేః, యష్టవ్యోఽప్యయమేవేతి ఇజ్యః ॥

శ్లో॥ 'యే యజన్తి మఖైః పుణ్యైః దేవతాదీన్ పితౄనపి,

ఆత్మాన మాత్మనా నిత్యం విష్ణుమేవ యజన్తితే. ఇతి హరివంశే ॥

సర్వాసు దేవతాసు యష్టవ్యాసు ప్రకర్షేణ యష్టవ్యో మోక్షఫలదాతృత్వా దితి మహేజ్యః. యూపసహితః యజ్ఞః క్రతుః చోదనాలక్షణం సత్రమ్. సత స్త్రాయత ఇతి వా. సతాం ముముక్షూణాం నాన్యా గతి రితి సతాంగతిః సర్వేషాం ప్రాణినాం కృతాకృతం సర్వం పశ్యతి స్వాభావికేన బోధేనేతి సర్వదర్శీ. స్వభావేన విముక్త ఆత్మా యస్యేతి. విముక్తశ్చాసౌ ఆత్మాచేతి వా విముక్తాత్మా 'విముక్తశ్చ విముచ్యతే' ఇతి శ్రుతేః సర్వశ్చాసౌ జ్ఞశ్చేతి సర్వజ్ఞః 'ఇదగ్ం సర్వం యదయ మాత్మా' ఇతి శ్రుతేః 'జ్ఞానముత్తమం' మిత్యేతత్సవిశేషణ మేకం నామ జ్ఞానం ప్రకృష్ట మజన్య మనవచ్ఛిన్నం సర్వస్య సాధనతమ మితి జ్ఞానముత్తమమ్. బ్రహ్మ. 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' ఇతి శ్రుతేః ॥

౪౪౫ యజ్ఞః-

సర్వయజ్ఞ స్వరూపుడు; 'యజ్ఞో వై విష్ణుః' అను శ్రుతినిబట్టి సర్వదేవతల యజ్ఞరూపమున సంతృప్తి కారకుడు నగుటవలన పరమేశ్వరుడు 'యజ్ఞ' శబ్దవాచ్యుడు.

౪౪౬ ఇజ్యః-

యష్టవ్య (పూజనీయు) స్వరూపుడు అగుడే యగుటంజేసి 'ఇజ్యః' యనబడుచున్నాడు. కనుకనే హరివంశములో పుణ్యాము లైన యజ్ఞములచే దేవతాదులను పితృదేవతలను యజించు నట్టివారు ఆత్మస్వరూపుడగు విష్ణువును యజించువారే అని చెప్పబడినది.

౪౪౬. మహేజ్యః-

పూజనీయులగు సర్వదేవతలలో మోక్షఫలదాత యగుటచే ప్రకృష్టముగా యష్టవ్యుడు గాన 'మహేజ్యః' అను నామము పరమాత్మ యందు ప్రసిద్ధము.

౪౪౭. క్రతుః-

యూపసహిత యజ్ఞమై యొప్పువాడు కనుక 'క్రతుః' యని స్తుతింపబడుచున్నాడు.

౪౪౮. సత్రమ్-

విధివాక్య ప్రమాణము గల సత్రమై యొప్పువాడు. 'సత్-త్ర' సతః- సత్పురుషులను 'త్ర' రక్షించువాడును అగుటచే 'సత్రమ్' యను నామముచే కీర్తనీయుడు.

౪౪౯. సతాంగతిః-

ముముక్షువులగు సత్పురుషులకు గతియైనవాడు గాన 'సతాంగతిః' యనబడును.

౪౫౦. సర్వదర్శీ-

సకలప్రాణుల కృతాకృతములగు సర్వమును స్వాభావిక బోధ చేత తెలిసికొనుచుండువాడు గాన 'సర్వదర్శీ' యను నామము పరమేశ్వరునియందు సంగతమగును.

౪౫౧. విముక్తాత్మా-

స్వభావముచేత విముక్తమయిన స్వరూపము కలవాడు; విముక్తమైన ఆత్మ అయినవాడును అగుటచే 'విముక్తాత్మా' యని కీర్తింపబడుచున్నాడు. ఇది శ్రుతిసిద్ధము.

౪౫౩. సర్వజ్ఞః-

'ఇదం సర్వం యదయమాత్మా' అను శ్రుతిని బట్టి ఈ సర్వము తానే యయినవాడు గాన పరమేశ్వరుడు 'సర్వజ్ఞ' నామముతో బరగును.

౪౫౪. జ్ఞానముత్తమమ్-

ఇది ఏకనామము, 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' అని శ్రుతి చెప్పినట్లు సర్వోత్తమము, నిత్యసిద్ధము, దేశ-కాల-వస్తు-పరిచ్ఛేదరహితము, సర్వసాధకము నగు ఉత్తమజ్ఞానమె యొప్పువాడు గాన 'జ్ఞానముత్తమమ్' అను నామము పరమాత్మయందు సుసంగత మగును

శ్లో॥ సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖదః సుహృత్ ॥
మనోహరో జితక్రోధో వీరబాహు ర్విదారణః ॥ ౬౨

శం. భా. :- శోభనం వ్రత మస్యేతి సువ్రతః

శ్లో॥ 'సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే.
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ'
ఇతి శ్రీరామాయణే రామవచనమ్.

శోభనం ముఖ మస్యేతి సుముఖః 'ప్రసన్నవదనం చారుపద్మపత్రాయతే క్షణమ్' ఇతి శ్రీ విష్ణుపురాణే.

వనవాసప్రముఖత్వాద్వా దాశరథీ రామః సుముఖః

శ్లో॥ 'స్వపితు ర్వచనం శ్రీమా నభిషేకాత్పరం ప్రియమ్ ।
మనసా పూర్వ మాసాద్య వాచా ప్రతిగృహీతవాన్ ।

ఇమాని తు మహారణ్యే విహృత్య నవపంచ చ ।
వర్షాణి వరమప్రీతః స్థాస్యామి వచనే తవ ॥
'నవనం గన్తుకామస్య త్యజతశ్చ వసుంధరామ్ ।
సర్వలోకాతిగస్యేవ మనో రామస్య వివ్యథే' ॥

ఇతి రామాయణే.

సర్వవిద్యోపదేశేన వా సుముఖః 'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై ఇత్యాది శ్రుతేః' సూక్ష్మః- శబ్దాది స్థూలకారణరహితత్వాత్ శబ్దాదయో హ్యాకాశాదీనా ముత్తరోత్తరస్థూలత్వ కారణాని. తదభావాత్ సూక్ష్మః. 'సర్వగతం సుసూక్ష్మమ్' ఇతి శ్రుతేః. శోభనో ఘోషో వేదాత్మకోఽస్యేతి మేఘగంభీరఘోషత్వాద్వా సుఘోషః. సద్వృత్తానాం సుఖం దదాతి అసద్వృత్తానాం సుఖం ద్యతి ఖండయతీతి వా సుఖదః. ప్రత్యుపకార నిరపేక్షతయా ఉపకారిత్వాత్ సుహృత్. నిరతిశయా నన్దరూపత్వాత్ మనోహరతీతి మనోహరః. 'యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి' ఇతి శ్రుతేః. జితః క్రోధో యేన సః జితక్రోధః. వేద మర్యాదాస్థాపనార్థం సురారీన్ హన్తి నతు కోపవశాదితి త్రిదశశత్రూ న్నిఘ్నన్ వేదమర్యాదాం స్థాపయన్ విక్రమశాలీ బాహురస్యేతి వీరబాహుః. అధార్మికాన్ విదారయతీతి విదారణః ॥

౭౫౫. సువ్రతః-

రామాయణమందలి 'సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే' అను శ్లోకము శ్రీరామచంద్రుడు ఒక్కసారి నాకు శరణాగతుడై నీవాడ నని యాచించినవానికి సర్వభూత ముల వలన అభయము నిచ్చుట నా వ్రతము' అని చెప్పుటవలన శోభనవ్రతము కలవాడు గాన పరమాత్మ 'సువ్రత' నామధేయు డని తెలియవలయును.

౭౫౬. సుముఖః-

విష్ణుపురాణములో 'ప్రసన్న వదనం చారు పద్మపత్రా యతే క్షణమ్' అని చెప్పుటచే ప్రసన్నము సుందరము నగు వదనము పద్మపత్రములవలె విశాలనేత్రములు. ఒట్టి శోభన ముఖము కలవాడు; దశరథరాముడు వనవాససుముఖుడు నగుట వలనను 'సుముఖః' యని కీర్తింపబడుచున్నాడు.

కనుకనే రామాయణములో తన అభిషేకము కంటె పితృవచనమును పరమప్రియముగా మొదట మనస్సులో భావించి తండ్రితో ఇట్లు చెప్పెను- నీవచనమునకు కట్టుబడి పదునాలుగు సంవత్సరములు మహారణ్యమందు పరమప్రీతితో నివసింతును. రాజ్యమును త్యజించి వనవాసము చేయదలచిన శ్రీరాముని మనస్సునకు లేశమాత్రమైనను వ్యథ కలుగలేదు. కనుక, సుముఖుడు మరియు- బ్రహ్మను సృజించి; 'యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై' అని శ్రుతిలో చెప్పినట్లు బ్రహ్మకు సర్వవిద్యోపదేశకత్వము చేతను సుముఖశబ్దవాచ్యు డగుచున్నాడు.

౭౫౭. సూక్ష్మః-

ఆకాశాది భూతములకు శబ్ద-స్పర్శరూప-రస-గంధములు, ఉత్తరోత్తర స్థూలత్వకారణములు కాన "సూక్ష్మః" యను నామముచే విరాజిల్లుచుండును. 'సర్వగతం సుసూక్ష్మమ్' అను శ్రుతి 'పరమాత్మ' 'సూక్ష్మ' శబ్దముచే వ్యపదేశ్యు డని వివరించుచున్నది.

౪౫౮. సుఘోషః-

వేదరూపమైన శోభనఘోషము కలవాడు! మేఘ గంభీర ఘోషము కలవాడును అగుటవలన 'సుఘోషః' యను నామము ప్రసిద్ధము.

౪౫౯. సుఖదః-

సత్ప్రవర్తన కలవారికి సుఖ మిచ్చువాడు, దుష్ప్రవర్తన కలవారికి సుఖము లేకుండ జేయువాడును అగుటవలన 'సుఖదః' యను నామముచే కీర్తింపబడుచున్నాడు.

౪౬౦. సుహృత్-

ప్రత్యుపకారము కోరని ఉపకారి గాన 'సుహృత్' అని స్తుతింపబడుచున్నాడు.

౪౬౧. మనోహరః-

మనస్సును హరించువాడు కాన 'మనోహరః' యను శబ్దముచే స్తోత్రము చేయబడుచున్నాడు. కనుకనే- 'యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి' అను శ్రుతి భూమా-నిరతిశయము స్వరూపమే సుఖ మని చెప్పుచున్నది.

౪౬౨. జితక్రోధః-

క్రోధమును జయించినవాడు గాన 'జితక్రోధః' యను నామము ప్రసిద్ధము. సురారులను వధించుట క్రోధవశమున కాదు; వేదమర్యాదాస్థాపనమునకే యని తెలియనగును.

౪౬౩. వీరబాహుః-

దేవశత్రువులను వధించుచు వేదమర్యాదను స్థాపించుచు

విక్రమశాలియైన బాహువు కలవాడు గాన 'వీరబాహుః' యను నామముచే స్తవనీయుడగుచున్నాడు.

౫౮౪. విదారణః-

అధార్మికులను విదళించువాడు గాన పరమేశ్వరుడు 'విదారణః' యను నామముచే స్తోతవ్యుడగుచున్నాడు.

శ్లో॥ స్వాపనః స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్ ।
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః ॥ ౯౩

శం. భా. :- ప్రాణినః స్వాపయన్ ఆత్మసంబోధ విధురాన్ మాయయా కుర్వన్ స్వాపనః. స్వతన్త్రః స్వవశః, జగదుత్పత్తి స్థితిలయహేతుత్వాత్. ఆకాశవ త్సర్వగతత్వాత్ వ్యాపీ. 'ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః' ఇతి శ్రుతేః. కారణత్వేన సర్వకార్యాణాం వ్యాపనాద్వా వ్యాపీ. జగదుత్పత్త్యాదిషు ఆవిర్భూత నిమిత్తశక్తిభి ర్విభూతిభి రనేకధా తిష్ఠన్ నైకాత్మా. జగదుత్పత్తి సంపత్తి విపత్తి ప్రభృతికర్మాణి కరోతీతి నైకకర్మకృత్. వసత్యత్రాఽఖిలమితి వత్సరః. భక్తస్నేహిత్వాత్ వత్సలః. 'వత్సాంసాభ్యాం కామబలే' ఇతి లచ్ ప్రత్యయః. వత్సానాం పాలనాత్ వత్సీ. జగత్పితు స్తస్య వత్సభూతాః ప్రజా ఇతి వా వత్సీ. రత్నాని గర్భభూతా న్యస్యేతి సముద్రో రత్నగర్భః. ధనానా మీశ్వరః ధనేశ్వరః॥

౫౮౫. స్వాపనః-

ప్రాణులను స్వాపము కలవారినిగ- తన మాయచే ఆత్మజ్ఞానరూపమైన జాగృతి లేనివారినిగ- జేయువాడు గాన పరమాత్మ 'స్వాపనః' అను నామముచే బరగుచున్నాడు.

౫౮౬. స్వవశః-

జగదుత్పత్తి-స్థితి-లయ-హేతు వగుటచే స్వాతంత్ర్యము కు

గాన "స్వవశః" యని కీర్తింపబడుచున్నాడు.

౪౬౭. వ్యాపీ-

‘ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః’ అను శ్రుతి చెప్పిన రీతిని ఆకాశము వలె సర్వగతుడు; కారణ రూపముచే సర్వకార్య వ్యాప్తి కలవాడు అగుటవలన ‘వ్యాపీ’ యను నామము ప్రసిద్ధము.

౪౬౮. నైకాత్మా-

జగదుత్పత్త్యాదులయందు ఆవిర్భూతములైన నిమిత్త శక్తులచే - విభూతులచే - అనేక విధములుగా నుండువాడు కాన ‘నైకాత్మ’ యనుచు కీర్తింపబడుచున్నాడు.

౪౬౯. నైకకర్మకృత్-

జగదుత్పత్తి స్థితి విపత్తి మొదలగు అనేక కర్మలను చేయుచుండువాడు కనుక ‘నైకకర్మకృత్’ యని స్తుతింపబడుచున్నాడు.

౪౭౦. వత్సరః

సర్వము యొక్క వసతికి ఆధారము అగువాడు కావున పరమేశ్వరుడు ‘వత్సర’ శబ్దవాచ్యుడగుచున్నాడు.

౪౭౧. వత్సలః-

భక్తులయందు స్నేహము కలవాడు కాన ‘వత్సలః’ యను నామము పరమేశ్వరునియందు ప్రసిద్ధము.

౪౭౨. వత్సీ-

వత్సముల పాలనము కలవాడు; జగత్పిత యగు పర

శాస్త్రాణ్యనేనేతి వా. 'వేదాః శాస్త్రాణి విజ్ఞాన మేతత్సర్వం జనార్దనాత్' ఇతి అత్రైవ వక్ష్యతి సజాతీయ విజాతీయ వ్యవచ్ఛేదకం లక్షణం సర్వభావానాం కృత్త మనేనేతి। ఆత్మనః శ్రీవత్సలక్షణం వక్షసి తేన కృతమితి వా కృత లక్షణః ॥

౪౮౧. ధర్మగుప్ -

ధర్మరక్షకుడు కాన 'ధర్మగుప్' యను నామము పరమేశ్వరునియందు అన్వర్థము. 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే, యను భగవద్వచనము పై విషయమును సూచించుచున్నది.

౪౮౨. ధర్మకృత్ -

ధర్మాధర్మములతో తనకు సంబంధము లేకున్నను ధర్మమర్యాదాస్థాపనార్థము ధర్మమునే ఆచరించువాడు గావున 'ధర్మకృత్, యనుచు స్తోత్రవ్యుడగుచున్నాడు.

౪౮౩. ధర్మి -

ధర్మములను ధారణ చేయువాడగుటచేత 'ధర్మియని భజనీయుడగుచున్నాడు.

౪౮౪. సత్ -

'సదేవ సోమ్యేదమ్, అను శ్రుతిని బట్టి సద్రూపమగు పరబ్రహ్మ గాన 'సత్' శబ్దవాచ్యుడు.

౪౮౫. అసత్ -

వాచారంభణం వికారో నామధేయమ్' - అను శ్రుతి వచనము ననుసరించి అపరబ్రహ్మ గాన 'అసత్' శబ్దము చేతను స్తుతింపబడుచున్నాడు.

౪౮౦. క్షరమ్ –

సర్వభూతాత్మకుడు గాన 'క్షరమ్' అనియు,

౪౮౧. అక్షరమ్ –

కూటస్థుడగుటచే 'అక్షరమ్' అనియు కీర్తింపబడు చున్నాడు. పరమేశ్వరుడు క్షర - అక్షర - స్వరూపుడని చెప్పుట 'క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే'- యను భగవద్వచనముచే సిద్ధము.

౪౮౨. అవిజ్ఞాతా –

ఆత్మయందు కర్తృత్వాది కల్పిత విజ్ఞానము కల్పితమై యుండును. తద్వాసనా విశిష్టుడగు జీవుడు విజ్ఞాత. తద్విలక్షణుడగు విష్ణువు 'అవిజ్ఞాతా' యని చెప్పబడును.

౪౮౩. సహస్రాంశుః –

'యేన సూర్య స్తపతి తేజసేద్ధః'- అను శ్రుతిని బట్టి ఆదిత్యాదుల అంశువులు (కిరణములు) ఈ పరమాత్మవే కనుక ఈ యనయే ముఖ్యమైన సహస్రాంశువు గాన 'సహస్రాంశుః' యనుచు సంకీర్తింపబడుచున్నాడు.

౪౮౪. విధాతా –

సర్వభూతములను ధరించునట్టి శేష - దిగ్గజ - భూధరములను విశేషముగ ధరించువాడు గాన 'విధాతా' యనుచు ధ్యాతవ్యుడగుచున్నాడు.

౪౮౫. కృతలక్షణః –

నిత్యసిద్ధ చైతన్యస్వరూపుడు; 'వేదాశ్శాస్త్రాణి విజ్ఞాన

మేతత్సర్వం జనార్దనాత్' - అని యీ సహస్రనామములలో
చెప్పినరీతి సర్వశాస్త్రకర్త - యగువాడు గాన 'కృతలక్షణః'
యని తత్త్వజ్ఞులచే స్తోత్రమ్ము చేయబడుచున్నాడు. మరియు సర్వభావ
పదార్థములకు సజాతీయ విజాతీయ విభాగహేతువయిన
లక్షణము - చిహ్నము - చేసియున్నవాడు; లేక 'శ్రీవత్స'
మను లక్షణము తనకు చేయబడియున్నవాడును గాన 'కృత
లక్షణః' యనునామముచే సంకీర్తింపబడుచున్నాడు.

శ్లో॥ గభస్తినేమిః సత్త్వస్థః సింహో భూతమహేశ్వరః
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః ॥ ౫౩

శం. భా. :- గభస్తిచక్రస్య మధ్యే సూర్యాత్మనా స్థిత ఇతి గభస్తి
నేమిః సత్త్వం గుణం ప్రకాశకం ప్రాధాన్యేన అధితిష్ఠతీతి సర్వప్రాణిషు
తిష్ఠతీతి వా సత్త్వస్థః విక్రమశాలిత్వాత్ సింహః సింహః ఏకశబ్దలోపేన
'సత్యభామా', 'భామా' ఇతివత్ సింహః భూతానాం మహానీశ్వరః
భూతేశ సత్యేన స ఏవ పరమో మహానీశ్వరః ఇతి వా భూతమహేశ్వరః;
సర్వభూతాన్యాదత్తే ఆదత్తేతి ఆదిః ఆదిశ్చాసౌ దేవశ్చేతి ఆదిదేవః.
సర్వాన్ భావాన్ పరిత్యజ్య ఆత్మజ్ఞానయోగైశ్వర్యే మహతి మహీయతే,
తస్మాదుచ్యతే మహాదేవః ప్రాధాన్యేన దేవానామీశో దేవేశః దేవాన్
బిభర్తీతి దేవభృత్ శక్రః; తస్యాపి శాసితేతి దేవభృద్గురుః దేవానాం భర
ణాత్ సర్వవిద్యానాం చ పరిజ్ఞానాద్వా దేవభృద్గురుః ॥

౪౯౫. గభస్తినేమిః-

మయూఖచక్రమునకు మధ్యభాగమున సూర్యరూప
ముతో నుండువాడు గాన 'గభస్తినేమిః' యని పరమేశ్వరుడు
కీర్తింపబడుచున్నాడు.

౭౮౭. సత్త్వస్థః-

ప్రకాశకమైన సత్త్వగుణమును ప్రధానముగ నధిష్ఠించి యుండువాడు; సర్వప్రాణులయందు నుండువాడును కాన, 'సత్త్వస్థః' యను నామముచే స్తవనీయు డగుచున్నాడు.

౭౮౮. సింహః-

సింహము వలె విక్రమశాలి గాన 'సింహముఖః' యని ప్రస్తుతింపబడుచున్నాడు, లేదా, 'సత్యభామా-భామా' యను రీతిని 'నృసింహ' శబ్దమందలి పూర్వపదమగు 'నృ' శబ్దము లోపింపగ మిగిలిన 'సింహ' శబ్దమునకు 'నృసింహ' స్వరూపము అర్థ మనియు తెలియనగును.

౭౮౯. భూతమహేశ్వరః-

భూతములకు మహేశ్వరుడు; భూతము చేత- సత్యము చేత-ఆయనయే మహేశ్వరుడు నగుటవలన 'భూతమహేశ్వరః' యనుచు సంకీర్తనీయు డగుచున్నాడు.

౭౯౦. ఆదిదేవః-

సర్వభూతములను ఆదానము - గ్రహణము - చేయువాడు; ఆదిః - ఆది యగు దేవుడు నగుటచేత పరమేశ్వరుడు ధ్యాతవ్యు డగుచున్నాడు.

౭౯౧. మహాదేవః-

సర్వభావములను వదలి ఆత్మజ్ఞానయోగమందును ఐశ్వర్యమందును మహిమోపేతుడు గాన 'మహాదేవః' యను నామముచే విరాజిల్లునట్టివాడు.

౪౯౨. దేవేశః-

ప్రధానముగ దేవులకు ఈశుడు కనుక 'దేవేశ' శబ్ద వాచ్యుడు.

౪౯౩. దేవభృద్గురుః-

దేవతలను భరించువాడు దేవభృత్ - ఇంద్రుడు; ఆయనకు గూడ శాసకుడు గాన 'దేవభృద్గురుః' యను నామము పరమేశ్వరునియందె ప్రసిద్ధము. అథవా, సర్వదేవతలను భరించుటచేతను సర్వవిద్యోపదేశకు డగుటచేతను 'దేవభృద్గురుః' యను నామముతో నొప్పును.

శ్లో॥ ఉత్తరో గోపతి ర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః
శరీరభూతభృత్ భోక్తా కపీన్ద్రో భూరిదక్షిణః ॥ ౬౬

శం. భా. :- జన్మసంసారబన్ధనా దుత్తరతీతి ఉత్తరః; సర్వోత్కృష్ట ఇతి వా. 'విశ్వస్మా దిన్ద్ర ఉత్తరః' ఇతి శ్రుతేః గవాం పాలనాత్ గోపవేషధరో గోపతిః గౌ ర్మహీ. తస్యాః పతిత్వాద్వా. సమస్తభూతాని పాలయన్ రక్షకో జగత ఇతి గోప్తా న కర్మణా న జ్ఞాన కర్మభ్యాం వా గమ్యతే, కిన్తు జ్ఞానేన గమ్యతే ఇతి జ్ఞానగమ్యః. కాలేన ఉపరిచ్ఛిన్నత్వాత్ పురా ఽపి భవతీతి పురాతనః. శరీరారంభకభూతానాం భరణాత్ ప్రాణరూపధరః శరీరభూతభృత్. పాలకత్వాత్ భోక్తా పరమానన్ద సందోహ సంభోగాద్వా భోక్తా. ఇతి నామ్నాం పంచమం శతం వివృతమ్ కపిశ్చాసౌ ఇన్ద్ర శ్చేతి కపిర్వరాహః; వారాహం వపురా స్థితః కపీన్ద్రః. రాఘవో వా భూరయః బహ్వ్యః యజ్ఞదక్షిణాః ధర్మ మర్యాదాం దర్శ యతో యజ్ఞం కుర్వతో విద్య న్త ఇతి భూరిదక్షిణః ॥

౨౯౪. ఉత్తరః-

జన్మరూపమైన సంసారబన్ధమునుండి విముక్తిని ప్రసాదించునట్టివాడు; సర్వోత్కృష్టుడు నగుటచే 'ఉత్తరః' యను నామముచే సంకీర్తితు డగుచున్నాడు. 'విశ్వస్మా దిన్ద్ర ఉత్తరః' యను శ్రుతి చే పరమేశ్వరునియొక్క సర్వోత్కృష్టత్వము సూచితము.

౨౯౫. గోపతిః-

గోపాలనమును బట్టి గోపవేషధారి యగుట వలనను గో-మహీ-భూమి- ఆమెకు పతి యగుట వలనను 'గోపతిః' యను నామము పరమాత్మయందు అన్వర్థము.

౨౯౬. గోప్తా-

సమస్తభూతములను పాలించుచు జగద్రక్షణ చేయువాడగుట వలన 'గోప్తా' యను నామముచే స్తవనీయుడు.

౨౯౭. జ్ఞానగమ్యః-

కర్మచేగాని, జ్ఞాన - కర్మ - సముచ్చయముచే గాని, తెలియబడనివాడు: కేవలజ్ఞానము చేతనే తెలియబడువాడు గాన జ్ఞానగమ్యః' యను నామముచే స్తుతింపబడుచున్నాడు.

౨౯౮. పురాతనః-

కాలముచేత పరిచ్ఛిన్నుడు కానందున ఎప్పటికప్పుడే పూర్వమందున్నవాడు కాన 'పురాతనః' యను సంజ్ఞచే, విలసిల్లునట్టివాడు.

౪౯౯. శరీరభూతభృత్ –

శరీరారంభకములైన భూతములను భరించుటలో ప్రాణరూపమున నొప్పువాడు కాన 'శరీరభూతభృత్' యను నామము సార్థకమై నొప్పును.

౫౦౦. భోక్తా –

పాలనార్థక 'భుజ' ధాతువును బట్టి, పాలకుడు; పరమానన్దసందోహభోగశాలియు నగుటచే 'భోక్తా' యనుచు సంస్తుతింపబడుచున్నాడు.

ఇక్కడకు నామములలో పంచమ శతము వివరింపబడినది.

౫౦౧. కపీన్ద్రః –

'కపి' శబ్దముచే వరాహము 'ఇన్ద్ర' శబ్దముచే శ్రేష్ఠము అను నర్థములు చెప్పబడును. కావున వారాహమూర్తిధరుడగు పరమేశ్వరుడు 'కపీన్ద్రః' యని సంకీర్తనము చేయబడుచున్నాడు. లేదా, వానరులకు ప్రభువు రఘురాముడైన పరమాత్మ యగుటంజేసియు 'కపీన్ద్ర' శబ్దవ్యపదేశ్యు డగుచున్నాడు.

౫౦౨. భూరిదక్షిణః –

ధర్మమర్యాదను ప్రదర్శించుచు యజ్ఞము చేయుచు యజ్ఞదక్షిణలు విశేషముగ నిచ్చువాడు గాన 'భూరి దక్షిణః' యను నామముచే స్తవనీయు డగుచున్నాడు.

స్వీకరించినవాడు నగుటచే 'అమృతప' శబ్దవాచ్యుడగు చున్నాడు.

౨౦౯. సోమః -

సోమ (చంద్ర) రూపమున ఓషధులను పోషించువాడు; ఉమా (పార్వతి) సహితుడైన శివుడు నగుటచేత 'సోమః' యను నామము చే ధ్యాతవ్యుడు.

౨౧౦. పురుజిత్ -

అనేకులను జయించిన వాడగుటవలన 'పురుజిత్' యని పిలవబడుచున్నాడు.

౨౧౧. పురుసత్తమః -

విశ్వరూపుడు, ఉత్తముడు నగుటచే 'పురుసత్తమ' సంజ్ఞచే వ్యపదేశ్యుడగుచున్నాడు.

౨౧౨. వినయః -

దుష్టులకు వినయమును కలిగించువాడు, అనగా దుష్టులను దండించువాడు గాన 'వినయః' యను నామముతో బరగు నట్టివాడు.

౨౧౩. జయః -

సమస్త భూతములను జయించువాడు కనుక పరమేశ్వరుడు 'జయ' శబ్దితుడగుచున్నాడు.

౨౧౪. సత్యసంధః -

సత్యసంకల్పః-యను శ్రుతి ననుసరించి సత్యమైన'సంధా'-

సంకల్పము కలవాడగుటచే 'సత్యసంకల్పః'యను నామముచే నొప్పారుచుండును.

౫౧౧. దాశార్హః-

దాశ యనగా దానము, దానికి అర్హమైనవాడు, ఆయన నుద్దేశించి దానము చేయతగినవాడు; అథవా, దాశార్హః కుల మందు ఉద్భవించినవాడు నగుటవలన దాశార్హః' యని చెప్పబడుచున్నాడు.

౫౧౨ సాత్వతాంపతిః-

'సాత్వత'మను తంత్రమును రచించినవాడు లేక చెప్పిన వాడు అను అర్థములో వ్యాకరణశాస్త్రానుసారము సాత్వత్' అని తకారాంత పద మగును. అందుచే 'సాత్వతాం'-సాత్వత తంత్రమునకు చెందినవారికి 'పతిః'-యోగక్షేమములను కలుగ చేయువాడు గాన 'సాత్వతాంపతిః'యను నామము పరమేశ్వరుని యందు ప్రసిద్ధము.

శ్లో॥ జీవో వినయితా సాక్షీ ముకుందోఽమితవిక్రమః ।
అంభోనిధి రనన్తాత్మా మహోదధిశయోఽన్తకః ॥ ౬౫

శం. భా. :- ప్రాణాన్ క్షేత్రజ్ఞరూపేణ ధారయన్ జీవ ఉచ్యతే. వినయిత్వం వినయితా. తాం చ సాక్షాత్పశ్యతి ప్రజానా మితి వినయితా సాక్షీ. అథవా. నయతే ర్గతివాచినో రూపం. వినయితా. అసాక్షీ అసాక్షాద్ద్రష్టా; ఆత్మాతిరిక్తం వస్తు న పశ్యతీశ్వరః ముక్తిం దదాతీతి ముకున్దః. పృషో దరాదిత్వాత్సాధుత్వమ్. అక్షరసామ్యాన్నిరుక్తివచనాత్ నైరుక్తానా ముకున్ద ఇతి నిరుక్తిః. అమితా అపరిచ్ఛిన్నా విక్రమా స్త్రయః పాదవిక్షేపా అస్య:

**అమితం** విక్రమణం శౌర్య మస్యేతి వా. అమితవిక్రమః, అంభాంసి దేవా దయోఽస్మి న్నిధీయన్త ఇతి అంభోనిధిః. 'తాని వా ఏతాని చత్వార్యం భాంసి దేవా మనుష్యాః పితరోఽసురాః' ఇతి శ్రుతేః, సాగరో వా. 'సరసా మస్మి సాగరః' ఇతి భగవద్వచనాత్ దేశతః కాలతో వస్తుతశ్చాఽపరిచ్ఛిన్నత్వాత్ అనన్తాత్మా. సంహృత్య సర్వభూతాని ఏకార్ణవం జగత్ కృత్వా ఇతి శేతే మహోదధిమితి మహోదధిశయః.. అన్తం కరోతి భూతానామితి అన్తకః 'తత్ కరోతి తదాచష్టే' ఇతి ణిచి 'ణ్వుల్ తృచౌ' ఇతి ణ్వులి. 'యువోరనాకౌ' ఇతి అకాదేశః ॥

౫౧౩. జీవః-

క్షేత్రజ్ఞరూపమున ప్రాణధారణము చేయువాడు కాన 'జీవః' యనుచు సంకీర్తితుడగుచున్నాడు.

౫౧౪. వినయితాసాక్షీ (అసాక్షీ)-

ప్రజలు వినయము కలిగియుండుటను సాక్షాత్తుగ తెలిసికొనువాడు; లేదా, 'వినయితా' శబ్దము గత్యర్థక 'నీ' ధాతువుయొక్క రూపము. అసాక్షీ-సాక్షాద్ద్రష్ట కానివాడు అనగా ఆత్మాతిరిక్తమైన వస్తువును దర్శింపనివాడును గాన 'వినయితాసాక్షీ, యను నామము పరమాత్మయందు ఒప్పును.

౫౧౫. ముకున్దః-

ముక్తి నిచ్చువాడు గాన 'ముకున్ద' శబ్దవాచ్యుడు. పృషోదరాదులందు పఠింపబడుటచే ముకున్దశబ్దము సాధు వని తెలియనగును. అక్షరసామ్యము చేతను 'ముకున్దః' యని నైరుక్తుల నిరుక్తి చేతను 'ముకున్ద' శబ్దము సాధువని గుర్తింపనగును.

౫౧౬. అమితవిక్రమః-

అపరిమితములగు విక్రమములు - మూడు పాదవిన్యాసములు కలవాడు; అపరిమితమైన విక్రమణము - శౌర్యము - కలవాడు నగుటచే 'అమితవిక్రమః' యను నామముతో విరాజిల్లు నట్టివాడు.

౫౧౭. అంభోనిధిః-

'తాని, వా, ఏతాని, చత్వార్యంభాంసి, దేవా మనుష్యాః, పితరోఽసురాః'- అను, శ్రుతివచనానుసారము దేవతలు, మనుష్యులు, పితరులు, అసురులు - ఈ నాలుగు వర్గములు అంభశ్శబ్దార్థములు. కావున, ఇట్టి అంభస్సులు తనయందు నిహితములై యున్నవాడు; లేదా, 'సరసామస్మి సాగరః'- యను భగవద్వచనము ననుసరించి సాగరస్వరూపుడు నగుటచే 'అంభోనిధిః' యను నామముతో భజింపబడుచున్నాడు.

౫౧౮. అనన్తాత్మా-

దేశమునుబట్టి కాని, కాలమునుబట్టి కాని, వస్తువును బట్టి కాని, పరిచ్ఛేదము లేనట్టివాడగుటచే 'అనన్తాత్మా' యను శబ్దముచే స్తోత్రవ్యుడగుచున్నాడు.

౫౧౯. మహోదధిశయః-

సర్వభూతములను సంహరించి జగత్తును ఏకార్ణవముగ జేసి మహోదధి యందు శయనించువాడు కనుక 'మహోదధిశయ' శబ్దవ్యపదేశ్యు డగుచున్నాడు.

౫౨౦. అన్తకః-

భూతము లనంత మొందించువాడు కనుక 'అన్తకః' శబ్దము పరమేశ్వర నామముగ ప్రసిద్ధము.

శ్లో॥ అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః
ఆనన్దో నన్దనో నన్ద స్సత్యధర్మా త్రివిక్రమః ॥ ౬౫

శం. భా :- అత్ విష్ణో రజాయత ఇతి కామః అజః మహః పూజా. తదర్హత్వాత్ మహార్హః స్వభావేనైవాఽభావ్యో నిత్యనిష్పన్నరూపత్వాత్ ఇతి స్వాభావ్యః జితా అమిత్రా అన్తర్వర్తినో రాగద్వేషాదయో బాహ్యాశ్చ రావణకుంభకర్ణశిశుపాలాదయో యేనాఽసౌ జితామిత్రః స్వాత్మామృతరసాస్వాదా న్నిత్యం ప్రమోదతే ధ్యాయినాం ధ్యానమాత్రేణ ప్రమోదం కరోతీతి వా ప్రమోదనః. ఆనన్దః స్వరూప మస్యేతి ఆనన్దః. 'ఏతస్యైవానన్ద స్యాఽన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి' ఇతి శ్రుతేః. నన్దయతీతి నన్దనః సర్వాభి రుపపత్తిభి స్సమృద్ధోనన్దః సుఖం వైషయికం నాస్య విద్యత ఇతి ఆనన్దః 'యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి' ఇతి శ్రుతేః. సత్యా ధర్మా జ్ఞానాదయోఽస్యేతి సత్యధర్మా త్రయో విక్రమా స్త్రిషు లోకేషు క్రాన్తా యస్య స త్రివిక్రమః 'త్రీణి పదా విచక్రమే' ఇతి శ్రుతేః త్రయో లోకాః క్రాన్తా యేనేతి వా త్రివిక్రమః.

శ్లో॥ 'త్రిరిత్యేవ త్రయో లోకాః కీర్తితాః మునిసత్తమైః
క్రమతే తాం స్త్రిధా సర్వాన్ త్రివిక్రమ ఇతి శ్రుతః ॥'

ఇతి హరివంశే.

౫౨౧. అజః-

విష్ణువు వలన పుట్టినవాడు కావున 'అజ' శబ్ద వాచ్యుడగుచున్నాడు.

౫౨౨. మహార్హః-

'మహ' శబ్దము పూజావాచక మగుటచే పూజకు అర్హుడు కాన 'మహార్హః' యని కీర్తింపబడుచున్నాడు.

౫౨౩. స్వాభావ్యః-

నిత్యసిద్ధస్వరూప మగుటచే స్వభావముచే ఉత్పత్తి లేని వాడు కనుక స్వాభావ్యః యనుచు స్తవనీయు డగుచున్నాడు.

౫౨౪. జితామిత్రః-

అన్తశ్శత్రువు లగు రాగద్వేషాదులు, బహిశ్శత్రువు లగు రావణ, కుంభకర్ణ, శిశుపాలాదులు ఎవరిచే జయింపబడిరో అట్టి పరమాత్మ 'జితామిత్రః' యను నామముచే స్తోతవ్యు డగుచున్నాడు.

౫౨౫. ప్రమోదనః-

స్వాత్మామృతరసాస్వాదనముచే నిత్యప్రముదితుడు, తనను ధ్యానించువారికి ధ్యానమాత్రమున ప్రమోదమును కలిగించువాడు నగుటవలన 'ప్రమోదనః' యను నామము పరమేశ్వరునియందు అన్వర్థము.

౫౨౬. ఆనన్దః-

ఆనన్దస్వరూపుడు గాన పరమాత్మ 'ఆనన్ద' శబ్ద వ్యపదేశ్యుడు. 'ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి'- అని శ్రుతివచనము. అనగా - 'ఈ ఆనన్దస్వరూపుని యంశము నాశ్రయించియే అన్యప్రాణు లుపజీవించుచున్నవి.'

అని భావము. ఈ శ్రుతి వచనానుసారము పరమేశ్వరుడు ఆనన్ద స్వరూపుడు - అని తెలియును.

౫౨౭. నన్దనః-

ఆనందింపజేయువాడు గాన 'నన్దనః' యని చెప్పబడుచున్నాడు.

౫౨౮. నన్దః (ఆనన్దః)-

సర్వవిధముల సమృద్ధి కలవాడు గాన 'నన్దః' యనుచు కీర్తితుడగుచున్నాడు. లేదా. 'నన్దనోఽనన్దః'- యని చెప్పినచో 'అనన్దః' యని పదచ్ఛేదము చేయనగును. అపుడు 'నన్దః' అనగా విషయసుఖము; దానితో సంబంధము లేనివాడు అని యర్థము చెప్పుకొనవగును కనుకనే 'యో వై భూమా తత్సుఖం, నాల్పే సుఖ మస్తి'- యనుచు భూమబ్రహ్మయే సుఖము; అల్పమందు (విషయములయందు) సుఖము లేదు'- అని శ్రుతి చెప్పుచున్నది. కావున, 'నన్దః' యను నామము పరమాత్మయందు సర్వథా యుపపన్న మని తెలియనగును.

౫౨౯. సత్యధర్మా-

సత్యములైన ధర్మములు - జ్ఞానాదులు కలవాడు గాన 'సత్యధర్మా' యని సంకీర్తింపబడుచున్నాడు.

౫౩౦. త్రివిక్రమః-

మూడు లోకములలో వ్యాప్తమైన మూడు పాదన్యాసములు గలవాడు. 'త్రీణి పదా విచక్రమే'- యను శ్రుతిచే పై విషయము సిద్ధము. అథవా, త్రిలోకములను వ్యాపించిన

వాడును గాన 'త్రివిక్రమః' యను నామముతో ధ్యాతవ్యుడగుచున్నాడు. 'త్రిరిత్యేవ త్రయోలోకాః' యను హారివంశ వచనము 'త్రి' శబ్దము త్రిలోకములను జెప్పును; వానిని త్రివిధముగ వ్యాపించినవాడు కాన 'త్రివిక్రముడ' డని కీర్తింపబడుచున్నా డనుచు పై అర్థమునే వివరించినది.

శ్లో॥ మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః ।
త్రిపద స్త్రిదశాధ్యక్షో మహాశృంగః కృతాన్తకృత్ ॥ ౭౦

**శం. భా.** :- మహర్షి కపిలాచార్య ఇతి సవిశేషణ మేకం నామ మహాంశ్చాసౌ ఋషిశ్చేతి మహర్షిః కృత్స్నస్య వేదస్య దర్శనాత్. అన్యే తు వేదైకదర్శనాత్ ఋషయః కపిలశ్చాసౌ సాంఖ్యస్య శుద్ధతత్త్వవిజ్ఞానస్య ఆచార్యశ్చ ఇతి కపిలాచార్యః 'శుద్ధాత్మతత్త్వవిజ్ఞానం సాంఖ్య మిత్యభిధీయతే' ఇతి స్మృతేః 'ఋషిం ప్రసూతం కపిలమ్' సిద్ధానాం కపిలో మునిః' ఇతి స్మృతేశ్చ. కృతం కార్యం జగత్. జ్ఞ ఆత్మా. కృతం చ తత్ జ్ఞశ్చేతి కృతజ్ఞః మేదిన్యాః భూమ్యాః పతిః మేదినీపతిః. త్రీణి పదాన్యస్యేతి త్రిపదః 'త్రీణి పదా విచక్రమే' ఇతి శ్రుతేః. గుణావేశేన సంజాతా స్త్రిస్రో దశా అవస్థా జాగ్రదాదయః తాసా మధ్యక్ష ఇతి త్రిదశాధ్యక్షః. మత్స్యరూపీ మహతి శృంగే ప్రళయాంభో నావంధా బద్ధ్వా చిక్రీడ ఇతి మహాశృంగః. కృతస్యాన్తం సంహారం కరోతీతి కృతాన్తం మృత్యుం వా కృతాన్తకృత్ ॥

౫౩౧. మహర్షిః కపిలాచార్యః -

ఇది విశేషణముతో కూడిన ఏకనామము. కృత్స్న వేద ద్రష్ట యగుట గాను మహర్షి యనబడును వేదైకద్రష్టలు ఋషులనబడుదురు. కపిలుడు. శుద్ధతత్త్వ విజ్ఞానరూపమున సాంఖ్య

మునకు ఆచార్యుడు కాన కపిలాచార్యుడని తెలియవలయును. ఈయన కృత్స్నవేదద్రష్ట యగుటవలన మహర్షియై నయి విరాజిల్లెను. 'శుద్ధాత్మతత్త్వవిజ్ఞానం సాంఖ్య మిత్యభిధీయతే', 'ఋషిం ప్రసూతం కపిలమ్', 'సిద్ధానాం కపిలో మునిః'- యను శ్రుతిస్మృతివచనములచే పై విషయము సిద్ధించును.

५३२. కృతజ్ఞః-

'కృత' మనగా కార్యరూపజగత్తు; 'జ్ఞః' యనగా ఆత్మ. కావున, జగద్రూపుడు, ఆత్మయు నగుటచే పరమాత్మ 'కృతజ్ఞః' యనుచు భజనీయు డగుచున్నాడు.

५३३. మేదినీపతిః-

భూమికి పతియైనవాడు కాన 'మేదినీపతిః' యను నామముతో నొప్పును.

५३४. త్రిపదః-

'త్రీణి పదా విచక్రమే'- యను శ్రుతివచనానుసారము మూడు పదములు గలవాడు గాన, 'త్రిపదః' అను నామముచే బరగునట్టివాడు.

५३५. త్రిదశాధ్యక్షః-

జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు - అను మూడు దశలు (అవస్థలు) గుణావేశముచే కలుగును. అట్టి యవస్థాత్రయమున కధ్యక్షుడు గాన 'త్రిదశాధ్యక్షః' యను నామముచే స్తవనీయు డగుచున్నాడు.

౫౩౮. మహాశృంగః-

ప్రలయాంభోనిధి యందు మత్స్యరూపియై తన మహాశృంగమున నావను బంధించి విహరించినవాడు గాన, 'మహాశృంగః' యను నామముచే సంకీర్తనీయు డగుచున్నాడు.

౫౫౩. కృతాన్తకృత్-

కృత - జగత్తు యొక్క అన్తకృత్ - సంహారము చేయువాడు; మరియు 'కృతాన్తం కృన్తతీతి' అను వ్యుత్పత్తి ననుసరించి మృత్యువును హరించువా డనియు గ్రహింప నగును. కాన, 'కృతాన్తకృత్' శబ్దము పరమాత్మయందు రూఢము.

శ్లో॥ మహావరాహో గోవిన్దః సుషేణః కనకాంగదీ।
గుహ్యో గభీరో గహనో గుప్త శ్చక్రగదాధరః ॥ ౭౧

శం. భా. :- మహాంశ్చాసౌ వరాహశ్చేతి మహావరాహః. గోభిర్వాణీభిః విన్దతే, వేత్తి. వేదాన్తవాక్యైరితి వా గోవిన్దః 'గోభిరేవ యతో వేద్యో గోవిన్ద స్సముదాహృతః' ఇతి శ్రీవిష్ణుతిలకే శోభనా సేనా గణాత్మికా యస్యేతి సుషేణః. కనకమయా న్యంగదాని అస్యేతి కనకాంగదీ రహస్యోపనిష ద్వేద్యత్వాత్ గుహాయాం హృదయాకాశే నిహిత ఇతి వా గుహ్యః. జ్ఞానైశ్వర్యబలవీర్యాదిభి ర్గంభీరో గభీరః. దుష్ప్రవేశత్వాత్ గహనః. అవస్థాత్రయ భావాభావసాక్షిత్వాత్ గహనో వా. వాఙ్మనసాగోచరత్వాత్ గుప్తః. ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే' ఇతి శ్రుతేః.

శ్లో॥ "మనస్తత్త్వాత్మకం చక్రం బుద్ధితత్త్వాతికాం గదామ్,
ధారయన్ లోకరక్షార్థ ముక్త శ్చక్రగదాధరః ॥"

ఇతి చక్రగదాధరః.

౫౩౮. మహావరాహః-

మహావరాహమూర్తిధారి యగుటచే 'మహావరాహః' యను శబ్దముచే చెప్పబడుచున్నాడు.

౫౩౯. గోవిన్దః-

గో-వాక్కులచే విన్దః - లభించువాడు; గో - వేదాన్త వాక్యములచే విన్దః - తెలియువాడును గాన 'గోవిన్దః' యను నామముచే పూజనీయుడు. 'గోభిరేవ యతో వేద్యో గోవిన్ద స్సముదాహృతః'- అని శ్రీ విష్ణుతిలకమందు చెప్పబడినది.

౫౪౦. సుషేణః-

శోభనమయిన సేన-పార్షదగణము - కలవాడు కాన, 'సుషేణ' శబ్దవాచ్యుడు.

౫౪౧. కనకాంగదీ-

కనకమయములగు అంగదములు భూషణములుగ గల వాడు గాన 'కనకాంగదీ' యనుచు భజింపబడుచున్నాడు.

౫౪౨. గుహ్యః-

ఉపనిషద్రహస్యవేద్యుడు, హృదయాకాశరూపమైన గుహ యందుండువాడు నగుటవలన 'గుహ్యః' యను నామముచే ధ్యానింపబడుచున్నాడు.

౫౪౩. గభీరః-

జ్ఞాన-ఐశ్వర్య-బల-వీర్యాదుల చేత గంభీరుడు కాన, 'గభీరః' యను నామముచే స్తుతింపబడుచున్నాడు.

౫౪౪. గహనః-

సులభముగా ప్రవేశింప శక్యము కానివాడు; జాగ్రత్స్వప్నసుషుప్తులకు, భావాభావములకును సాక్షియైనవాడును నగుటవలన పరమాత్మ 'గహన' శబ్దవాచ్యుడగుచున్నాడు.

౫౪౫. గుప్తః-

వాఙ్మనస్సులకు గోచరింపనివాడు గాన 'గుప్తః' యను సంజ్ఞచే నొప్పును, 'ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే' యనుచు శ్రుతి 'సర్వభూతములయందును గూఢముగ నున్న యీ ఆత్మ ప్రకాశించుట (తెలియుచుండుట) లేదు' అని పై విషయమును వివరించుచున్నది.

౫౪౬. చక్రగదాధరః-

మనస్తత్త్వరూపమైన చక్రమును, బుద్ధితత్త్వరూపమైన గదను లోకరక్షార్థము ధరించుచున్నవాడు గావున 'చక్రగదాధరః' యనుచు పరమేశ్వరుడు ధ్యాతవ్యుడగుచున్నాడు.

శ్లో॥ వేధాః స్వాంగో౽జితః కృష్ణో దృఢః సంకర్షణో౽చ్యుతః ।
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః ॥ ౬౨

శం. భా.:- విధాతా వేధాః. 'పృషోదరాదిత్వాత్సాధుత్వమ్'. స్వయమేవ కార్యకరణే అంగం సహకారీతి స్వాంగః. న కేనాపి అవతారేషు జిత ఇతి అజితః. కృష్ణః కృష్ణద్వైపాయనః. 'కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్. కో హ్యన్యః పుండరీకాక్షాన్మహాభారతకృద్భవేత్' ఇతి విష్ణుపురాణవచనాత్. స్వరూపసామర్థ్యాదేః ప్రచ్యుత్యభావాత్ దృఢః. సంహారసమయే యుగపత్ ప్రజాః సంకర్షతీతి సంకర్షణః. న చ్యోతతి స్వరూపాదితి

అచ్యుతః. సంకర్షణోఽచ్యుత ఇతి నామైకం సవిశేషణమ్. స్వరశ్మీనాం సంవరణాత్ సాయంగత స్సూర్యో వరుణః. 'ఇమం మే వరుణ శ్రుధి హవమ్' ఇతి మన్త్రవర్ణాత్. వరుణస్యాఽపత్యం వసిష్ఠోఽగస్త్యో వా వారుణిః వృక్ష ఇవాఽచలతయా స్థిత ఇతి వృక్షః. 'వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః' ఇతి శ్రుతేః. వ్యాప్త్యర్థా దక్షతే ర్ధాతోః పుష్కరోపపదా దణి ప్రత్యయే. పుష్కరాక్షః. హృదయపుండరీకే చిన్తితః స్వరూపేణ ప్రకాశత ఇతి వా. పుష్కరాక్షః సృష్టిస్థిత్యన్తకర్మాణి మనసైవ కరోతీతి మహామనాః. 'మనసైవ జగత్సృష్టిం సంహారం చ కరోతి యః' ఇతి విష్ణు పురాణే ॥

౫౮౭. వేధాః -

విధాతయై యొప్పువాడు గాన 'విధాతా' యని కీర్తింపబడుచున్నాడు.

౫౮౮. స్వాంగః -

కార్యాచరణములో స్వయముగనే సహకారి యగువాడు కనుక, పరమేశ్వరుడు 'స్వాంగ' శబ్దవాచ్యుడు.

౫౮౯. అజితః-

అవతారసమయములయందు ఎవరిచేతను జితుడు కానివాడు గాన, 'అజితః' యను నామమున బరగువాడు.

౫౯౦. కృష్ణః-

కృష్ణద్వైపాయనుడు. విష్ణుపురాణము - 'కృష్ణద్వైపాయనం విద్ధి నారాయణం ప్రభుమ్' - అను శ్లోకముచే 'వ్యాసుడయిన కృష్ణద్వైపాయనుని నారాయణునిగ తెలిసికొనవలయును; పుండరీకాక్షుడు తక్క యన్యుడెవడు మహాభారత

కర్త కాగలడు'-అని యనుచు కృష్ణద్వైపాయనుడు సాక్షాన్నారాయణస్వరూపునిగ గుర్తింపనగునని చెప్పినది. కాన పరమేశ్వరుడు 'కృష్ణ' శబ్దముచే చెప్పబడుట యుపపన్నము.

౫౫౧. దృఢః-

స్వరూపమున గాని, సామర్థ్యమున గాని, ఎన్నడును ప్రచ్యుతి లేనివాడు గాన 'దృఢః' యను నామముచే ధ్యానింపబడుచున్నాడు.

౫౫౨. సంకర్షణోఽచ్యుతః-

సంహారకాలమున ప్రజలను ఒక్కసారిగ నాకర్షించువాడు గావున 'సంకర్షణః' యను నామముచే కీర్తనీయుడగుచున్నాడు. 'అచ్యుతః'-స్వరూపస్థితినుండి చ్యుతుడు కానివాడు గాన 'అచ్యుత' శబ్దవాచ్యుడు కనుక 'సంకర్షణోఽచ్యుతః' యను ఏక నామముచే విరాజిల్లునట్టివాడు.

౫౫౩. వరుణః-

తన కిరణములను సంకోచింపజేయుట వలన, సాయంకాల సూర్యుడు 'వరుణః' యను శబ్దముచేత చెప్పబడును, 'ఇమం మే వరుణ శ్రుధీ' యను మంత్రము ఈ పై విషయము నభివ్యక్తము చేయుచున్నది.

౫౫౪. వారుణః-

వరుణుని అపత్యమైన వసిష్ఠుడు లేక అగస్త్యుడు; కాన 'వారుణః' యను నామముచే కీర్తనీయుడగుచున్నాడు.

౨౫౭. వృక్షః-

వృక్షము వలె అచలముగ నుండువాడు గాన, 'వృక్షః' యనుచు స్తవనీయు డగుచున్నాడు. 'వృక్ష ఇవ స్తబ్ధః...' అను మంత్రవర్ణముచే నీ విషయము సిద్ధము.

౨౫౮. పుష్కరాక్షః-

పుష్కరశబ్దము ఉపపదముగగల వ్యాప్త్యర్థకమైన 'అక్ష' ధాతువునకు 'అణ్' ప్రత్యయము చేయగా, 'పుష్కరాక్షః' యను రూపము నిష్పన్నమైనది. పుష్కరమును (ఆకాశమును) వ్యాపించినవాడు; హృదయ పుండరీకమందు విచారింపబడి స్వరూపముతో ప్రకాశించువాడు గాన, 'పుణ్డరీకాక్షః'యనుచు స్తవనీయుడగుచున్నాడు.

౨౫౯. మహామనాః-

సృష్టి-స్థితి-లయములను మనస్సు చేతనే చేయువాడు గాన,'మహామనాః'యను నామముతో నొప్పారునట్టివాడు 'మనసైవ జగత్సృష్టిం సంహారం చ కరోతి యః'- అను విష్ణుపురాణ వచనము వలన పై విషయము సూచితమగుచున్నది.

శ్లో॥ భగవాన్ భగహాఽఽనన్దీ వనమాలీ హలాయుధః ।
ఆదిత్యో జ్యోతిరాదిత్యః సహిష్ణుః గతి సత్తమః॥ 23

శం. భా. :- 'ఐశ్వర్యస్య సమగ్రస్య యశసః శ్రియః జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా' సోఽస్యాస్తీతి భగవాన్. 'ఉత్పత్తిం ప్రలయం చైవ భూతానా మాగతిం గతిమ్. వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవానితి' ఇతి విష్ణుపురాణే. ఐశ్వర్యాదికం సంహారసమయే హన్తీతి

భగహా. సుఖస్వరూపత్వాత్ ఆనన్దీ. సర్వ సంపత్సమృద్ధత్వాత్ ఆనన్దీవా. భూతతన్మాత్రరూపాం వైజయన్త్యాఖ్యాం వనమాలాం వహాన్ వనమాలీ. ఆహలమాయుధమస్యేతి. హలాయుధః-బలభద్రాకృతిః అదిత్యాం కశ్యపాత్ వామనరూపేణ జాతః అదిత్యః. జ్యోతిషు సవితృమండలేస్థితః. జ్యోతిరాదిత్యః. ద్వన్ద్వానిశీతోష్ణాదీని సహతే ఇతి సహిష్ణుః. గతిశ్చాసౌ సత్తమశ్చేతి గతిసత్తమః ॥

౫౫౮. భగవాన్-

విష్ణుపురాణవచనానుసారము సంపూర్ణమైన ఐశ్వర్యము ధర్మము, యశస్సు, లక్ష్మి, జ్ఞానము, వైరాగ్యము - ఈ యారింటికి 'భగ' మని పేరు, భగరూపమగు ఐశ్వర్యముచే నొప్పువాడు గాన, 'భగవాన్' అని సంకీర్తితుడగుచున్నాడు, మరియు, భూతముల యుత్పత్తిని, ప్రలయమును, గమనాగమనములను, విద్యను, అవిద్యను తెలిసినవాడు నగుటవలనను భగవాన్' యని స్తుతింపబడుచున్నాడు.

౫౫౯. భగహా-

సంహారసమయమందు ఐశ్వర్యాదికమును పోగొట్టువాడు కాన, 'భగహా' యను నామముచే ధ్యాతవ్యుడగుచున్నాడు.

౫౬౦. ఆనన్దీ-

సుఖస్వరూపుడు, సర్వసంపత్సమృద్ధి కలవాడు నగుట జేసి పరమాత్మ "ఆనన్దీ' యను నామమున బరగుచున్నాడు.

౫౬౧. వనమాలీ-

భూతతన్మాత్రరూపమయిన 'వైజయన్తి' యను వన

మాలను వహించువాడు (ధరించువాడు) గాన 'వనమాలీ' యను నామముచే సంకీర్తితు డగుచున్నాడు.

౫౬౨. హలాయుధః-

హలము నాగలి ఆయుధముగ గల బలభద్రస్వరూపుడు గాన, 'హలాయుధః' యను నామముచే విరాజిల్లునట్టివాడు.

౫౬౩. ఆదిత్యః-

అదితియందు కశ్యపునివలన వామనరూపమున ఆవిర్భవించినవాడు గాన, 'ఆదిత్యః' యను నామముచే సంకీర్తితు డగుచున్నాడు.

౫౬౪. జ్యోతిరాదిత్యః-

జ్యోతిస్స్వరూపమైన సవితృమండలమందు ఉన్నవాడు గాన, 'జ్యోతిరాదిత్యః' యను నామముచే స్తవనీయుడగుచున్నాడు.

౫౬౫ సహిష్ణుః-

శీతోష్ణాది ద్వంద్వములను సహించువాడు కనుక 'సహిష్ణు' శబ్దవాచ్యుడగుచున్నాడు.

౫౬౬. గతిసత్తమః-

గతియై యున్న సత్తముడు (శ్రేష్ఠుడు) గావున, 'గతిసత్తమః' యనుచు పరమేశ్వరుడు సంకీర్తనీయు డగుచున్నాడు.

శ్లో॥ సుధన్వా ఖండపరశు ర్దారుణో ద్రవిణప్రదః।
దివస్పృక్ సర్వదృగ్వ్యాసో వాచస్పతిరయోనిజః॥ ౭౪

శం. భా. :- శోభన మిన్ద్రియాదిమయం శార్ఙ్గం ధను రస్యాస్తీతి సుధన్వా. శత్రూణాం ఖండనాత్ ఖండః పరశు రస్య జామదగ్న్యాకృతే రితి ఖండపరశుః. అఖండః. పరశు రస్యేతి వా అఖండపరశుః. సన్మార్గ విరోధినాం దారుణత్వాత్ దారుణః. ద్రవిణం వాంఛితం భక్తేభ్యః ప్రదదా తీతి ద్రవిణప్రదః దివః స్పర్శనాత్ దివస్స్పృక్ సర్వదృశాం సర్వజ్ఞానా నాం విస్తారకృ ద్వ్యాసః సర్వదృగ్వ్యాసః అథవా. సర్వ చ సా దృక్చేతి సర్వదృక్. సర్వాకారం జ్ఞానమ్. సర్వస్య దృష్టిత్వాద్వా సర్వదృక్ ఋగ్వే దాదివిభాగేన చతుర్ధా వేదా వ్యస్తాః కృతాః ఆద్యో వేద ఏకవింశతిధా కృతః ద్వితీయ ఏకోత్తరశతధా కృతః. సామవేద స్సహస్రధా కృతః అథర్వ వేదో నవధా శాఖాభేదేన కృతః ఏవ మన్యాని చ పురాణాని వ్యస్తా న్యనేనేతి వ్యాసః. బ్రహ్మా. వాచస్పతిర యోనిజః-వాచో విద్యాయాః పతిః. వాచస్పతిః. జనన్యాన న జాయత ఇతి అయోనిజః. ఇతి సవిశేషణమేకం నామ ॥

౫౮౭. సుధన్వా -

శోభనము, ఇంద్రియాదిమయము నయిన 'శార్ఙ్గము' అను ధనుస్సు కలవాడు గాన పరమేశ్వరుడే 'సుధన్వా' యను నామముచే కీర్తింపబడుచున్నాడు.

౫౮౮. ఖణ్డపరశుః (అఖణ్డపరశుః) -

శత్రువులను ఖండించెడి పరశువుకల పరశురామ స్వరూపుడు గాన, 'ఖణ్డపరశుః' యనియు, లేదా, 'అఖణ్డపరశుః' యని నామమును విభాగము చేసినచో అఖండమైన పరశువు గలవాడుగాన 'అఖండపరశుః' యనియు ప్రస్తుతింపబడు చున్నాడు.

౭౭౯. దారుణః-

సన్మార్గవిరోధుల యెడ దారుణమైనవాడు కనుక 'దారుణః' అను శబ్దముచే స్తోతవ్యుడగుచున్నాడు.

౭౮౦. ద్రవిణప్రదః-

భక్తులకు వాంఛితముల ననుగ్రహించువాడు గాన 'ద్రవిణప్రదః' యను నామము పరమేశ్వరునియందు ప్రసిద్ధము.

౭౮౧. దివఃస్పృక్-

దివమును స్పృశించువాడు గావున 'దివఃస్పృక్' యని కీర్తింపబడుచున్నాడు.

౭౮౨. సర్వదృగ్వ్యాసః-

సర్వాసాం దృశాం - సర్వజ్ఞానములకు వ్యాసః - విస్తారకర్త గాన, 'సర్వదృగ్వ్యాసః యనబడును. లేదా, సర్వదృక్ - సర్వాకారజ్ఞానము సర్వమునకు దృష్టియు నని యర్థము. కాన, పరమేశ్వరుడు 'సర్వదృక్' శబ్దముచే చెప్పబడును. వ్యాసః- ఋగ్వేదాది విభాగముతో వేదమును, చతుర్విధముగా విభజించినవాడు. అందులో - ఋగ్వేదమును ఇరువదియొక శాఖలుగను, యజుర్వేదమును నూటఒక శాఖలుగను, సామవేదమును సహస్రశాఖలుగను, అథర్వణవేదమును తొమ్మిది శాఖలుగను విభజించెను. ఇట్లు పురాణములను విభక్తముగ చేసినవాడు వ్యాసుడు - బ్రహ్మ.

౭౮౩. వాచస్పతిరయోనిజః-

విదకు పతి వాచస్పతి; జననియందు జన్మ లేనివాడు అయోనిజుడు. ఇది విశేషణ విశిష్టమగు ఏకనామము.

శ్లో॥ త్రిసామా సామగ స్సాను నిర్వాణం భేషజం భిషక్ ।
సంన్యాసకృ చ్ఛమ శ్శాన్తో నిష్ఠా శా న్తిః పరాయణమ్ ॥

శం. భా. :- దేవవ్రతసమాఖ్యాతైః త్రిభిః సామభిః సామగైః స్తుత ఇతి త్రిసామా, సామగాయతీతి సామగః 'వేదానాం సామవేదోఽస్మి'- ఇతి భగవద్వచనాత్ - సామవేదః నామ సర్వదుఃఖోపశమలక్షణం పరమానన్ద రూపం నిర్వాణమ్ సంసారరోగస్యౌషధం భేషజమ్ సంసారరోగవిర్మోక్ష కారిణీం పరాం విద్యా ముపదిదేశ గీతాస్వితి భిషక్ 'భిష క్తమం త్వా భిషజాం శృణోమి' ఇతి శ్రుతేః. మోక్షార్థం చతుర్థ మాశ్రమం కృతవానితి సంన్యాసకృత్, సంన్యాసినాం ప్రాధాన్యేన జ్ఞానసాధనం శమ మాచష్ట ఇతి శమః

శ్లో॥ 'యతీనాం ప్రశమో ధర్మో నియమో వనవాసినామ్ ।
దానమేవ గృహస్థానాం శుశ్రూషా బ్రహ్మచారిణామ్ ॥
ఇతి స్మృతేః.

'తత్ కరోతి తదాచష్టే' ఇతి ణిచి 'పచాద్యచి' కృతే రూపం, శమ ఇతి స[illegible]తానాం శమయతీతి వా శమః విషయసుఖే ష్వనంగీకయా శాన్తః '[illegible] - విష[illegible]యం [illegible]న్తమ్' ఇతి శ్రుతేః ప్రలయే పితరాం తైర్ నిష్ఠా [illegible] [illegible] [illegible] [illegible]త్తిః [illegible] నిః సా బ్రహ్మైవ పరముత్కృష్ట మయనం స్థానం పునరావృత్తి శంకారహిత మితి. పరాయణమ్ పుంలింగపక్షే బహువ్రీహిః ॥

౫౭౭ త్రిసామా -

దేవవ్రత సమాఖ్య కల మూడు సామములతో సామగులచేత స్తుతింపబడువాడు గాన, 'త్రిసామా' యను నామము సార్థకము.

౫౭౫. సామగః-

సామగానము చేయువాడు కనుక; 'సామగః' యను నామముచే స్తోతవ్యుడు ;

౫౭౬. సామ -

'వేదానాం సామవేదోఽస్మి, యను భగవద్వచ నాను సారము పరమేశ్వరుడు సామవేదస్వరూపుడు గాన, 'సామ' శబ్దవ్యపదేశ్యుడు.

౫౭౭. నిర్వాణమ్ -

సర్వదుఃఖోపశమన లక్షణమైన పరమానన్దస్వరూపము గాన, 'నిర్వాణమ్' అని స్తుతింపబడుచున్నాడు.

౫౭౮. భేషజమ్-

సంసారరూపరోగమునకు ఔషధ మయినవాడు కావున, 'భేషజమ్' అనుచు భక్తులచే కీర్తింపబడుచున్నాడు.

౫౭౯. భిషక్ -

సంసారరోగమునుండి విముక్తిని కలిగింపగల పరా విద్యను భగవద్గీతలో నుపదేశించిన వైద్యుడు గాన, 'భిషక్' యని, ప్రస్తుతింపబడుచున్నాడు. భిషక్తమం త్వా భిషజాం శృణోమి' యనుచు శ్రుతి పై విషయమును తెలియుచేయు చున్నది.

౫౮౦. సంన్యాసకృత్ః-

మోక్షార్థమై సంన్యాసను ఏర్పరచినవాడు గాన,

'సంన్యాసకృత్' యను నామముచే చెప్పబడుచున్నాడు.

౫౮౧ శమః-

'యతులకు ప్రశమము, వానప్రస్థులకు నియమము, గృహస్థులకు దానము, బ్రహ్మచారులకు శుశ్రూష, పరమ ధర్మ' మని చెప్పునట్టి స్మృతివచన తాత్పర్యానుసారము సంన్యాసులకు ప్రధానముగ జ్ఞానసాధనమైన శమము నుపదేశించినవాడు గాన 'శమ' శబ్దముచే సంకీర్తితుడగుచున్నాడు. ఇట. 'శమ' శబ్దమునకు, 'తదాచష్టే' యను అర్థమున, 'ణిచ్' చేసి పచాదిత్వముచే 'అచ్' ప్రత్యయము చేయగా 'శమః' అను రూపము నిష్పన్నమయ్యెను. సర్వభూతములను శమింపజేయువాడు నగుటవలన కూడ, 'శమః' యని చెప్పబడుచున్నాడు.

౫౮౨. శాన్తః-

'నిష్కలం నిష్క్రియం'-అని, శ్రుతి ప్రతిపాదించినరీతిగ, పరమాత్మ, విషయసుఖముల యందు అసంగుడగుటవలన, 'శాన్తః' యనుచు భక్తులకు భజనీయు డగుచున్నాడు.

౫౮౩. నిష్ఠాః-

ప్రలయకాలమున భూతములయొక్క స్థితిఉనికి తనయందే గలవాడు కాన, 'నిష్ఠా' నామముతో బరగుచున్నాడు.

౫౮౪. శాన్తిః-

శాన్తి యనగా, సమస్తఅవిద్యానివృత్తి; అది బ్రహ్మస్వరూపమే; కావున, 'శాన్తి' శబ్దప్రతిపాద్యుడై, స్తవనీయుడగుచున్నాడు.

౫౮౫. పరాయణమ్-

పర - ఉత్కృష్టమైన, అయనం-స్థానము; పునరావృత్తి శంకారహితమైన స్థానము. కావున, పరమాత్మ, 'పరాయణమ్' అను నామముచే ధ్యాతవ్యుడగు చున్నాడు. 'పరాయణః, పుంలింగపక్షములో, 'పరం అయనం యస్య సః' అని బహువ్రీహి సమాసము చెప్పవలెను.

శ్లో॥ శుభాంగ శ్శాన్తిదః స్రష్టా కుముదః కువలేశయః ।
గోహితో గోపతి ర్గోప్తా వృషభాక్షో వృషప్రియః॥ ౭౬

శం. భా. :- సున్దరాం తనుం ధారయన్ శుభాంగః; రాగద్వేషాది నిర్మోక్షలక్షణాం శాన్తిం దదాతీతి శాన్తిదః సర్గాదౌ సర్వభూతాని ససర్జేతి స్రష్టా. కౌ భూమ్యాం మోదత ఇతి కుముదః. కోః - క్షితేః వలనాత్ సంవరణాత్ కువలం జలమ్ తస్మిన్ శేతే ఇతి కువలేశయః, 'శయవాస వాసిష్వకాలాత్' ఇతి అలుక్ సప్తమ్యాః. కువలస్య బదరీఫలస్య మధ్యే శేతే తక్షకః. సోఽపి తస్య విభూతిరితి వా హరిః కువలేశయః. కౌ భూమ్యాం వలతే సంశ్రయత ఇతి. సర్పాణా ముదరం కువలమ్ తస్మిన్ శేషోదరే శేతే ఇతి కువలేశయః గవాం వృద్ధ్యర్థం గోవర్ధనం ధృతవానితి గోభ్యో హితో గోహితః. గోః భూమే ర్భారావతరణేచ్ఛయా శరీర గ్రహణం కుర్వాన్వా గోహితః గోః భూమ్యాః పతిః గోపతిః. రక్షకోజగత ఇతి. గోప్తా. స్వమాయయా స్వమాత్మానం సంవృణోతీతి వా గోప్తా. సకలాన్ కామాన్ వర్షతే అక్షిణీ అస్యేతి వృషభో ధర్మః స ఏవ వా దృష్టిరస్యేతి వృషభాక్షః. వృషోధర్మః ప్రియో యస్య స వృషప్రియః, 'వా ప్రియస్య' ఇతి పూర్వనిపాతవికల్ప విధానాత్ పరనిపాతః వృషశ్చాసౌ ప్రియశ్చేతి వా॥

౭౮౬. శుభాంగః-

సౌందరమగు శరీరమును ధరించినవాడగుటచే 'శుభాంగః' యని చెప్పబడును.

౭౮౭. శాన్తిదః-

రాగద్వేషాది రాహిత్యరూపమగు శాన్తి నిచ్చువాడు గాన, 'శాన్తిదః' యను నామముతో పిలసిల్లు నట్టివాడు.

౭౮౮. స్రష్టా-

సర్గాదియందు సర్వభూతములను సృష్టి యని కీర్తింపబడు చున్నాడు.

౭౮౯. కుముదః-

కు-భూమియందు మోదః - మోదము నొందువాడు కావున, 'కుముద' శబ్దవాచ్యుడు.

౭౯౦. కువలేశయః-

కు-భూమిని వల-ఆవరించునది గాన, జలము 'కువల' మనబడును. ఆ జలమునందు శయనించు వాడగుట వలనను, లేదా, 'కువల' మనగా. బదరీఫలము; దాని మధ్యన శయనించు వాడు తక్షకుడు. ఆ తక్షకుడును పరమేశ్వరవిభూతియే యగుట చేతను శ్రీహరి 'కువలేశయః' యనుచు ఖ్యాతవ్యుడు. అథవా, సర్పముల ఉదరము భూమి నాశ్రయించుట జేసి 'కువల శబ్దముచే ఆదిశేషు డుపలక్షితు డగును. ఆ యాదిశేషుని యుదరమందు శయనించువాడు గాన 'కువలేశయః' యని సంకీర్తితు డగు చున్నాడు.

౫౯౧. గోహితః-

గోవుల వృద్ధికొరకు గోవర్ధనగిరిని ధరించుట వలన గోవులకు హితుడు : లేక, గో-భూమియొక్క భారావతరణార్థము శరీరగ్రహణము చేసినవాడు నగుటచే 'గోహితః'యను నామముచే సంకీర్తితు డగుచున్నాడు.

౫౯౨. గోపతిః-

భూమికి పతి యైనవాడు గాన, 'గోపతిః'యని ధ్యానింపబడుచున్నాడు.

౫౯3. గోప్తా-

జగద్రక్షకుడు; లేక, తన మాయచేత తన స్వరూపమును తెలియకుండ గుప్తపరచుకొనువాడు కాన, 'గోప్తా' యను నామముచే భజనీయుడు.

౫౯౪.వృషభాక్షః-

సర్వకామములను వర్షించెడి అక్షులు కలవాడు; అథవా, వృషభ మనగా, ధర్మము; అదియే ధర్మముగ కలవాడు నగుటచే "వృషభాక్షః' యనుచు ప్రస్తుతింపబడుచున్నాడు.

౫౯౫. వృషప్రియః-

వృష - ధర్మము, ప్రియముగ కలవాడు; లేదా. 'వృషశ్చాసౌ ప్రియశ్చ' యని చెప్పికొనినచో, ధర్మస్వరూపుడు, ప్రియస్వరూపుడు నగుటచే 'వృషప్రియః' యను నామము పరమేశ్వరునియందు అన్వర్థము.

శ్లో॥ అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః ।
శ్రీవత్సవక్షాః శ్రీవాస శ్శ్రీపతి శ్శ్రీమతాంవరః ॥ 66

శం భా. :- దేవాసురసంగ్రామా న్న నివర్తతే ఇతి అనివర్తీ; వృషప్రియత్వా ద్ధర్మా న్న నివర్తతే ఇతి వా. స్వభావతో విషయేభ్యో నివృత్త ఆత్మా మనోఽస్యేతి నివృత్తాత్మా విస్తృతం జగత్ సంహారసమయే సూక్ష్మ రూపేణ సంక్షిపన్ సంక్షేప్తా. ఉపాత్తస్య పరిరక్షణం కరోతీతి క్షేమకృత్. స్వనామస్మృతిమాత్రేణ పావయన్ శివః. ఇతి నామ్నాం షష్ఠశతం వివృతమ్. శ్రీవత్ససంజ్ఞం చిహ్నం మస్య వక్షసి స్థితమితి శ్రీవత్సవక్షాః. అస్య వక్షసి శ్రీ రనపాయినీ వసతీతి శ్రీవాసః. అమృతమథనే సర్వాన్ సురాసురాదీన్ విహాయ శ్రీరేనం పతిత్వేన వరయామాసేతి శ్రీపతిః. శ్రీః పరా శక్తిః తస్యాః పతిరితి వా. 'పరాఽస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే' ఇతి శ్రుతేః. ఋగ్యజుస్సామలక్షణా శ్రీ ర్యేషాం తేషాం సర్వేషాం శ్రీమతాం విరించ్యాదీనాం ప్రధానభూతః శ్రీమతాంవరః 'ఋచస్సామాని యజూంషి సా హి శ్రీరమృతా సతామ్' ఇతి శ్రుతేః

౫౯౬. అనివర్తీ-

దేవాసురసంగ్రామము నుండి నివర్తింపనివాడు లేక, వృష (ధర్మ) ప్రియుడు గనుక, ధర్మమునుండి నివర్తింపనివాడు నగుట వలన 'అనివర్తీ' యని కీర్తింపబడుచున్నాడు.

౫౯౭. నివృత్తాత్మా-

స్వాభావికముగ విషయముల నుండి నివృత్తమైన మనస్సు కలవాడగుటచే 'నివృత్తాత్మా' యనుచు భక్తులచే కొనియాడబడుచున్నాడు

౫౯౮. సంక్షేప్తా-

విస్తృతమైన జగత్తును సంహారసమయమున సూక్ష్మ

రూపముగ సంక్షేప మొనర్చువాడు గాన, 'సంక్షేప్తా' యను నామమున బరుగునట్టివాడు.

౪౯౯. క్షేమకృత్ –

లబ్ధమైనదానికి పరిరక్షకుడు గాన, పరమాత్మ, 'క్షేమకృత్' శబ్దముచే అభిహితుడగుచున్నాడు.

౫౦౦. శివః–

స్వనామస్మరణమాత్రమున భక్తులను పావనము చేయువాడు గాన, 'శివ' శబ్దవాచ్యుడు. ఇక్కడకు నామములలో పఞ్చశతము వివరింపబడినది,

౫౦౧. శ్రీవత్సవక్షాః–

'శ్రీవత్స' మను చిహ్నము వక్షమునందు గలవాడు గాన, 'శ్రీవత్సవక్షాః' యను నామము శ్రీహరియందు ప్రసిద్ధము.

౫౦౨. శ్రీవాసః –

ఏ పరమాత్మ వక్షస్థలమందు శ్రీదేవి అనపాయినియై వసించి యుండునో ఆ శ్రీహరి 'శ్రీవాసః' యను నామమున ఒప్పారుచుండును.

౫౦౩. శ్రీపతిః–

అమృతమథనకాలమందు సురాసురాదుల నందరిని విడచి శ్రీదేవిచే పతిగా వరింపబడినవాడు గాన, 'శ్రీపతిః' యను నామముచే పరమాత్మ స్తవనీయు డగుచున్నాడు. అథవా, 'శ్రీః' యనగా, పరాశక్తికి పతి యగుటవలను 'శ్రీపతిః'

యని చెప్పబడుచున్నాడు. 'పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే' యను శ్రుతివచనము ఈ విషయమును స్పష్టీకరించుచున్నది.

౬౦౪. శ్రీమతాంవరః-

'ఋచ స్సామాని యజూంషి, సా హి శ్రీ రమృతా సతామ్'- అను శ్రుతి ననుసరించి ఋగ్యజుస్సామ లక్షణ మయిన శ్రీ కలవారందుకు శ్రీమంతులు. అట్టి శ్రీ చే నావ్వ బ్రహ్మాదులలో ప్రధానమైనవాడు గాన, 'శ్రీమతాంవరః' యనుచు పరమేశ్వరుడు స్తోతవ్యుడగుచున్నాడు.

శ్లో॥ శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః ।
శ్రీధరః శ్రీకరః శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః ।

శ. భా. :- శ్రియం దదాతి భక్తానా మితి శ్రీదః; శ్రియ ఈశః శ్రీశః; శ్రీమత్సు నిత్యం వసతీతి శ్రీనివాసః; శ్రీశబ్దేన శ్రీమన్తో లక్ష్యన్తే; సర్వశక్తిమయేఽస్మి న్నఖిలాః శ్రియో నిధీయన్తే ఇతి శ్రీనిధిః; కర్మానురూపేణ వివిధాః శ్రియః సర్వభూతానాం విభావయతీతి శ్రీవిభావనః; సర్వభూతానాం జననీం శ్రియం వక్షసి వహన్, శ్రీధరః; స్మరతాం స్తువతామ్ అర్చయతాం చ భక్తానాం శ్రియం కరోతీతి, శ్రీకరః. అనపాయిసుఖావాప్తిలక్షణం శ్రేయః, తచ్చ పరస్యైవ రూపమితి, శ్రేయః; శ్రేయోఽస్య స న్తీతి, శ్రీమాన్; త్రయాణాం లోకానా మాశ్రయత్వాత్, లోకత్రయాశ్రయః ॥

౬౦౫. శ్రీదః -

భక్తులకు సిరు లిచ్చువాడు గాన, పరమాత్మ 'శ్రీదః' యనుచు స్తోతవ్యు డగుచున్నాడు.

౬౦౬. శ్రీశః-

శ్రీదేవికి ఈశుడు గాన, 'శ్రీశః' యని చెప్పబడు చున్నాడు.

౬౦౭. శ్రీనివాసః-

ఇట, 'శ్రీ' శబ్దముచే శ్రీమంతు లుపలక్షితు లగుదురు. శ్రీమంతుల యందు నిత్యము వసించువాడు కనుక, 'శ్రీనివాసః' యను నామమున బరగును.

౬౦౮. శ్రీనిధిః-

సర్వశక్తిమయుడైన యీ పరమాత్మ సకలములయిన సిరులకు నిధి యైనవాడగుట వలన; 'శ్రీనిధిః' యను నామముచే కీర్తింప బడుచున్నాడు.

౬౦౯. శ్రీవిభావనః-

కర్మానుగుణముగ వివిధములగు సిరులను, సర్వభూతములకు కలిగించువాడు గాన, 'శ్రీవిభావనః' యనుచు స్తోతవ్యుడగుచున్నాడు.

౬౧౦. శ్రీధరః-

సర్వభూతములకు జనని యైన శ్రీదేవిని, వక్షస్స్థలమున ధరించినవాడు కాన, శ్రీహరి, 'శ్రీధర' శబ్దవాచ్యుడగుచున్నాడు.

౬౧౧. శ్రీకరః-

భగవన్నామస్మరణము స్తోత్రము, అర్చనము చేయు

భక్తులకు సిరుల నిచ్చువాడగుటచే 'శ్రీకరః' యనుచు భజనీయు డగుచున్నాడు.

౬౧౨. శ్రేయః-

'శ్రేయః' - అనగా నిరపాయమైన సుఖప్రాప్తి యని అర్థము. అట్టి శ్రేయస్సు పరమాత్మ యొక్క స్వరూపు డని, చెప్పబడుచున్నాడు.

౬౧౩. శ్రీమాన్-

సిరులు కలవాడు గాన, శ్రీహరి 'శ్రీమాన్' యని కీర్తింపబడుచున్నాడు.

౬౧౪. లోకత్రయాశ్రయః.

త్రిలోకములకు ఆశ్రయమైనవాడగుటచే పరమేశ్వరుడు 'త్రిలోకాశ్రయః' యను నామముచే విలసిల్లుచున్నాడు.

శ్లో॥ స్వక్షః స్వంగః శతానన్దో నన్ది ర్జ్యోతిర్గణేశ్వరః ।
విజితాత్మాఽవిధేయాత్మా సత్కీర్తిః ఛిన్నసంశయః ॥౬౫

శం. భా. :-శోభనే పుణ్డరీకాభే అక్షిణీ అస్యేతి. స్వక్షః; శోభనా న్యంగాని అస్యేతి స్వంగః; ఏక ఏవ పరమా నన్ద ఉపాధిభేదాచ్ఛ తథా భిద్యత ఇతి శతానన్దః 'ఏతస్యైవానన్దస్యాఽన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి' ఇతి శ్రుతేః పరమా నన్దవిగ్రహో నన్దిః: జ్యోతిర్గణానా మీశ్వరః జ్యోతిర్గణేశ్వరః; 'తమేవ భాన్త మను భాతి సర్వమ్' ఇతి శ్రుతేః. 'యథాదిత్యగతం తేజః' ఇత్యాది స్మృతేశ్చ విజిత ఆత్మా మనో యేన సః విజితాత్మా; స కేనాపి విధేయ ఆత్మా స్వరూప మస్యేతి అవిధేయాత్మా; సతీ అవితథా కీర్తి

రస్యేతి. సత్కీర్తిః; కరతాలామలకవత్ సర్వం సాక్షాత్కృతవతః క్వాపి సంశయో నాస్తీతి. ఛిన్నసంశయః.

౬౧౫. స్వక్షః-

శోభనము లయిన పుండరీకముల వంటి అక్షులు కల వాడు గాన, 'స్వక్షః' యని ధ్యాతవ్యు డగుచున్నాడు.

౬౧౬. స్వంగః-

శోభనము లయిన అంగములు గలవాడు గాన, 'స్వంగః' యని కీర్తింపబడుచున్నాడు.

౬౧౭. శతానన్దః-

పరమానన్దాత్మకమైన పరమాత్మ యొకడే, ఉపాధి భేదముచే శతవిధము లయినవాడగుట వలన, 'శతానన్దః' యనుచు స్తోతవ్యుడగుచున్నాడు. కనుకనే, 'ఏతస్యైవానన్ద స్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి' యని బృహదా రణ్యక శ్రుతి చెప్పుచున్నది.

౬౧౮. నన్దిః-

పరమానన్దవిగ్రహుడు గాన, 'నన్దిః' యను నామముచే స్తుతింపబడుచున్నాడు.

౬౧౯. జ్యోతిర్గణేశ్వరః-

జ్యోతిర్గణములకు ఈశ్వరుడు గాన, పరమాత్మ, 'జ్యోతిర్గణేశ్వరః, యని స్తుతింపబడుచున్నాడు. 'తమేవ భాన్త మనుభాతి . సర్వమ్', 'యదాదిత్యగతం తేజః' - యనుచు

శ్రుతిస్మృత్యాదులు పై విషయమును ద్యోతనము చేయుచున్నవి.

౬౨౦. విజితాత్మా-

విజితమైన మనస్సు కలవాడు గాన, 'విజితాత్మా' యను నామము పరమాత్మయందు ప్రసిద్ధము.

౬౨౧. అవిధేయాత్మా-

ఎవరికిని విధేయము కానట్టి స్వరూపము గలవాడగుటచే 'అవిధేయాత్మా' యను నామముతో బరగుచున్నాడు.

౬౨౨. సత్కీర్తిః-

యథార్థమైన కీర్తి గలవాడు గనుక, 'సత్కీర్తిః' యని పిలవబడుచున్నాడు.

౬౨౩. ఛిన్నసంశయః-

కరతలామలకము వలె సర్వమును, సాక్షాత్తుగ దర్శించునట్టివాడగుటచే ఎక్కడను, సంశయము లేనట్టివాడు గాన పరమేశ్వరుడు 'ఛిన్నసంశయః' యను నామముచేత స్తవనీయుడగుచున్నాడు.

శ్లో॥ ఉదీర్ణః సర్వతశ్చక్షు రనీశః శాశ్వతస్థిరః ।
భూశయో భూషణో భూతి ర్విశోక శ్శోకనాశనః ॥ ౭౦

శం.భా :- సర్వభూతేభ్య స్సముద్రిక్తత్వాత్ ఉదీర్ణః; సర్వతః సర్వం స్వచైతన్యేన పశ్యతీతి సర్వతశ్చక్షుః; 'విశ్వతశ్చక్షుః' ఇతి శ్రుతేః. న విద్యతేఽస్యేశ ఇతి. అనీశః 'న తస్యేశే కశ్చన' ఇతి శ్రుతేః. శశ్వత్

భవన్నపి న విక్రియాం కదాచి దుపైతీతి శాశ్వతస్థిరః ఇతి నామైకమ్; లంకాం ప్రతి మార్గ మన్వేషయన్ సాగరం ప్రతి భూమౌ శేతే ఇతి, భూశయః; స్వేచ్ఛావతారైః బహుభి ర్భూమిం భూషయన్ భూషణః; భూతిః భవనం సత్తా, విభూతిర్వా, సర్వవిభూతీనాం కారణత్వాద్వా. భూతిః విగతః శోకోఽస్య పరమానన్దైకరూపత్వాదితి, విశోకః; స్మృతిమాత్రేణ భక్తానాం శోకం నాశయతీతి, శోకనాశనః ॥

౬౨౮. ఉదీర్ణః-

సర్వప్రాణులకంటె ఉత్కృష్టమైనవాడు గాన, పరమాత్మ 'ఉదీర్ణ' శబ్దవాచ్యు డగుచున్నాడు.

౬౨౯. సర్వతశ్చక్షుః-

సర్వతః సర్వమును, స్వచైతన్యముచే చూచుచుండువాడు గనుక, పరమాత్మకు 'సర్వతశ్చక్షుః' యను నామము అన్వర్థము. శ్రుతి, 'విశ్వతశ్చక్షుః' యని పరమాత్మను కీర్తించుట ఇందుకు ప్రమాణము.

౬౩౦. అనీశః-

తనకు ఈశుడు లేనట్టివాడు కనుక, పరమాత్మ. 'అనీశః' యని స్తుతింపబడుచున్నాడు. 'న తస్యేశే కశ్చన' యను శ్రుతిచే ఈ విషయము ప్రతిపాదింపబడుచున్నది.

౬౩౧. శాశ్వతస్థిరః-

ఎల్లప్పుడు ఉంటూ ఎన్నడను వికృతిని పొందనట్టివాడు గాన, 'శాశ్వతస్థిరః' యను నామముచే సంకీర్తితు డగుచున్నాడు. ఇది ఏకనామము.

౬౨౮. భూశయః-

లంకామార్గము నన్వేషించుచు సాగరుని గూర్చి భూమి యందు శయనించినవాడు గాన, 'భూశయః' యను నామముచే ధ్యాతవ్యుడగుచున్నాడు.

౬౨౯. భూషణః-

స్వేచ్ఛావశమున అనేకములగు అవతారములను ధరించి భూమిని, భూషింప జేయునట్టివాడు కాన, 'భూషణ' శబ్దముచే వ్యపదేశ్యుడగుచున్నాడు.

౬౩౦. భూతిః-

సత్తాత్మకము, లేక 'విభూతి' అథవా, సర్వవిభూతులకు కారణమైనవాడు నగుటచే పరమాత్మ, 'భూతిః'యను పేరుతో బరగుచున్నాడు.

౬౩౧. విశోకః-

పరమానందైకస్వరూపు డగుటచే పరమాత్మ శోక రహితుడు. కాన, అట్టి పరమాత్మ 'విశోకః' యను నామముచే స్తోతవ్యు డగుచున్నాడు.

౬౩౨. శోకనాశనః-

స్మరణామాత్రముచే భక్తుల శోకమును, నశింపజేయు వాడు గాన, శోకనాశనః' యను నామము పరమేశ్వరుని యొక్క అన్వర్థము.

శ్లో॥ అర్చిష్మా నర్చితః కుంభో విశుద్ధాత్మా విశోధనః ।
అనిరుద్ధోఽప్రతిరథః ప్రద్యుమ్నోఽమితవిక్రమః ॥౮౧

శం. భా. :- అర్చిష్మన్తో యదీయేనాఽర్చిషా చన్ద్రసూర్యాదయః, స ఏవ ముఖ్యః అర్చిష్మాన్; సర్వలోకార్చితైః విరించ్యాదిభి ర ప్యర్చిత ఇతి. అర్చితః; కుంభవ దస్మిన్ సర్వం ప్రతిష్ఠిత మితి. కుంభః: గుణత్రయాతీత తయా విశుద్ధత్వాసౌ ఆత్మేతి. విశుద్ధాత్మా. స్మృతిమాత్రేణ పాపానాం క్షపణాత్. విశోధనః; చతుర్వ్యూహేషు చతుర్థో వ్యూహః. అనిరుద్ధః. న విరుధ్యతే శత్రుభిః కదాచిదితి వా; ప్రతిరథః ప్రతిపక్షః అస్య న విద్యతే ఇతి అప్రతిరథః ప్రకృష్టం ద్యుమ్నం ద్రవిణ మస్యేతి. ప్రద్యుమ్నః. చతుర్వ్యూహాత్మా వా. అమితోఽతులితో విక్రమోఽస్యేతి; అమితవిక్రమః. అహింసిత విక్రమో వా.

౬33. అర్చిష్మాన్-

చంద్రసూర్యాదులను; అర్చిష్మంతులుఁగ జేయు అర్చిస్సు (తేజస్సుతో) నొప్పుచున్నవాఁడు గాన, పరమాత్మ, 'అర్చిష్మాన్' యని స్తూయమాను డగుచున్నాడు.

౬3౪. అర్చితః-

సర్వలోకములచేత నర్చింపబడునట్టి బ్రహ్మాదులచే గూడ, అర్చితు డగుచుండువాఁడు గాన, 'అర్చితః' యను నామముచే స్తుతింపబడుచున్నాడు.

౬3౫. కుంభః-

సర్వము తన యందు, కుంభ మందువలె, ప్రతిష్ఠితమైనవా డగుటవలన, 'కుంభ' శబ్దవాచ్యు డగుచున్నాడు.

౬3౬. విశుద్ధాత్మా-

గుణత్రయాతీత మగుటచే విశుద్ధ మయిన ఆత్మ కల

వాడు గాన, 'విశుద్ధాత్మా' యనుచు భజనీయుడగుచున్నాడు.

౮౩౭. విశోధనః-

స్మరణమాత్రము చేతనే పాపములను పోగొట్టువాడు గనుక, 'విశోధనః' యను నామము పరమేశ్వరునియందు అన్వర్థము.

౮౩౮. అనిరుద్ధః-

వాసుదేవ - సంకర్షణ - ప్రద్యుమ్న - అనిరుద్ధ - లను నీ నాల్గు వ్యూహములలో నాలుగవ వ్యూహముగ, నొప్పు వాడు; శత్రువులచే ఎన్నడును, నిరోధింపబడనివాడు నగుటచే 'అనిరుద్ధః' యను నామముచే పరమేశ్వరుడు సంకీర్తనీయుడగు చున్నాడు.

౮౩౯. అప్రతిరథః

ప్రతిరథుడు (ఎదుర్కొనగలవాడు) లేనట్టివాడగుటచే 'అప్రతిరథః' యను నామముచే స్తోతవ్యుడగుచున్నాడు.

౮౪౦. ప్రద్యుమ్నః-

ప్రకృష్టమైన ధనము కలవాడు; అనిరుద్ధాది చతుర్వ్యూహాత్మకుడు నగుటవలన 'ప్రద్యుమ్నః' యను నామము పరమేశ్వరనామముగ ప్రసిద్ధము.

౮౪౧. అమితవిక్రమః-

సాటిలేని విక్రమము గలవాడు; అజేయ పరాక్రమము గలవాడు - గాన 'అమితవిక్రమ' నామమున శ్రీహరి ప్రసిద్ధుడు.

శ్లో॥ కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః ।
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః ॥ ౮౨

శం భా. :- కాలనేమి మసురం నిజఘానేతి, కాలనేమినిహా; వీరః శూరః; శూరకులోద్భవత్వాత్, శౌరిః; శూరజనానాం వాసవాదీనాం శౌర్యాతిశయే నేష్ట ఇతి, శూరజనేశ్వరః; త్రయాణాం లోకానా మన్తర్యామితయా ఆత్మేతి. త్రయో లోకా అస్మా త్పృథగ్భూతార్థతో న భిద్యన్తే ఇతి వా. త్రిలోకాత్మా; త్రయో లోకా స్తదాజ్ఞప్తాః స్వేషు స్వేషు కర్మసు వర్తన్తే ఇతి త్రిలోకేశః; కేశస జ్ఞితాః సూర్యాదిష్వంశవః తద్వత్తయా కేశవః;

శ్లో॥ 'అంశవో యే ప్రకాశన్తే మమ తే కేశసంజ్ఞితాః ।
సర్వజ్ఞాః కేశవం తస్మా న్మామాహు ర్ద్విజసత్తమాః' ॥
ఇతి మహాభారతే.

బ్రహ్మ విష్ణు శివాఖ్యాః శక్తయః కేశస జ్ఞితాః, తద్వత్తయా వా, కేశవః 'త్రయః కేశినః' ఇతి శ్రుతేః. 'మత్కేశౌ వసుధాతలే' ఇతి కేశశబ్దః శక్తి పర్యాయత్వేన ప్రయుక్తః.

శ్లో॥ 'కో బ్రహ్మేతి సమాఖ్యాత ఈశోఽహం సర్వదేహినాం ।
ఆవాం తవాంశసంభూతౌ తస్మాత్ కేశవనామవాన్' ॥
ఇతి హరివంశే.

కేశినామాన మసురం హతవా నితి. కేశిహా; సహేతుకం సంసారం హరతీతి హరిః.

౭౭౨. కాలనేమినిహా-

కాలనేమి యను అసురుని, నిహతుని చేసినవాడు గాన,

'కాలనేమినిహా' యను నామముచే శ్రీహరి స్తోతవ్యు డగు చున్నాడు.

౬౪౩. వీరః-

శూరుడు గాన, 'వీర' శబ్దవాచ్యుడు.

౬౪౪. శూరః (శౌరిః)-

శూరుని కులమందు ఉద్భవించినవాడు గాన, 'శూరః' యని, చెప్పబడుచున్నాడు.

౬౪౫. శూరజనేశ్వరః-

శూరులగు దేవేంద్రాదులను, శౌర్యాతిశయముచేత శాసించునట్టి ప్రభువు గాన, 'శూరజనేశ్వరః' యనుచు కీర్తింపబడును.

౬౪౬. త్రిలోకాత్మా-

త్రిలోకములకు అన్తర్యామి యగుటచేతను, పరమార్థమున, త్రిలోకములు ఆ పరమాత్మకంటె భిన్నములు కామండుటచేతను 'త్రిలోకాత్మా' యని కీర్తింపబడుచున్నాడు.

౬౪౭. త్రిలోకేశః-

త్రిలోకములు, ఆ పరమేశ్వరుని యాజ్ఞకు లోబడి, తమ తమ కర్మలయందు, ప్రవర్తించుచుండుట వలన, ఆయన, 'త్రిలోకేశః' యను శబ్దముచే వ్యపదేశ్యు డగుచున్నాడు.

౬౪౮. కేశవః-

సూర్యాదులయందు సంక్రాన్తము లయిన యంశువులు

(కిరణములు) కేశము లనబడును. అట్టి కేశములు కలవాడు, 'కేశవః' యని చెప్పబడును. మహాభారతము. 'అంశవో యే ప్రకాశన్తే' అను శ్లోకమున 'నాయొక్క యంశువు లేవి ప్రకాశించుచున్నవో, వానికి 'కేశము' లని పేరు; అవి కల వాడను గాన, నన్ను, 'కేశవు' డని, సర్వజ్ఞులు చెప్పు చున్నారు - అని వివరించినది.

అథవా, బ్రహ్మ, విష్ణు, శివాఖ్య శక్తులకు 'కేశ' సంజ్ఞ గలదు. అట్టి శక్తిరూప కేశములు కలవాడు గాన, 'కేశవ' శబ్ద సంజ్ఞితు డగుచున్నాడు. 'త్రయః కేశినః' అను శ్రుతి, పై విషయముననే వివరించుచున్నది. 'మత్కేశా వసుధాతలే' అను స్థలమున, 'కేశ' శబ్దము, శక్తివ్యాఖ్యానముగనే, ప్రయోగింప బడినది. 'కో బ్రహ్మేతి సమాఖ్యాత' యనుచు హరివంశము 'కేశవ' శబ్దమందలి 'క' వర్ణము బ్రహ్మను, ప్రతిపాదించును; సర్వప్రాణులకు ఈశుడను, నేను; మేమిరువురము త్వదంశ సంభూతులము గాన, నీవు కేశవ నామము కలవాడవు' అని కేశవ శబ్దార్థమును వివరించినది.

౬౪౯. కేశిహా-

'కేశి' యను రాక్షసుని సంహరించినవాడు కనుక, 'కేశిహా' యను శబ్దముచే పరమేశ్వరుడు ఉపలక్షితు డగు చున్నాడు.

౬౫౦. హరిః-

సమూలముగ, సంసారమును హరించువాడు గాన,

పరమాత్మ, 'హరిః' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు.

శ్లో॥ కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః ।
అనిర్దేశ్యవపు ర్విష్ణు ర్వీరో௨నన్తో ధనంజయః ॥ ౭౩

శం. భా :- ధర్మాది పురుషార్థచతుష్టయం కాంక్షద్భిః కామ్యత ఇతి కామః, స చాసౌ దేవశ్చేతి కామదేవః; కామినాం కామాన్ పాలయతీతి కామపాలః; పూర్ణకామస్వరూపత్వాత్ కామీ; అభిరూపతమం దేహం వహన్ కాన్తః. ద్విపరార్ధాన్తే కస్య బ్రహ్మణో௨పి అన్తో௨స్మాదితి వా కాన్తః; కృత ఆగమః శ్రుతిస్మృత్యాదిలక్షణో యేన స కృతాగమః. 'శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే' ఇతి భగవద్వచనాత్; 'వేదాః శాస్త్రాణి విజ్ఞాన మేత త్సర్వం జనార్దనాత్' ఇత్యత్రైవ వక్ష్యతి. ఇదం తదీదృశం వేతి నిర్దేష్టుం యన్న శక్యతే, గుణాద్యతీతత్వాత్, తదేవ రూప మస్యేతి. అనిర్దేశ్యవపుః రోదసీవ్యాప్య కాన్తి రభ్యధికా స్థితా௨స్యేతి విష్ణుః.

శ్లో॥ 'వ్యాప్య మే రోదసీ పార్థ కాన్తి రభ్యధికా స్థితా ।
క్రమణా ద్వా௨ప్యహం పార్థ విష్ణు రిత్యభిసంజ్ఞితః' ॥

ఇతి మహాభారతే.

గత్యాదిమత్త్వాత్; వీరః; 'వీ గతి వ్యాప్తి ప్రజన కాన్త్యసన ఖాదనేషు' ఇతి ధాతుపాఠాత్. వ్యాపిత్వా న్నిత్యత్వా త్సర్వాత్మత్వాత్ దేశతః కాలతో వస్తుతశ్చా௨పరిచ్ఛిన్నః. అనన్తః; 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' ఇతి శ్రుతేః.

శ్లో॥ 'గన్ధర్వాప్సరసస్సిద్ధాః కిన్నరోరగ చారణాః ।
నాన్తం గుణానాం గచ్ఛన్తి తేనానన్తో௨య మవ్యయః' ఇతి.

విష్ణుపురాణవచనాద్వా. అనన్తః; యద్దిగ్విజయే ప్రభూతం ధవమజయ త్తేన ధనంజయః. అర్జునః; 'పాణ్డవానాం ధనంజయః'- ఇతి భగవద్వచనాత్ ॥

౬౫౧. కామదేవః-

పురుషార్థములైన ధర్మార్థకామమోక్షములను వాంఛించునట్టి భక్తులచే నభిలషింపబడు దేవుడు గాన, పరమాత్మ 'కామదేవః' యను నామమున బరగును.

౬౫౨. కామపాలః-

విషయాభిలాష కలవారి కోరికలను, పాలించు వాడగుటచే 'కామపాల' శబ్దముచే ధ్యాతవ్యుడు.

౬౫౩ కామీ-

పూర్ణకామస్వరూపుడు గాన, 'కామీ' యని కీర్తింపబడుచున్నాడు.

౬౫౪ కాన్తః-

పరమ సుందరమగు శరీరమును, ధరించిన వాడగుటచేతను, లేక, ద్విపరార్థకాలము యొక్క అంతమందు, 'క' - బ్రహ్మకు, అన్తః - అంతము కలిగించు వాడగుటచేతను, 'కాన్తః' యనుచు, స్తోతవ్యు డగుచున్నాడు

౬౫౫. కృతాగమః-

శ్రుతి స్మృత్యాది లక్షణమైన ఆగమమును, అనుగ్రహించినవాడు గాన, 'కృతాగమః' యను నామము, పరమేశ్వరుని యందన్వర్థము. 'శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే' - శ్రుతి స్మృతులు నా యాజ్ఞలే' - యను భగవద్వచనము పరమే

శ్వరుని యొక్క 'కృతాగమత్వము' ను వివరించుచున్నది. 'వేదాశ్శాస్త్రాణి విజ్ఞాన మేతత్సర్వం జనార్దనాత్' - అనగా, 'వేదములు, శాస్త్రములు, విజ్ఞానము - ఈ సర్వము; భగవంతుని వలన ప్రాప్తించినవే' - యని, ఈ సహస్రనామముల లోనే చెప్పబడినది.

౬౫౬. అనిర్దేశ్యవపుః-

గుణాద్యతీత మగుటచేత, నిది, యిట్టిదని, నిర్దేశింప శక్యము గానట్టి స్వరూపము కలవాడు గాన, అనిర్దేశ్యవపుః' యని పరమాత్మ స్తూయమాను డగుచున్నాడు.

౬౫౭. విష్ణుః-

భూమ్యాకాశము లను వ్యాపించియున్న యత్యధికమగు కాంతితో విరాజిల్లువాడు గాన, పరమేశ్వరుడు 'విష్ణు' శబ్దముచే సంకీర్తనీయు డగుచున్నాడు.

శ్లో॥ "వ్యాప్య మే రోదసీ పార్థ కాన్తి రభ్యధికా స్థితా,
క్రమణాద్వా ప్యహం పార్థ విష్ణు రిత్యభిసంజ్ఞితః" ॥

'అనగా, 'నా కాంతి భూమ్యాకాశము లను వ్యాపించి యుండుటచేతను, నేను సర్వత్ర వ్యాపించి యుండుటచేతను, 'విష్ణు' సంజ్ఞ కలవాడను' - అని చెప్పుచున్న మహాభారత వచనము వలన పరమాత్మ, 'విష్ణు' శబ్దవ్యపదేశ్యు డని తెలియ నగును.

౬౫౮. వీరః-

గత్యాది క్రియలు గలవాడు గాన, పరమేశ్వరుడు

'వీరః' యనుచు స్తవనీయుడగుచున్నాడు. 'వీ' యను ధాతువు గతి-వ్యాప్తి-కాన్తి-మున్నగు నర్థముల దెలియజేయును. ఇవన్నియు కలవాడగుటచే పరమాత్మ 'వీరః' యని చెప్ప బడును.

౬౫౯. అనన్తః-

వ్యాపియై, నిత్యుడై, సర్వాత్మకుడై దేశ-కాల-వస్తు కృత-పరిచ్ఛేదము లేనట్టివాడు కాన పరమాత్మ 'అనన్తః' యనుచు భజనీయుడగుచున్నాడు. "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" యనుచు శ్రుతి పరమాత్మయొక్క అనంతత్వమును ప్రతిపాదించుచున్నది. విష్ణుపురాణమునందు "గంధర్వాప్సరసస్సిద్ధాః" అనుశ్లోకముచే గంధర్వాప్సరులు, సిద్ధులు, కిన్నరులు, ఉరగులు, చారణులు ఆ పరమాత్మయొక్క గుణముల తెలియజాలకపోయిరి. కావున ఆ పరమేశ్వరుడు అనంతుడు, అవ్యయుడు అని చెప్పబడెను.

౬౬౦. ధనంజయః-

దిగ్విజయములో అత్యధికమగు ధనమును జయించుటచే ఆ పరమాత్మ 'ధనంజయః' యనియు, 'అర్జునః' యనియు కీర్తింపబడుచున్నాడు. "పాండవానాం ధనంజయః" యను భగవద్వచనము పై విషయమును స్పష్టము చేయుచున్నది.

శ్లో॥ బ్రహ్మణ్యో బ్రహ్మకృత్ బ్రహ్మ బ్రహ్మ బ్రహ్మవివర్ధనః।
బ్రహ్మవిత్ బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో
బ్రాహ్మణప్రియః ॥ ౭౪

శం. భా. :- 'తపో వేదాశ్చ విప్రాశ్చ జ్ఞానం చ బ్రహ్మసంజ్ఞితమ్' తేభ్యో హితత్వాత్, బ్రహ్మణ్యః; తప ఆదీనాం కర్తృత్వాత్, బ్రహ్మకృత్; బ్రహ్మాత్మనా సర్వం సృజతీతి, బ్రహ్మ: బృహత్త్వాత్ బృంహణత్వాచ్చ సత్యాదిలక్షణం; బ్రహ్మ. 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' ఇతి శ్రుతేః.

శ్లో॥ ప్రత్యస్తమితభేదం యత్ సత్తామాత్ర మగోచరమ్ ।
వచసా మాత్మసంవేద్యం తజ్జ్ఞానం బ్రహ్మసంజ్ఞితమ్ ॥
ఇతి విష్ణుపురాణే

తప ఆదీనాం వివర్ధనాత్, బ్రహ్మవివర్ధనః; వేదం, వేదార్థం చ యథావత్ వేత్తీతి బ్రహ్మవిత్. బ్రాహ్మణాత్మనా సమస్తానాం లోకానాం ప్రవచనం కుర్వన్ వేదస్యోదయమితి, బ్రాహ్మణః. బ్రహ్మసంజ్ఞితాః తచ్ఛేష భూతా అత్రేతి, బ్రహ్మీ. వేదాన్ స్వాత్మభూతాన్ జానాతీతి, బ్రహ్మజ్ఞః. బ్రాహ్మణానాం ప్రియః, బ్రాహ్మణప్రియః. బ్రాహ్మణాః ప్రియా అస్యేతి వా.

శ్లో॥ 'ఘ్నన్తం శపన్తం పురుషం వదన్తం
యో బ్రాహ్మణం న ప్రణమే ద్యథార్హమ్ ।
స పాపకృ ద్బ్రహ్మదవాగ్నిదగ్ధో
వధ్యశ్చ దండ్యశ్చ న చాస్మదీయః' ॥ ఇతి భగవద్వచనాత్.

శ్లో॥ యం దేవం దేవకీదేవీ వసుదేవా దజీజనత్
భౌమస్య బ్రహ్మణో గుప్త్యై దీప్త మగ్ని మివారణిః' ఇతి చ మహాభారతే.

౬౬౧. బ్రహ్మణ్యః -

తపస్సు, వేదములు, విప్రులు, జ్ఞానము - బ్రహ్మ శబ్దముచే చెప్పబడును. వానికి హితకరుడు గావున 'బ్రహ్మణ్యః' యను నామముచే పరమాత్మ సంకీర్తనీయుడగు చున్నాడు.

౬౬౨. బ్రహ్మకృత్ -

తపస్సు మున్నగువానికి కర్త గావున పరమేశ్వరుడు 'బ్రహ్మకృత్' నామముచే స్తోతవ్యు డగుచున్నాడు.

౬౬౩. బ్రహ్మ -

బ్రహ్మరూపమున సర్వమును సృజించువాడు గావున పరమాత్మ 'బ్రహ్మ' యని చెప్పబడుచున్నాడు.

౬౬౪ బ్రహ్మ -

బృహత్త్వ - బృంహణత్వములనుబట్టి (గొప్పదనము, పుష్టిపరచుట) సత్యాదిలక్షణమైన పరమాత్మ 'బ్రహ్మ' శబ్దముచే వ్యపదేశ్యుడగుచున్నాడు. "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" అను శ్రుతివలన పైవిషయము ప్రస్ఫుటమగు చున్నది.

శ్లో॥ ప్రత్యస్తమితభేదం యత్ సత్తామాత్ర మగోచరమ్,
వచసా మాత్మసంవేద్యం తద్ జ్ఞానం బ్రహ్మసంజ్ఞితమ్"

అనగా ఏది భేదరహితము, సత్తామాత్రము, వాక్కులకు అగోచరము, స్వసంవేద్యము అయియుండెనో అట్టిజ్ఞానము 'బ్రహ్మ' యనబడును - అనుచు విష్ణుపురాణము నందలి పై శ్లోకము తెలియచేయుచున్నది.

౬౬౫. బ్రహ్మవివర్ధనః -

తపో వేద విప్ర జ్ఞానములను వృద్ధిపొందించువాడు గాన 'బ్రహ్మవివర్ధనః' యనునామముచే పరమాత్మ ధ్యాతవ్యు డగుచున్నాడు.

"భౌమబ్రహ్మ - బ్రాహ్మణ - రక్షణార్థమే వసుదేవుని వలన దేవకీదేవి దేవదేవుని కనెను." అని మహాభారత వచనము. 'పరమేశ్వరుడు బ్రాహ్మణప్రియుడు' అను విషయమును ద్యోతనము చేయుచున్నది.

శ్లో॥ మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః ।
మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః ॥ ౭౫

శం. భా. :- మహాన్తః క్రమాః పదవిక్షేపా అస్యేతి, మహాక్రమః, 'శం నో విష్ణు రురుక్రమః' ఇతి శ్రుతేః. మహత్ జగదుత్పత్త్యాదికర్మ, అస్యేతి, మహాకర్మా; యదీయేన తేజసా తేజస్వినో భాస్కరాదయః. తత్తేజో మహ దస్యేతి, మహాతేజాః; 'యేన సూర్య స్తపతి తేజసేద్ధః' ఇతి శ్రుతేః, 'యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్' ఇతి భగవద్వచనాచ్చ, క్రౌర్యశౌర్యాదిభిః ధర్మై ర్మహద్భి స్సమలంకృత ఇతి వా. మహాతేజాః మహాంశ్చాసా వురగశ్చేతి, మహోరగః 'సర్పాణా మస్మి వాసుకిః' ఇతి భగవద్వచనాత్ మహాంశ్చాసౌ క్రతుశ్చేతి; మహాక్రతుః. 'యథాఽశ్వమేధః క్రతురాట్' ఇతి మనువచనాత్. సోఽపి స ఏవేతి స్తుతిః మహాంశ్చాసౌ యజ్వా చేతి. లోకసంగ్రహార్థం యజ్ఞాన్ నిర్వర్తయన్, మహాయజ్వా మహాంశ్చాసౌ యజ్ఞశ్చేతి, మహాయజ్ఞః 'యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి' ఇతి భగవద్వచనాత్. మహచ్చ తద్ధవిశ్చేతి, బ్రహ్మాత్మని సర్వంజగ త్తదాత్మతయా హూయతే ఇతి, మహాహవిః మహాక్రతు రిత్యాదయో బహువ్రీహయో వా.

౬౭౧. మహాక్రమః -

'శం - నో - విష్ణు - రురుక్రమః' అను శ్రుతి వచనానుసారము మహాపదవిక్షేపములు కలవాడగుట జేసి పరమేశ్వరుడు

'మహాక్రమః' యను సార్థకనామమున నొప్పారుచుండును.

౬౭౨. మహాకర్మా –

జగదుత్పత్త్యాది మహాకర్మ కలవాడు గాన పరమాత్మ 'మహాకర్మా' యని చెప్పబడును.

౬౭౩. మహాతేజాః–

ఎవని తేజస్సుచేత సూర్యాదులు వెలుగొందుచుందురో అట్టి మహాతేజస్సు కలవాడు కాన పరమేశ్వరుడు 'మహాతేజాః' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు. 'యేన సూర్య స్తపతి తేజసేద్ధః' అను శ్రుతివచనము పై విషయమును స్పష్టము చేయుచున్నది. 'యదాదిత్యగతం తేజః' అను శ్లోకమున 'ఆదిత్యుని యందు, చంద్రునియందు, అగ్నియందు, జగత్తును భాసింపచేయు ఏ తేజస్సు కలదో ఆ తేజస్సు నాదియే' అని భగవద్వచనము తెలుపుచున్నది. ఇంతే కాదు. క్రౌర్య శౌర్యాది మహా ధర్మములచేత అలంకృతుడై యుండుటను బట్టియు పరమాత్మకు 'మహాతేజాః' అను నామము అన్వర్థము.

౬౭౪. మహోరగః–

'సర్పాణా మస్మి వాసుకిః' అను భగవద్వచనానుసారము వాసుకి రూపమును ధరించినవాడు గావున పరమాత్మ 'మహోరగః' యని కీర్తింపబడుచున్నాడు.

౬౭౫. మహాక్రతుః–

'అశ్వమేధః క్రతురాట్' అను మనుస్మృతి వచనానుసారము ఆ యశ్వమేధయాగము పరమేశ్వరుని స్వరూపమే

గాన పరమాత్మ 'మహాక్రతుః' యను నామముచే విలసిల్లు చుండును.

౬౭౬. మహాయజ్వా-

పరమేశ్వరుడు లోకసంగ్రహార్థము యజ్ఞములను నిర్వర్తించువాడు కావున 'మహాయజ్వా' యను నామముచే సంకీర్తనీయుడగుచున్నాడు.

౬౭౭. మహాయజ్ఞః-

'యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి' యను భగవద్వచనాను సారము పరమేశ్వరుడు జపయజ్ఞస్వరూపుడు కాన 'మహాయజ్ఞః' యను నామముచే వ్యపదేశ్యుడగుచున్నాడు.

౬౭౮. మహాహవిః-

బ్రహ్మాత్మయందు సర్వజగత్తు బ్రహ్మభావనతో హావనము చేయబడును గాన 'మహాహవిః' యను నామముచే పరమాత్మ స్తవనీయుడగుచున్నాడు.

ఇట నొక విషయము గమనింప దగియున్నది. 'మహాక్రతుః' మొదలుగాగల నామములకు బహువ్రీహి సమాసము గూడ చెప్పవచ్చును.

శ్లో॥ "స్తవ్యః స్తవప్రియః స్తోత్రం స్తుతిః స్తోతా రణప్రియః ।
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తి రనామయః ॥"

శం. భా. :. సర్వైః స్తూయతే న స్తోతా కస్యచి దితి, స్తవ్యః అతఏవ స్తవప్రియః యేన స్తూయతే తత్. స్తోత్రమ్ గుణసంకీర్తనాత్మకమ్. తద్ధరి రేవేతి. స్తుతిః స్తవనక్రియా స్తోతా. అపి స ఏవ ప్రియో రణో యస్య.

యతః పంచమహాయుధాని ధత్తే సతతం లోకరక్షార్థ మతో, రణప్రియః. సర్వైః కామైః సకలాభిశ్శక్తిభిశ్చ సంపన్న ఇతి, పూర్ణః న కేవలం పూర్ణ ఏవ. పూరయితా చ, సర్వేషాం సంపద్భిః స్మృతిమాత్రేణ కల్మషాణి క్షపయతీతి, పుణ్యః. పుణ్యాకీర్తి రస్య. యద్వా పుణ్యమావహ త్యస్య కీర్తిర్నృణా మితి పుణ్యకీర్తిః, ఆన్తరై ర్బాహ్యై రాధ్యాత్మికాదిభిః కర్మజై ర్న పీడ్యతే ఇతి. అనామయః ॥

౬౮౯. స్తవ్యః—

తానొకనిని స్తుతింప నావశ్యకత లేనివాడును, సర్వుల చేతను స్తుతింపబడువాడు నగుటచే పరమాత్మునందు 'స్తవ్యః' అను నామము సార్థకము.

౬౯౦. స్తవప్రియః—

సర్వులచేత స్తుతింపబడుట వలననే 'స్తవప్రియః' అని పరమేశ్వరుడు చెప్పబడును.

౬౯౧ స్తోత్రమ్

స్తుతిసాధన మగు గుణసంకీర్తనము గూడ హరి స్వరూపమే గాన పరమేశ్వరుడు 'స్తోత్ర' శబ్దముచే వ్యపదేశ్యు డగుచున్నాడు.

౬౯౨. స్తుతిః—

స్తుతిక్రియయు ఆయనయే గాన 'స్తుతి' శబ్దముచే సంకీర్తితు డగుచున్నాడు.

౬౯౩ స్తోతా—

స్తవము చేయువాడును పరమేశ్వరునికంటె భిన్నమైన

వాడు కాడు గాన 'స్తోత్రా' యనియు కీర్తింపబడుచున్నాడు.

౬౮౪. రణప్రియః-

లోకరక్షణార్థము మహాయుధ పంచకమును ధరించిన వాడును రణప్రియుడు నగుటచే 'రణప్రియః' అను నామముచే పరమేశ్వరుడు స్తవనీయు డగుచున్నాడు.

౬౮౫. పూర్ణః-

సకల కామములతో, సకల శక్తులతో సంపన్ను డగుటచే పరమాత్మ 'పూర్ణః' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు.

౬౮౬. పూరయితా -

పరమేశ్వరుడు కేవలము పూర్ణ పురుషుడే గాక సర్వ జీవులను సంపదలచే పూరింప జేయు వాడును గాన 'పూరయితా' యను నామముచే విలసిల్లచుండును.

౬౮౭. పుణ్యః-

స్మరణమాత్రమున సకల కల్మషములను హరింపచేయు నట్టివాడు గాన 'పుణ్యః' అను నామముచే సంకీర్తనము చేయ బడుచున్నాడు.

౬౮౮. పుణ్యకీర్తిః-

పుణ్యమైన కీర్తి కలవాడగుటచేసి సకల నరులకు పుణ్యము ప్రాప్తింప చేయువాడు గాన 'పుణ్యకీర్తిః' యను నామము భగవంతుని యందు అన్వర్థము.

౭౮౯. అనామయః-

ఆంతరములు, బాహ్యములు నగు కర్మజన్యవ్యాధుల యొక్క పీడలేనట్టివాడు గావున పరమాత్మ 'అనామయః' యను నామముచే భజనీయు డగుచున్నాడు.

శ్లో॥ "మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః ।
వసుప్రదో వాసుదేవో వసు ర్వసుమనా హవిః ॥ ౮౦

శం. భా. :- మనసో వేగ ఇవ వేగోఽస్య సర్వగతత్వాత్ మనోజవః చతుర్దశవిద్యానాం, బాహ్యవిద్యా సమయానాం చ ప్రణేతా ప్రవక్తా చేతి తీర్థకరః, హయగ్రీవరూపేణ మధుకైటభౌ హత్వా విరించాయ సర్గాదౌ సర్వాః శ్రుతీ రన్యాశ్చ విద్యా ఉపాదిశన్ వేదబాహ్యా స్సురవైరిణాం చ నాయ చోపదేశేతి పౌరాణికాః కథయన్ని. వసు - సువర్ణం. రేతోఽస్యేతి వసురేతాః.

శ్లో॥ దేవః పూర్వ మపః సృష్ట్వా తాసు వీర్య మపాసృజత్ ।
త దండ మభవ ద్ధైమం బ్రహ్మణః కారణం పరమ్ ॥
ఇతి వ్యాసవచనాత్

వసు ధనం ప్రకర్షేణ దదాతి. సాక్షా ద్దాతాఽధ్యక్షోఽయమ్. ఇతర స్తు తత్ప సాదా ద్దనాదః ఇతి. వసుప్రదః వసు ప్రకృష్టం మోక్షాఖ్యం ఫలం భక్తే భ్యః ప్రదదాతీతి, ద్వితీయోవసుప్రదః, 'విజ్ఞాన మానన్దం బ్రహ్మ. రాతి ర్దాతుః పరాయణం తిష్ఠమానస్య తద్విదః' ఇతి శ్రుతేః. సురారీణాం వసూని ప్రకర్షేణ ఖండయన్ వా వసుప్రదః. వసుదేవస్యాఽపత్యం వాసుదేవః వస న్తి భూతాని త్రత, తేష్వయ మపి వసతీతి, వసుః అవిశేషేణ సర్వేషు విషయేషు వసతీతి వసు - తాదృశం మనోఽస్యేతి వసుమనాః 'బ్రహ్మా ర్పణం బ్రహ్మ హవిః' ఇతి భగవద్వచనాత్ హవిః ॥

౮౯౦ మనోజవః-

సర్వగతు డగుటచే మనస్సు యొక్క వేగము వంటి వేగము కలవాడు గావున పరమాత్మ 'మనోజవః' యను శబ్దముచే అభిహితు డగుచున్నాడు.

౮౯౧. తీర్థకరః-

చతుర్దశ విద్యలకు బాహ్యావిద్యా సిద్ధాంతములకు ప్రణేతయు, ప్రవక్తయు నగుట వలన పరమాత్మ 'తీర్థకరః' యను నామముచే సంస్తవనీయు డగుచున్నాడు.

ఈ విషయమును గురించి పౌరాణికోక్తి ఇట్లు కలదు- పరమేశ్వరుడు సర్గాదియందు హయగ్రీవ రూపమున మధుకైటభులను సంహరించి సర్వశ్రుతులను, అన్యవిద్యలను ఉపదేశించెను. అటుపిమ్మట సురవైరులగు రాక్షసులను వంచించుటకై వేదబాహ్యములగు విద్యలను ఆ రాక్షసులకు ఉపదేశించి యుండెను.

౮౯౨. వసురేతాః-

సువర్ణము వీర్యముగా గలవాడు కావున పరమాత్మ 'వసురేతాః' యని చెప్పబడును. 'దేవః పూర్వ మపః సృష్ట్వా' అను వ్యాస వచనము వలన 'పరమేశ్వరుడు మొదట ఉదకములను సృజించి వానియందు వీర్యమును ప్రవేశపెట్టెను. అది సువర్ణమయమగు అండ మయి (బ్రహ్మాండమయి) బ్రహ్మకు కారణమైనది.' అని చెప్పబడుటచే పరమాత్మ యొక్క వసురేతత్వము ద్యోతక మగుచున్నది.

౬౯౩. వసుప్రదః-

ధనమును అధికముగా నిచ్చువాడు గాన పరమాత్మ 'వసుప్రదః'యని కీర్తింపబడుచున్నాడు. ఆయనయే సాక్షాత్తుగా ధనాధ్యక్షుడు. ఆయన అనుగ్రహము చేతనే ఎవరైనను ధనాధ్యక్షుడు అగును.

౬౯౪. వసుప్రదః-

భక్తులకు మోక్షఫలప్రదాత యగుటచేతను 'వసుప్రదః' యను నామము పరమేశ్వరునియందు అన్వర్థము. 'విజ్ఞాన మానందం బ్రహ్మ' విజ్ఞప్తి - ఆనంద స్వరూపమైనది బ్రహ్మ. 'రాతి ర్దాతుః పరాయణం' రాతిః - ఇట షష్ఠ్యర్థము నందు ప్రథమావిభక్తి యని గ్రహింపవలెను. రాతిః - ధనమునకు, దాతుః - దాతయు కర్మకర్తయు నగు యజమానునకు, పరాయణం-కర్మఫలప్రదాత, తిష్ఠమానస్య తద్విదః - బ్రహ్మవేత్త యయిన బ్రహ్మనిష్ఠునకును పరాయణము అని శ్రుతి వచనము వలన తెలియుచున్నది. ఇంతే కాదు. సురారులగు రాక్షసుల యొక్క వసువులను (ధనములను) ఖండించువాడు (వసూని ప్రకర్షేణ ఖండయన్) నగుటచేతను పరమాత్మ వసుప్రదః యని ధ్యానింపబడుచున్నాడు.

౬౯౫. వాసుదేవః-

వసుదేవ పుత్రుడగుటచే 'వాసుదేవః' యని కీర్తింపబడుచున్నాడు.

౬౯౬. వసుః-

భూతములు తనయందును, తాను భూతములయందును

ఉన్నవాడగుటంజేసి పరమేశ్వరుడు 'వసు' శబ్దవాచ్యు డగు చున్నాడు

౬౯౭. వసుమనాః-

అవిశేషముగ సర్వవిషయములయందు మనస్సు వసిం చును. అట్టి మనస్సు కలవాడు కాన 'వసుమనాః' యను నామ ముచే పరమాత్మ స్తోతవ్యు డగుచున్నాడు.

౬౯౮. హవిః-

'బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః' అను భగవద్వచనాను సారము పరమేశ్వరుడు హవి స్స్వరూపుడు గాన 'హవిస్' శబ్ద ముచే వివక్షితు డగును

శ్లో॥ "సద్గతి స్సత్కృతి స్సత్తా సద్భూతి స్సత్పరాయణః ।
శూరసేనో యదుశ్రేష్ఠ స్సన్నివాస స్సుయామునః ॥"

శం. భా :- 'అస్తి బ్రహ్మేతి చే ద్వేద సన్త మేనం తతో విదుః ఇతి శ్రుతేః బ్రహ్మ అస్తీతి యే విదు స్తే సన్తః, తైః ప్రాప్యతే ఇతి. సద్గతిః సతీ గతిః బుద్ధిః సముత్కృష్టా అస్యేతి వా. సద్గతిః సతీ కృతిః జగద్రక్షణలక్షణా అస్య యస్మా త్తేన సత్కృతిః. ఇతి నామ్నాం సప్తమం శతం వివృతమ్, సజాతీయ విజాతీయ స్వగత భేద రహితా అను భూతిః సత్తా 'ఏక మేవాద్వితీయమ్, ఇతి శ్రుతేః. స న్నేవ పరమాత్మా చిదాత్మకః, అబాధాత్ భాసమానత్వాచ్చ. సద్భూతిః నాఽన్యః, ప్రతీతే ర్బాధ్యమానత్వాచ్చ న సత్, నావసత్, ప్రాకో యాక్తికో వా బాధః ప్రపంచస్య ప్రతిభాసికః. సతాం తత్త్వవిదాం పరం ప్రకృష్ట మయన మితి. సత్పరాయణమ్ హనూమత్ప్రముఖా స్సైనికా శ్శౌర్యశాలినో యస్యాం

సేనాయాం సా శూరసేనా యస్య సః శూరసేనః. యదూనాం ప్రధానత్వాత్.
యదుశ్రేష్ఠః సతాం విదుషా మాశ్రయః సన్నివాసః శోభనా యామునాః
యమునాసంబన్దినో దేవకీ వసుదేవ నన్ద యశోదా. బలభద్ర సుభద్రాదయః
పరివేష్టారోఽస్యేతి సుయామునః. గోపవేషధరా యామునాః పరివేష్టారః
పద్మాసనాదయః శోభనా అస్యేతి వా, సుయామునః ॥

౬౯౯. సద్గతిః-

'అస్తి బ్రహ్మేతి చే ద్వేద; సంత మేనం తతో విదుః'
అను శ్రుతివచనానుసారము బ్రహ్మ స్తిత్వమును తెలిసికొన్న
వాను 'సత్' శబ్దముచే చెప్పబడును. అట్టి సచ్ఛబ్ద ప్రతిపాద్యు
లచే ప్రాప్యమై యున్నవాడు గాన పరమేశ్వరునకు 'సద్గతిః'
యను నామము సార్థకము. ఇంతేకాదు. సత్-సముత్కృష్టమైన
గతి-బుద్ధి-కలవాను గాన 'సద్గతిః' యని చెప్పబడును.

౭00. సత్కృతిః-

సతీ, కృతిః-జగద్రక్షణ వ్యాపారము కలవాడు గాన
పరమేశ్వరుడు సత్కృతిః యను నామముచే ధ్యాతవ్యు డగు
చున్నాడు.

ఇంతవరకు నామములలో సప్తమశతము వివరింపబడినది.

౭0౧. సత్తా-

సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహిత మయిన
యనుభూతి 'సత్తా' శబ్దముచే చెప్పబడును. 'ఏక మేవాద్వితీ
యమ్' అను శ్రుతిచే పైన పేర్కొన్న పరమాత్మ తత్త్వము

వివక్షిత మగుచున్నది గాన, పరమాత్మ 'సత్తా' శబ్ద వ్యప దేశ్యు డగుచున్నాడు.

202. సద్భూతిః-

బాధ లేకుండి భాసించుచునట్టి చిదాత్మకపరమాత్మయే 'సత్' శబ్దవాచ్యము. కావున, పరమాత్మ 'సద్భూతిః' యని కీర్తింపబడును. ఇతర మట్టిది గాదు; ఇతరము బాధిత మగుటచే 'సత్' కాదు; ప్రతీయమాన మగుటచే 'అసత్' కాదు. శ్రుతిసిద్ధము; యుక్తిసిద్ధము నగు బాధ యిట ప్రపంచమునకు చెప్పబడినది.

203. సత్పరాయణమ్-

సతాం = సత్పురుషులకు, పరాయణం = ఉత్కృష్ట స్థానమై యొప్పువాడు గాన, పరమేశ్వరుడు సత్పరాయణమ్' అను నామముచే స్తవనీయు డగుచున్నాడు.

204. శూరసేనః-

మహాశౌర్యవంతులగు హనుమదాదులతో నొప్పు సేన గలవాడు గాన పరమాత్మ 'శూరసేనః' యను నామమున ధ్యాతవ్యు డగుచున్నాడు.

205. యదుశ్రేష్ఠః-

యదువులలో ప్రధానుడు గావున పరమాత్మ 'యదు శ్రేష్ఠ' శబ్దముచే వ్యపదేశ్యు డగుచున్నాడు.

206. సన్నివాసః-

జ్ఞానుల కాశ్రయభూతు డయినవాడు కాన, 'సన్ని

వాసః' యను నామముచే పరమాత్మ సంస్తవనీయుడగు చున్నాడు.

౭౧౭. సుయామునః-

సు - శోభనులగు, యామున - యమునా సంబంధులైన దేవకీ - వసుదేవులు, నన్ద - యశోదలు, బలభద్ర-సుభద్రలు మున్నగువారు పరివేష్టలు (కావలసినది పెట్టువారు) గా నున్నవాడు కావున, 'సుయామునః' యను నామముచే పరమేశ్వరుడు భజనీయుడు. ఇంతే కాదు. యామునులగు (యమునా సంబంధులగు) గోపవేషధరులు పరివేష్టలుగ నున్నవా డగుటచేతను, సుందరములగు యమునా సంబంధము లయిన పద్మములు ఆసనములుగ గలవా డగుటచేతను 'సుయామునః' యను నామము పరమాత్మయందు అన్వర్థము.

శ్లో॥ "భూతావాసో వాసుదేవ స్సర్వాఽసునిలయోఽనలః ।
దర్పహా దర్పదో దృప్తో దుర్ధరోఽథాఽపరాజితః" ॥ ౭౮

శం. భా. :- భూతాన్యత్రాభిముఖ్యేన వసన్తీతి, భూతావాసః 'వసన్తి త్వయి భూతాని భూతావాస స్తతో భవాన్' ఇతి హరివంశే. జగ దాచ్ఛాదయతి మాయయేతి వాసుః, స ఏవ దేవ ఇతి, వాసుదేవః. 'ఛాదయామి జగ ద్విశ్వం భూత్వా సూర్య ఇవాంశుభి' ఇతి భగవద్వచనాత్. సర్వ ఏవాఽసవః ప్రాణాః జీవాత్మకే యస్మిన్ ఆశ్రయే విలీయన్తే సః, సర్వాసు నిలయః. అలం పర్యాప్తిః. శక్తిసంపదాం నాస్య విద్యతే ఇతి, అనలః. ధర్మవిరుద్ధే పథి తిష్ఠతాం దర్పం హన్తి. దర్పహా. ధర్మవర్త్మని వర్తమానానాం దర్పం దదాతీతి, దర్పదః స్వాత్మామృత రసాస్వాదనాత్ నిత్య

ప్రముదితో, దృష్టః న శక్యా ధారణా యస్య ప్రణిధానాదిషు సర్వోపాధి వినిర్ముక్తత్వాత్, తథాపి తత్ప్రసాదకః, కైశ్చిద్దుఃఖేన ధార్యతే హృదయే, జన్మాన్తరసహస్రేషు భావనా యోగాత్, తస్మాత్, దుర్ధరః,

శ్లో॥ 'క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్।
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే' ॥
ఇతి భగవద్వచనాత్.

న ఆన్తరై రాగాదిభిః బాహ్యై రపి దానవాదిభిః శత్రుభిః పరాజిత ఇతి, అపరాజితః ॥

౭౦౭. భూతావాసః-

'వసన్తి త్వయి భూతాని భూతావాస స్తతో భవాన్' అను హరివంశవచనానుసారము భూతములు తనయందు ఆవాసముగ గలవాడు గాన, పరమాత్మ 'భూతావాసః' యను నామముచే సంకీర్తితు డగుచున్నాడు.

౭౦౮. వాసుదేవః-

జగత్తును మాయచేత నాచ్ఛాదించువాడు వాసువు. అట్టి దేవుడు గాన, పరమాత్మ 'వాసుదేవః' యని కీర్తింపబడును.

'ఛాదయామి జగ ద్విశ్వమ్'- అను భగవద్వచనము 'సూర్యుడు తనకిరణములచే జగత్తు నాచ్ఛాదించుచున్న రీతిగ నేను (పరమేశ్వరుడు) మాయాశక్తిచే జగత్తు నాచ్ఛాదించుచున్నా' నని చెప్పుచున్నది.

౭౧౦. సర్వాసునిలయః-

జీవాత్మకములగు సర్వప్రాణములును, ఆశ్రయమగు తనయందు లీనమై యున్నవాడు కావున, సర్వాసు నిలయః' యను నామముచే నొప్పుచుండును.

౭౧౧. అనలః-

తనయొక్క శక్తి-సంపదలకు పర్యాప్తి లేనట్టివాడు గాన, పరమాత్మ 'అనల' శబ్దవాచ్యు డగుచున్నాడు.

౭౧౨. దర్పహా-

ధర్మవిరుద్ధ మయిన మార్గమందు ప్రవర్తించువారల దర్పమును హరించువాడు గాన, పరమాత్మయందు 'దర్పహా' యను నామము అన్వర్థము.

౭౧౩. దర్పదః-

ధర్మమార్గమున ప్రవర్తించువారలకు దర్పమును (గౌరవమును) కలిగించువాడు గాన, 'దర్పదః' యను నామముచే పరమేశ్వరుడు సంకీర్తింపబడుచున్నాడు.

౭౧౪. దృప్తః-

స్వాత్మామృత రసాస్వాదనముచేత నిత్యప్రముదితు డగుటంజేసి భగవంతుడు 'దృప్తః' యను శబ్దముచే వ్యపదేశ్యు డగుచున్నాడు.

౭౧౫. దుర్ధరః-

సర్వోపాధి వినిర్ముక్తు డగుటచే ప్రణిధానాదులలో

'ధారణ' అశక్య మయినను, తన యనుగ్రహము వలనను, జన్మాన్తర సహస్రమందలి భావనాబలము వలనను, యే కొలది మంది మాత్రము చేతనే అతిప్రయాసము మీద హృదయమున ధారణచేయబడువాడుగాన, 'దుర్ధరః' యను నామముచే పరమాత్మ ధ్యాతవ్యు డగుచున్నాడు. 'క్లేశోఽధికతర స్తేషామ్'- అను భగవద్వచనము' అవ్యక్తాసక్తచిత్తులకు క్లేశము అధికతర మనియు, అవ్యక్తగతి దేహధారులకు కష్టప్రాప్య మనియు బోధించు చున్నది.

౭౧౬ అపరాజితః-

అన్తశ్శత్రువు లయిన రాగద్వేషాదుల చేతను, బహిశ్శత్రువులయిన దానవాదుల చేతను పరాజితుడు కానట్టివాడు; కావున పరమాత్మ 'అపరాజితః' యను నామముచే సంస్తవనీయు డగుచున్నాడు.

శ్లో॥ విశ్వమూర్తి ర్మహామూర్తి ర్దీప్తమూర్తి రమూర్తిమాన్।
అనేకమూర్తి రవ్యక్త శ్శతమూర్తి శ్శతాననః ॥ ౭౦

శం. భా. :- విశ్వం మూర్తి రస్య సర్వాత్మకత్వా దితి విశ్వమూర్తిః. శేషపర్యంక శాయినోఽస్య మహతీ మూర్తి రితి. మహామూర్తిః. దీప్తా జ్ఞానమయీ మూర్తి .ర్యస్యేతి. స్వేచ్ఛయా గృహీతా తైజసీ మూర్తి ర్దీప్తా అస్యేతి వా. దీప్తమూర్తిః. కర్మనిబన్ధనా మూర్తి రస్య న విద్యతే ఇతి. అమూర్తిమానే అవతారేషు స్వేచ్ఛయా లోకానా ముపకారిణీః బహ్వీ ర్మూర్తీ ర్భజతే ఇతి. అనేకమూర్తిః. యద్యప్యనేక మూర్తిత్వ మస్య. తథాప్యయ మీదృశ ఏవేతి న వ్యజ్యతే ఇతి. అవ్యక్తః. నానావికల్పజా

మూర్తయః సంవిదాకృతే స్వప్తీతి. శతమూర్తిః. విశ్వాదిమూర్తిత్వం యతో ఽత ఏవ. శతాననః.

౭౧౭. విశ్వమూర్తిః-

సర్వాత్మకు డగుటచే విశ్వము మూర్తిగ గలవాడు గాన 'విశ్వమూర్తిః' యను నామము పరమాత్మ యందు సార్థకము.

౭౧౮. మహామూర్తిః-

శేషపర్యంకశాయి యగుటచే పరమేశ్వరుడు 'మహామూర్తిః' యను నామముచే ధ్యానింపబడుచుండును.

౭౧౯. దీప్తమూర్తిః-

దీప్త-జ్ఞానమయ మగు మూర్తిః-మూర్తి కలవాడు- అగుటచేతను, స్వేచ్ఛచే గ్రహింపబడినదియు, దీప్తమైనదియు నగు తైజసీమూర్తి కలవా డగుటచేతను, పరమాత్మ 'దీప్తమూర్తిః' యను నామముచే స్తోతవ్యుడు.

౭౨౦ అమూర్తిమాన్-

కర్మనిమిత్తకమైన మూర్తి లేనట్టివాడు గావున; 'అమూర్తిమాన్' యను నామముచే బరగును.

౭౨౧. అనేకమూర్తిః-

అవతార సమయమున, స్వేచ్ఛావశమున లోకోపకారకము లయిన బహువిధమూర్తులను ధరించువాడు గాన 'అనేకమూర్తిః' యను నామము పరమేశ్వరునియందు అన్వర్థ మగుచున్నది.

౭_౧_౨. అవ్యక్తః-

అనేక విధములగు మూర్తులను ధరించువా డయినను 'ఈతడిట్టివాడే' యని వ్యక్తము కానట్టివాడు గాన, 'అవ్యక్తః' యను నామముచే పరమేశ్వరుడు భజనీయుడు.

౭_౧౩. శతమూర్తిః-

జ్ఞానస్వరూప పరమాత్మ వికల్పజన్యము లయిన నానా మూర్తులు గలవా డగుటచేత 'శతమూర్తిః' యను నామముచే అర్చనీయు డగుచున్నాడు.

౭_౧౪. శతాననః-

విశ్వాదిమూర్తులు కలుగుటవలన పరమేశ్వరునికి 'శతాననః' యను నామము ప్రసిద్ధము.

శ్లో॥ ఏకో నైకః సవః కః కిం య త్తత్ పద మనుత్తమమ్ ।
లోకబన్ధుః లోకనాథో మాధవో భక్తవత్సలః ॥ ౯౧

శం. భా. :- పరమార్థతః జాతీయ విజాతీయ స్వగతభేద వినిర్ముక్తత్వాత్. ఏకః 'ఏక మేవాఽద్వితీయమ్' ఇతి శ్రుతేః. మాయయా బహురూపత్వాత్, నైకః 'ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే' ఇతి శ్రుతేః. సోమో యత్రాభిషూయతే సోఽధ్వరః. సవః 'క' శబ్దః సుఖవాచకః. తేన స్తూయతే ఇతి, కః 'కం బ్రహ్మ' ఇతి శ్రుతేః. సర్వ పురుషార్థ రూపత్వాత్ బ్రహ్మైవ విచార్య మితి. బ్రహ్మ-కిమ్, యచ్ఛబ్దేన స్వతస్సిద్ధ వస్తూద్దేశవాచినా బ్రహ్మ నిర్దిశ్యతే ఇతి, బ్రహ్మ. యత్ 'యతో వా ఇమాని భూతాని జాయన్తే' ఇతి శ్రుతేః తనోతీతి బ్రహ్మ-తత్. 'ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్స్మృతః' ఇతి భగవద్వచనాత్. పద్యతే గమ్యతే

ముముక్షుభి రితి. పదం. యస్మా దుత్కృష్టం నాస్తి తత్. అనుత్తమమ్ సవిశేషణ మేకం నామ. పద మనుత్తమమ్. ఇతి. ఆధారభూతేఽస్మిన్ సకలా లోకా బధ్యన్త ఇతి లోకానాం బన్ధుః. లోకబన్ధుః. లోకానాం జనకత్వా జ్జనకోపమో బన్ధుర్నాస్తీతి వా. లోకానాం బన్ధుకృత్యం. హితాహితోపదేశం శ్రుతిస్మృతిలక్షణం కృతవా నితి వా, లోకబన్ధుః. లోకైర్నాథ్యతే యాచ్యతే, లోకా నుపతపతి. ఆశాస్తే. లోకానా మీష్టే ఇతి వా. లోకనాథః మధుకులే జాతత్వాత్, మాధవః భక్తస్నేహవాన్ భక్తవత్సలః ॥

౭౨౫. ఏకః-

పరమార్థమున, సజాతీయ, విజాతీయ స్వగత భేదము లేనివాడు గాన పరమాత్మ 'ఏకః' యను శబ్దముచే వ్యపదేశ్యుడగుచున్నాడు. 'ఏక మేవాద్వితీయం బ్రహ్మ' యను శ్రుతి వచనము ఉక్తార్థమునే స్పష్టము గావించుచున్నది.

౭౨౬. నైకః-

'ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే' యను శ్రుతి వచనానుసారము మాయచే బహురూపములు కలవాడు గాన, 'నైకః' యను నామముచే పరమాత్మ, సంకీర్తనము చేయబడుచున్నాడు.

౭౨౭. సవః-

సోమరసము యొక్క అభిషవముకల అధ్వరమునకు 'సవ' మని సంజ్ఞ, తద్రూపుడు గాన, పరమాత్మ 'సవ' శబ్ద వాచ్యుడు.

౭౨౮. కః-

'క' శబ్దము సుఖవాచక మగుటచే సుఖస్వరూప మని

స్తుతిచేయబడుచున్నది. 'కం బ్రహ్మ' యను శ్రుతివచనము సుఖస్వరూపము, 'క' శబ్దవాచ్యము నైన పరమాత్మతత్త్వమును ప్రతిపాదించుచున్నది.

౭౨౯. కిమ్ –

సర్వపురుషార్థరూప మగుటచే బ్రహ్మయే విచార్య మని 'కిమ్' శబ్దముచే బ్రహ్మతత్త్వము ప్రతిపాదితము

౭౩౦. యత్ –

స్వతస్సిద్ధవస్తు వయిన ఉద్దేశ్యమును చెప్పునట్టి, 'యత్' శబ్దముచే బ్రహ్మ నిర్దేశింపబడుచున్నది కనుక బ్రహ్మ 'యత్' శబ్దముచే అభిహితుడగుచున్నాడు. 'యతో వా ఇమాని భూతాని జాయన్తే' అను శ్రుతివచనముచే పై విషయము ప్రతిపాదితము.

౭౩౧. తత్ –

'తనోతీతి తత్' – అను వ్యుత్పత్తి ననుసరించి, విస్తరించునది గాన బ్రహ్మ 'తత్' శబ్దముచే చెప్పబడును. 'ఓమ్ తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః' యను భగవద్వచనము 'తత్' శబ్దము బ్రహ్మప్రతిపాదక మని నిర్దేశించుచున్నది.

౭౩౨. పదమనుత్తమమ్ –

సర్వోత్కృష్ట మైనది ముముక్షువులచే పొందబడినది గాన పరమాత్మతత్త్వము 'పద మనుత్తమమ్' అని సవిశేషణ మగు ఏకనామమున విరాజిల్లును.

౨౩౩. లోకబన్ధుః-
ఆధారభూతుడయిన యీ పరమాత్మయందు సకలలోకములు బంధము కలిగియుండుటచేతను, లోకజనకుడగుటచేతను మరియు జనకునివంటి బంధువు లేకపోవుటచేతను, పరమేశ్వరుడు 'లోకబన్ధుః' యను నామముచే స్తోతవ్యుడగుచున్నాడు. ఇంతే కాదు; శ్రుతిస్మృతిరూపమైన హితాహితోపదేశమును బంధువు వలె లోకమునకు చేసినవాడగుటచేతను పరమాత్మ 'లోకబన్ధు' శబ్దవాచ్యుడగుచున్నాడు.

౨౩౪. లోకనాథః-
లోకులచే యాచింపబడువాడు, లోకులను నియమనము, ఆశ్వాసనము, శాసనము చేయువాడును గాన, 'లోకనాథః' యని చెప్పబడుచున్నాడు.

౨౩౫. మాధవః-
మధుకులమందు దుద్భవించినవాడు గాన, 'మాధవః' యనుచు పరమేశ్వరుడు ధ్యాతవ్యుడగుచున్నాడు.

౨౩౬. భక్తవత్సలః
భక్తులయొక్క స్నేహము కలవాడు గాన 'భక్తవత్సలః' యను నామము పరమేశ్వరుని యందు అన్వర్థము.

శ్లో॥ "సువర్ణవర్ణో హేమాఙ్గో వరాఙ్గశ్చన్దనాఙ్గదీ ।
వీరహా విషమశ్శూన్యో ఘృతాశీరచలశ్చలః ॥ ౭౮

శం. భా. :- సువర్ణస్యేవ వర్ణోఽస్యేతి. సువర్ణవర్ణః. 'యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణమ్' ఇతి శ్రుతేః, హేమేవాఙ్గం వపురస్యేతి.

హేమాంగః. 'య ఏషోఽన్త రాదిత్యే హిరణ్మయః పురుషః. ఇతి శ్రుతేః. వరాణి శోభనాన్యంగాని అస్యేతి, వరాంగః. చన్దనై రాహ్లాదనై రంగదైః కేయూరై ర్భూషిత ఇతి, చన్దనాంగదీ, ధర్మత్రాణాయ వీరాన్ అసురముఖ్యాన్ హన్తీతి, వీరహా. సమో నాస్య విద్యతే. సర్వవిలక్షణత్వా దితి. విషమః. 'న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యః' ఇతి భగవ ద్వచనాత్. సర్వవిశేష రహితత్వాత్ శూన్యవత్ శూన్యః. ఘృతా విగళితా ఆశిషః ప్రార్థనా అస్యేతి, ఘృతాశీః. న స్వరూపా న్న సామర్థ్యా న్న చ జ్ఞానాదికా ద్గుణాత్, చలనం విద్యతేఽస్యేతి అచలః వాయురూపేణ చలతీతి చలః.

౨౩౭. సువర్ణ వర్ణః-

సువర్ణము వంటి వర్ణము కలవా డగుటచే పరమాత్మ 'సువర్ణ వర్ణః' అను నామముచే అర్చనీయుడు. 'రుక్మవర్ణమ్' అను శ్రుతియు పరమేశ్వరుని సువర్ణవర్ణత్వమును బోధించు చున్నది.

౨౩౮. హేమాంగః-

'హిరణ్మయః పురుషః' అను శ్రుతివచనానుసారము పరమేశ్వరుడు హేమము వంటి శరీరము కలవాడు గాన, 'హేమాంగః' యను నామముచే స్తవనీయుడగుచున్నాడు.

౨౩౯. వరాంగః-

శోభనములగు అవయవములు గలవాడు గాన పరమాత్మ 'వరాంగః' యని సంకీర్తింప బడుచున్నాడు.

౨౪౦. చన్దనాంగదీ-

చందనములైన (ఆహ్లాదనములైన) అంగదము (కేయూ

రమ్ములచేత అలంకృతు డగుటవలన పరమాత్మ 'చన్దనాంగదీ' యను నామముతో విరాజిల్లుచుండును.

౭౮౧. వీరహా-

ధర్మరక్షణార్థము వీరులగు అసురలను ముఖ్యులను హింసించువాడు గాన పరమాత్మ యందు 'వీరహా' యను నామము అన్వర్థము.

౭౮౨. విషమః-

'న త్వత్సమోఽస్తి' అను భగవద్గీతావచనానుసారము, సర్వవిలక్షణు డగుటచే, తనకు సమానుడు లేనట్టివాడు గావున, పరమేశ్వరుడు 'విషమ' శబ్దవ్యపదేశ్యు డగుచున్నాడు.

౭౮౩. శూన్యః-

సర్వవిశేష రహితు డగుటచే పరమాత్మ శూన్యము వంటివాడు గాన, 'శూన్య' శబ్దసంజ్ఞితు డగుచున్నాడు.

౭౮౪. ఘృతాశీః-

విగళితము లయిన ప్రార్థనలు గలవా డగుటచేత 'ఘృతాశీః' యను నామముచే పరమాత్మ ఖ్యాతవ్యుడు.

౭౮౫. అచలః-

స్వరూపమునుండి, సామర్థ్యమునుండి, జ్ఞానాది గుణములనుండి చలనము లేనట్టివాడు గాన, పరమాత్మ 'అచల' శబ్దవాచ్యు డగుచున్నాడు.

౨౮౬. చలః-

వాయురూపమున, చలనము కలవాడు గాన, భగవానుడు 'చల' శబ్దముచే అభిహితు డగుచున్నాడు.

శ్లో॥ అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోకధృక్।
సుమేధా మేధజో ధన్యః సత్యమేధా ధరాధరః ॥ ౯౩

శం. భా. :- అనాత్మవస్తుషు ఆత్మాభిమానో నాస్త్యస్య స్వచ్ఛసంవేదనాదృతే రితి. అమానీ. స్వమాయయా సర్వేషా మనాత్మసు ఆత్మాభిమానం దదాతి. భక్తానాం సత్కారం మానం దదాతీతి. తత్త్వవిదా మనాత్మసు ఆత్మాభిమానం ఖండయతీతి వా. మానదః. సర్వై ర్మాననీయః పూజనీయః సర్వేశ్వరత్వా దితి. మాన్యః. చతుర్దశానాం లోకానా మీశ్వరత్వాత్. లోకస్వామీ. త్రీన్ లోకాన్ ధారయతీతి త్రిలోకధృక్. శోభనా మేధా ప్రజ్ఞాఽస్యేతి సుమేధాః 'నిత్యమసిచ్ ప్రజామేధయోః' ఇతి సమాసాన్తోఽసిచ్. మేధేఽధ్వరే జాయత ఇతి. మేధజః. కృతార్థో. ధన్యః. సత్యా అవితథా మేధా అస్యేతి. సత్యమేధాః. అంశై రశేషైః శేషాద్యై రశేషాం ధరాం ధారయన్. ధరాధరః.

౨౮౭. అమానీ-

శుద్ధ జ్ఞానస్వరూప మగుటచే అనాత్మవస్తువులందు ఆత్మాభిమానము లేనివాడు గావున, 'అమానీ' యను నామము పరమాత్మ యందు సార్థకము.

౨౮౮. మానదః-

స్వకీయ మాయచేత అనాత్మవస్తువు లందాత్మాభిమానము కలిగించువాడు, భక్తులకు సత్కారరూపమైన

మానము కలిగించువాడు, మరియు తత్త్వజ్ఞుల కనాత్మలయందు ఆత్మాభిమానము పోగొట్టువాడు నగుటచేత పరమాత్మ 'మానదః' యను నామముచే కీర్తింపబడుచున్నాడు.

౭౮౯. మాన్యః-

సర్వేశ్వరు డగుటచే పరమాత్మ, సర్వులకు మాననీయుడు గాన, 'మాన్యః' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు.

౭౯౦. లోకస్వామీ -

చతుర్దశ భువనములకు ఈశ్వరుడు (ప్రభువు) గాన, 'లోకస్వామీ' యను నామముచే నొప్పారును.

౭౯౧. త్రిలోకధృక్ -

లోకత్రయమును ధారణ చేయువాడు గాన 'త్రిలోకధృక్' యను నామముచే భజనీయు డగుచున్నాడు.

౭౯౨ సుమేధాః-

శోభనమైన మేధ - ప్రజ్ఞ - కలవా డగుటవలన పరమేశ్వరుడు, 'సుమేధాః' యను నామముచే కీర్తనీయు డగుచున్నాడు. మేధాశబ్దాన్త సమాసమునకు సమాసాన్తమైన 'అసిచ్' వచ్చినది.

౭౯౩. మేధజః-

మేధ మునందు - అధ్వరమునందు - ప్రాదుర్భవించిన

వాడు గాన, పరమాత్మ 'మేధజః' యను నామముచే స్తవనీయు డగుచున్నాడు.

౭౫౪. ధన్యః-

కృతార్థుడు గాన, భగవంతుడు 'ధన్య' శబ్దవాచ్యుడు.

౭౫౫. సత్యమేధాః.

అమోఘమైన మేధకలవా డగుటజేసి పరమాత్మ 'సత్యమేధాః' యను నామముచే ధ్యానింపబడుచున్నాడు.

౭౫౬. ధరాధరః-

సంపూర్ణాంశకల శేషాదులచేత ధరామండలమును ధరించునట్టివాడు గాన, 'ధరాధరః' యను నామముచే సంస్తవనీయుడు.

శ్లో॥ "తేజో వృషో ద్యుతిధరః సర్వశస్త్రభృతాం వరః ।
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృంగో గదాగ్రజః" ॥

శం. భా :- తేజసా మంభసాం సర్వదా ఆదిత్యరూపేణ వర్షణాత్. తేజోవృషః ద్యుతి మంగగతాం కాన్తిం ధారయన్. ద్యుతిధరః. సర్వశస్త్రభృతాం శ్రేష్ఠః సర్వశస్త్రభృతాం వరః భక్తై రుపహృతం పత్రపుష్పాదికం ప్రగృహ్ణాతీతి. ప్రగ్రహః. ధావతో విషయారణ్యే దుర్దాన్తేన్ద్రియ వాజినః తత్ప్రసాదేన రశ్మి నేవ బధ్నాతీతి వా ప్రగ్రహవత్. ప్రగ్రహః. 'రశ్మౌచ' ఇతి పాణిని వచనాత్. ప్రగ్రహశబ్దస్య సాధుత్వమ్. స్వవశేన సర్వం నిగృహ్ణాతీతి నిగ్రహః విగత మగ్ర మన్తో నాశోఽస్యేతి వ్యగ్రః. భక్తానా మభీష్టప్రదానేషు వ్యగ్ర ఇతి వా. చతుశ్శృంగో. నైకశృంగః 'చత్వారి శృంగా త్రయోఽస్య పాదా ద్వేశీర్షే సప్తహస్తాసోఽస్య. త్రిధాబద్ధో వృషభో

రోరవీతి మహాదేవో మర్త్యాగ్ం ఆవివేశ' ఇతి మన్త్రవర్ణాత్. విగదేన మన్త్రేణ. అగ్రే జాయత ఇతి. వి శబ్దలోపం కృత్వా గదాగ్రజః యద్వా. గదో నామ శ్రీవాసుదేవావరజః. తస్మా దగ్రే జాయత ఇతి గదాగ్రజః ॥

౭౫౮. తేజోవృషః-

తేజసాం - ఉదకములయొక్క; సర్వదా ఆదిత్యరూప వర్షణాత్ - వర్షించువాడు అగుట వలన పరమాత్మ 'తేజో వృషః' అను నామముచే సంకీర్తితు డగుచున్నాడు.

౭౫౯. ద్యుతిధరః-

దేహాగత మగు కాంతిని ధరించిన వాడు గాన పరమే శ్వరుడు 'ద్యుతిధర' శబ్దముచే చెప్పబడు చున్నాడు.

౭౬౦. సర్వశస్త్రభృతాంవరః-

సర్వశస్త్ర ధారులలో శ్రేష్ఠుడు గాన 'సర్వశస్త్ర భృతాంవరః' యను నామము పరమాత్మయందు ప్రసిద్ధము.

౭౬౦. ప్రగ్రహః-

భక్తులు సమర్పించిన పత్రపుష్పాదికమును ఆదరముతో గ్రహించువాడు; విషయారణ్యమునందు ధావనము చేయుచు (పరుగిడుచు) లొంగకుండెడి ఇంద్రియాశ్వములను త్రాడు వంటి తన యనుగ్రహముచే బంధించువాడు మరియు ప్రగ్రహము వంటివాడు నగుటచే పరమాత్మ 'ప్రగ్రహః' యని భజింప బడుచున్నాడు.

౭౬౧. నిగ్రహః-

తనకు వశమగుటచే సర్వమును నిగ్రహించువాడు కాన

భగవంతుడు 'నిగ్రహః' యను నామముచే వ్యపదేశ్యు డగు చున్నాడు.

౭౬౨. వ్యగ్రః-

అగ్ర మనగా అంతము - వినాశము. అది లేనట్టి వాడును, మరియు భక్తులకు అభియిష్టప్రదానము చేయుటలో లగ్నమైనవాడు నగుటచేత పరమాత్మ 'వ్యగ్రః' యనుచు ధ్యానింప బడుచున్నాడు.

౭౬3 నైకశృంగః-

'చత్వారి శృంగా' అను మంత్రవచనాను సారము చతుశ్శృంగములు కలవాడు గాన పరమేశ్వరుడు 'నైకశృంగః' యను నామముచే స్తవనీయు డగుచున్నాడు.

౭౬౪. గదాగ్రజః-

నిగదము (మంత్రము) చేత ముందుండు వాడు కాన పరమాత్మకు 'గదాగ్రజః' యను నామము ప్రసిద్ధము. ఇట 'నిగద' శబ్దమందలి 'ని' లోపింపగా 'గదాగ్రజ' అను రూపము ఏర్పడినది.

శ్లో॥ "చతుర్మూర్తి శ్చతు ర్బాహు శ్చతుర్వ్యూహ శ్చతుర్గతిః।
చతురాత్మా చతుర్భావ శ్చతుర్వేద విదేకపాత్ ॥ ౮౧

శం. భా :- చతస్రో మూర్తయో విరాట్ - సూత్ర - అవ్యాకృత-తురీయాత్మానో ఽ స్యేతి చతుర్మూర్తిః. సితా-రక్తా-పీతా-కృష్ణాచేతి. చతస్రో మూర్తయో ఽ స్యేతివా, చత్వారో బాహవో ఽ స్యేతి చతుర్బాహుః ఇతి నామ, వాసుదేవే రూఢమ్ 'శరీరపురుష శ్ఛన్దః పురుషో వేదపురుషో మహా

పురుషః' ఇతి బహ్వృచోపనిషదుక్తా శ్చత్వారః. పురుషా వ్యూహా అస్యేతి. చతుర్వ్యూహః. ఆశ్రమాణాం వర్ణానాం చతుర్ణాం యథోక్త కారిణాం గతిః. చతుర్గతిః. రాగద్వేషాది రహితత్వాత్ చతుర ఆత్మా మనోఽస్యేతి. మనో-బుద్ధి - అహంకార - చిత్తాఖ్య - అన్తఃకరణ చతుష్టయాత్మకత్వాద్వా చతురాత్మా ధర్మార్థ కామమోక్షాఖ్య పురుషార్థ చతుష్టయం భవత్యుత్పద్యతే అస్మా దితి చతుర్భావః. యథావ ద్వేత్తి చతుర్ణాం వేదానా మర్థమితి చతుర్వేదవిత్. ఏకః పాదోఽస్యేతి ఏకపాత్ 'పాదోఽస్య' విశ్వా భూతాని' ఇతి శ్రుతేః. 'విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్' ఇతి భగవద్వచనాచ్చ ॥

౭౬౫. చతుర్మూర్తిః-

విరాట్, సూత్రి, అవ్యాకృతి, తురీయాత్మ, రూపము లగు నాలుగు మూర్తులు కలవాడు మరియు తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు రంగులు కల నాలుగుమూర్తులు కలవాడు నగుటచే పరమాత్మ 'చతుర్మూర్తిః' యని ధ్యానింప బడుచున్నాడు.

౭౬౬. చతుర్బాహుః-

నాలుగు బాహువులు కలవాడు కాన భగవంతుడు 'చతుర్బాహు' శబ్దముచే కీర్తింప బడుచున్నాడు ఈ నామము వాసుదేవుని యందు రూఢము.

౭౬౭. చతుర్వ్యూహః-

బహ్వృచో పనిషత్తులో చెప్పబడిన రీతిగా శరీర పురుష - ఛందః పురుష - వేదపురుష - మహాపురుష - భేద

మున నలుగురు పురుషులు వ్యూహములుగా కలవాడు గాన పరమాత్మ 'చతుర్వ్యూహః' యను నామముచే స్తోతవ్యు డగుచున్నాడు.

౨౧౮. చతుర్గతిః-

యథోక్తముగ ప్రవర్తించు చతురాశ్రమములకు, చతుర్వర్ణములకు గతి యైన వాడు గాన పరమాత్మ 'చతుర్గతిః' యను నామముచే అర్చనీయు డగుచున్నాడు.

౨౧౯. చతురాత్మా -

రాగద్వేషాది రహితమగుటచే చతురమైన మనస్సు కలవాడు మరియు, మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అను అంతఃకరణ చతుష్టయాత్మకుడు నగుటచే పరమేశ్వరుడు 'చతురాత్మా' యని భక్తులచే సమర్చితు డగుచున్నాడు.

౨౨౦. చతుర్భావః-

ధర్మార్థ కామమోక్ష రూపమైన పురుషార్థ చతుష్టయము యొక్క ఉత్పత్తికి హేతువైనవాడు కాన భగవానుడు 'చతుర్భావః' యని కీర్తింపబడుచున్నాడు.

౨౨౧. చతుర్వేదవిత్ -

నాలుగు వేదములయొక్క అర్థమును యథావత్‌గా తెలిసిన వాడు గాన 'చతుర్వేదవిత్' అను సంజ్ఞ పరమాత్మ యందు అన్వర్థము.

౨౨౨. ఏకపాత్ -

'పాదోఽస్య విశ్వాభూతాని' అను శ్రుతి చెప్పిన రీతి

గను 'విష్టభ్యాహ మిదమ్ కృత్స్న మేకాంశేన స్థితో జగత్' అను భగవద్వచనాను సారము ఏకపాదము కలవాడు. సమస్త జగత్తు ఏకపాదమై యొప్పు వాడు నగుటచే పరమాత్మ 'ఏక పాత్' శబ్దముచే ప్రస్తుతింప బడుచున్నాడు.

శ్లో॥ "సమావర్తో ఽ నివృత్తాత్మా దుర్జయో దురతి క్రమః ।
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా"॥ ౯౭

శం భా :- సంసార చక్రస్య సమ్యగావర్తక ఇతి, సమావర్తః. సర్వత్ర వర్తమానత్వా న్న నివృత్త ఆత్మా కుతోపీతి. అనివృత్తాత్మా. నివృత్త ఆత్మా వనో. విషయేభ్యోఽస్యేతివా. నివృత్తాత్మా జేతుం నశక్యత ఇతి. దుర్జయః భయహేతుత్వా దస్యాఽఽజ్ఞాం సూర్యాదయో నాతిక్రామన్తీతి. దురతిక్రమః.

శ్లో॥ 'భయా దస్యాఽగ్ని స్తపతి భయా త్తపతి సూర్యః ।
భయా దిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః' ॥
ఇతి మన్త్రవర్ణాత్.

మహద్భయం వజ్ర ముద్యతమ్' ఇతి చ దుర్లభయా భక్త్యా లభ్యత్వాత్. దుర్లభః.

శ్లో॥ 'జన్మాన్తర సహస్రేషు తపో జ్ఞాన సమాధిభిః ।
నరాణాం క్షీణ పాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే' ॥
ఇతి వ్యాస వచనాత్.

'భక్త్యా లభ్య స్త్వనన్యయా' ఇతి భగవద్వచనాచ్చ. దుఃఖేన గమ్యతే జ్ఞాయత ఇతి, దుర్గమః. అన్తరాయ ప్రతిహతైః దుఃఖా దవాప్యతే ఇతి. దుర్గః దుఃఖేనాఽఽవాస్యతే చిత్తే యోగిభి స్సమాధా వితి. దురావాసః. దురాచిణో దానసవాదయః తాన్ హన్తీతి, దురారిహా ॥

223. సమావర్తః-

సంసార చక్రమును చక్కగా ఆవర్తింప జేయువాడగుట వలన పరమేశ్వరుడు 'సమావర్తః' యను నామముచే విరాజిల్లు చున్నాడు.

224. అనివృత్తాత్మా (నివృత్తాత్మా) -

సర్వత్ర వ్యాపించి యున్నవాడగుటచే ఏ ప్రదేశము నుండియు నివర్తింపబడని స్వరూపముతో నొప్పువాడు గాన పరమాత్మ 'అనివృత్తాత్మ' యనుచు ధ్యాతవ్యుడగుచున్నాడు. మరియు 'నివృత్తాత్మ' యని పదచ్ఛేదము చేసినచో - విష యములనుండి నివృత్తమైన మనస్సు కలవాడు' యని యర్థము చెప్పికొనవలెను.

225. దుర్జయః-

జయింప శక్యము కానట్టివాడు పరమేశ్వరుడు 'దుర్జయ' శబ్ద వాచ్యుడు.

226. దురతిక్రమః-

'భయా దస్యాగ్ని స్తపతి భయా త్తపతి సూర్యః...' ఇత్యాది శ్రుతులలో చెప్పిన రీతిగా అగ్ని, సూర్య, ఇంద్ర వాయు, మృత్యు ప్రభృతులు భయముచే ఎవరి ఆజ్ఞను అతిక్ర మింప జాలరో, ఆ పరమాత్మ 'దురతిక్రమః' యను నామ ముచే స్తోతవ్యుడగుచున్నాడు.

227. దుర్లభః-

'జన్మాంతర సహస్రములలో తపో, జ్ఞాన, సమాధుల

చేత క్షీణించిన పాపముగల నరులకు (శ్రీ)కృష్ణుని యందు భక్తి ప్రభవించును.' యను వ్యాసవచనమును బట్టియు అనన్య భక్తిచేత లభ్యుడను' అను భగవద్వచనము ననుసరించియు దుర్లభమైన భక్తిచే లభ్యమగు వాడు కాన పరమేశ్వరుడు 'దుర్లభః' యను నామముచే స్తవనీయు డగుచున్నాడు.

౭౭౮. దుర్గమః-

కష్టముచేత తెలియబడు వాడు గాన భగవంతుడు 'దుర్గమ' శబ్దవాచ్యుడు.

౭౭౯. దుర్గః-

విఘ్నములచేత ప్రతిహతులగు వారిచే కష్టము మీద పొందబడువాడు గాన పరమేశ్వరుడు 'దుర్గః' యని చెప్పబడు చున్నాడు.

౭౮౦ దురావాసః-

సమాధిలో యోగులచేత చిత్తమందు కష్టముమీద వశింపజేయబడు వాడు గాన పరమాత్మ 'దురావాసః' యనుచు సంస్తుతింప బడుచున్నాడు.

౭౮౧. దురారిహా-

దురారులగు దానవాదులను హింసించు వాడు గాన పరమాత్మ 'దురారిహా' యను నామముచే ధ్యానము చేయ బడుచున్నాడు.

శ్లో॥ "శుభాంగో లోకసారంగః సుతన్తు స్తన్తు వర్ధనః ।
ఇన్ద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః" ॥ ౯౭

శం. భా :- శోభనైః అంగైః ధ్యేయత్వాత్, శుభాంగః. లోకానాం సారం సారంగవత్ భృంగవత్ గృహ్ణాతీతి, లోకసారంగః. 'ప్రజాపతి ర్లోకా నభ్యతపత్' ఇతి శ్రుతేః. లోకసారః ప్రణవః. తేన ప్రతిపత్తవ్య ఇతివా పృషోదరాదిత్వా త్సాధుత్వమ్. శోభనః తన్తుః విస్తీర్ణః ప్రపంచో౽స్యేతి' సుతన్తుః. తమేవ తన్తుం వర్ధయతి. ఛేదయతీతివా. తన్తువర్ధనః. ఇన్ద్రస్య కర్మేవ కర్మ అస్యేతి ఇన్ద్రకర్మా. ఐశ్వర్య కర్మేత్యర్థః. మహాన్తి వియదాదీని భూతాని కర్మాణి - కార్యాణ్యస్యేతి, మహాకర్మా. కృతమేవ సర్వం. కృతార్థత్వాత్, నకిర్తవ్యం కించి దపి కర్మ. అస్య విద్యతే ఇతి. కృతకర్మా. ధర్మాత్మకం కర్మకృత వా నితి వా. కృతో వేదాత్మక ఆగమో యేనేతి, కృతాగమః. 'అస్య మహతో భూతస్య నిశ్వసిత మేతత్ యదృగ్వేదః' ఇత్యాది శ్రుతేః.

౭౮౨. శుభాంగః-

శోభనములైన అంగములతో ధ్యేయమగు స్వరూపము కలవాడు కాన పరమేశ్వరుడు 'శుభాంగః' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు.

౭౮౩. లోకసారంగః-

లోకముల సారమును, సారంగము - భృంగము - వలె గ్రహించువాడు గాన, పరమాత్మ 'లోకసారంగః' యను నామముచే స్తోతవ్యు డగుచున్నాడు. 'ప్రజాపతి ర్లోకా నభ్య పతత్' అను శ్రుతివచనము పై విషయమునే చెప్పుచున్నది.

మరియు, లోకసారము, ప్రణవము; దానిచే తెలిసికొొన బడు వాడు గాన, 'లోకసారంగః' యని పరమాత్మ చెప్పబడు చున్నాడు. పృషోదరాదులందు పఠితమగుటచే దీని సాధుత్వము ఉపపన్నము.

౭౮౪. సుతన్తుః-

శోభనమయిన విస్తీర్ణ ప్రపంచము గలవాడు గాన భగవానుడు 'సుతన్తు' శబ్ద వ్యపదేశ్యు డగుచున్నాడు.

౭౮౫. తన్తువర్ధనః-

అవిస్తీర్ణ మగు ప్రపంచరూప తంతువునే వృద్ధి పొందించు వాడు, భేదింప జేయువాడు నగుటచే 'తన్తువర్ధనః' యను నామముచే పరమేశ్వరుడు సంకీర్తనీయుడు.

౭౮౬. ఇన్ద్రకర్మా -

ఇంద్రుని కర్మవంటి కర్మ-ఐశ్వర్యరూపమైన కర్మ కలవాడు గాన పరమాత్మ 'ఇన్ద్రకర్మా' యను నామమున బరగును.

౭౮౭. మహాకర్మా -

ఆకాశాది మహాభూతములు కార్యములయి విలసిల్లును గాన, పరమాత్మ 'మహాకర్మా' యను నామముచే భజనీయు డగుచున్నాడు.

౭౮౮. కృతకర్మా-

కృతార్థు డగుటచేత సర్వము కృతమేగాని, కర్తవ్య మేమియు లేనివాడు; ధర్మరూపమైన కర్మను చేసినట్టి వాడు

నగుటచే పరమేశ్వరుడు 'కృతకర్మా' యను నామముచే విరాజిల్లును.

౭౮౯. కృతాగమః-

'అస్య మహతో భూతస్య'- అను శ్రుతివచనము ననుసరించి నిశ్వసితన్యాయమున ఆవిష్కృతమగు వేదాత్మక - ఆగమము కలవాడు గాన, 'కృతాగమః' యను నామముచే పరమాత్మ ధ్యాతవ్యుడు.

శ్లో॥ ఉద్భవ స్సున్దర స్సున్దో రత్ననాభ స్సులోచనః ।
అర్కో వాజసన శ్శృంగీ జయన్త స్సర్వవిజ్జయీ ॥ ౯౦

శం. భా. :- ఉత్కృష్టం భవం, జన్మ. స్వేచ్ఛయా భజతీతి, ఉద్గత మపగతం జన్మాఽస్య సర్వకారణత్వా దితి వా. ఉద్భవః. విశ్వాతిశాయి సౌభాగ్యశాలిత్వాత్. సున్దరః సుష్ఠు ఉనత్తీతి. సున్దః. 'ఉన్దీక్లేదనే' ఇతి ధాతోః పచాద్యచే. ఆర్ద్రీభావస్య వాచకః. కరుణాకర ఇత్యర్థః. పృషోదరాదిత్వాత్ పరరూపత్వమ్. రత్నశబ్దేన శోభాఽభిధీయతే. రత్నవత్. సున్దరా నాభి రస్యేతి, రత్ననాభః. శోభనం లోచనం నయనం జ్ఞానం వాఽస్యేతి. సులోచనః. బ్రహ్మాదిభిః పూజ్యతమైరపి అర్చనీయత్వాత్. అర్కః. వాజమన్నమర్థినాం సనోతి దదాతీతి, వాజసనః. ప్రలయాఽభసి శృంగవన్మత్స్య విశేష రూపః. శృంగీ, మత్వర్థీయోఽతిశాయనే ఇని ప్రత్యయః. అరీన్ అతిశయేన జయతి. జయహేతుర్వా. జయన్తః సర్వవిషయం జ్ఞానమస్యేతి. సర్వవిత్. ఆభ్యన్తరాన్ రాగాదీన్. బాహ్యాన్ హిరణ్యాక్షా దీంశ్చ దుర్జయాన్ జేతుం శీలమస్యేతి. జయీ తచ్ఛీలాధికారే, 'జిదృక్షి' ఇత్యాది పాణినీయ వచనాత్ ఇని ప్రత్యయః సర్వవిచ్చాసౌ జయీచేతి సర్వవిజ్జయీ, ఇతి ఏకం నామ.

౭౯౦. ఉద్భవః-

స్వేచ్ఛానుసారము ఉత్కృష్టమైన జన్మను పరిగ్రహించు వాడగుటచేతను, సర్వకారణుడగుటచేత ఉద్గతమైన - అపగతమైన - జన్మ కలవాడగుటచేతను పరమాత్మ 'ఉద్భవః' యను నామమున బరగును.

౭౯౧. సున్దరః-

విశ్వాతిశాయి యగు సౌభాగ్యముతో శోభారు వాడు గాన, పరమేశ్వరుడు 'సున్దరః' యను నామముచే సంకీర్తితుడగు చున్నాడు.

౭౯౨. సున్దః-

'ఉన్దీ క్లేదనే' అని 'ఉన్ద' శబ్దమునకు ఆర్ద్రీభావము అర్థము. 'సుష్ఠు ఉన్దతి' అను నర్థములో 'పచాద్యచ్' పృషోదరాదిత్వమును బట్టి పరరూపము చేయుగా 'సున్దః' యను రూపము సిద్ధించును. 'సున్దః' అనగా కరుణామయుడని యర్థము.

౭౯౩. రత్ననాభః-

ఇట, 'రత్న' శబ్దము శోభాపరకముగ గుర్తింపనగును. రత్నము వలె సుందరమైన నాభి కలవాడు గాన, పరమాత్మ 'రత్ననాభః' యనుచు ధ్యేయవస్తు వగుచున్నాడు.

౭౯౪. సులోచనః-

శోభనమైన లోచనము - నయనము లేక జ్ఞానము

కలవా డగుటచే పరమేశ్వరునికుండు 'సుశోవనః' యను నామము ప్రసిద్ధము.

౭౯౫. అర్కః-

పూజ్యతము లయిన బ్రహ్మాదులచేత అర్చనీయుడు గాన. పరమాత్మ 'అర్కః' యను నామముచే భక్తులకు భజనీయుడు.

౭౯౬. వాజసనః-

వాజమ్ = అన్నమును (అర్థించు వారలకు) సనోతి = ఇచ్చువాడు, గాన భగవానుడు 'వాజసనః' యను నామముచే స్తవనీయు డగుచున్నాడు.

౭౯౭ శృంగీ-

ప్రలయాంభోనిధియందు శృంగధారి యగు మత్స్య విశేషస్వరూపము గలవాడు కాన, పరమాత్మకు 'శృంగీ' యను నామము ప్రసిద్ధము.

౭౯౮. జయన్తః-

అధికముగ శత్రువులను జయించువాడు జయహేతువు నయిన వాడు నగుటచే పరమేశ్వరుడు 'జయన్త' శబ్ద వ్యప దేశ్యు డగుచున్నాడు.

౭౯౯. సర్వవిజ్జయీ -

సర్వవిత్ = సర్వవిషయక జ్ఞానము కలవాడు, జయీ = దుర్జయములు అభ్యంతర శత్రువులు నగు రాగాదులను, బాహ్య

శత్రువులయిన హిరణ్యాక్షాదులను జయించు నట్టి శీలము గలవాడును గాన, పరమాత్మ 'సర్వవిజ్జయీ' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు. 'సర్వవిచ్చాసౌ జయీ చ – సర్వ విజ్జయీ' – యని ఏకనామము.

శ్లో॥ "సువర్ణ బిన్దు రక్షోభ్య స్సర్వవాగీ శ్వరేశ్వరః ।
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః" ॥

శం. భా. :- బిన్దవోఽవయవాః సువర్ణసదృశా అస్యేతి, సువర్ణబిన్దుః. 'ఆప్రణఖాత్ సర్వఏవ సువర్ణః' ఇతి శ్రుతేః. శోభనో వర్ణోఽక్షరం, బిన్దుశ్చ, యస్మిన్ మన్త్రే. తన్మన్త్రాత్మా వా. సువర్ణబిన్దుః. ఇతి నామ్నా మష్టమం శతం వివృతమ్ ॥

రాగద్వేషాదిభిః శబ్దాది విషయైశ్చ త్రిదశారిభి శ్చ నక్షోభ్యత ఇతి అక్షోభ్యః. సర్వేషాం వాగీశ్వరాణాం బ్రహ్మాదీనా మపీశ్వరః. సర్వవాగీశ్వ రేశ్వరః. అవగాహ్య తదా నన్దం విశ్రమ్య సుఖమాసతే యోగిన ఇతి. మహాహ్రద ఇవ. మహాహ్రదః. గర్తవ దస్య మాయా మహతీ దురత్య యేతి, మహాగర్తః 'మమ మాయా దురత్యయా' ఇతి భగవద్వచనాత్. యద్వా. గర్తశబ్దో రథపర్యాయో నైరుక్తై రుక్తః తస్మాత్. మహారథో మహాగర్తః. మహారథత్వ మస్య ప్రసిద్ధం భారతాదిషు కాలత్రయా నవ చ్ఛిన్న స్వరూపత్వాత్. మహాభూతః. సర్వభూతాని. అస్మి న్నిధీయన్తే ఇతి నిధిః. మహాంశ్చాసౌ నిధిశ్చేతి మహానిధిః.

౮౦౦. సువర్ణబిన్దుః–

'ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః' అను శ్రుతి వచనాను సారము సువర్ణ సదృశములయిన యవయవములు గలవాడు; శోభనమైన వర్ణము ( అక్షరము ) బిందువును కలిగిన

మన్త్రస్వరూపుడగుటచేత భగవానుడు 'సువర్ణ బిన్దుః' యను నామముచే ప్రసిద్ధుడు.

ఇంతవరకు, నామములలో అష్టమ శతము వివరింప బడినది.

౮౦౧. అక్షోభ్యః-

రాగద్వేషాదులచేతను, శబ్దాది విషయముల చేతను, దేవ శత్రువులచేతను ఎట్టి క్షోభము లేనట్టివాడు గాన, పరమేశ్వరుడు 'అక్షోభ్యః' యనుచు సంకీర్తనీయు డగుచున్నాడు.

౮౦౨. సర్వవాగీశ్వరేశ్వరః-

సమస్త వాగీశ్వరులైన బ్రహ్మాదులకు నైతము ఈశ్వరు డగుటచేసి పరమాత్మ "సర్వవాగీశ్వరేశ్వరః' యను నామముతో విరాజిల్లు చుండును.

౮౦౩. మహాహ్రదః-

యోగులు ఆ యానందస్వరూపమున మునిగి విశ్రాంతితో సుఖముగా నుందురు గాన యా పరమేశ్వరుడు మహాహ్రదమువంటి వాడగుటచే 'మహాహ్రదః' యను నామమున బరగును.

౮౦౪. మహాగర్తః-

గర్తము వలె దుష్కరమైన మహామాయ కలవాడు గాన పరమాత్మ 'మహాగర్త' శబ్దముచే చెప్పబడుచున్నాడు. 'మమమాయా దురత్యయా' యను భగవద్వచనము పరమే

శ్వరుని యొక్క దుస్తరమైన మహామాయాలక్షణమును ద్యోతనము చేయుచున్నది. ఇంతే కాదు. నైఘుక్తులచే 'గర్త' శబ్దము రథపర్యాయముగా చెప్పబడినది. అందుచే మహాగర్తుడనగా 'మహారథుడు' అని యర్థము. భగవంతుని యొక్క మహారథత్వము భారతాదులందు ప్రసిద్ధము.

౮౦౫. మహాభూతః-

కాలత్రయము చేత పరిచ్ఛిన్నముకాని స్వరూపము కలవాడు గాన పరమేశ్వరుడు 'మహాభూతః' యనుచు స్తవనీయు డగుచున్నాడు.

౮౦౬. మహానిధిః-

సర్వభూతములు తనయందు నిహితములగుటచే నిధి యనబడును. అదియు మహానిధి యగుటచేసి పరమాత్మ 'మహానిధిః' యను సార్థక నామముతో విలసిల్లుచుండును.

శ్లో॥ కుముదః కున్దరః కున్దః పర్జన్యః పావనోఽనిలః
అమృతాశోఽమృతవపు స్సర్వజ్ఞ స్సర్వతోముఖః॥ ౧౦౦

శం. భా. :- కుం, ధరణీం భారావతరణం కుర్వన్ మోదయతీతి• కుముదః. ముదిరత్ర అన్తర్భావి తణిజర్థః. కున్దపుష్పతుల్యాని శుద్ధాని ఫలాని రాతి, దదాతి, లాతి ఆదత్తే, ఇతివా. కున్దరః. రలయోః వృత్త్యేకత్వ స్మరణాత్. 'కుందరాం దారయామాస హిరణ్యాక్ష జిఘాంసయావారాహం రూప మాస్థాయా' ఇతివా. కున్దరః, కున్దోపమ సుందరాంగత్వాత్ స్వచ్ఛతయా స్ఫటిక వన్నిర్మలః. కున్దః. కుం పృథ్వీం, కశ్యపాయాఽదాదితి వా. కున్దః.

శ్లో॥ 'సర్వపాప ప్రశమార్థం వాజిమేధేన చేష్టవాన్ ।
తస్మిన్ యజ్ఞే మహాదానే దక్షిణాం భృగునన్దనః,
మారీచాయ దదౌ ప్రీతః కశ్యపాయ వసున్ధరామ్' ॥
ఇతి హరివంశే.

కుం పృథ్వీం ద్యతిఖండయతీతి వా. కున్దః, కుశబ్దేన పృథ్వీశ్వరా లక్ష్యన్తే.

శ్లో॥ 'విః క్షత్రియాం యశ్చ చకార మేదినీ
మనేకశో బాహు వనం తథాఽచ్ఛినత్ ।
యః కార్తవీర్యస్య సభార్గవోత్తమో
మామాస్తు మాంగల్య వివృద్ధయే హరిః' ॥ ఇతి విష్ణుధర్మే.

పర్జన్యవత్ ఆధ్యాత్మికాది తాపత్రయం శమయతి. సర్వాన్ కామా నభి వర్షతీతివా. పర్జన్యః స్మృతి మాత్రేణ పునాతీతి. పావనః. ఇంతి ప్రేరణం కరోతీతి ఇలః. తద్రహితత్వాత్. అనిలః, ఇంతి స్వపితి ఇత్యజ్ఞ ఇలః. తద్విపరీతో నిత్యప్రబుద్ధ స్వరూపత్వా దితివా. అథవా నిలతే ర్గహనార్థాత్ కప్రత్యయా న్నాత్ రూపమ్. అగహనః అనిలః. భక్తేభ్య స్సులభ ఇతి స్వాత్మా మృత మశ్నాతీతి అమృతాశః మథిక మమృతం సురాన్ పాయ యిత్వా స్వయం చాశ్నాతీతివా. అమృతాశః. అమృతా-అనశ్వర ఫలత్వాత్, దాశావాంఛా అస్యేతి వా. మృతం మరణం తద్రహితం వపు రస్యేతి అమృతవపుః. సర్వం జానాతీతి, సర్వజ్ఞః 'య స్సర్వజ్ఞ స్సర్వవిత్' ఇతి శ్రుతేః సర్వతోఽక్షి శిరోముఖమ్' ఇతి భగవద్వచనాత్, సర్వతోముఖః,

౮౦౭. కుముదః–

'కు' యనగా భూమి. తద్భారావతరణము జేయుచు

సంతోషింప చేయువాడు (మోదయతి) గాన భగవానుడు 'కుముదః' యని సంకీర్తింప బడుచున్నాడు.

౮౦౮. కున్దరః-

'కున్ద' అనగా కుంద పుష్పములవంటి శుద్ధములైన ఫలములను 'రాతి' యనగా ఇచ్చువాడు గాన 'కున్దదరః' యని చెప్పబడును. మరియు 'రలయోరభేదః' అను న్యాయము ననుసరించి కున్దము వంటి ఫలములను 'లాతి' - స్వీకరించువాడు అనియు చెప్పికొనవగును.

మరియు 'హిరణ్యాక్షవధ నిమిత్తమై వారాహరూపమును ధరించి పరమాత్మ భూమిని పెల్లగించెను.' అను వచనము ననుసరించి కూడ కున్దరః యను నామము ప్రసిద్ధము. ఇంతేకాదు, కుందముతో సమానమగు సుందరమైన శరీరము కలవాడు గాన స్వచ్ఛతచే స్ఫటికము వంటివాడు.

౮౦౯. కున్దః-

కుం, దదాతీతి - కున్దః. అనగా భూమి నిచ్చినవాడు. 'సర్వపాప విశుద్ధ్యర్థమ్ వాజిమేధేన చేష్టవాన్' అను హరివంశ శ్లోకమున 'భృగునందను డగు పరశురాముడు అశ్వమేధము చేసి అందు దక్షిణగా కశ్యపునకు భూమిని అర్పించెను' అని తెలియచేసెను.

కుం, ద్యతి - ఖండయతి అనగా పృథ్వీశ్వరులను ఖండించినవాడు అని యర్థము. ఇట 'కు' శబ్దము పృథ్వీశ్వర పర్యాయము. 'నిహా క్షత్రియాణాం యశ్చచకార' అని విష్ణు

ధర్మవచనము 'భార్గవరాముడు అనేక పర్యాయములు భూమిని జయించి కార్తవీర్యార్జునుని బాహువనమును ఛేదించెను.' అని చెప్పుచు పరమాత్మ పృథ్వీశ్వరులను ఖండించి నట్లు వర్ణించెను. కాన 'ఖణ్డరః' యను నామము పరమేశ్వరుని యందు సర్వదా యన్వర్థము.

౮౧౦. పర్జన్యః-

పర్జన్యుని వలె ఆధ్యాత్మికాది తాపత్రయమును శమింప చేయువాడు మరియు సర్వకామములను అభివర్షించువాడు నగుటచే పరమేశ్వరుడు 'పర్జన్యః' యను నామముచే భజనీయు డగుచున్నాడు.

౮౧౧. పావనః-

స్మరణమాత్రమున పవిత్రీకరించు వాడు గాన పరమాత్మ 'పావన' శబ్ద వాచ్యుడు.

౮౧౨. అనిలః-

'ఇలః' అనగా ప్రేరణ చేయువాడు తద్రహితుడు అనిలుడు.

ఇలతి-స్వపితి అనగా నిద్రించువాడు - అజ్ఞుడు 'ఇలః' అనబడును. నిత్యప్రబుద్ధ స్వరూపుడగుటచే పరమాత్మ 'ఇల' విలక్షణమైన వాడు గాన 'అనిల' శబ్ద వాచ్యుడు.

మరియు గహనార్థకమగు 'నిల' ధాతువు గలదు. దానికి ప్రత్యయము చేర్చిన 'నిలః' యగును. 'నిలః' యనగా

గహనమైన వాడు. గహనము కానట్టివాడు అనిలుడు. అనగా పరమాత్మ భక్తసులభుడు.

౮౧౩. అమృతాశః-

స్వాత్మామృతము ననుభవించువాడు; మథితమైన అమృతమును దేవతలచే స్వీకరింప చేయుటయే కాక తానును స్వీకరించినట్టి వాడు మరియు శాశ్వతఫలము కలడగుటచేత అమృతమైన వాంఛ (అమృతా-ఆశా) కలవాడు నగుటచే భగవానుడు 'అమృతాశః' యను నామముచే నొప్పారును.

౮౧౪. అమృతవపుః-

మరణ రహితమైన శరీరము కలవాడు గాన పరమాత్మ 'అమృతవపుః' యని చెప్పబడుచున్నాడు.

౮౧౫. సర్వజ్ఞః-

'య స్సర్వజ్ఞ స్సర్వవిత్' అను శ్రుతి వచనానుసారము సర్వము తెలిసినవాడు గాన శ్రీహరి'సర్వజ్ఞః'యను నామముచే విలసిల్లుచుండును.

౮౧౬. సర్వతోముఖః -

'సర్వతో ఒక్షి శిరో గ్రీవమ్' అను భగవద్వచనాను సారము శ్రీవిష్ణువు సర్వతోముఖుడు గాన 'సర్వతోముఖః' యను నామము చే స్తవనీయుడు.

శ్లో॥ సులభ స్సువ్రత స్సిద్ధ శ్శత్రుజి చ్ఛత్రుతాపనః ।
న్యగ్రోధో దుంబరో ఒశ్వత్థ శ్చాణూరాన్ధ్రనిషూదనః ॥

శం. భా. :- పత్రపుష్పఫలాదిభిః భక్తిమాత్ర సమర్పితైః సుప్రాపేన లభ్యత ఇతి. సులభః.

శ్లో॥ 'పత్రేషు పుష్పేషు ఫలేషు తోయే
స్వక్రీత లభ్యేషు సదైవ సత్సు ।
భక్త్యైక లభ్యే పురుషే పురాణే
ముక్త్యై కథం న క్రియతే ప్రయత్నః ॥ ఇతి మహాభారతే.

శోభనం వ్రతయతి భుజ్క్తే, భోజనా న్నివర్తతే. ఇతివా. సువ్రతః. అపన్యాధీన సిద్ధిత్వాత్. సిద్ధః. సురశత్రవ ఏవాఽస్య శత్రవః. తాన్ జయతీతి. శత్రుజిత్. సురశత్రూణాం తాపనః. శత్రుతాపనః. న్యక్ అర్వాక్ రోహతి సర్వేషా ముపరివర్తతే ఇతి. న్యగ్రోధః. వృషోదరాదిత్వాత్ హకారస్య ధకారా దేశః. సర్వాణి భూతాని సంవృత్య నిజమాయాం వృణోతి. నిరుణద్ధీతి వా అంబరా దుద్గతః కారణత్వే నేతి. ఉదుంబరః. వృషోదరాదిత్వా దేవ ఉకారాదేశః. యద్వా. ఉదుంబర మన్నాద్యం. తేన తదాత్మనా విశ్వం పోషయన్ ఉదుంబరః. 'ఊర్గ్వా అన్నాద్య ముదుంబరమ్' ఇతి శ్రుతేః. 'న్యగ్రో ధోదుంబరో' ఇత్యత్ర విసర్గలోపే సన్ధిరార్షః. శ్వోఽపి న స్థాతేతి అశ్వత్థః. పృషోదరా దిత్వాదేవ సకారస్య థకారాదేశః. 'ఊర్ధ్వమూలోఽవాక్ శాఖ ఏషోఽ శ్వత్థ స్సనాతనః' ఇతి శ్రుతేః. 'ఊర్ధ్వ మూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్' ఇతి స్మృతేశ్చ. చాణూర నామాన మన్ధ్రం నిషూదిత వా నితి చాణూరాన్ధ్ర నిషూదనః

౮౯౭. సులభః-

భక్తిమాత్ర సమర్పితములగు పత్ర పుష్ప ఫలాదులచే సుఖముగ లభ్యమగు వాడుగాన పరమాత్మ 'సులభ' శబ్ద వ్యపదేశ్యు డగుచున్నాడు. 'పత్రేషు పుష్పేషు ఫలేషు' అను

శ్లోకమున 'పత్ర పుష్ప ఫల తోయములు కొన నర్పణ లేశమే లభ్య మగుచుండగా, పరమ పురుషుడు భక్తిమాత్ర లభ్యు డగు చుండగ, ముక్తికై యేల ప్రయత్నము చేయకూడదు'- అని మహాభారతము చెప్పుచున్నది.

౮౧౮. సువ్రతః-

శుభముగ భుజించువాడు, భోజనమునుండి నివర్తించు వాడు నగుటచే శ్రీహరి 'సువ్రత' నామాంకితు డయి వరలు చున్నాడు.

౮౧౯. సిద్ధః-

అన్యాధీనము కానట్టి సిద్ధి కలవాడు గాన పరమాత్మ 'సిద్ధ' శబ్దవాచ్యు డగుచున్నాడు.

౮౨౦. శత్రుజిత్-

సుర శత్రువులే ఆ పరమేశ్వరుని శత్రువులు; అట్టి శత్రువు లను జయించు వాడగుటచే 'శత్రుజిత్' అను సార్థక నామ ముతో విలసిల్లును.

౮౨౧. శత్రుతాపనః-

సురశత్రువులను తపింపజేయువాడు గావున పరమాత్మకు 'శత్రుతాపనః' యను నామము అన్వర్థమై యొప్పును.

౮౨౨. న్యగ్రోధః-

'న్యక్-రోహతి'- దిగువున పుట్టి, సర్వమునకు మీదుగ నుండు వాడుగాన 'న్యగ్రోధః' యని చెప్పబడు చున్నాడు.

పృషోదరాదిత్వము ననుసరించి 'హ' కారమునకు 'ధ' కారా
దేశము వచ్చెను. మరియు, సర్వభూతముల నధఃకరించి నిజ
మాయ నవలంబించువాడు, నిరోధించువాడును గాన 'న్యగ్రోధః'
యను నామముచే పరమాత్మ భక్తులచే ధ్యానింప బడు
చున్నాడు.

౮౨౩. ఉదుంబరః-

కారణస్వరూపు డగుటచే అంబరము-ఆకాశము-కంటె
ఊర్ధ్వమందుండు వాడుగాన, శ్రీవిష్ణువు, 'ఉదుంబరః' యనుచు
ధ్యాతవ్యు డగుచున్నాడు. 'ఉదంబరః' యని అనుటకు బదులు
'ఉదుంబరః' యని పఠిత మగుటచే పృషోదరాదిత్వము వలన
'ఉ'కారము వచ్చినది.

మరియు, 'ఊర్గ్వా అన్నాద్య ముదుంబరమ్' అని శ్రుతి
వచనము ననుసరించి ఉదుంబర మనగా అన్నాద్య మని
యర్థము. పరమేశ్వరుడు అన్నాదికముచేత విశ్వమును పోషించు
వాడు గాన 'ఉదుంబర' శబ్దవాచ్యుడగుచున్నాడు. 'న్యగ్రోధో
దుంబరః' అనునపుడు 'న్యగ్రోధ' శబ్దము పైనున్న విసర్గము
నకు లోపము, సన్ధి, ఆర్షమని గ్రహింపనగును.

౮౨౪. అశ్వత్థః -

రేపటి కయిన నుండని, భగవంతుని యొక్క యభివ్యక్తి
రూపమైన జగత్తు 'అశ్వత్థ' మనబడును. పృషోదరాది పఠిత
మగుటచేత 'అశ్వత్థ' శబ్దమందలి 'స' కారమునకు 'త' కారా
దేశము వచ్చినది. 'ఊర్ధ్వమూలో౽వాక్ శాఖ ఏషో'

ఽశ్వత్థ స్సనాతనః' అని శ్రుతి. ఊర్ధ్వమూలః - ఉత్కృష్టమైన బ్రహ్మ, మూలము - కారణముగా గలది; అర్వాక్ శాఖః - దిగువునగల కార్యప్రపంచము శాఖలుగా నున్నది; ఇట్టిది సనాతనము అనాది యగు అశ్వత్థ మని చెప్పబడినది. 'ఊర్ధ్వ మూల మధశ్శాఖ మశ్వత్థమ్' అను స్మృతివచనము వలనగూడ ఈ 'అశ్వత్థ' శబ్దము, అశ్వత్థమునకు (కార్య ప్రపంచమునకు) మూలకారణమగు బ్రహ్మ బోధిత మగును.

౮౨౫. చాణూరాన్ధ్రనిషూదనః-

చాణూరు డను నట్టిఆంధ్రుని సంహరించినవాడు గాన శ్రీహరి 'చాణూరాన్ధ్రనిషూదనః'యను నామము చేనొప్పారును.

శ్లో॥ "సహస్రార్చి స్సప్తజిహ్వ స్సప్తైధా స్సప్త వాహనః ।
అమూర్తి రనఘో ఽచిన్త్యో భయకృ ద్భయనాశనః ॥

శం. భా. :- సహస్రాణి అనన్తాని అర్చీంషి యస్యసః. సహస్రార్చిః.

శ్లో॥ 'దివిసూర్య సహస్రస్య భవే ద్యుగప దుత్థితా ।
యదిభాః సదృశీ సాస్యా ద్భాస స్తస్య మహాత్మనః' ॥

ఇతి గీతా వచనాత్.

సప్తజిహ్వ అస్యసన్తీతి, సప్తజిహ్వః.

శ్లో॥ 'కాలీ కరాలీ చ మనోజవా చ
సులోహిత యాచ సుధూమ్ర వర్ణా ।
స్ఫులింగినీ విశ్వరుచీ చ దేవీ
వేలాయమానా ఇతి సప్తజిహ్వః' ॥ ఇతి శ్రుతేః.

సప్తైధాంసి దీప్తయోఽస్యేతి సప్తైధాః. అగ్నిః. 'సప్త తే అగ్నే సమిధః, సప్తజిహ్వాః' ఇతి మన్త్రవర్ణాత్. సప్తాశ్వా వాహనాని అస్యేతి సప్తవాహనః' సప్తానామేకో అశ్వో వా హన మస్యేతి వా, 'ఏకోఽశ్వో వహతి సప్తనామా. ఇతి శ్రుతేః. మూర్తిః. ఘనరూపం ధారణ సమర్థం. చరాచర లక్షణమ్. 'తాభ్యో ఽభితప్తాభ్యో మూర్తిరజాయత' ఇతి శ్రుతేః తద్రహిత ఇతి అమూర్తిః. అథవా. దేహ సంస్థాన లక్షణా మూర్ఛితా ఽఙ్గావయవా. మూర్తిః తద్రహిత ఇతి. అమూర్తిః. అఘం దుఃఖం, పాపం వాఽస్య న విద్యత ఇతి. అనఘః. ప్రమాతృత్వాపి సాక్షిత్వేన సర్వప్రమాణా గోచరత్వాత్. అచిన్త్యః అయ మీదృశ ఇతి. విశ్వప్రపంచ విలక్షణత్వేన చిన్తయితు మశక్యత్వా ద్వా అచిన్త్యః. అసన్మార్గ వర్తినాం భయం కరోతి, భక్తానాం భయం కృన్తతి కృణోతీతి వా. భయకృత్ వర్ణాశ్రమాచారవతాం భయం నాశయతీతి, భయనాశనః.

శ్లో॥ 'వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్ ।
విష్ణురారాధ్యతే పన్థాః నాన్య స్తత్తోష కారకః' ॥
ఇతి పరాశర వచనాత్ ॥

౮౨౬. సహస్రార్చిః-

'దివి సూర్య సహస్రస్య' అను గీతావచనానుసారము 'ఆకాశమందు వేయి సూర్యులయొక్క దీప్తి ఒక్కమారు ఉద్భవించినపుడు సంభవించునట్టి కాంతి ఆ పరమాత్మ దీప్తికి సమానమై యుండును.' అను రీతిగా అనంతములైన అర్చిస్సులు (కాంతులు) కలవాడు గాన పరమాత్మ 'సహస్రార్చిః' యను నామముచే అర్చనీయు డగుచున్నాడు.

౮౨౭. సప్తజిహ్వః-

శ్రుతి వచనానుసారము కాళీ-కరాళీ, మనోజవా, సులోహితా, సుధూమ్రవర్ణా, స్ఫులింగినీ, విశ్వరుచి, వేలాయమానః- అను 'సప్తజిహ్వః' యని పూజనీయుడగుచున్నాడు.

౮౨౮. సప్తైధాః-

'సప్తతే అగ్నే సమిధః సప్తజిహ్వాః' అను మంత్ర వర్ణము ననుసరించి దీప్తి సప్తకముతో నొప్పు అగ్నిస్వరూపుడు గాన శ్రీహరి 'సప్తైధాః' అని చెప్పబడును.

౮౨౯, సప్తవాహనః-

సప్త అశ్వములు వాహనములుగా కలవాడు మరియు 'ఏకోఽశ్వో వహతి సప్తనామా' అను శ్రుతి వచనము ననుసరించి 'సప్త' లో నొక యశ్వము వాహనముగా కలవాడు కనుక భగవానుడు 'సప్తవాహనః' యని సంకీర్తితు డగుచున్నాడు.

౮౩౦. అమూర్తిః-

'తాభ్యోఽభి తప్తాభ్యో మూర్తి రజాయత' అను శ్రుతి వచనము చెప్పిన రీతిగా మూర్తి యనగా ఘనరూపము, ధారణ సమర్థము నగు చరాచరాత్మకము అని భావము. పరమాత్మ తద్రహితుడు గాన 'అమూర్తిః' యనుచు వ్యపదేశ్యు డగుచున్నాడు. మరియు దేహసంస్థాన లక్షణా మూర్ఛితము లగు అవయవములు గలది మూర్తి యనబడును. పరమేశ్వరుడు

తద్రహితుడు గాన 'అమూర్తిః' యని కీర్తింపఁబడుచున్నాడు.

౮౩౧. అనఘః-

'అఘ' మనగా పాపము, దుఃఖము యని యర్థము. అవి లేనివాడు గాన పరమాత్మ 'అనఘ' శబ్ద వాచ్యుఁ డగుచున్నాడు.

౮౩౨. అచిన్త్యః-

సాక్షి యగుట చేత సర్వ ప్రమాణములకు నగోచరుడు మరియు సకల ప్రపంచ విలక్షణు డగుటచేత ఇట్టివాఁడని నిర్దేశింప శక్యము కానివాఁడు కాన శ్రీహరి 'అచిన్త్యః' యనుచు ధ్యాతవ్యు డగుచున్నాడు.

౮33. భయకృత్ -

అసన్మార్గ వర్తనులకు భయము కలిగించువాఁడు మరియు భక్తులయొక్క భయము పోగొట్టువాడు నగుటచే 'భయకృత్' యను నామము పరమేశ్వరుని యందు అన్వర్థము.

౮౩౪. భయనాశనః-

వర్ణాశ్రమాచారపరుల భయము నశింప చేయువాడు కావున పరమాత్మ 'భయనాశనః' యను నామముచే స్తుతింపబడుచున్నాఁడు. 'వర్ణాశ్రమాచార వతా పురుషేణ' యనుచు 'వర్ణాశ్రమాచార పరుడగు వాని చేత నారాధింప బడుటకంటె శ్రీమహా విష్ణువుకు సంతోషకర మగు మార్గము మరియొకటి లేదు' అని పరాశర వచనము బోధించు చున్నది.

శ్లో॥ అణుర్బృహత్ కృశః స్థూలో గుణభృన్నిర్గుణో మహాన్।
అధృత స్స్వధృత స్స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః ॥ ౧౦౩

శం భా. :- సౌక్ష్మ్యాతిశయ శాలిత్వాత్. అణుః. ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః' ఇతి శ్రుతేః బృహత్త్వాత్. బృంహణత్వా చ్చ. బ్రహ్మ. బృహత్. 'మహతో మహీయాన్' ఇతి శ్రుతేః. 'అస్థూలమ్' ఇత్యాదినా ద్రవ్యత్వ ప్రతిషేధాత్. కృశః. స్థూలః. ఇతి ఉపచర్యతే సర్వాత్మత్వాత్. సత్త్వరజస్తమసాం, సృష్టిస్థితి లయ కర్మసు అధిష్ఠాతృత్వాత్ గుణభృత్ వస్తుతో గుణాభావాత్. నిర్గుణః 'కేవలో నిర్గుణశ్చ' ఇతి శ్రుతేః. శబ్దాది గుణరహితత్వా న్నిరతిశయ సూక్ష్మత్వాత్. నిత్యశుద్ధ సర్వగతత్వాదినా చ ప్రతిబన్ధకం ధర్మజాతం తర్కతోఽపి యతో వక్తుం నశక్య మత ఏవ మహాన్. 'అసఙ్గో ఽశబ్దో ఽశరీరో ఽస్పర్శశ్చ మహాన్ శుచిః' ఇత్యాప స్తంబః. పృథివ్యాదీనాం ధారకాణా మపి ధారకత్వా న్నకేన చి ద్ధ్రియత ఇతి. అధృతః. యద్యేవ మయం తేన ధార్యతే ఇత్యాశంక్యాహ- స్వేనైవ ఆత్మనా ధార్యతే ఇతి స్వధృతః 'సభగవన్ కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని' ఇతి శ్రుతేః శోభనం పద్మోదరతల తామ్ర మాస్యమస్యేతి స్వాస్యః వేదాత్మకో మహాన్ శబ్దరాశి స్తస్య ముఖా న్నిర్గతః. పురుషార్థోపదేశార్థ మితి వా స్వాస్యః. 'అస్య మహతో భూతస్య' ఇత్యాది శ్రుతేః. అన్యస్య వంశినో వంశాః పాశ్చాత్త్యాః. అస్య వంశః ప్రపంచః. ప్రాగేవ. న పాశ్చాత్త్య ఇతి ప్రాగ్వంశః. వంశం ప్రపంచం వర్ధయన్. ఛేదయన్. వా వంశవర్ధనః.

౮౩౫. అణుః-

'ఏషో ఽనురాత్మా' అను శ్రుతి వచనానుసారము అత్యంత సూక్ష్మరూపమై యొప్పువాడు గాన పరమాత్మ

'అణు' శబ్దముచే వ్యపదేశ్యు డగుచున్నాడు.

౮౩౬. బృహత్ -

'మహతో మహీయాన్' అను శ్రుతిననుసరించి అతి మహా స్వరూపమైన బ్రహ్మస్వరూపము గాన పరమాత్మ 'బృహత్' శబ్దముచే అభివర్ణితు డగుచున్నాడు.

౮౩౭. కృశః-

'అస్థూలమ్' ఇత్యాది శ్రుతులచేత ద్రవ్యత్వము నిషేధింప బడుటవలన పరమేశ్వరుడు 'కృశ' శబ్దముచేత చెప్పబడును.

౮౩౮. స్థూలః-

సర్వాత్మత్వమును బట్టి ఆరోపిత స్థౌల్యము కలవాడు గాన పరమాత్మ 'స్థూలః' యని కీర్తింప బడుచున్నాడు.

౮౩౯. గుణభృత్ -

సృష్టి స్థితి లయ కర్మలకు ఉపయుక్తములకు సత్వ రజస్తమో గుణముల కధిష్ఠాతయైన వాడు గాన 'గుణభృత్' యను నామముచే పరమాత్మ స్తవనీయుడు.

౮౪౦. నిర్గుణః-

'కేవలో నిర్గుణశ్చ' అను శ్రుతిననుసరించి పరమేశ్వరుడు వస్తుతః నిర్గుణ స్వరూపుడు గాన 'నిర్గుణః' యని కీర్తింప బడు చున్నాడు.

౮౪౧. మహాన్ -

'అసంగో ఽశబ్దో ఽశరీరో ఽస్పర్శశ్చ మహాన్ శుచిః'

అను ఆపస్తంబోక్తి ననుసరించి శబ్దాది గుణరహితు డగుట చేతను నిరతిశయ సూక్ష్మస్వరూప మగుటచేతను నిత్యశుద్ధ సర్వగతత్వాదులను పురస్కరించుకొని మహత్వమునకు ప్రతిబంధక మయిన ధర్మజాతము, తర్కముచేగూడ చెప్పుటకు శక్యము కానందున మహచ్ఛబ్దముచే చెప్పబడువాడు గాన పరమాత్మ 'మహాన్' అను నామముచే సంస్తుతింపబడును.

౮౪౨. అధృతః-

ధారకములగు పృధివ్యాదులకు కూడ ధారకుడై యున్నందున ఏ ఒకదానిచేత ధరింపబడని వాడు గావున భగవంతుడు 'అధృత'శబ్ద వాచ్యు డగుచున్నాడు.

౮౪౩. స్వధృతః-

మరి, దేనిచేత ధరింపబడు చుండును? అని యనిన స్వస్వరూపముచేత ధరింప బడుచుండు వాడు గాన 'స్వధృతః' యని కీర్తింప బడుచున్నాడు 'స భగవన్ కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి, స్వే మహిమ్ని' అను శ్రుతి పరమేశ్వరుని యొక్క స్వధృతత్వమును బోధించుచున్నది.

౮౪౩. స్వాస్యః-

పద్మము యొక్క యుదర భాగమువలె తామ్రవర్ణము కలిగి శోభనమై యొప్పారుచు అతి సుందరమైన ముఖము కల వాడు మరియు 'అస్య మహతో భూతస్య' అను శ్రుతి ననుసరించి పురుషార్థోపదేశము కొరకు వేదాత్మక మగు మహాశబ్ద

రాశిని నిర్గమింప జేసిన శోభనమైన ముఖము కలవాడు నగు
టచే 'స్వాస్యః' యని కీర్తింపబడును.

౨౮౫. ప్రాగ్వంశః-

ఆయా మూలపురుషుల వంశములు పాశ్చాత్యములు.
అనగా తరువాత వచ్చినవి. ఈ పరమాత్మ యొక్క వంశము
ప్రపంచము ప్రాగేవ- మొట్టమొదటనే ఉన్నట్టివాడు గాన పర
మేశ్వరుడు 'ప్రాగ్వంశః' యని వ్యపదేశ్యుడగుచున్నాడు.

౨౮౬. వంశవర్ధనః-

వంశ-ప్రపంచమును వర్ధిల్ల చేయువాడు ఛేదింప చేయు
వాడు నగుటచే పరమేశ్వరుడు 'వంశవర్ధనః' యని స్తుతింప
బడుచున్నాడు

శ్లో॥ "భారభృత్ కథితో యోగీ యోగీశ స్సర్వకామదః ।
ఆశ్రమః శ్రమణః క్షామ స్సుపర్ణో వాయువాహనః"॥౧౦౫

శం భా :- అనన్తాది రూపేణ భువో భారం బిభర్తి, భారభృత్.
వేదాదిభి రయ మేవ పరత్వేన కథితః, సర్వై ర్వేదైః కథిత ఇతి వా,
కథితః. 'సర్వేవేదా యత్పద మామనన్తి' 'వేదైశ్చ సర్వై రహమేవ
వేద్యః'

శ్లో॥ 'వేదే రామాయణే పుణ్యే భారతే భరతర్షభ ।
ఆదౌ మధ్యే తథా చాఽన్తే విష్ణు స్సర్వత్ర గీయతే ॥

'సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్' ఇతి శ్రుతి
స్మృత్యాది వచనేభ్యః.

కిం త దర్థ న్నో విష్ణో ర్వ్యాపన శీలస్య పరమం పదం సతత్త్వ మిత్యాకాంక్షాయా మిన్ద్రియాదిభ్య స్సర్వేభ్యః పరత్వేన ప్రతిపాద్యతే- 'ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థాః' ఇత్యారభ్య 'పురుషా న్నపరం కించి త్సాకాష్ఠా సా పరా గతిః' ఇత్యన్తేన యః కథితః సః. కథితః. యోగో జ్ఞానమ్. తేనైవ గమ్యత్వాత్. యోగీ. యోగః సమాధిః సహి స్వాత్మని సర్వదా సమాధత్తే స్వమాత్మానమ్. తేన వా. యోగీ. అన్యే యోగినో యోగా న్తరాయై ర్హన్యన్తే స్వరూపా త్ప్రమాద్యన్తి. అయన్తు తద్రహితత్వా త్తేషా మీశః. యోగీశః. సర్వాన్ కామాన్ సదా దదాతీతి. సర్వకామదః. 'ఫల మత ఉపపత్తేః' ఇతి వ్యాసేనాఽభిహితత్వాత్. ఆశ్రమ వత్ సర్వేషాం సంసారా రణ్యే భ్రమతాం విశ్రమస్థాన త్వాత్ ఆశ్రమః. అవివేకిన స్సర్వాన్ సంతాపయతీతి. శ్రమణః. క్షామాః క్షీణాః సర్వాః ప్రజాః కరోతీతి. క్షామః. 'తత్కరోతి తదాచష్టే' ఇతి ణిచి పచాద్యచి కృతే సంపన్నః. క్షామ ఇతి. శోభనాని పర్ణాని ఛన్దాంసి సంసారతరురూపిణోఽస్యేతి. సుపర్ణః. 'ఛన్దాంసి యస్య పర్ణాని' ఇతి భగవద్వచనాత్. వాయు ర్వహతి యద్భీత్యా భూతా నీతి సః, వాయువాహనః. 'భీషాఽస్మా ద్వాతః పవతే' ఇతి శ్రుతేః.

౮౪౭. భారభృత్ -

భూభారమును, అనన్తాది రూపమున భరించుచున్న వాడు గావున, 'భారభృత్' యనుచు, పరమాత్మ ధ్యాతవ్యుడు.

౮౪౮. కథితః-

వేదాదులచేత పరమపురుషుడుగ కీర్తింప బడినవాడు నగుటచే 'కథితః' యను నామముచే శ్రీహరి అర్చనీయుడు. 'సర్వే వేదా యత్పద మామనన్తి' 'వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః', 'వేదే రామాయణే పుణ్యే భారతే భరతర్షభ,

ఆదౌ మధ్యే తథాచాన్తే విష్ణు స్సర్వత్ర గీయతే॥', సోఽధ్వనః
పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్' - అను శ్రుతి-
స్మృత్యాది వచనములు పై విషయమును బోధించుచున్నవి.

'సోఽధ్వనః' అను ఉపనిష ద్వచనమున - 'వ్యాపనశీలు
డగు విష్ణువుయొక్క మార్గమునకు సంబంధించిన తాత్త్విక
మగు పరమపదమును గురించి వివరించు సందర్భమున -'ఇన్ద్రి
యేభ్యః పరా హ్యర్థాః' అని యారంభించి, 'పురుషా న్నపరం
కించిత్ సా కాష్ఠా సా పరా గతిః' అని, 'ఇంద్రియాదు లన్నిటి
కంటె పరమ పదము, పరమగతి' యేది యని చెప్పబడెనో,
అదియే 'కథిత' శబ్దముచే నిట చెప్పబడినది.

౮౪౯. యోగీ -

యోగ మనగా జ్ఞానము; ఆజ్ఞానముచే గమ్యు డగు
వాడు; మరియు, 'యోగ' మనగా సమాధి; ఆ పరమాత్మ,
సదా స్వస్వరూపమందే సమాహితు డయి యుండు వాడగుట
వలన 'యోగీ' అను అన్వర్థ నామముతో విరాజిల్లును.

౮౫౦. యోగీశః-

అన్యులగు యోగులు అన్తరాయ ప్రతిహితులయి
స్వరూపమునుండి ప్రచ్యుతు లగుచుందురు. అట్టి ప్రచ్యుతి
లేనివాడు గాన, పరమాత్మ 'యోగీశః' యనుచు స్తోతవ్యు
డగుచున్నాడు.

౮౫౧. సర్వకామదః-

భక్తుల సర్వకామములను సదా యీడేర్చు వాడు గాన

శ్రీహరి 'సర్వకామదః' యనుచు స్తవనీయుడు. ఫలమంత 'ఉపపత్తేః' యను వ్యాససూత్రమున యీ విషయము చక్కగ ప్రతిపాదింప బడినది.

౭౧౨. ఆశ్రమః-

సంసారారణ్యమున పరిభ్రమించు సర్వజనులకు విశ్రమ స్థాన మగు ఆశ్రమము వంటివాడు కనుక 'ఆశ్రమః' యనుచు ధ్యాతవ్యు డగుచున్నాడు.

౭౧౩. శ్రమణః-

అవివేకిజనమును సంతాపపెట్టువాడు గాన, పరమాత్మ 'శ్రమణః' యని కీర్తింపబడుచున్నాడు.

౭౧౪. క్షామః-

సర్వప్రజలను, క్షామములనుగ (క్షీణులనుగ) చేయు వాడు గాన, పరమాత్మ, 'క్షామః' శబ్ద వ్యపదేశ్యు డగు చున్నాడు. 'క్షామాన్ కరోతి'-అను అర్థములో 'ణిచ్' 'పచాద్యచ్' చేయగా 'క్షామః' యను రూపము నిష్పన్న మైనదని తెలియనగును.

౭౧౫. సుపర్ణః-

ఛందస్సులు, సంసార తరుస్వరూపు డయిన పరమాత్మకు, శోభనములగు పర్ణములయి యొప్పుచున్నవాడు గాన, పరమాత్మ 'సుపర్ణః' యనుచు భజనీయు డగుచున్నాడు. 'ఛన్దాంసి యస్య పర్ణాని' అను గీతావచనము ఇందుకు ప్రమాణము.

౮౫౮. వాయువాహనః-

'భీషాఽస్మా ద్వాతః పవతే'- అను శ్రుతి ననుసరించి యీ పరమాత్మ యొక్క భయము వలననే వాయువు ప్రవర్తించును. అట్టి వాయువును భూతములను గూర్చి ప్రవర్తింపజేయు వాడు గనుక, శ్రీహరి 'వాయువాహనః' యను నామముచే ప్రకీర్తితు డగుచున్నాడు.

శ్లో॥ "ధనుర్ధరో ధనుర్వేదో దండో దమయితా దమః ।
అపరాజిత స్సర్వసహో నియన్తాఽనియమోఽయమః" ॥

శం. భా. :- శ్రీమాన్ రామో మహద్ధను ర్ధారయామాసేతి, ధనుర్ధరః. సఏవ దాశరథిః ధనుర్వేదం వేత్తీతి, ధనుర్వేదః దమనం దమయతాం దండః, 'దండో దమయతా మస్మి' ఇతి భగవద్వచనాత్. వైవస్వత నరేన్ద్రాది రూపేణ ప్రజాదమయతీతి, దమయితా. దమః దమ్యేషు దండ కార్యం ఫలం. తచ్చ స ఏవేతి దమః. శత్రుభి ర్నపరాజిత ఇతి. అపరాజితః సర్వకర్మసు సమర్థ ఇతి. సర్వాన్ శత్రూన్ సహత ఇతి వా, సర్వసహః సర్వాన్ స్వేషు స్వేషు కృత్యేషు వ్యవస్థాపయతీతి, నియన్తా, న నియమో నియతి ర్నస్య విద్యత ఇతి, అనియమః సర్వనియన్తు ర్నియన్త్రన్తరా భావాత్ నాస్య విద్యతే యమో మృత్యురితి, అయమః. అథవా, యమ నియమా యోగాంగే, త ద్గమ్యత్వా త్స ఏవ నియమః యమః.

౮౫౯. ధనుర్ధరః-

పరమేశ్వరుని యవతారములలో శ్రీరామచంద్రుడు మహా ధనుర్ధరు డగుటచే 'ధనుర్ధర' నామము పరమేశ్వరుని యందు ప్రసిద్ధము.

౮౫౮. ధనుర్వేదః-

దాశరథి యగు ఆ రామచంద్రమూర్తియే ధనుర్వేద వేత్త యగుట చేత పరమాత్మ 'ధనుర్వేదః' యను నామముచే బరగును.

౮౫౯. దణ్డః-

'దండో దమయతా మస్మి' అను భగవద్వచనాను సారము దండించువారిలో దమనము - దండము అయి విరాజిల్లును గాన పరమేశ్వరుడు 'దణ్డ' శబ్ద వాచ్యుడగుచున్నాడు.

౮౬౦. దమయితా -

వైవస్వత (యమ) రూపమున, నరేంద్రాది రూపమునను ప్రజలను దండించువాడు గాన శ్రీమహావిష్ణువు 'దమయితా' యను అన్వర్థ నామధేయుడై యొప్పెను.

౮౬౧. దమః-

దండ్యుల యందు దండరూప కార్యమగు ఫలము 'దమము' - ఇంద్రియ నిగ్రహము ఆదమము పరమాత్మ యొక్క రూపమే గాన 'దమః' యను నామముచే కీర్తింప బడును.

౮౬౨. అపరాజితః-

శత్రువులచే పరాజితుడు కానివాడు గాన 'అపరాజితః' యను నామముచే సంకీర్తనీయుడు.

౮౬౩. సర్వసహః-

సర్వ కర్మలయందును సమర్థుడు మరియు సర్వ శత్రువు

లను సహించువాఁడగుటచే పరమాత్మ 'సర్వసహః' యను నామముచే భజనీయుడు.

౫౬౪. నియంతా -

సర్వులను స్వ - స్వ కార్యములయందు వ్యవస్థాపన చేయునట్టి వాఁడుగాన పరమాత్మ 'నియంతా' యను సార్థక నామముతో విరాజిల్లును.

౫౬౫. అనియమః (నియమః) -

సర్వనియంతకు మరియొక నియంత అసంభవము గాన ఒకని నియమము లేనట్టివాఁడు గాన శ్రీహరి 'అనియమః' యను నామముచే వ్యపదేశ్యుఁడగుచున్నాఁడు.

౫౬౬. అయమః (యమః)-

యముఁడు - మృత్యువు - లేనట్టివాఁడు గాన పరమాత్మ 'అయమః' యనుచు ధ్యాతవ్యుఁడగుచున్నాఁడు.

మరియు అనియమో ఽయమః' అని కాక 'నియమో-యమః' అని పదచ్ఛేదము చేసినచో యమ, నియమము లు యోగాంగములు గాన, తద్గమ్యుఁడగుటచేత ఆ పరమాత్మయే నియమమనియు, యమమనియు చెప్పఁబడునని గ్రహింపవలెను.

శ్లో॥ సత్త్వవాన్ సాత్త్వికః సత్యః సత్యధర్మ పరాయణః ।
అభిప్రాయః ప్రియార్హోఽర్హః ప్రియకృత్ ప్రీతి వర్ధనః ॥

శం. భా. :- శౌర్య వీర్యాదికం సత్త్వ మస్యేతి సత్త్వవాన్, సత్త్వే గుణే ప్రాధాన్యేన స్థిత ఇతి సాత్త్వికః. సత్సు సాధుత్వాత్, సత్యః. సత్యే

యథాభూతార్థ కథనే, ధర్మే చ చోదనాలక్షణే నియత ఇతి సత్య ధర్మ పరాయణః అభిప్రేయతే పురుషార్థ కాంక్షిభిః అభిముఖ్యేన ప్రాప్యతే ఽస్మిన్ ప్రైతి జగదిత వా, అభిప్రాయః, ప్రియాణి ఇష్టాన్యర్హతీతి, ప్రియార్హః.

శ్లో॥ 'యద్య దిష్టతమం లోకే యచ్చాఽస్య దయితం గృహే।
తత్త ద్గుణవతే దేయం తదేవాఽక్షయ మిచ్ఛతా' ఇతిస్మరణాత్ ॥

స్వాగతా సన ప్రశంసాఽర్ఘ్య పాద్య స్తుతి నమస్కారాదిభిః పూజా సాధనైః పూజనీయః ఇతి. అర్హః, న కేవలం ప్రియార్హ ఏవ కిన్తు, స్తుత్యాదిభి ర్భజతాం ప్రియం కరోతీతి. ప్రియకృత్. తేషా మేవ ప్రీతిం వర్ధయతీతి. ప్రీతివర్ధనః ॥-

౮౮౭. సత్త్వవాన్-

శౌర్యవీర్యాది రూపమైన సత్త్వము-బలము-కలవాడు గాన శ్రీహరి 'సత్త్వవాన్' అను నామముచే సంకీర్తితు డగు చున్నాడు.

౮౮౮. సాత్త్వికః-

సత్త్వగుణ ప్రధానుడు గాన పరమాత్మ 'సాత్త్వికః' శబ్దాభిధేయుడు.

౮౮౯. సత్యః-

సత్పురుషుల విషయమై సద్భావము కలవా డగుట చేసి పరమాత్మ 'సత్య' నామాంకితుడై విరాజిల్లును.

౮౯౦. సత్యధర్మపరాయణః-

యథార్థ భాషణ విహిత ధర్మాచరణముల యందు

నియతుడై యున్నవాడు గాన శ్రీహరి 'సత్యధర్మపరాయణః' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు.

౮౨౧. అభిప్రాయః-

పురుషార్థములను కాంక్షించు వారలచే అభిలషింప బడువాడు, మరియు ప్రళయకాలమున సకల జగత్తును తనలో ప్రవేశపెట్టు కొనువాడు నగుటచే పరమేశ్వరుడు 'అభిప్రాయః' యను నామముచే స్తవనీయు డగుచున్నాడు.

౮౨౨. ప్రియార్హః-

ఇష్ట వస్తువులను సమర్పింప నర్హుడు గాన భగవానుడు 'ప్రియార్హాహః' అను శబ్దముచే వ్యపదేశ్యు డగుచున్నాడు. 'యద్య దిష్టతమం లోకే' అను స్మృతి వచనము 'లోక మందు తనకు ఏది మిక్కిలి ఇష్టమైనదో ఏది ప్రియ వస్తువో దానిని అక్షయముగా కోరు వాడు గుణవంతునకు సమర్పింప వలయును' అని చెప్పుచున్నది.

౮౨3. అర్హః-

స్వాగతము, ఆసనము, ప్రశంసనము, అర్ఘ్యము, పాద్యము, స్తుతి, నమస్కారము అను పూజా సాధనములచేత పూజనీయుడు గాన పరమాత్మ 'అర్హః' అను నామముచే అర్చనీయుడు

౮౨౪. ప్రియకృత్ -

కేవలము ప్రియార్హుడే కాక స్తుత్యాదులచే భజించు వారలకు ప్రియమును చేకూర్చువాడు గాన పరమేశ్వరుడు

'ప్రియకృత్' అను అన్వర్థ సంజ్ఞతో విరాజిల్లును.

౮౭౫. ప్రీతివర్ధనః-

స్తుత్యాదులచే భజించు నట్టి భక్తుల యొక్క ప్రీతిని వృద్ధిపొందించువాడు గాన భగవానుడు 'ప్రీతివర్ధనః' యను శబ్దముచే అభిహితుడగుచున్నాడు.

శ్లో॥ విహాయసగతి ర్జ్యోతి స్సురుచి ర్హుతభు గ్విభుః ।
రవి ర్విరోచన స్సూర్య స్సవితా రవిలోచనః ॥ ౧౦౨

శం. భా. :- విహాయసగతి రాశ్రయో ఽస్యేతి విహాయసగతిః. విష్ణుపదమ్. ఆదిత్యోవా స్వత ఏవ ద్యోతత ఇతి జ్యోతిః. 'నారాయణపరో జ్యోతి రాత్మా' ఇతి మన్త్రవర్ణాత్. శోభనా రుచి ర్దీప్తి కీర్తి రిచ్ఛావా ఽస్యేతి సురుచిః సమస్త దేవతోద్దేశేన ప్రవృత్తేష్వపి కర్మసు హుతం భుఙ్క్తే భునక్తి వా. హుతభుక్. సర్వత్ర వర్తమానత్వాత్. త్రయాణాం లోకానాం ప్రభుత్వాద్వా. విభుః. రసానాదత్తే ఇతి. రవిః. ఆదిత్యాత్మా.

శ్లో॥ రసానాం చ తథాఽఽదానా ద్రవిరి త్యభిధీయతే ।
ప్రజానాం తు ప్రసవనా త్సవితేతి నిగద్యతే ॥

ఇతి విష్ణుధర్మోత్తరే.

వివిధం రోచతే ఇతి. విరోచనః. సూతే శ్రియమితి, సూర్యోఽగ్నిర్వా. సూర్యః. సూతేః. సువతేర్వా సూర్యశబ్దో నిపాత్యతే. 'రాజసూయ సూర్య' ఇతి పాణిని వచనాత్. సర్వస్య జగతః ప్రసవితా. సవితా. 'ప్రజానాం తు ప్రసవనా త్సవితేతి నిగద్యతే' ఇతి విష్ణు ధర్మోత్తరే. రవిర్లోచనం చక్షు రస్యేతి. రవిలోచనః 'అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ' ఇతి శ్రుతేః.

౮౭౬. విహాయసగతిః-

విహాయసః - ఆకాశము, గతిః - ఆశ్రయము, అయిన

వాడు గాన శ్రీమహావిష్ణువు 'విహాయసగతిః' అని చెప్పబడును. మరియు విహాయసగతిః యనగా విష్ణుపదము లేక ఆదిత్యుడు అనియు అర్థము చెప్పికొనవచ్చును.

౨౭౭. జ్యోతిః-

స్వతః ప్రకాశ స్వభావుడు గాన పరమాత్మ 'జ్యోతిః' యని కీర్తింప బడుచున్నాడు 'నారాయణ పరోజ్యోతి రాత్మా' అను శ్రుతివచనము పరమాత్మ జ్యోతి స్వరూపుడని ప్రతిపాదించుచున్నది.

౨౭౮. సురుచిః-

శోభనమైన దీప్తి లేక ఇచ్ఛ కలవాడు గాన భగవానుడు 'సురుచిః' యను నామముచే ధ్యానింపబడుచున్నాడు.

౨౭౯. హుతభుక్ -

సమస్త దేవతోద్దేశముగా ప్రవృత్తము లగు కర్మలందు హవిస్సును స్వీకరించు వాడు, రక్షించువాడు నగుటచే పరమాత్మ 'హుతభుక్' అను సార్థకమగు అభిధానముతో విలసిల్లును.

౨౮౦. విభుః-

సర్వత్ర వర్తమానుడు లోకత్రయమునకు ప్రభువు నగుటచే పరమాత్మ 'విభు' శబ్దవాచ్యు డగుచున్నాడు.

౨౮౧. రవిః-

'రసానాం చ తథా ఽఽదానాత్ రవి రిత్యభిధీయతే'

అను విష్ణు ధర్మోత్తర వచనము ననుసరించి రసములను ఆకర్షణ చేయునట్టి యాదిత్య స్వరూపుడు గాన శ్రీహరి 'రవిః' యను నామముచే స్తోతవ్యు డగుచున్నాడు.

౮౮౨. విరోచనః-

వివిధముగా రోచమానుడు గాన 'పరమాత్మ' విరోచనః యని భజింప బడుచున్నాడు.

౮౮౩. సూర్యః-

సంపదను కలిగించువాడు మరియు శ్రీప్రదాత యగు అగ్నియు నగుటచే పరమేశ్వరుడు 'సూర్య' శబ్ద వాచ్యుడు.

౮౮౪. సవితా-

'ప్రజానాం తు ప్రసవనా త్సవితేతి నిగద్యతే' అను విష్ణు ధర్మోత్తరమందలి వచనము ననుసరించి సర్వజగ దుత్పాదకుడు కాన శ్రీహరి 'సవితా' యను నామముచే స్తవనీయ డగుచున్నాడు.

౮౮౫. రవిలోచనః-

సూర్యుడు లోచనముగా-నేత్రముగా-కలవాడు గాన పరమాత్మ 'రవిలోచనః' యను నామముచే కీర్తింప బడుచున్నాడు. 'అగ్నిర్మూర్ధా చక్షుషి చంద్ర సూర్యౌ' అను శ్రుతి పై విషయమును స్పష్టము చేయుచున్నది.

శ్లో॥ అనన్తో హుతభుక్ భోక్తా సుఖదో నైకజోఽగ్రజః ।
అనిర్విణ్ణః సదాఽమర్షీ లోకాధిష్ఠాన మద్భుతః ॥ ౧౦౮

శం. భా. ;- నిత్యత్వాత్ సర్వగతత్వాత్ దేశకాల పరిచ్ఛేదా భావాత్ అనన్తః. శేషరూపో వా హుతం భునక్తీతి. హుతభుక్. ప్రకృతిం భోగ్యామ్ అచేతనాం భుఙ్క్తే ఇతి జగత్ పాలయతీతి వా భోక్తా. భక్తానాం సుఖం మోక్షలక్షణం దదాతీతి, సుఖదః. అసుఖం ద్యతి ఖండయతీ తి వా. అసుఖదః. ధర్మగుప్తయే అసకృ జ్జాయమానత్వాత్. నైకజః. అగ్రే జాయత ఇతి. అగ్రజః. 'హిరణ్యగర్భః హిరణ్యగర్భ స్సమవ ర్తతాగ్రే' ఇత్యాది శ్రుతేః. అవాప్త సర్వకామత్వా దప్రాప్తి హేత్వభావా న్నిర్వే దోఽస్య నాస్తీతి. అనిర్విణ్ణః. సతః, సాధూన్ అభిముఖ్యేన మృష్యతే క్షమతే ఇతి. సదామర్షీ. త మనాధార మాధార మధిష్ఠాయ త్రయోలోకా స్తిష్ఠన్తి ఇతి. లోకాధిష్ఠానం. బ్రహ్మ. అద్భుతత్వా దద్భుతః.

శ్లో॥ 'శ్రవణాయా పి బహుభి ర్యో న లభ్యః
శృణ్వన్తో పి బహవో యం న విద్యుః ।
ఆశ్చర్యో వక్తా కుశలో ఽస్యలబ్ధా
ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః' ॥ ఇతి శ్రుతేః.

'ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేనమ్' ఇతి భగవద్వచనాత్. స్వరూప శక్తి వ్యాపారకార్యై రద్భుతత్వా ద్వా. అద్భుతః.

౮౮౬. అనన్తః-

నిత్యత్వము, సర్వగతత్వము, దేశకాలపరిచ్ఛేద రాహి త్యమును, పురస్కరించుకొని పరమేశ్వరుడు అనంతుడు. మరియు శేషస్వరూపుడును గాన 'అనన్తః' యను నామము చే సంకీర్తింప బడుచున్నాడు.

౮౮౭. హుతభుక్ -

అగ్నియందు హుతము చేయబడిన ద్రవ్యమును పరిగ్ర

హించు వాడు గాన 'హుతభుక్' అను నామముచే పరమే
శ్వరుడు భక్తులచే ఆరాధింపబడు చున్నాడు.

౮౮౮. భోక్తా-

అచేతనము, భోగ్యము నయిన ప్రకృతికి భోక్త అయిన
వాడు జగత్పాలకుడు నగుటచే భగవంతుడు 'భోక్తా' యను
నామమున బరగు చున్నాడు.

౮౮౯. సుఖదః (అసుఖదః) -

భక్తులకు మోక్షరూపసుఖము నిచ్చువాడు; లేక
'భోక్తా' అసుఖదః' అని పదచ్ఛేదము చేసినచో భక్తుల యొక్క
అసుఖమును - దుఃఖమును - పోగొట్టువాడు గాన పరమాత్మ
'సుఖదః' అనియు, 'అసుఖదః' అనియు గూడ ధ్యాతవ్యు
డగును.

౮౯౦. నైకజః-

ధర్మ రక్షణార్థము అనేక పర్యాయములు ఆవిర్భవించు
చుండు వాడు గాన పరమాత్మ 'నైకజః' అను సార్థక నామ
ముతో విలసిల్లు చుండును.

౮౯౧ అగ్రజః-

'హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే' అను శ్రుతివచనము
ననుసరించి పరమేశ్వరుడు ముందుగా హిరణ్యగర్భ రూపమున
ఉద్భవించినవాడు గాన 'అగ్రజః' యను నామముచే
స్తోతవ్యుడు.

౮౯౨. అనిర్విణ్ణః-

అవాప్త సర్వకాముడగుటచేత లభ్యము కానిదేదియు లేనందున నిర్వేదము - దుఃఖము ఎరుగనివాడు గాన 'అని ర్విణ్ణః' యను నామముచే పరమాత్మ స్తవనీయుడు.

౮౯౩. సదామర్షీ -

సత్పురుషులను సదా క్షమించువాడు గాన పరమేశ్వరుడు 'సదామర్షీ' యను నామముచే వ్యపదేశ్యుడగుచున్నాడు.

౮౯౪. లోకాధిష్ఠానమ్ -

తాను నిరాధారుడయి త్రిలోకములకు నాధారభూతుడై యొప్పు వాడు గాన భగవానుడు 'లోకాధిష్ఠానమ్' అను నామముచే చెప్పబడును.

౮౯౫. అద్భుతః-

అద్భుతమగు స్వరూపముతో విరాజిల్లు చుండును గాన శ్రీహరి 'అద్భుతః' యను నామముచే సంస్తుతింపబడు చున్నాడు. 'శ్రవణాయాపి బహుభి ర్యో నలభ్యః' అనుచు 'కఠోపనిషత్తు ఆత్మ విషయమై కొందరికి శ్రవణము చేయుట దుర్లభము; మరికొందరికి జ్ఞానము దుర్లభము; మరియు ప్రవక్తయు ఆశ్చర్యవస్తువవలె అనేకులలో నొకడుండును. అటులనే జ్ఞాతయు కుశలుడగు ఆచార్యుని చేత అను శాసింపబడిన వాడు అనేకులలో ఒకడుండును.' అని పరమాత్మ యొక్క అద్భుత స్వరూపము నుద్ఘోషించుచున్నది. 'ఆశ్చర్య వత్పశ్యతి

కశ్చిదేనం' అను భగవద్వచనము కూడ పైవిషయము నుద్ఘోషించుచున్నది. ఇంతేకాదు. స్వరూపము, శక్తి, వ్యాపారము, కార్యము - వీనిచేత అద్భుతమైన వాడు గాన పరమాత్మ 'అద్భుత' శబ్దవాచ్యుడు.

శ్లో॥ సనాత్ సనాతనతమః కపిలః కపి రవ్యయః ।

స్వస్తిదః స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తిదక్షిణః ॥

శం. భా. :- సనాత్ ఇతి నిపాత శ్చిరార్థవచనః. కాలశ్చ పరస్యైవ వికల్పనా కాఽపి.

శ్లో॥ 'పరస్య బ్రహ్మణో రూపం పురుషః ప్రథమం ద్విజ ।

వ్యక్తావ్యక్తే తథైవాన్యే రూపే కాల స్తథాపరమ్' ॥

ఇతి విష్ణుపురాణే.

సర్వకారణత్వాత్ విరించ్యాదీనా మపి సనాతనానా మతిశయేన సనాతనత్వాత్ సనాతనతమః బడబానలస్య కపిలో వర్ణ ఇతి తద్రూపీ కపిలః. తం జలం రశ్మిభిః పిబన్ కపిః సూర్యః కపిర్వరాహో వా. 'కపిర్వరాహః శ్రేష్ఠశ్చ' ఇతి వచనాత్ ప్రళయే అస్మి న్నపి యాన్తి జగన్తీతి అవ్యయః. ఇతి నామ్నాం నవమం శతం వివృతమ్ భక్తానాం స్వస్తి మంగలం దదాతీతి స్వస్తిదః. తదేవ భుఙ్త్తే ఇతి, స్వస్తిభుక్. భక్తానాం తదేవ కరోతీతి స్వస్తికృత్. మంగలస్వరూప మాత్మీయం పరమానన్ద లక్షణం స్వస్తి తదేవ భుఙ్త్తే ఇతి స్వస్తిభుక్ భక్తానాం మంగలం స్వస్తి భునక్తీతి వా స్వస్తిభుక్. స్వస్తి రూపేణ దక్షతే వర్ధతే, స్వస్తి దాతుం సమర్థ ఇతి వా స్వస్తిదక్షిణః. అథవా దక్షిణశబ్ద ఆశుకారిణి వర్తతే, క్షిప్రం స్వస్తి దాతు మయ మేవ సమర్థ ఇతి యస్య స్మరణా దేవ సిధ్యన్తి సర్వసిద్ధయః

శ్లో॥ 'స్మృతే సకల కల్యాణ భాజనం యత్ర జాయతే।
పురుష స్తమజం నిత్యం వ్రజామి శరణం హరిమ్' ॥

శ్లో॥ 'స్మరణా దేవ కృష్ణస్య పాప సంఘాత పంజరమ్।
శతథా భేద మాయాతి గిరి ర్వజ్రహతో యథా' ॥

ఇత్యాది వచనేభ్యః.

౮౯౬. సనాత్ -

'సనాత్' అనగా చిరకాలము అని అర్థము. కాలము పరమాత్మకే ఒకానొక వికల్పము కాన పరమాత్మ 'సనాత్' శబ్దముచే చెప్పబడును. 'పరబ్రహ్మయొక్క ప్రథమరూపము పురుషుడనియు, వ్యక్తావ్యక్తములు మరియొక రూపమనియు అటులనే కాలము అన్యరూప' మనియు విష్ణు పురాణములో చెప్పబడినది.

౮౯౭. సనాతనతమః-

సర్వకారణత్వమును పురస్కరించుకొని బ్రహ్మాదులు సనాతనులు పరమాత్మ వారికంటె సనాతనుడు గాన 'సనాతన తమః' యని కీర్తింప బడుచున్నాడు.

౮౯౮. కపిలః-

కపిలవర్ణము కల బడబానల స్వరూపుడు గాన పరమాత్మ 'కపిల' శబ్దముచే వ్యపదేశ్యుడు.

౮౯౯. కపిః-

జలమును కిరణములచేత గ్రహించునట్టి ఆదిత్య స్వరూపుడు, మరియు 'కపి ర్వరాహః శ్రేష్ఠశ్చ' అను వచనము నను

సరించి వరాహ మూర్తియు నగుటచే పరమాత్మ 'కపిః' యను నామముచే ధ్యానింప బడుచున్నాడు.

౯౦౦. అప్యయః-

ప్రలయ కాలమందు జగత్తులు తనయందు లీనమగునట్టి వాడు గాన శ్రీహరి 'అప్యయః' అను అన్వర్థ నామముచే విరాజిల్లు చుండును.

ఇంతవరకు నామములలో నవమ శతము వివరింప బడినది.

౯౦౧. స్వస్తిదః-

భక్తులకు స్వస్తి - మంగళము- కలిగించువాడు గాన, పరమాత్మ 'స్వస్తిదః' యను నామముచే స్తోతవ్యుడు.

౯౦౨. స్వస్తికృత్ -

భక్తులకు మంగళమునే చేయువాడు గాన, 'స్వస్తికృత్' అని పరమాత్మ కీర్తింపబడు చున్నాడు.

౯౦౩. స్వస్తి -

మంగళాత్మకము, ఆత్మీయము నయిన పరమానంద రూపము గాన 'స్వస్తి' యను నామము పరమాత్మయందు అన్వర్థము.

౯౦౪. స్వస్తిభుక్ -

ఆ పరమానందమునే అనుభవించు వాడు, భక్తుల యొక్క స్వస్తిని - మంగళమును - పాలించు వాడు నగుటచే

శ్రీమహావిష్ణువు 'స్వస్తిభుక్' అను అన్వర్థ సంజ్ఞ
విరాజిల్లును.

౯౦౫. స్వస్తిదక్షిణః-

మంగళరూపమున ప్రవర్ధమానుడు, మంగళదానము
సమర్థుడును గావున, 'స్వస్తిదక్షిణః' యని చెప్పబడును.

మరియు 'దక్షిణ' శబ్దము శీఘ్రకారిని చెప్పును గ
శీఘ్రముగా స్వస్తిని - మంగళమును - ఇచ్చుటలో నీ
సమర్థుడు కనుక శ్రీహరి 'స్వస్తిదక్షిణ' శబ్దముచే సంకీర్తితు
ఆ పరమేశ్వరుని నామస్మరణము చేతనే సర్వసిద్ధులు సిద్ధిం
చుండును.

'ఆ పరమాత్మ స్మరింపబడినంత మాత్రమున, మా
వుడు సకల కళ్యాణపాత్రుడగును. కాన, అట్టి శ్రీహ
స్మరించుచున్నాను'. అనియు -

'శ్రీకృష్ణస్మరణము చేతనే పాపసంఘాతము వజ్రప
మైన గిరివలె భిన్నమై పోవు' ననియు వచనములు చె
చున్నవి.

శ్లో॥ అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జిత శాసనః ।
శబ్దాతిగ శ్శబ్దసహ శ్శిశిర శ్శర్వరీకరః ॥ ౯

శం. భా :- కర్మ రౌద్రమ్. రాగశ్చ రౌద్రః. కోపశ్చ రౌద్రః. ర
రౌద్ర త్రయం నాస్తి. అవాప్త సర్వకామత్వేన రాగద్వేషాదే రభా
వః. అరౌద్రః. శేషరూపభాక్. కుండలీ. సహస్రాంశు మండలో

కుండల ధారణాత్. యద్వా సాంఖ్యయోగాత్మకే కుండలే మకరాకారే౽స్యస్త ఇతి. కుండలీ సమస్త లోకరక్షార్థం మనస్తత్త్వాత్మకం సుదర్శనాఖ్యం చక్రం ధత్తే ఇతి చక్రీ.

శ్లో॥ 'చలస్వరూప మత్యన్త జవేనా౽న్తరితానిలమ్ ।
చక్రస్వరూపం చ మనో ధత్తే విష్ణుః కరే స్థితమ్ ॥
ఇతి విష్ణుపురాణవచనాత్.

విక్రమః పాదవిక్షేపః శౌర్యంవా, ద్వయంవా. అశేష పురుషేభ్యో విలక్షణ మస్యేతి విక్రమీ, శ్రుతిస్మృతి లక్షణ మూర్జితం శాసన మస్యేతి. ఊర్జితశాసనః.

శ్లో॥ 'శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే యస్తే ఉల్లంఘ్య వర్తతే ।
ఆజ్ఞా చ్ఛేదీ మమద్వేషీ మద్భక్తో౽పి నవైష్ణవః' ॥
ఇతి భగవద్వచనాత్.

శబ్ద ప్రవృత్తి హేతూనాం జాత్యాదీనా మసంభవాత్ శబ్దేన వక్తు మశక్యత్వాత్, శబ్దాతిగః. 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ' 'న శబ్దగోచరం యస్య యోగిధ్యేయం పరం పదమ్' ఇత్యాది శ్రుతి స్మృతిభ్యః సర్వే వేదా స్తాత్పర్యేణ త మేవ వదన్తీతి శబ్దసహః. 'సర్వే వేదా యత్పద మామనన్తి' ఇతి శ్రుతేః. 'వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః' ఇతి స్మృతేశ్చ. తాపత్రయాభి తప్తానాం విశ్రామ స్థానత్వాత్, శిశిరః. సంసారిణా మాత్మా, శర్వరీవ, శర్వరీ౽జ్ఞానినాం పున సంసార శ్శర్వరీ తా ముభయేషాం కరోతీతి, శర్వరీ కరః.

శ్లో॥ 'యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతో మునేః ॥
ఇతి భగవద్వచనాత్.

## శ్రీ విష్ణుసహస్రనామస్తోత్ర భాష్యము

౯౦౬. అరౌద్రః-

సర్వకామములు సిద్ధములే అయియున్న వాడగుటవ
రాగద్వేషాది రహితు డగుటచేత, రౌద్రమగు కర్మ, రౌ
మగు రాగము, రౌద్ర మగు క్రోధము- ఇవి మూడును లే
వాడు గాన, శ్రీహరి 'అరౌద్రః' యనుచు భజనీయుడు.

౯౦౭. కుండలీ-

శేషరూపధారి, సూర్య మండల తుల్యములగు కుం
ములను ధరించిన వాడు, సాంఖ్య యోగాత్మకము లగు
రాకార కుండలములు కలవాడు నగుటచే శ్రీమహావిష్ణు
'కుండలీ' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు.

౯౦౮. చక్రీ-

సమస్త లోకరక్షణార్థము మన స్తత్త్వాత్మక మగు
ర్శన చక్రమును ధరించి యున్నవాడు గాన విష్ణుభగవా
'చక్రీ' యను నామమున బరగును. ఈవిషయము ను
పురాణము - 'పరమాత్మ అత్యంత వేగముతో చలించెడి
స్వరూపమైన మనస్సును హస్తమున ధరించి యున్నా
చెప్పుచున్నది.

౯౦౯. విక్రమీ-

పాదవిక్షేపము, శౌర్యము - అను కార్యద్వయ
సమస్త పురుషులకంటెను విలక్షణముగ నున్నవాడు క
పరమాత్మ 'విక్రమీ' యను నామముచే స్తోతవ్యుడు'.

౯౧౦. ఊర్జితశాసనః-

'శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే, అను భగవద్వచనానుసా

పరమేశ్వరుని ఆజ్ఞారూపములై యున్న శ్రుతిస్మృతుల నుల్లం
ఘించిన వాడు పరమేశ్వర ద్వేషి యగు నని తెలియుచున్నం
దున శ్రీహరి శ్రుతిస్మృతి రూపము, అనుల్లంఘనీయము.
ఉత్కృష్టము నగు శాసనము గలవాడు గాన 'ఊర్జితశాసనః'
యనుచు ధ్యాతవ్యు డగుచున్నాడు.

౯౧౧. శబ్దాతిగః-

శబ్దప్రవృత్తికి హేతువులయిన జాత్యాదులు సంభవింపని
కారణమున పరమేశ్వరుడు శబ్దముచే చెప్పుటకు శక్యుడు కాని
వాడు కాన 'శబ్దాతిగః' యని చెప్పబడును. 'యతో వాచో నివ
ర్తన్తే. అప్రాప్య మనసా సహ', న శబ్దగోచరం యస్య యోగి
ధ్యేయం పరం పదమ్' అనుచు శ్రుతిస్మృతులు పరమేశ్వరుని
వాచామగోచరత్వమును ప్రతిపాదించు చున్నవి.

౯౧౨. శబ్దసహః-

"సర్వే వేదా యత్పద మామనన్తి" "వేదైశ్చ సర్వై
రహమేవ వేద్యః" అను శ్రుతిస్మృతుల వచనానుసారము
పరమేశ్వరుడు తాత్పర్యరూపమున సర్వవేదములచేత చెప్పబడు
వాడు గాన 'శబ్దసహః' అను నామముచే ధ్యానింప బడు
చున్నాడు.

౯౧౩. శిశిరః-

తాపత్రయ సంతప్త చిత్తులకు విశ్రాంతి స్థానమైన
వాడు గాన శ్రీహరి 'శిశిర' శబ్ద వాచ్యు డగుచున్నాడు.

౯౧౪. శర్వరీకరః -

సంసారులకు ఆత్మ శర్వరీసమము. అనగా నిశతో సమానము. జ్ఞానులకు సంసారము శర్వరీ సమానము. అట్టి శర్వరిని ఆ ఇరువురికి కలిగించు వాడుగాన పరమేశ్వరుడు 'శర్వరీకరః' అని ప్రస్తుతింపబడుచున్నాడు. "యా నిశా సర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమి, యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతో మునేః" అని భగవద్వచనము. అనగా సంసారులకు ఏమియు తెలియకుండునది ఆత్మ. ఆత్మజ్ఞానులకు ఏమియు తెలియకుండునది సంసారము అని భావము.

శ్లో॥ అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాం వరః ।
విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణ కీర్తనః" ॥ ౧౧౧

శం. భా. :- క్రౌర్యంనామ మనోధర్మః ప్రకోపజః ఆన్తర స్సంతాపః సాభినివేశః. అవాప్త సమస్త కామత్వాత్. కామాభావా దేవ కోపాభావః, తస్మాత్ క్రౌర్య మస్య నాస్తీతి. అక్రూరః. కర్మణా మనసా వాచా వపుషా చ శోభనత్వాత్. పేశలః. ప్రవృద్ధః, శక్తః శీఘ్రకారీచ దక్షః. త్రయం చైతత్ పరస్మి న్నియతమితి, దక్షః. దక్షిణశబ్ద స్యాపి దక్ష ఏవార్థః పున రుక్తి దోషో నాస్తి శబ్దభేదాత్. అథవా దక్షతే-గచ్ఛతి, హినస్తీతివా, దక్షిణః 'దక్షగతి హింసనయోః' ఇతి ధాతుపాఠాత్. క్షమావతాం యోగి నాం చ, పృథివ్యాదీనాం భారధారకాణాం చ. శ్రేష్ఠ ఇతి. క్షమిణాం వరః. 'క్షమయా పృథివీసమః' ఇతి వాల్మీకి వచనాత్. బ్రహ్మాణ్డ మఖిలం వహన్ పృథివీవ భారేణ నార్దిత ఇతి పృథివ్యా అపి వరోవా. క్షమిణః శక్తాః. అయన్తు సర్వశక్తి మత్త్వాత్ సకలాః క్రియాః, కర్తుం, క్షమత ఇతి వా. క్షమిణాం వరః. నిరస్తాతిశయం జ్ఞానం సర్వదా సర్వగోచర మస్యాస్తీ

నేతరేషా మితి. విద్వత్తమః. వీతం విగతం భయం సాంసారికం సంసార లక్షణం వా అస్యేతి. వీతభయః. సర్వేశ్వరత్వా న్నిత్యముక్తత్వా చ్చ. పుణ్యం పుణ్యకరం. శ్రవణం కీర్తనం చాఽస్యేతి పుణ్యశ్రవణ కీర్తనః

శ్లో॥ 'య ఇదం శృణు యా న్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।
నాఽశుభం ప్రాప్నుయాత్కించి త్సోఽముత్రేహ చ మానవః' ॥

ఇతి శ్రవణాది ఫలవచనాత్.

౯౧౫. అక్రూరః-

శౌర్య మనునది మనోధర్మము ప్రకోపజన్యము. అభినివేశ - ఆగ్రహ - యుక్తము నయిన అంతర్గత సంతాపము. అవాప్త సర్వకాముడైన వానికి కామమే లేనందున క్రోధ మసంభవము. అందుచేత పరమాత్మ క్రౌర్యము లేనివాడు గాన 'అక్రూరః' యని స్తుతింప బడుచున్నాడు.

౯౧౬. పేశలః-

మనో, వాక్ కర్మ స్వరూపములు శోభనములై యొప్పువాడు గాన పరమాత్మ 'పేశలః' యను నామముచే ధ్యాతవ్యుడు.

౯౧౭. దక్షః-

వృద్ధి, శక్తి, శీఘ్రకారిత్వము - ఈమూడును తన యందు నియతముగా నొప్పువాడు గాన శ్రీహరి 'దక్షః'యను నామముచే సంకీర్తనీయుడు.

౯౧౮. దక్షిణః-

ఇదియు 'దక్ష' శబ్ద సమానార్థకమే శబ్ద భేదముచేత

పునరుక్తి దోషము లేదు. లేక 'దక్షగతి హింసనయోః' అను ధాతుపాఠమును బట్టి గతికలవాడు హింసించువాడును గాన పరమాత్మ 'దక్షిణః' శబ్దవాచ్యు డగుచున్నాడు.

౫౧౯. క్షమిణాంవరః-

క్షమాసీలురైన యోగులలోను, భారమును వహించు పృథివ్యాదులలోను శ్రేష్ఠుడు గాన పరమాత్మ 'క్షమిణాం వరః' యని భజింప బడుచున్నాడు. "క్షమయా పృథ్వీసమః" అను వాల్మీకి వచనము శ్రీహరి యొక్క క్షమాశీలిత్వమును చాటుచున్నది.

మరియు పృథ్వివలె అఖిల బ్రహ్మాండమును వహించుచు భారముచేత పీడ లేకున్నవాడు గాన పరమేశ్వరుడు పృథ్వికంటెను శ్రేష్ఠుడు అని చెప్పికోనగును. ఇంతేకాదు. క్షమాశీలురు శక్తికలవారు. ఈ పరమాత్మ సర్వశక్తులు కలవాడగుటచే సకలక్రియలను చేయుగల సామర్థ్యముచే నొప్పారును గాన 'క్షమిణాంవరః' అని చెప్పబడుచున్నాడు.

౫౨౦. విద్వత్తమః-

సర్వపదార్థ విషయకము నిరతిశయము ఇతరులకు లేనట్టిదియు నగు జ్ఞానము సర్వదా కలిగియున్నవాడు గాన పరమేశ్వరుడు 'విద్వత్తమః' యనుచు ధ్యాతవ్యు డగుచున్నాడు

౫౨౧. వీతభయః-

సర్వేశ్వరత్వము చేతను, నిత్య ముక్తత్వము చేతను సాంసారిక భయము, సంసారరూప భయము లేనివాడు గాన

'వీతభయః' అను నామము పరమాత్మయందు అన్వర్థము.

౯౨౨. పుణ్యశ్రవణ కీర్తనః-

పుణ్యకరమైన శ్రవణము కీర్తనము కలవాడు గాన శ్రీహరి 'పుణ్యశ్రవణకీర్తనః' యనుచు సంస్తుతింప బడు చున్నాడు. కనుకనే శ్రవణాది ఫల వచనములతో - 'దీనిని నిత్యము శ్రవణము చేసినవాడు, కీర్తించినవాడు ఇహ పరము లలో అశుభమును ఎంతమాత్రము పొందడు' అని చెప్పబడినది.

శ్లో॥ "ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః ।
వీరహా రక్షణ స్సన్తో జీవనః పర్యవస్థితః" ॥ ౧౧౨

శం. భా :- సంసార సాగరా దుత్తారయతీతి. తారణః. దుష్కృతీః పాపసంజ్ఞితా హన్తీతి. దుష్కృతిహా. యే పాపకారిణ స్తాన్ హన్తీతి వా. దుష్కృతిహా. స్మరణాది కుర్వతాం సర్వేషాం పుణ్యం కరోతీతి. సర్వేషాం శ్రుతిస్మృతి లక్షణయా వాచా పుణ్య మాచష్టే ఇతి వా పుణ్యః భావినోఽ నర్థస్య సూచకాన్ దుస్స్వప్నాన్ నాశయతి. ధ్యాతః స్తుతః. కీర్తితః. పూజిత శ్చేతి. దుస్స్వప్న నాశనః. వివిధా స్సంసారిణాం గతీః. ముక్తి ప్రదానేన హన్తీతి వీరహా. సత్త్వం గుణ మధిష్ఠాయ జగత్త్రయం రక్షన్. రక్షణః. సన్మార్గవర్తిత్వాత్ కర్తరిల్యుట్ః సన్మార్గ వర్తిన స్సన్తః. తద్రూపేణ విద్యావినయ వృద్ధయే స ఏవ వర్తతే ఇతి సన్తః. సర్వాః ప్రజాః ప్రాణరూపేణ జీవయన్. జీవనః. పరితః సర్వతో విశ్వం వ్యాప్యాఽ వస్థిత ఇతి పర్యవస్థితః.

౯౨౩. ఉత్తారణః-

సంసార సాగరము నుండి దాటించు వాడు గాన శ్రీహరి 'ఉత్తారణః' యని స్తుతింప బడుచున్నాడు.

౯౨౩. దుష్కృతిహా-

పాపములను, పాపులను నశింపచేయు వాడు గాన పరమాత్మ 'దుష్కృతిహా' శబ్దముచే ధ్యానింప బడుచున్నాడు.

౯౨౪. పుణ్యః-

పరమాత్మ స్మరణము చేయు వారందరికీ పుణ్యము కలిగించువాడు మరియు శ్రుతిస్మృతి రూపమైన తన వాక్కు చేత సర్వులకును పుణ్యము నుపదేశించు వాడు గనుకనే శ్రీ మహావిష్ణువు 'పుణ్యః' యను నామముచే సంకీర్తనము చేయ బడుచున్నాడు.

౯౨౫. దుస్స్వప్ననాశనః-

ధ్యానము చేయబడియు, స్తుతింపబడియు, కీర్తింప బడియు, పూజింపబడియు రాబోవు అనర్థములను సూచించు నట్టి దుస్స్వప్నములను నశింపచేయు వాడు గాన పరమాత్మ 'దుస్స్వప్ననాశనః' యనుచు సంస్తవనీయు డగుచున్నాడు.

౯౨౬. వీరహా -

సంసారులకు కలుగు వివిధ గతులను ముక్తి ప్రదానము చేత పోగొట్టువాడు గాన శ్రీహరి 'వీరహా' యని భక్తులచే ధ్యానింప బడుచున్నాడు.

౯౨౭. రక్షణః-

సత్త్వగుణ మాశ్రయించి జగత్త్రియమును రక్షించు నట్టి వాడు గాన 'రక్షణః' యను నామముచే స్తుతింప బడు చున్నాడు.

౯౨౯. సన్తః-

సన్మార్గవర్తులు 'సన్తః' యనబడుదురు. తద్రూపమున విద్యావినయాదుల అభివృద్ధి కొరకు ఆయనయే ఉన్నవాడు గాన పరమాత్మ 'సన్తః' యను నామముచే ప్రథితు డగుచున్నాడు.

౯౩౦. జీవనః-

సర్వప్రజలను ప్రాణరూపమున జీవింప చేయువాడు గనుక పరమాత్మ 'జీవనః' యను నామముచే విరాజిల్లును.

౯౩౧. పర్యవస్థితః-

విశ్వమంతటను వ్యాపించి యున్నవాడు గాన శ్రీమహా విష్ణువు 'పర్యవస్థితః' యని సంకీర్తింప బడుచున్నాడు.

శ్లో॥ "అనన్తరూపో ఽనన్తశ్రీ ర్జితమన్యు ర్భయాపహః ।
చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః ॥ ౧౦౩

శం. భా. :- అనన్తాని రూపా ణ్యస్య విశ్వప్రపంచ రూపేణ స్థిత స్యేతి, అనన్తరూపః అనన్తా అపరిమితా శ్రీః పరాశక్తి రస్యేతి, అనన్తశ్రీః. 'పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే' ఇతి శ్రుతేః మన్యుః క్రోధో జితో యేన సః, జితమన్యుః భయం సంసారజం పుంసా మపఘ్నన్, భయాపహః న్యాయ సమవేతః, చతురశ్రః. పుంసాం కర్మానురూపం ఫలం ప్రయచ్ఛతేతి. ఆత్మా స్వరూపం చిత్తంవా. గభీరం పరిచ్ఛేత్తు మశక్య మస్యేతి గభీరాత్మా. వివిధాని ఫలాని అధికారిభ్యో విశేషేణ దిశతీతి విదిశః. వివిధా మాజ్ఞాం శక్రాదీనాం కుర్వన్ వ్యాదిశః. సమస్తానాం కర్మణాం ఫలాని దిశన్ వేదాత్మనా దిశః.

౩౩౨. అనన్తరూపః-

సకల ప్రపంచరూపమున నుండుటంజేసి అనంతరూప ధారియగుటచే శ్రీహరి 'అనంతరూపః' యని స్తవము చేయ బడును.

౩౩౩. అనన్తశ్రీః-

అపరిమితమయిన పరాశక్తి కలవాడు గాన పరమాత్మ 'అనంతశ్రీః' యను నామమున బరగును, 'పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే' యను శ్రుతి పరమాత్మయొక్క అనంత శ్రీత్వమును వ్యక్తము చేయుచున్నది.

౩౩౪. జితమన్యుః-

జయింపబడిన క్రోధము కలవా డగుటచే పరమేశ్వరుడు 'జితమన్యుః' యను నామముచే సంకీర్తింప బడును.

౩౩౫. భయాపహః-

లోకులకు సంసార సంభవమగు భయమును పోగొట్టువా డగుటచేత శ్రీ మహావిష్ణువు 'భయాపహః' శబ్ద వాచ్యు డగు చున్నాడు.

౩౩౬. చతురశ్రః-

'చతురశ్రః' యనగా న్యాయసమవేతు డని యర్థము. పరమాత్మ, కర్మానురూపమయిన ఫలము నొసంగుచు న్యాయము ననుసరించు నట్టివాడు గావున, 'చతురశ్రః' యను నామముచే ఖ్యాతవ్యుడు.

౯౩౭. గభీరాత్మా-

ఇట్టిదని తెలిసికొనరాని శక్తియు కాన్పట్టి స్వరూపము- చిత్తము-కలవాడు గాన, పరమేశ్వరుడు 'గభీరాత్మా' యను సార్థక నామమున విరాజిల్లుచుండును.

౯౩౮. విదిశః-

వివిధఫలములను ఆయా అధికారులకు విశేషించి యిచ్చువాడు కాన శ్రీహరి 'విదిశః' యనుచు స్తుతింపబడును.

౯౩౯. వ్యాదిశః-

శ్రీహరి, ఇంద్రాదులకు వివిధము లయిన యాజ్ఞల నిచ్చువాడు గనుక 'వ్యాదిశః' యనుచు భజింప బడుచున్నాడు.

౯౪౦ దిశః-

సమస్త కర్మఫలములను వేదరూపమున నిచ్చునట్టివాడు గావున పరమాత్ముడు 'దిశః' యను నామ మన్వర్థము.

శ్లో॥ "అనాదిః భూర్భువో లక్ష్మీ స్సువీరో రుచిరాంగదః ।
జననో జనజన్మాది ర్భీమో భీమపరాక్రమః" ॥ ౧౦౪

శం. భా :- ఆదిః కారణ మస్య న విద్యత ఇతి. అనాదిః. సర్వకారణత్వాత్ భూర్భువః. భూః ఆధారః. భువః సర్వభూతాశ్రయత్వేన ప్రసిద్ధాయా భూమ్యాః భువోపి భూరితి, భూర్భువః. అథవా. న కేవలమసౌ భూః, భువః లక్ష్మీః శోభా వేతి. భువో లక్ష్మీః అథవా, భూః భూర్లోకః భువః భువర్లోకః లక్ష్మీః ఆత్మవిద్యా. 'ఆత్మవిద్యా చ దేవి త్వమ్' ఇతి శ్రీస్తుతౌ భూమ్యస్త్రివిష్టపో శోభేతి వా, భూర్భువో లక్ష్మీః. సువీరః - శోభనా వివిధా

ఈరాగతయో యస్య సః సువీరః. రుచిరే కల్యాణే అంగదేఽస్యేతి రుచిరాంగదః. జన్తూన్ జనయన్ శోభనం వివిధమ్ ఈర్తే ఇతి వా. సువీరః. జననః 'ల్యుడ్విధౌ బహుల గ్రహణాత్ కర్తరి ల్యుట్ ప్రత్యయః. ప్రయోగ వచనాదివత్. జనస్య జనిమతో జన్మ ఉద్భవః. తస్యాదిః మూలకారణ మితి. జనజన్మాదిః. భయహేతుత్వాత్. భీమః 'భీమాదయోఽపాదానే' ఇతి నిపాతనాత్. 'మహద్భయం వజ్రముద్యతమ్' ఇతి శ్రుతేః. అసురాదీనాం భయహేతుః పరాక్రమోఽస్యావతారేష్వితి. భీమపరాక్రమః.

౯౮౧ అనాదిః-

'ఆదిః' అనగా కారణము. పరమాత్మ సర్వకారణ మగుటచేత, తనకు కారణము లేనట్టివాడు గాన 'అనాదిః' అను సార్థక నామమునే సంకీర్తనీయుడు.

౯౮౨. భూర్భువః,- ౯౮౩. లక్ష్మీః-

భువః = సర్వభూతాశ్రయముగ ప్రసిద్ధమయిన భూమికి గూడ భూః = ఆధారముగ నున్నవాడు, కాన పరమాత్మ 'భూర్భువః' యను నామముచే భజనీయుడగుచున్నాడు.

మరియు, 'భువః' యనగా లక్ష్మి యనియు చెప్పికొన నగును. ఆ పరమాత్మ కేవలము భూమికి ఆధారము మాత్రమే గాక ఆ భూమి 'లక్ష్మీః' - శోభగూడ నయి యున్నవా డగుటచేతను 'భూర్భువః' యను నామము ఆ పరమాత్మయం దన్వర్థము. 'భువో లక్ష్మీః' యనియు చెప్పబడును.

ఇంతేకాదు. భూః - భూర్లోకము. భువః - భువర్లోకము, లక్ష్మీః - ఆత్మవిద్య, కనుకనే శ్రీస్తుతిలో 'ఆత్మవిద్యా చ

దేవిత్వమ్' అని చెప్పబడినది. కాన, భూర్భువోలక్ష్మీః - భూర్లోక - భువర్లోక - ఆత్మవిద్యా - స్వరూపుడు, భూమ్యంత రిక్షములకు శోభయై నొప్పు నట్టివాడును గాన పై నామముచే ధ్యానింప బడుచున్నాడు.

౯౨౭. సువీరః-

శోభనములగు వివిధములగు 'ఈర'-గతులు కలవాడు, శోభనము, వివిధము నగు కంపనము - స్ఫురణము - కలవాడగుటవలన శ్రీహరి 'సువీర' శబ్దవాచ్యుడు.

౯౨౮. రుచిరాంగదః-

రుచిరములైన అంగదములను అలంకారములుగ కలవాడు గాన శ్రీమహావిష్ణువు 'రుచిరాంగదః' యను నామముచే స్తోతవ్యు డగుచున్నాడు.

౯౨౯. జననః-

జంతువులను (ప్రాణులను) జనింపజేయునట్టి వాడు గాన పరమాత్మ 'జననః' యను సార్థక నామమున బరగుచుండును. ఇట 'జన' ధాతువునకు 'ల్యుట్' ప్రత్యయము కర్త్రర్థక మని తెలియనగును.

౯౩౦. జనజన్మాదిః-

జన్మించువారి జన్మకు మూలకారణ మయిన వాడు గాన శ్రీహరి 'జనజన్మాదిః' యని ధ్యానింప బడుచుండును.

౯౩౧. భీమః-

భయహేతు వయినవాడు గాన పరమేశ్వరుడు 'భీమ'

శబ్దాభిధానమున విరాజిల్లుచున్నాడు 'మహద్భయం వజ్ర ముద్యతమ్' అనుచు శ్రుతి పరమాత్మయొక్క భీమత్వమును ప్రతిపాదించుచున్నది.

౫౮౯. భీమపరాక్రమః-

అవతారసమయమున అసురాదులకు భయహేతు వయిన పరాక్రమము గలవాడు గాన శ్రీమహావిష్ణువు 'భీమ పరాక్రమః' యని స్తుతింప బడుచున్నాడు.

శ్లో॥ ఆధారనిలయో ఽధాతా పుష్పహాసః ప్రజాగరః ।
ఊర్ధ్వగ స్సత్పథా చారః ప్రాణదః ప్రణవః పణః" ॥

శం. భా. :- పృథివ్యాదీనాం పంచభూతానా మాధారాణా మాధారత్వాత్, ఆధార నిలయః. స్వాత్మనా ధృతస్యాఽస్య అన్యో ధాతా నాస్తీతి. అధాతా. 'నద్యృతశ్చ' ఇతి సమాసాన్త విధ ్రనిత్యః. ఇతి కప్రత్యయాఽభావః. సంహారసమయే సర్వాః ప్రజాః ధయతి, పిబతీతివా, ధాతా. 'ధేట్ పానే' ఇతి ధాతుః. ముకులాత్మనా స్థితానాం పుష్పాణాం హాసవత్. ప్రపంచ రూపేణ వికాసోఽస్యేతి, పుష్పహాసః. నిత్యప్రబుద్ధ స్వరూపత్వాత్ ప్రకర్షేణ జాగర్తీతి. ప్రజాగరః. సర్వేషా ముపరితిష్ఠన్, ఊర్ధ్వగః. సతాం కర్మాణి సత్పథాః, తా నాచరత్యేష ఇతి. సత్పథాచారః, మృతాన్ పరిక్షి త్ప్రభృతీన్ జీవయన్. ప్రాణదః, ప్రణవోనామ పరమాత్మనో వాచక ఓంకారః తద భేదోపచారేణాఽయం ప్రణవః పణతి వ్యవహారార్థః తం కుర్వన్, పణః. 'సర్వాణి రూపాణి విచిత్యధీరో నామాని కృత్వాఽభివదన్ యదాస్తే' ఇతి శ్రుతేః పుణ్యాని సర్వాణి కర్మాణి పణం సంగృహ్య అధికారిభ్య స్తత్ఫలం ప్రయచ్ఛతీతి వా, లక్షణయా పణః.

౯౫౦. ఆధారనిలయః-

నిఖిల జగమున కాధారభూతము లయిన పంచభూతము లకు నాధారమై వెల్గొందుచుండువాడు గావున శ్రీహరి 'ఆధారనిలయః' యనుచు స్తవము చేయబడుచున్నాడు.

౯౫౧. ఆధాతా (ధాతా)-

స్వస్వరూపముచేతనే ధరింపబడిన వాడగుటచేత, ఆ పరమాత్మను ధరించెడిది అన్య మేదియు లేనట్టివాడు గనుక శ్రీమహావిష్ణువు 'అధాతా' యని భక్తులచే ధ్యానింప బడుచున్నాడు, మరియు, 'ధాతా' యని పదచ్ఛేదము చేసినచో, సంహార సమయమున సర్వప్రజలను పానము చేయువాడని చెప్పికొనవగును. 'ధాతా' యందలి 'ధా' ధాతువు పానార్థకముగ గుర్తింపనగును.

౯౫౨. పుష్పహాసః-

మొగ్గగానున్న పుష్పములకు వికాసమువలె ప్రపంచ రూపమున వికాసము గలవాడు. గాన, పరమాత్మ 'పుష్పహాసః' యను నామముచే స్తోతవ్యు డగుచున్నాడు.

౯౫౩. ప్రజాగరః-

నిత్యప్రబుద్ధ స్వరూపు డగుటచేత పరమాత్మ ప్రకృష్టమైన జాగృతి కలవాడు గాన 'ప్రజాగరః' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు

౯౫౪. ఊర్ధ్వగః-

సర్వులకును మీద నున్నవాడు కనుక 'ఊర్ధ్వగః' యను శబ్దముచే చెప్పబడును.

౯౨౭. సత్పథాచారః-

సత్పురుషుల కర్మల నాచరించు వాడు గావున శ్రీహరి 'సత్పథాచారః' అను నామమున బరగును.

౯౨౮. ప్రాణదః-

మృతులయిన పరీక్షి త్ప్రభృతులను జీవింపజేసినవాడు గావున శ్రీహరి 'ప్రాణదః' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు.

౯౨౯. ప్రణవః-

ప్రణవ మనగా పరమాత్మవాచక మగు ఓంకారము. అట్టి ప్రణవముతో అభేదవివక్షచే పరమేశ్వరుడు 'ప్రణవ' శబ్ద వ్యపదేశ్యు డగుచున్నాడు.

౯౩౦. పణః-

'పణ' ధాతువు వ్యవహారార్థకము కాన, నామరూపాది వ్యవహారము చేయు వాడగుటచే పరమాత్మ 'పణ' శబ్దవాచ్యు డగుచున్నాడు. ఈ విషయమునే 'సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వాఽభివదన్ యదాస్తే' యనుచు శ్రుతి యుద్ఘోషించుచున్నది.

మరియు, సకల పుణ్యకర్మలను తాను పణముగ స్వీకరించి ఆ యా అధికారులకు తత్ఫలముల నిచ్చువాడు కనుక 'పణ' శబ్దము లక్షణచేత పరమాత్మ చెప్పబడును.

శ్లో॥ ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ ప్రాణజీవనః ।
తత్త్వం తత్త్వవి దేకాత్మా జన్మమృత్యుజరాతిగః ॥

శం. భా. :- ప్రమితిః సంవిత్ స్వయంప్రమా. ప్రమాణామ్-'ప్రజ్ఞానం బ్రహ్మ' ఇతి శ్రుతేః.

శ్లో॥ 'జ్ఞానస్వరూప మత్యన్తం నిర్మలం పరమార్థతః ।
తమేవా ఽర్థస్వరూపేణ భ్రాన్తిదర్శనతః స్థితమ్' ॥

ఇతి విష్ణు పురాణే ॥

ప్రాణనిలయః - ప్రాణా ఇన్ద్రియాణి యత్ర జీవే నిలీయన్తే. తత్పరతన్త్రత్వాత్. దేహస్య ధారకాః ప్రాణాపానాదయో వా తస్మిన్నిలీయన్తే. ప్రాణితీతి ప్రాణో జీవః, పరే పుంసి నిలీయత ఇతి వా. ప్రాణాన్ జీవాంశ్చ సంహరన్నితివా. ప్రాణనిలయః. పోషయ న్నన్నరూపేణ ప్రాణాన్. ప్రాణభృత్. ప్రాణినో జీవయన్ ప్రాణాఖ్యైః పవనైః. ప్రాణజీవనః

శ్లో॥ 'నప్రాణేన నాపానేన మర్త్యో జీవతికశ్చన ।
ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతా వుపాశ్రితౌ' ఇతి మన్త్రవర్ణాత్.

తత్త్వం, తథ్య మమృతం. సత్యం. పరమార్థతః. సతత్త్వ. మిత్యేతే ఏకార్థవాచినః. పరమార్థ సతో బ్రహ్మణః వాచకా శ్శబ్దాః. తత్త్వం స్వరూపం యథావత్ వేత్తీతి. తత్త్వవిత్. ఏకశ్చాసౌ వాత్మాచేతి. ఏకాత్మా- 'ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్' ఇతిశ్రుతేః.

శ్లో॥ 'యచ్చాప్నోతి యదా దత్తే యచ్చాత్తి విషయా నిహ।
యచ్చాస్య సన్తతో భావ స్తస్మా దాత్మేతి గీయతే'॥

ఇతి స్మృతేశ్చ.

జాయతే. అస్తి. వర్ధతే. విపరిణమతే. అపక్షీయతే. నశ్యతి. ఇతి షడ్భావ వికారా నతీత్యగచ్ఛతీతి. జన్మమృత్యు జరాతిగః. 'న జాయతే మ్రియతే వా విపశ్చిత్' ఇతి మన్త్రవర్ణాత్.

౯౫౯. ప్రమాణమ్-

'ప్రజ్ఞానం బ్రహ్మ' అను శ్రుతి వచనానుసారము 'ప్రమితి' యనబడు స్వయం ప్రమాత్మకమై యొప్పువాడు గాన శ్రీహరి 'ప్రమాణమ్' యను నామముచే స్తుతింప బడును. 'జ్ఞానస్వరూప మత్యన్త నిర్మలం'- అను శ్లోకమున 'పరమాత్మ; పరమార్థతః అత్యంత నిర్మలమయిన జ్ఞాన స్వరూప మయి యుండి భ్రాంత దృష్టికి పదార్థరూపమున నుండె' నని విష్ణుపురాణము చెప్పుచున్నది.

౯౬౦. ప్రాణనిలయః-

ప్రాణములు-ఇంద్రియములు-ఏ జీవాత్మయందు లీన మగుచుండునో, త త్పరతంత్రము లగుటచే దేహాధారకములగు ప్రాణాపానాదులును ఎక్కడ ఎక్కడ విలీన మగుచుండునో అట్టి జీవాత్మ (పరమాత్మ) 'ప్రాణనిలయః' యనుచు స్తోతవ్యు డగుచున్నాడు. 'ప్రాణ' శబ్దము 'ప్రాణితీతి ప్రాణః' అను వ్యుత్పత్తి ననుసరించి జీవవాచకము. అట్టి జీవుడును ఎక్కడ లీన మగుచుండునో, ప్రాణములను - జీవులను - సంహరించు వాడగుచుండెనో అట్టి స్వరూపము 'ప్రాణనిలయ' శబ్ద వ్యప దేశ్యము.

౯౬౧ ప్రాణభృత్-

అన్నరూపమున ప్రాణములను పోషించు చుండును గాన పరమాత్మ 'ప్రాణభృత్' యని ధ్యానింప బడుచున్నాడు.

౯౬౨. ప్రాణజీవనః-

ప్రాణులను ప్రాణవాయువుచే జీవింపజేయు వాడు

గాన శ్రీమహావిష్ణువు 'ప్రాణజీవనః' యను సార్థకనామముచేత విరాజిల్లుచుండును. 'న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన' - అను మంత్రవర్ణము 'మర్త్యుడెవ్వడును కేవలము ప్రాణాపానములచేత నే జీవించుటలేదు; ఈ ప్రాణాపానములు ఎవని యందు ఆశ్రయించి యున్నవో ఆ పరమేశ్వరునిచేత జీవించుచుండె'నని చెప్పుచున్నది.

౮౬౩ తత్త్వమ్-

తథ్య మమృతం సత్యం పరమార్థః సత్త్వమ్ - అను నవి ఏకార్థవాచకములు. పరమార్థ సత్త్వమయిన బ్రహ్మను బోధించును గాన 'తత్త్వమ్' శబ్దముచే పరబ్రహ్మమే వాచ్యుడగుచున్నాడు.

౮౬౪. తత్త్వవిత్ -

స్వరూపమును యథార్థముగ తెలిసినవాడు గాన పరమేశ్వరుడు 'తత్త్వవిత్' యనుచు స్తవనము చేయబడుచుండును.

౮౬౫. ఏకాత్మా -

'ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్' - అను శ్రుతి వచనము ననుసరించి ఏకమై యున్నట్టి ఆత్మ గాన పరమాత్మ యందు 'ఏకాత్మ' యను నామము సార్థకము. 'యచ్చాప్నోతి యదాదత్తే' యను స్మృతి వచనముగూడ 'విషయములను పొందువాడు, స్వీకరించువాడు, భక్షించువాడు, సదా వర్తమానుడు అగుటచేత ఆత్మ యనబడుచుండె'నని చెప్పుచున్నది.

౯౬౬. జన్మమృత్యుజరాతిగః–

'న జాయతే మ్రియతే వా విపశ్చిత్'- అను మంత్ర వర్ణానుసారము జన్మమొదలు మరణాంతము గల షడ్భావ వికారములకు (జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, నశ్యతి) అతీతుడై యున్న వాడుగాన పరమేశ్వరుడు 'జన్మమృత్యు జరాతిగః' యను సార్థకనామమున విరాజిల్లు చుండును.

శ్లో॥ "భూర్భువ స్స్వ స్తరు స్తార స్సవితా ప్రపితామహః ।
యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః" ॥

శం. భా. :- భూర్భువస్స్వ స్సమాఖ్యాని త్రీణివ్యాహృతి రూపాణి శుక్రాణి త్రయీ సారాణి బిభ్రాణా ఆహుః త్రైలోక్యమానా జగత్త్రయం తరతి, ప్లవతేవేతి. భూర్భువస్స్వ స్తరుః 'అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్య గాదిత్య ముపతిష్ఠతే ఆదిత్యా జ్జాయతే వృష్టిః వృష్టే రన్నం తతః ప్రజాః' ఇతి మనువచనాత్. అథవా. భూర్భువస్స్వ స్సమాఖ్య లోకత్రయ సంసార వృక్షో భూర్భువ స్స్వ స్తరుః భూర్భువ స్స్వరాఖ్యం లోకత్రయం వృక్ష వత్ వ్యాప్య తిష్ఠతీతివా. భూర్భువ స్స్వ స్తరుః సంసార సాగరం తారయన్, తారః. ప్రణవోవా. సర్వస్య లోకస్య జనక ఇతి. సవితా పితామహస్య బ్రహ్మణో పి పితేతి. ప్రపితామహః యజ్ఞాత్మనా, యజ్ఞః. యజ్ఞానాం పాతా, స్వామీవా, యజ్ఞపతిః 'అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవచ' ఇతి భగవద్వచనాత్ యజమానాత్మనా తిష్ఠన్ యజ్వా. యజ్ఞా అంగాన్యస్యేతి వరాహమూర్తిః, యజ్ఞాంగః.

శ్లో॥ 'వేదపాదో యూపదంష్ట్రః క్రతుహస్త శ్చితీముఖః ।
అగ్నిజిహ్వో దర్భరోమా బ్రహ్మశీర్షో మహాతపాః ॥

శ్లో॥ అహో రాత్రే క్షణో దివ్యో వేదాంగ శ్రుతిభూషణః ।
ఆజ్యనాస స్స్రువతుండ సామఘోష స్వనో మహాన్ ॥

శ్లో॥ ధర్మసత్య మయ శ్శ్రీమాన్ క్రమ విక్రమ సత్క్రియః ।
ప్రాయశ్చిత్త నఖో ఘోరః పశుజాను ర్మహాభుజః ॥

శ్లో॥ ఉద్గాత్రన్త్రో హోమలింగో బీజౌషధి మహాఫలః ।
వాయ్వన్తరాత్మా మన్త్రస్ఫిక్ విక్రమ స్సోమశోణితః ॥

శ్లో॥ వేదిస్కన్ధో హవి రన్ధో హవ్యకవ్యాతి వేగవాన్ ।
ప్రాగ్వంశ కాయో ద్యుతిమా న్నానా దీక్షాభి రర్చితః ॥

శ్లో॥ దక్షిణా హృదయో యోగీ మహాసత్ర మయో మహాన్ ।
ఉపాకర్మోష్ఠ రుచకః ప్రవర్గ్యా వర్తభూషణః ॥

శ్లో॥ నానాచ్ఛన్దో గతిపథో గుహ్యోప నిషదాసనః ।
ఛాయా పత్నీ సహాయోవై మేరుశృంగ ఇవోచ్ఛ్రితః ॥

ఇతి హరివంశే.

పరిహేతు భూతాన్ యజ్ఞాన్ వా హయతీతి యజ్ఞవాహనః.

౯౬౭. భూర్భువస్స్వ స్తరుః-

భూః, భువః, సువః - అను వ్యాహృతులు మూడును త్రయీ (వేద) సారము లని చెప్పబడుటచేత ఆ వ్యాహృతు లచే చేసిన హోమాదికములవలన జగత్త్రియము తరించును - ఉద్ధరింపబడును. జగత్త్రియమును తరింపజేయు వ్యాహృతి రూపమున నొప్పువాడు గాన పరమాత్మ 'భూర్భువస్స్వస్తరుః' యని భక్తగణముచే భజింపబడుచుండును. 'అగ్నౌ ప్రాస్తా హుతి స్సమ్య గాదిత్య ముపతిష్ఠతే'- అను మనుస్మృతివచ

నము- 'అగ్నియందు వేయబడు నాహుతు లాదిత్యుని ప్రక్షిప్తమగు ఆహుతి ఆదిత్యుని పొందును; ఆదిత్యుని వలన వర్షము కురియును; వృష్టి వలన అన్నము కలుగును; అన్నము వలన ప్రజలు కలుగుదురు' అని చెప్పుచున్నది

ఇంతేకాదు. భూర్భువ స్స్వర్లోక రూపములు సంసార వృక్షరూపమై యున్నవాడు, భూర్భువస్స్వర్నామక మగు లోకత్రయమును వృక్షమువలె వ్యాపించి యున్నవాడు నగుటచే 'భూర్భువ స్స్వస్తరుః' అను నామమున పరమేశ్వరుడు ప్రసిద్ధుడు.

౯౬౮. తారః-

సంసార సాగరమును తరింపజేయు వాడు, ప్రణవ స్వరూపుడై యున్నవాడు నగుటచే పరమేశ్వరుడు 'తారః' యను నామమునచే స్తవనీయుడు.

౯౬౯. సవితా -

సర్వలోకజనకుడు గాన శ్రీహరి 'సవితా' యని ధ్యానింపబడుచున్నాడు.

౯౭౦. ప్రపితామహః-

పితామహుడైన బ్రహ్మకును పితయైన వాడు గాన 'ప్రపితామహః' యని సంకీర్తింప బడుచున్నాడు.

౯౭౧. యజ్ఞః-

యజ్ఞాత్మకు డగుటచే పరమేశ్వరుడు 'యజ్ఞ' శబ్ద వాచ్యు డగుచున్నాడు.

ప్రధానము - అయినవాడు గాన 'యజ్ఞీ' యను నామమున వ్యవహరింపబడును.

౯౭౯. యజ్ఞభుక్ -

యజ్ఞము ననుభవించువాడు, పాలించువాడు నగుటచే పరమేశ్వరుడు 'యజ్ఞభుక్' యని ధ్యానింపబడును.

౯౮౦. యజ్ఞసాధనః -

తన ప్రాప్తికి యజ్ఞములు సాధనములుగ గలవాడు గాన 'యజ్ఞసాధనః' యనుచు పరమాత్మ సంస్తుతింప బడుచుండును.

౯౮౧. యజ్ఞాన్తకృత్ -

యజ్ఞము యొక్క అంతమును-ఫలప్రాప్తిని-కలిగించువాడు, లేక విష్ణుదేవతాక ఋఙ్మంత్రము కీర్తనముతో కూడిన పూర్ణాహుతితో యజ్ఞము గావించి యజ్ఞసమాప్తిని చేయువాడు కనుక శ్రీహరి 'యజ్ఞాంతకృత్' యను నామముతో భజనీయుడగుచుండును.

౯౮౨. యజ్ఞగుహ్యమ్-

యజ్ఞములలో గుహ్యమైనది జ్ఞానయజ్ఞము. లేక ఫలాపేక్షారహితమైన యజ్ఞము. అట్టి యజ్ఞముతో నభేదవివక్షచే బ్రహ్మ (పరమాత్మ) 'యజ్ఞగుహ్య' మనబడును.

౯౮౩. అన్నమ్-

భూతములచే తినబడునది, భూతములను తినునదియు

'అన్న' మనబడును కాన, పరబ్రహ్మ 'అన్న' శబ్దముచే ప్రతిపాదితుడగును.

౯౦౮. అన్నాదః-

అన్నమును తినునట్టివాడుగాన, పరమాత్మ 'అన్నాద' యని చెప్పబడును. సకలజగత్తు అన్నాద - అన్న - రూపమున భోక్తృ - భోగ్య రూపమే యని తెలుపుటకు 'ఏవ' శబ్ద ముపయోగింపబడినది. అటులనే, 'చ' శబ్దము, భగవన్నామముల కన్నిటికిని ఒక్క పరమాత్మయందే 'సముచ్చిత్యన్వ' యని తెలియజేయుటకు ప్రయోగింప బడినదని తెలియనగు

శ్లో॥ "ఆత్మయోనిః స్వయంజాతో వైఖానః సామగాయనః
దేవకీ నన్దనః స్రష్టా క్షితీశః పాపనాశనః" ॥ ౧౯

శం. భా. :- ఆత్మైవ యోని రుపాదాన కారణం నాన్యదితి. ... యోనిః. నిమిత్త కారణమపి స ఏవేతి దర్శయితుం స్వయంజాతః. 'ప్రకృతి శ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తానురోధాత్' ఇత్యత్ర స్థాపిత ముభయోః ... త్వం హరేః విశేషేణ ఖననాత్ వైఖానః. ధరణీం విశేషేణ ఖ... పాతాలవాసినం హిరణ్యాక్షం వారాహం రూప మాస్థాయ జఘానేతి పు... ప్రసిద్ధమ్. సామాని గాయతీతి, సామగాయనః. దేవక్యాః పుత్రో. నందనః.

శ్లో॥ జ్యోతీంషి శుక్రాణి చ యాని లోకే
త్రయోలోకా లోకపాలా స్త్రయీ చ ।
త్రయోఽగ్నయ శ్చాహుతయ శ్చ పంచ
సర్వదేవా దేవకీ పుత్రఏవ ॥ ఇతి మహాభారతే.

౯౮౮. సామగాయనః-

సామములను గానము చేయువాడు గావున 'సామగాయనః' యని భక్తులచే ప్రార్థింప బడుచుండును.

౯౮౯. దేవకీనందనః-

దేవకీపుత్రుడు గాన శ్రీహరి 'దేవకీనందనః' యను నామమున బరగును. 'లోకములోని జ్యోతిస్సులు, త్రిలోకములు, లోకపాలకులు, వేదత్రయము, అగ్నిత్రయము, పంచాహుతులు, సర్వదేవతలు-ఈ సర్వము దేవకీపుత్రుడే' యని మహాభారతవచనము తెలియుచున్నది.

౯౯౦ స్రష్టా-

పరమాత్మ, సర్వలోక స్రష్టయైనవాడు గాన, 'స్రష్టా' యను నామమున వెలుగొందు చున్నాడు.

౯౯౧. క్షితీశః-

శ్రీహరి సమస్తభూమికి ఈశుడు గావున, 'క్షితీశః' నామమున బరగుచున్నాడు. దశరథాత్మజుడైన శ్రీరామచంద్రమూర్తియు 'క్షితీశ' శబ్దముచే సూచితము.

౯౯౨. పాపనాశనః-

కీర్తింపబడి, పూజింపబడి, ధ్యానింపబడి, స్మరింపబడి భక్తుల పాపరాశిని నశింపజేయువాడు గాన శ్రీహరి 'పాపనాశనః' యను సార్థకనామముతో విలసిల్లు చున్నవాడు. 'ఒక పక్షముపవాసము చేయుటతో నశించునట్టి మానవుని పాపము ప్రాణాయామశతముతో నంతరించును. ప్రాణాయామ సహస్ర

ముత్తో నంతరించు పాపము క్షణమాత్రము శ్రీహరి ధ్యానమను చేత నశించు' నని వృద్ధశాతాతపవచనము వలన తెలియు చున్నది.

శ్లో॥ "శంఖభృ న్నన్దకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః।
రథాంగపాణి రక్షోభ్య స్సర్వప్రహరణాయుధః" ౧౨౦
సర్వప్రహరణాయుధోం నమః ॥

శం. భా :- పాంచజన్యాఖ్యం భూతా ద్యహంకారాత్మకం శంఖం బిభ్రత్ శంఖభృత్. విద్యామయో నన్దకాఖ్యో ఽసి రస్యేతి. నన్దకీ. మన స్తత్త్వాత్మకం సుదర్శనాఖ్యం చక్ర మస్యా స్తీతి. సంసార చక్రమస్యాజ్ఞయా పరివర్తత ఇతివా. చక్రీ. ఇన్ద్రియా ద్యహంకారాత్మకం శార్ఙ్గం నామ ధను రస్యా స్తీతి. శార్ఙ్గధన్వా. 'ధనుషశ్చ' ఇతి అనఙ్ సమాసాన్తః. బుద్ధితత్త్వా త్మికాం కౌమోదకీం నామ గదాం వహన్. గదాధరః. రథాంగం చక్ర మస్య పాణౌ స్థిత మితి రథాంగపాణిః. అతఏవ అక్షోభ్య ఇతి. అక్షోభ్యః కేవల మేతాన్యాయుధా న్యస్యేతి ననియమ్యతే. అపితు సర్వా ణ్యేవ ప్రహరణా న్యాయుధా న్యస్యేతి. సర్వప్రహరణాయుధః. ఆయుధ త్వేనాఽప్రసిద్ధా న్యపి కరజాదీ న్యస్యాయుధాని భవ న్తీతి. అన్తే సర్వప్రహ రణా యుధ ఇతి వచనం. సత్యసంకల్పత్వేన సర్వేశ్వరత్వం దర్శయితుమ్. 'ఏష సర్వేశ్వరః' ఇతి శ్రుతేః. ద్వి ర్వచనం సమాప్తిం ద్యోతయతి. ఓంకారశ్చ మంగలార్థః.

శ్లో॥ 'ఓంకారశ్చాఽథశబ్దశ్చ ద్వా వేతౌ బ్రహ్మణః పురా।
కంఠం భిత్త్వా వినిర్యాతౌ తస్మా న్మాంగలికా వుభౌ' ॥
ఇతి వచనాత్.

'ధన్యం తదేవలగ్నం తన్నక్షత్రం తదేవ పుణ్య మహః. కరణవ్యర పా సిద్ధిః యత్ర హరిః ప్రాణ్యమస్క్రియతే' ఇతిచ. ప్రాగిత్యవంకణమ్. అత్రాపి నమస్కారస్య శ్రైష్ఠ్యాత్. నమస్కారఫలం ప్రాగేవ దర్శితమ్.

శ్లో॥ 'ఏకో పి కృష్ణస్య కృతః ప్రణామః
దశాశ్వమేధా వభృథేన తుల్యః ।
దశాశ్వమేధీ పునరేతి జన్మ
కృష్ణప్రణామీ న పునర్భవాయ ॥

శ్లో॥ 'అతసీ పుష్ప సంకాశం పీతవాసస మచ్యుతమ్ ।
యే నమస్యన్తి గోవిన్దం నతేషాం విద్యతే భయమ్' ॥

శ్లో॥ 'లోకత్రయాధిపతి మప్రతిమ ప్రభావమ్
ఈష త్ప్రణమ్య శిరసా ప్రభవిష్ణు మీశమ్ ।
జన్మాన్తర ప్రలయకల్ప సహస్రజాత
మాశు ప్రశాన్తి ముపయాతి నరస్య పాపమ్' ॥

౯౯3. శంఖభృత్ -

భూతాదుల యొక్క అహంకారాత్మకమయిన పాంచ జన్య మనునట్టి శంఖమును ధరించి యున్నవాడు గాన, పరమే శ్వరుడు 'శంఖభృత్' అను సార్థకనామమున విఖ్యాతుడగు చుండును.

౯౯౪. నన్దకీ-

విద్యామయ మయిన 'నన్దక' మను ఖడ్గమును ధరించిన వాడు గాన, శ్రీహరి 'నన్దకీ' యని చెప్పబడును.

౯౯౫. చక్రీ -

శ్రీహరి, మన స్తత్త్వాత్మక మయిన 'సుదర్శన' మను చక్రము గలవాడు మరియు తన యాజ్ఞచే పరివర్తనము నొందు నట్టి సంసారచక్రము గలవాడు గనుకనే 'చక్రీ' యను నామముచే ధ్యాతవ్యు డగుచున్నాడు.

౯౯౬. శార్ఙ్గధన్వా -

ఇంద్రియాద్యహంకారాత్మక మయిన 'శార్ఙ్గ' మను ధనస్సు కలవాడు గాన 'శార్ఙ్గధన్వా' యను నామముచే శ్రీహరి స్తోతవ్యుడు.

౯౯౭. గదాధరః-

బుద్ధి తత్త్వాత్మక మయిన 'కౌమోదకీ' యను గదను ధరించినవాడు గాన పరమాత్మ 'గదాధర' నామమున ప్రసిద్ధుడు.

౯౯౮. రథాంగపాణిః-

రథాంగము - చక్రము - హస్తమున గలవాడు గాన 'రథాంగపాణిః' యను నామముచే శ్రీహరి సంకీర్తింప బడుచున్నాడు.

౯౯౯. అక్షోభ్యః-

క్షోభింపజేయు శక్యము కానట్టి వాడు కనుక "అక్షోభ్యః" యను నామము పరమేశ్వరునియందు ప్రసిద్ధము.

౧౦౦౦. సర్వప్రహరణాయుధః-

భగవంతుని ఆయుధములు అసంఖ్యాకములు. ఇన్ని అ నియమము లేక ప్రహరణమునకు తగినవన్నియు ఆయుధముల నొప్పు వాడుగాన, శ్రీహరి 'సర్వప్రహరణాయుధః' య సార్థకనామమున విరాజిల్లు చుండును. ఆయుధములుగ స సిద్ధము లయిన నఖములు గూడ నారసింహావతారమ ఆయుధము లయినవి.

అంతమందు 'సర్వప్రహరణాయుధః' అని చెప్పుటవ సత్య సంకల్పుడగుటచే పరమాత్మయొక్క సర్వేశ్వరత్వ ద్యోతక మగుచున్నది. 'ఏష సర్వేశ్వరః' యనుచు శ్రుతి మేశ్వరుని సర్వేశ్వరత్వము నుద్ఘోషించు చున్నది. 'స ప్రహరణాయుధః' అని రెండు మార్లు చెప్పుట సమా ద్యోతనము చేయుచున్నది.

ఓంకారము మంగలార్థకము. "ఓంకారము 'అ శబ్దము, పూర్వము బ్రహ్మయొక్క కంఠమునుండి వినిర్గత లైనవి, కాన, అవి మంగళకరము" లని ప్రాచీనవచనము.

అంతమందు 'నమః' శబ్ద ముపయుక్తము 'భూయిష్ఠా నమ ఉక్తిం విధేమ' - అని మంత్రవర్ణము. 'శ్రీహరి యొ నమస్కరింపబడునో ఆ లగ్నమే ధన్యము; ఆ నక్షత్ర ధన్యము; ఆ యహస్సె పుణ్యము, అదియే ఇంద్రియసఫ యని భగవన్నమస్కార విశేషమును గూర్చి ప్రతిపాది వచనములు గలవు.

ఇందు 'ప్రాక్ నమస్క్రియతే' - అనుచు ప్రాక్ -

యందు - నమస్కారము చెప్పబడినది. అది అంతమును గూడ బోధించును. ఆద్యంతములందు నమస్కారాచరణము శిష్టాచార ప్రసిద్ధము.

నమస్కార ఫలము పూర్వము ప్రదర్శితము. 'శ్రీకృష్ణ పరమాత్మ కొనరించు నమస్కారము దశాశ్వమేధావభృథ ఫలముతో తుల్యమైంది. దశాశ్వమేధి పునర్జన్మ నొందును; శ్రీకృష్ణపరమాత్మకు నమస్కరించిన వానికి పునర్జన్మ యుండదు. 'అతసీ పుష్పసంకాశమైన కాంతులతో నొప్పుచు, పీతాంబరధారి యగు గోవిందుని నమస్కరించు వారలకు భయముండదు.' 'లోకత్రయాధిపతియు, నిరుపమాన ప్రభావ సంపన్నుడు నగు జగదీశ్వరునకు ఎవరు శిరసువంచి నమస్కరింతురో అట్టి మానవులకు అనంతజన్మార్జిత పాపరాశి నశించి పోవును.'

ఇప్పటికి సహస్రనామములలో దశమశతము వివరింపబడినది.

శ్లో॥ "ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః ।
నామ్నాం సహస్రం దివ్యానా మశేషేణ ప్రకీర్తితమ్ ॥

శం. భా. :- ఇతీద మిత్యనేన నామసహస్ర మన్యూనా వతిరిక్త ముక్త మితి దర్శయతి. దివ్యానా మప్రాకృతానాం నామ్నాం సహస్రం ప్రకీర్తిత మితి వదతా ప్రకారాన్తరేణాపి సంఖ్యోపపత్తి ర్దర్శితా. ప్రక్రమే - కిం జపన్ ముచ్యతే జన్తుః ఇతి జపశబ్దోపాదానాత్ 'కీర్తయేత్'. ఇత్యనేనాపి త్రివిధ జపో లక్ష్యతే ఉచ్చ-ఉపాంశు-మానస-లక్షణో జపః త్రివిధః.

ఇక్కడ 'ఇతి ఇదమ్' అనుటచే నామసహస్ర తక్కువ, ఎక్కువ, కాకుండ ఉక్తమయినదని తెలుపబడి దివ్యమ్ము లనగా అప్రాకృతములగు నామముల సహస్రము కీ మనుటచే ప్రకారాన్తరము గా కూడ సంఖ్యోపపత్తి తె బడినది. ఉపక్రమములో 'కిం జపన్ ముచ్యతే జన్తుః' అని శబ్దమును గ్రహించుట వలన ఇట 'కీర్తయేత్' అనుటచే ఉచ్చ-ఉపాంశు-మానస-లక్షణమైన త్రివిధ జపము చెప్ప నట్లు గ్రహింపనగును.

శ్లో॥ య ఇదం శృణుయా న్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్
నాఽశుభం ప్రాప్నుయా త్కించిత్ సోఽముత్రేహ
మానవః ॥ ౧

శం. భా. :- స్పష్టార్థః. పరలోకప్రాప్తవ్యాసి. యయాతి నహుష దశుభప్రాప్త్య భావం దర్శయితు మముత్ర ఇత్యుక్తమ్.

పై శ్లోకమందలి యర్థము స్పష్టము. ఈ సహస్రనామ లను నిత్యము శ్రవణము చేయు మానవుడును, కీర్తి మానవుడును ఇహమందు కాని పరమందు కాని అశుభ మేమ మును పొందడు, పరలోకప్రాప్తు లయినను యయాతి - న హుషాదులకు అశుభప్రాప్తి కలిగినది. అట్టి అశుభము ప్రా దనుటకై 'అముత్ర' అని చెప్పబడినది.

శ్లో॥ వేదాన్తగో బ్రాహ్మణ స్స్యాత్ క్షత్రియో విజయీ భ
వైశ్యో ధనసమృద్ధ స్స్యాత్ శూద్ర స్సుఖ
మవాప్నుయాత్ ॥

శం. భా :- వేదాన్తానా ముపనిషదా మర్థం బ్రహ్మ గచ్ఛ త్యవగచ్ఛతీతి వేదాన్తగః. 'కిం జపన్ ముచ్యతే జన్తు ర్జన్మసంసారబన్ధనాత్' ఇతి వచనాత్, జపకర్మణా సాక్షాన్ముక్తి శంకాయాం కర్మణాం సాక్షాన్ముక్తిహేతుత్వం నాస్తి జ్ఞానేనైవ మోక్ష ఇతి ధర్మయితుం 'వేదాన్తగో బ్రాహ్మణ స్స్యాత్' ఇత్యుక్తమ్ కర్మణాన్తు అన్తఃకరణశుద్ధిద్వారేణ మోక్షహేతుత్వమ్.

శ్లో॥ 'కషాయపక్తిః కర్మాణి జ్ఞానం తు పరమా గతిః ।
కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే ॥
నిత్యం జ్ఞానం సమాసాద్య పరో బన్ధా త్ప్రముచ్యతే ।
ధర్మా త్సుఖం చ జ్ఞానం చ జ్ఞానా న్మోక్షోఽధిగమ్యతే ॥
యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే ।
'కర్మణా బధ్యతే జన్తు ర్విద్యయైవ విముచ్యతే ॥
తస్మా త్కర్మ న కుర్వన్తి యతయః పారదర్శినః ।'
'యథోక్తా న్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః ॥
ఆత్మజ్ఞానే శమే చ స్యా ద్వేదాభ్యాసే చ యత్నవాన్ ।'
'తపసా కల్మషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే ॥
జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః ।
యథాఽఽదర్శతలప్రఖ్యే పశ్య త్యాత్మాన మాత్మని ॥'

ఇత్యాది స్మృతిభ్యః.

ఈ సహస్రనామస్తోత్రము వలన బ్రాహ్మణుడు వేదాన్తగు డగును. వేదాన్తగః-వేదాన్తముల ఉపనిషత్తుల అర్థమయిన బ్రహ్మను తెలిసికొన్నవాడగును. ఇక్కడ 'కిం జపన్ ముచ్యతే జన్తు ర్జన్మసంసార బన్ధనాత్' అను ప్రశ్నవాక్యమును

పురస్కరించుకొని జపకర్మలవలన సాక్షాన్ముక్తిశంక కలుగు చున్నది. అందుకే చెప్పుచున్నాము. సాక్షాన్ముక్తిహేతుత్వము కర్మలకు లేదు, జ్ఞానము చేతనే మోక్షము, అని తెలుపుటకే 'వేదాన్తగో బ్రాహ్మణ స్స్యాత్' అని చెప్పబడెను.

కర్మలకు అన్తఃకరణశుద్ధి ద్వారా మోక్షహేతుత్వమని తెలియునగును. స్మృతు లిట్లు చెప్పుచున్నవి-

కర్మలు అన్తఃకరణగతాశుద్ధి నివర్తకములు, జ్ఞానమే పరమగతి. కర్మలచేత 'కషాయపక్వము' అన్తఃకరణశుద్ధి, కాగా జ్ఞానము ప్రవృత్త మగును. నిత్యజ్ఞానమును పొందిన నరుడు బన్ధవిముక్తు డగును. ధర్మాచరణముచే సుఖము, జ్ఞానము కలుగును. జ్ఞానము వలన మోక్షము లభించును. యోగులు ఫలాపేక్ష లేక చిత్తశుద్ధికే కర్మ చేయుదురు. జనుడు కర్మచే బంధమను జ్ఞానముచే విముక్తిని పొందుచుండెను. అందుచే యతులు కర్మ చేయరు. ద్విజశ్రేష్ఠుడు యథోక్తకర్మలను కూడ పరిత్యజించి ఆత్మజ్ఞానమందు శమమందు వేదాభ్యాసమందు ప్రయత్నము కలవాడు కావలయును. తపస్సు కల్మషమును హరించును. విద్య-జ్ఞానము-అమృతము-మోక్షము నిచ్చును. అట్టి జ్ఞానము పాపక్షయము వలన ఉద్భవించును శుద్ధాన్తఃకరణమందు అద్దమందు వలె ఆత్మదర్శనము సంభవించును.

ఇట్లే శ్రుతులు కూడ చెప్పుచున్నవి -

'తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి. యజ్ఞేన దానేన తపసానాశకేన'.

'యేన కేన చ యజేతాపి వా దర్వీ హోమేన అనుపహతమనా ఏవ భవతి' ఇత్యాది శ్రుతిభ్యః.

జ్ఞానాదేవ మోక్షో భవతి.

'జ్ఞానాదేవ తు కైవల్యం ప్రాప్యతే తేన ముచ్యతే' 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' 'తరతి శోకమాత్మవిత్' 'బ్రహ్మైవ భవతి' 'బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి' 'తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ'. 'ఆనన్దం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన' 'ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః' 'యదా చర్మవదాకాశం వేష్టయిష్యన్తి మానవాః తదా దేవమవిజ్ఞాయ దుఃఖస్యాన్తో భవిష్యతి' 'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః' 'వేదాన్తవిజ్ఞాన సునిశ్చితార్థాః సంన్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః తే బ్రహ్మలోకే తు పరాన్తకాలే పరామృతాః పరిముచ్యన్తి సర్వే' ఇత్యాది శ్రుతిభ్యః.

తా॥ ఈ శ్రుతు లన్నియు జ్ఞానము వలననే మోక్షమనుచు ఘోషించుచున్నవి. కర్మలు అన్తఃకరణశుద్ధి ద్వారా మోక్షహేతువు లనియే సిద్ధాంతము.

శం. భా. 'శూద్ర స్సుఖ మవాప్నుయాత్' శ్రవణేనైవ, నతు జపయజ్ఞేన 'తస్మాచ్ఛూద్రో యజ్ఞేఽనవక్లృప్తః' ఇతి శ్రుతేః 'శ్రావయే చ్చతురో వర్ణాన్ కృత్వా బ్రాహ్మణ మగ్రతః' ఇతి మహాభారతే శ్రవణ మనుజ్ఞాయతే. 'సుగతి మియా చ్ఛ్రవణాచ్చ శూద్రయోనిః' ఇతి హరివంశే.

యః శూద్రః శృణుయాత్ స సుఖ మవాప్నుయాత్, ఇతి వక్తవ్యే శ్రోతేన సంబన్ధః. త్రైవర్ణికానాం కీర్తయే దిత్యనేన.

తా॥ శూద్ర సుఖ మవాప్నుయాత్ - శ్రవణమాత్రము

చేతనే శూద్రుడు సుఖమును పొందును. జపయజ్ఞము చేత గాదు. యజ్ఞ మాతనికి శ్రుతిచేత నిషేధింపబడినది. మహా భారతములో- 'శ్రావయే చ్చతురో వర్ణాన్' అని శ్రవణము విధింపబడినది. హరివంశములో గూడ శ్రవణముచేత నాతనికి సుఖప్రాప్తి చెప్పబడినది. త్రైవర్ణికుల నుద్దేశించియే కీర్తనము చెప్పబడినది.

శ్లో॥ "ధర్మార్థీ ప్రాప్నుయా ద్ధర్మ
మర్థార్థీ చార్థ మాప్నుయాత్ ।
కామా నవాప్నుయా త్కామీ
ప్రజార్థీ చాప్నుయా త్ప్రజామ్ ॥ ౧౨౪

శం- భా. :- చక్షురాదీనా మాత్మయుక్తేన మనసాఽధిష్ఠితానాం స్వేషు స్వేషు విషయేషు అనుకూల్యా ప్రవృత్తిః కామః. ప్రజాయత ఇతి ప్రజా సంతతిః.

తా॥ ధర్మార్థి ధర్మమును, అర్థార్థి అర్థమును, కామార్థి కామమును, సంతానార్థి సంతానమును పొందును, కామ మనగా - ఆత్మసహితమైన మనస్సుతో సంబంధించిన చక్షురా దీంద్రియములకు ఆ యా విషయములందు అనుకూలభావన (సుఖహేతు వను భావన) తో కూడిన ప్రవృత్తి కామమన బడును.

శ్లో॥ భక్తిమాన్ య స్సదోత్థాయ శుచి స్తద్గత మానసః ।
సహస్రం వాసుదేవస్య నామ్నా మేత త్ప్రకీర్తయేత్ ॥

తా॥ మానవుడు భక్తి కలవాడయి నిత్యము లేచి

శుచియై పరమాత్మగతమనస్కుడై యీ వాసుదేవ నామ సహస్రమును కీర్తింపవలెను.

శ్లో॥ "యశః ప్రాప్నోతి విపులం జ్ఞాతిప్రాధాన్య మేవ చ ।
అచలాం శ్రియ మాప్నోతి శ్రేయః ప్రాప్నో త్యనుత్తమమ్॥

తా॥ అట్లు కీర్తించుట వలన విపులమైన యశస్సును పొందును. జ్ఞాతులతో ప్రాధాన్యమును పొందును. స్థిరమైన లక్ష్మిని పొందును. ఉత్తమ శ్రేయస్సును పొందును.

శ్లో॥ "న భయం క్వచి దాప్నోతి వీర్యం తేజశ్చ విన్దతి ।
భవ త్యరోగో ద్యుతిమాన్ బలరూపగుణాన్వితః" ॥

తా॥ భయ మెప్పుడును పొందడు, వీర్యతేజస్సులను పొందును. రోగరహితుడు దీప్తి కలవాడు బల - రూప - గుణ - సంపన్నుడు నగును.

శ్లో॥ రోగార్తో ముచ్యతే రోగాత్ బద్ధో ముచ్యేత బంధనాత్ ।
భయా న్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥

తా॥ రోగగ్రస్తుడు రోగవిముక్తు డగును. బద్ధుడు బన్ధవిముక్తు డగును. భీతుడు భయవిముక్తు డగును. ఆపన్నుడు ఆపద్విముక్తు డగును.

శ్లో॥ దుర్గా ణ్యతితర త్యాశు పురుషః పురుషోత్తమమ్ ।
స్తువ న్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః !

తా॥ భక్తిసమన్వితుడై పురుషోత్తముని నామసహస్రము

చేత నిత్యము స్తుతించుచుండు పురుషుడు దుర్గములను (దుఃఖ ఘట్టములను) శీఘ్రముగా నతిక్రమించును.

శ్లో॥ వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవపరాయణః।
సర్వపాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్ ॥

తా॥ వాసుదేవుని ఆశ్రయించి వాసుదేవుడే పరమ గమ్యముగా భావించిన మానవుడు సర్వపాపములనుండి విశుద్ధమైన అన్తఃకరణ కలవాడై సనాతన మయిన బ్రహ్మస్వరూపమును పొందును.

శ్లో॥ న వాసుదేవభక్తానా మశుభం విద్యతే క్వచిత్ ।
జన్మ-మృత్యు-జరా-వ్యాధి-భయం నైవోపజాయతే ॥

తా॥ వాసుదేవ భక్తులకు భయ మెప్పుడును కలుగదు. జన్మ - మృత్యు - జరా - వ్యాధి - మూలమైన భయముండనే యుండదు.

శ్లో॥ ఇమం స్తవ మధీయానః శ్రద్ధాభక్తి సమన్వితః ॥
యుజ్యేతాత్మసుఖ-క్షాన్తి-శ్రీ-ధృతి-స్మృతి-కీర్తిభిః ॥

తా॥ ఈ స్తవమును శ్రద్ధాభక్తి సమన్వితుడై అధ్యయనము చేయువాడు ఆత్మసుఖము, క్షాన్తి, (సహనము) శ్రీ, ధృతి, స్మృతి, కీర్తులు- వీనితో శోభించును.

శంకర భాష్యమ్ :- భక్తిమానిత్యాదినా భక్తిమతః శుచేః సతత మభ్యుక్తస్య ఏకాగ్రచిత్తస్య శ్రద్ధాలో ర్వ్యాఖ్యాదికారిణః ఫలవిశేషం దర్శ

యతి. శ్రద్ధా ఆస్తిక్యబుద్ధిః. భక్తి ర్భజనం తాత్పర్యమ్. ఆత్మనః సుఖమ్ ఆత్మసుఖమ్, తేన చ శాన్త్యాదిభిశ్చ యుజ్యతే.

తా॥ 'ఇట భక్తిమాన్ యస్సదా' అను 125, వ శ్లోక మారంభించి చెప్పియున్న ఫలవిశేషము వివరింపబడినది. భక్తిసంపన్నుడై శుచియై సతతోద్యుక్తుడై ఏకాగ్రచిత్తుడై శ్రద్ధాలువై యుండు విశిష్టాధికారికి చెప్పబడినది. శ్రద్ధ అనగా ఆస్తిక్యబుద్ధి. భక్తి అనగా భజించుట, అనగా, తత్పరత్వము.

శ్లో॥ న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాఽశుభా మతిః ।
భవన్తి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే ॥

శం. భా. న క్రోధో, న లోభో, నాఽశుభామతిః ఇతి ఇకారాను బన్ధరహితేన నకారేణ సమస్తం పదత్రయమ్ క్రోధాదయో న భవన్తి మాత్సర్యం చ నభవతీత్యర్థః.

తా॥ ఇట 'న క్రోధః, న లోభః, నాఽశుభా,' అనునవి నఞర్థముకల, 'న' శబ్దముతో సమాసము వచ్చిన పదములు. పుణ్యాత్ములగు పురుషోత్తమ భక్తులకు క్రోధముండదు అశుభమైన బుద్ధి యుండదు. మాత్సర్యము కూడ నుండదు అని భావము.

శ్లో॥ ద్యౌ స్సచన్ద్రార్కనక్షత్రా ఖం దిశో భూ ర్మహోదధిః ।
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః ॥ ౧౩౪

తా॥ చన్ద్ర-సూర్య-నక్షత్ర-సహితమైన ద్యులోకము, ఆకాశము, దిక్కులు, భూమి, మహోదధి - ఇవన్నియు వాసు

దేవప్రభావముచే ధారణ చేయబడినవి.

శ్లో॥ ససురాసురగన్ధర్వం సయక్షోరగరాక్షసమ్ ।
జగద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచరమ్ ॥ ౧౩౫

తా॥ సురాసుర గన్ధర్వసహితమై యక్షోరగ రాక్షస సహితమయి యున్న యీ చరాచరజగత్తు శ్రీకృష్ణునిపై ఆధారపడి యున్నది.

శ్లో॥ ఇన్ద్రియాణి మనోబుద్ధిస్సత్త్వం తేజో బలం ధృతిః ।
వాసుదేవాత్మకా న్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవ చ ॥

తా॥ ఇన్ద్రియములు, మనస్సు, బుద్ధి, అన్తఃకరణము, తేజస్సు, బలము, ధృతి, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు - అనునవి వాసుదేవాత్మకము లని చెప్పుచున్నారు.

శ్లో॥ సర్వాగమానా మాచారః ప్రథమం పరికల్పతే ।
ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభు రచ్యుతః ॥ ౧౩౭

తా॥ సర్వశాస్త్రములలో ఆచారము ప్రథము మైనదని కీర్తింపబడినది. ఆచారమూలకమై ధర్మ మొప్పుచున్నది. అట్టి ధర్మమునకు ప్రభువు పరమాత్మయై యుండెను.

శ్లో॥ ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః ।
జంగమాజంగమం చేదం జగన్నారాయణోద్భవమ్ ॥

తా॥ ఋషులు, పితరులు, దేవతలు, మహాభూతములు,

సువర్ణాది ధాతువులు, జంగమస్థావరములుకల యీ జగత్తు నారాయణుని వలన ఉద్భవించినవి.

శ్లో॥ యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాది కర్మ చ।
వేదా శ్శాస్త్రాణి విజ్ఞాన మేతత్సర్వం జనార్దనాత్ ॥ ౧౩౯

తా॥ యోగము, జ్ఞానము, సాంఖ్యము, విద్యలు, శిల్పాది కర్మలు, వేదములు, శాస్త్రములు ఈ విజ్ఞానమంతయు పరమాత్మనుండియే ప్రాప్తించినది.

శ్లో॥ ఏకో విష్ణు ర్మహద్భూతం పృథగ్భూతా న్యనేకశః ।
త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాఽఽత్మా భుఙ్క్తే
విశ్వభుగవ్యయః ॥ ౧౪౦

తా॥ ఏకమై యున్న విష్ణుభగవానుడే మహత్త్వముతో కూడిన స్వరూపమై భూతాత్మకుడు, అవ్యయుడు, విశ్వ భోక్తయు నయి అనేకవిధముల పృథగ్భావము నొందియున్న భూతములను త్రిలోకములను వ్యాపించి ఆ యా భూతముల రూపమున అనుభవించుచుండెను.

శం. భా. :- 'ద్యౌ స్సచన్ద్రార్కనక్షత్రా' ఇత్యాదినా. స్తుత్యస్య వాసుదేవస్య మాహాత్మ్య కథనేన ఉక్తానాం ఫలానాం ప్రాప్తివచనం యథార్థ కథనం నార్థవాద ఇతి దర్శయతి.

'సర్వాగమానా మాచారః' ఇత్యనేన అనన్తరవాక్యేన సర్వధర్మాణా మాచారవత ఏవాధికార ఇతి దర్శయతి

తా॥ 'ద్యౌ స్సచన్ద్రార్కనక్షత్రా అను శ్లోకము

మొదలుకొని స్తుత్యుడయిన వాసుదేవుని మహాత్త్వమును ప్రకటించుటచేత స్తోత్రజపమునకు చెప్పబడిన ఫలప్రాప్తి వచనము, యథార్థకథనమే కాని, అర్థవాదము కాదని తెలుపబడినది.

ఇక 'సర్వాగమానా మాచారః' అను శ్లోకము చేత, సర్వధర్మములలో అధికారము, ఆచారవంతునకే కలదని తెలుపబడినది.

శ్లో॥ ఇమం స్తవం భగవతో విష్ణో ర్వ్యాసేన కీర్తితమ్ ।
పఠే ద్య ఇచ్ఛే త్పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖాని చ॥

శం. భా. 'ఇమం స్తవమ్' ఇత్యాదినా సహస్రశాఖాజ్ఞేన సర్వజ్ఞేన భగవతా కృష్ణద్వైపాయనేన సాక్షాన్నారాయణేన కృతమితి సర్వైరేవాఽర్థిభి స్సాదరం పఠితవ్యం సర్వఫలసిద్ధయే ఇతి దర్శయతి.

తా॥ ఇట వేదశాఖాసహస్రాభిజ్ఞుడు; సర్వజ్ఞుడు, భగవానుడు అగు కృష్ణద్వైపాయను డను సాక్షాన్నారాయణునిచే కీర్తింపబడిన దీ విష్ణుసహస్రనామస్తోత్ర మని సర్వఫలసిద్ధిని కోరువారందరు నాదరముతో పఠింపవలసిన దని, తెలుపబడుచున్నది"

శ్లో॥ విశ్వేశ్వర మజం దేవం జగతః ప్రభవాఽవ్యయమ్ ।
భజన్తి యే పుష్కరాక్షం న తే యాన్తి పరాభవమ్ ॥

శ. భా. విశ్వేశ్వర మిత్యాదినా విశ్వేశ్వరోపాసనాదేవ స్తోతార స్తే ధన్యాః కృతార్థాః. కృతకృత్యా ఇతి దర్శయతి. 'ప్రమాదా త్కుర్వతాం

కర్మ ప్రచ్యవేతాఽధ్వరేషు యత్ స్మరణాదేవ తద్విష్ణోః సంపూర్ణం స్యాదితి శ్రుతిః.

'ఆదరేణ యథా స్తౌతి ధనవన్తం ధనేచ్ఛయా తథా చే ద్విశ్వకర్తారం కో న ముచ్యేత బన్ధనాత్' ఇతి వ్యాస వచనమ్ ॥

తా॥ 'విశ్వేశ్వరమ్' ఇత్యాది శ్లోకము చేత విశ్వేశ్వరోపాసనము చేతనే స్తోత్రపాఠము చేయువారు ధన్యులు కృతార్థులు కృతకృత్యులనియు చెప్పబడినది, 'యజ్ఞములలో కర్మానుష్ఠానము చేయువారికి ప్రమాదము చేత చ్యుతి కలిగినపుడు విష్ణుస్మరణము చేతనే ఆ లోపము లేకుండ సంపూర్ణతను పొందును' అని శ్రుతి చెప్పుచున్నది.

'ధనవాంఛ చేత ధనవంతుని ఆదరముతో ఎట్లు స్తుతింతురో అట్లు విశ్వకర్తనే స్తుతించిన యెడల సంసారబన్ధము నుండి విముక్తుడు కానివాడెవడు? అని వ్యాస వచనము ఘోషించుచున్నది.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య
శ్రీ గోవిన్ద భగవత్పూజ్య పాదశిష్యస్య
శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ
విష్ణుసహస్రనామ
స్తోత్ర భాష్యమ్
సంపూర్ణమ్.

— o —

# అకారాది నామానుక్రమణిక

## అ

## స

— • —

# శంకర వాఙ్మయోద్ధారకులు

జగద్గురు శ్రీ శృంగేరీశారదాపీఠాధీశ్వరులు :

| | |
|---|---|
| ప. ప. శ్రీ శ్రీ శ్రీ అభినవ విద్యాతీర్థస్వామిగారు | శృంగేరీ |
| ప. ప. శ్రీ శ్రీ శ్రీ అవధూతేంద్ర సరస్వతిస్వామివారు | |
| కీ. శే. పోలిశెట్టి సోమసుందరంగారి జ్ఞాపకార్థము వారి కుమారులు | గుంటూరు |
| శ్రీ శంకర వాఙ్మయాభిమానులు | బందరు |
| శ్రీ ఆర్. సి. ఎల్లారెడ్డిగారు | రామనపల్లి |
| శ్రీ యం. కోటేశ్వరరావుగారు | నెల్లూరు |
| శ్రీ విష్ణుభొట్ల దక్షిణామూర్తిగారు | కలకత్తా |

## మ హా రా జ పో ష కు లు

| | |
|---|---|
| ప. ప. శ్రీ రామకృష్ణానందస్వామివారు సంపాదకులు గీతావాణి | ఆళ్ళగడ్డ |
| శ్రీ వెల్లంకి దొరయ్యగారు | నల్లజర్ల |
| శ్రీ సిసుపాటి వెంకట్రామశర్మగారు పి. హెచ్. డి. | కరవది |
| శ్రీ డా. కళా వెంకటసుబ్బారావుగారు | ద్రాక్షారామం |
| శ్రీ పాటిబండ్ల వెంకటేశ్వర్లుగారు | దొడ్డవరప్పాడు |
| శ్రీ కంచినాథం శ్రీరామచంద్రమూర్తిగారు | వరంగలు |
| శ్రీ జూలూరి జగదీశ్వరయ్యగారు | సికింద్రాబాద్ |
| శ్రీ బచ్చు లింగయ్యగారు | ,, |
| శ్రీ గోలి ఈశ్వరయ్యగారు | ,, |
| శ్రీ పి. బాలకృష్ణగారు | ,, |
| శ్రీ జి. కె. రావుగారు | ,, |
| కీ. శే. డా. బెండపూడి పేర్రాజుగారు | విశాఖపట్నం |

శ్రీ డా. డి. యస్. కృష్ణమూర్తిగారు — ఒంగోలు
శ్రీ ఓరియంటు లాఙ్మన్సు — మదరాసు
శ్రీ గొల్లపూడి వెంకట్రామశాస్త్రిగారు — హైదరాబాదు
శ్రీ తాళ్ళూరి నాగేశ్వరరావుగారు — నర్సరావుపేట

## రాజపోషకులు

శ్రీ కంభంమెట్టు మధుసూదనరావుగారు — బాపట్ల
శ్రీ బొలిశెట్టి సీతారామయ్యగారు — ,,
కీ. శే. కూచిభొట్ల నాగభూషణశాస్త్రిగారి జ్ఞాపకార్థము
వారికుమారుడు శ్రీ వీరరాఘవశాస్త్రిగారు — కొల్లూరు
శ్రీ బచ్చు సీతారామాంజనేయులుగారు — తెనాలి
శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారు — ,,
శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటసుబ్బారావుగారు — ,,
కీ. శే. జనస్వామి వెంకటేశ్వరశాస్త్రిగారి జ్ఞాపకార్థము
వారి కుమారులు — ,,
కీ. శే. తాడేపల్లి కేశవశాస్త్రిగారి జ్ఞాపకార్థము, వారి
కుమారులు. — తెనాలి
శ్రీ కుప్పా వీరరాఘవశాస్త్రిగారు — ,,
శ్రీ యడ్లపాటి వెంకట్రావుగారు — ,,
శ్రీ యార్లగడ్డ సీతాంబగారు — ,,
కీ. శే. గణపవరపు శ్రీరామశాస్త్రిగారి జ్ఞాపకార్థము
వారి కుమారులు — ,,
శ్రీ గుడుల్లి కోటయ్యగారు — ,,

| | |
|---|---|
| శ్రీ దెందుకూరి వెంకటప్పయజ్ఞనారాయణ పౌండరీకయాజులుగారు | తెనాలి |
| శ్రీ పులిపాటి మోహనరావుగారు కాంతికుటీర్ | ,, |
| శ్రీ కోటరాజు కృష్ణారావుగారు | ,, |
| శ్రీ. సి. భీమసేనరావుగారు | ,, |
| శ్రీ దార్వేముల సత్యనారాయణశాస్త్రిగారు | ,, |
| శ్రీ విష్ణుభట్ల భీమశంకర సోమయాజులుగారు | ,, |
| శ్రీ కప్పగ శ్రీరామచంద్రమూర్తిగారు | ,, |
| శ్రీ సాలన వెంకటేశ్వరరావుగారు | ,, |
| శ్రీ మత్తిపాటి వెంకటనరసింహారావుగారు | విశాఖపట్నం |
| శ్రీ ఉలిచి ఆదిశేషయ్యగారు | గుంటూరు |
| శ్రీ మంతెన సత్యనారాయణరాజుగారు | చెరుకుమిల్లి |
| శ్రీ శంకర వాఙ్మయాభిమానులు | రామగుండం |
| శ్రీ హరేరామ జపయజ్ఞ సమాజము | రామగుండం |
| శ్రీ ఘంటా చిట్టెయ్యగారు | నల్లజర్ల |
| శ్రీ శ్రీపాద శరచ్చంద్రమౌళిగారు | అమలాపురం |
| శ్రీ యాబలూరి ఆదినారాయణశర్మగారు | అనంతవరం |
| శ్రీ. శే ప్రఖ్య రాధాకృష్ణశర్మగారు | ,, |
| శ్రీ ముష్టి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | బెజవాడ |
| శ్రీ నల్లూరి వెంకటేశ్వర్లుగారు | ,, |
| శ్రీ టి. యస్. నరసింగరావుగారు | ,, |
| శ్రీ సోము సత్యనారాయణగారు | ,, |
| శ్రీ తూండ్ల వెంకటకృష్ణశర్మగారు | ,, |

| | |
|---|---|
| శ్రీ పిసుపాటి బంగారుభొట్లుగారు | కరవది |
| శ్రీ ఈశ్వర సీతారామధన్వంతరిగారు | శ్రీకాకుళం |
| శ్రీ తురగా రామబ్రహ్మంగారు | తరగటూరు |
| కీ. శే. బులుసు సూర్యనారాయణ సోమయాజులు గారి జ్ఞాపకార్థము వారి కుమారులు | రాజమండ్రి |
| శ్రీ ఈమని పున్నయ్యయ్యగారు | ఈమని |
| శ్రీ పిల్లుట్ల లక్ష్మీనరసింహశాస్త్రిగారు | కుంచవరం |
| శ్రీ పితాల చంద్రమౌళిశాస్త్రిగారు | చుంచకోట |
| శ్రీ యం. వి. బి. యస్. శర్మగారు | బొంబాయి |
| శ్రీ సరిపల్లె విశ్వనాథంగారు | సికింద్రాబాద్ |
| శ్రీ తాటిపల్లి రామలింగంగారు | ,, |
| శ్రీ గుండా ఈశ్వరయ్య భాస్కరరావుగారు | ,, |
| శ్రీ పబ్బా శంకరయ్యగారు | ,, |
| శ్రీ పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | ,, |
| శ్రీ బొగ్గారపు సూర్యనారాయణగారు-బొగ్గారపు రామయ్య అండ్ సన్సు | అనకాపల్లి |
| కీ. శే. కొణతాల ఆదినారాయణగారి జ్ఞాపకార్థము వారి కుమారులు | ,, |
| శ్రీ అత్తలూరి రంగారావుగారు-వారిసోదరులు | పెదపాలెం |
| కీ. శే. పినపాటి లింగయ్యగారి జ్ఞాపకార్థము వారి కుమారులు | పినపాడు |
| శ్రీ జె. వి. సోమయాజులుగారు | మదరాసు |
| శ్రీ మాదిగొండ లింగమూర్తిగారు | మదరాసు |
| శ్రీ చింతా సూర్యనారాయణమూర్తిగారు | వంగేరు |